# భారతి


చెన్నపట్టణము, డిసెంబరు ౧౯౩౦
1930

సంపుటము. ౭    ప్రమోదూత సంవత్సరము మార్గశీర్ష మాసము    సంఖ్య ౧౨


# హంపీక్షేత్రము


కొడాలి వెంకటసుబ్బారావు గారు, బి. ఏ., కామరాజుగడ్డ శివయోగానందరావు గారు


## పశ్చాత్తాపము

(కృష్ణరాయల కొడుకును తిమ్మరుసు చంపినట్లు, అందుచేత రాయలు తిమ్మరుసును గుడ్లు తీయించి చెరసాలలో పెట్టి తిండిసీరీయక చంపినట్లు, తరువాత రాజు కొడుకును తిమ్మరుసుపై గిట్టని కొందరు కుట్రదారులు చంపిరని తెలిసినట్లు, తన తప్పునకై రాజు పశ్చాత్తాపపడి మనోవ్యాధితో మరణించినట్లు అనుశ్రుతముగా వచ్చే కథనుంచి ఇది—)

"ఆతని కేమివచ్చినది అంతయో తీరిన వెన్క రాజ్యముం
చేతునటన్న ఆశ? మతి చెడ్డది హో! యువరాజు చావగా
నే తనకబ్బునా పదవి? నేటికి పాపము పండిపోయె న
య్యా! తనవంటివాని కిది యా తగుబుద్ధి? వినాశకాలమే.

దాపురమయ్యె. కానియెడ తండ్రిగ తన్ను భజించి నమ్ము భూ
మీపతి కిట్లొనర్చునె? శమించునె? రంపపుకోత వోని సం
తాపము పుత్రనష్ట జనితం" బని తోచినరీతి పల్కువా
రై, పలుగుంపులై, జనము న్యాయసభాంగణ పార్శ్వవర్తులై.

తిమ్మరుసయ్య నేరమున తీర్పును చెప్పుట చూడవచ్చి మా
ర్గమ్మును కట్టి నిల్చి రినరశ్మికి. మే నుడుకెత్తి పోవు ఖే
దమ్మును లక్ష్యపెట్టక పదమ్ములు మాడుట కోర్చి కొల్వుమా
త్రమ్మది చూడబోదు తనధర్మమునందె నిబద్ధబుద్ధియై.

*    *    *    *

తన యోచనామగ్నతను చూపు మౌనము పరరాజు హృదినాటు బాకుపోటు
తన హర్ష వివశత్వమున చూపు చిరునవ్వు తెనుగు రాజు కిరీటమునకు వన్నె
తన సంశయమ్ము రీతిని చూపు తలయూపు తత్కాలజయవిరుద్ధమ్ము ఫలము
తన నిరుత్తరభావమున చూపు మాంద్యము అవసరానవసర మరయు చర్చ
తన మహామూర్తి తెల్గుమేధా విశేష-పరిణతి శ్రీని పండినపంటగాగ
వెలుగు సచివుడు మును తన కొలువునుందు-రాజశిశుహత్యకై యపరాధి నేడు.

*    *    *    *

న్యాయము మూర్తిమంతమయినట్టుల పొల్చెడి ప్రాడ్వివాకు లం
తా యిరుప్రక్కలన్ తగు విధంబున కూరుచునుండ్రి. రాజు ధర్మ చే
తోయుతుడా మహాత్మునను "తోచిన న్యాయము వెల్లడింపు డ
య్యా" యనినాడు వారలొకరై యొకరై యిటు పల్కినారలున్.

"తిమ్మరుసు హత్య చేసిన దే నిజమ్మటంచు సాక్ష్యాలు మమ్ము నమ్మించినారు
రాజ శిశుహత్య క్షమియించరాని నేర-మందు కగుశిక్ష బలవంతమైన చావు.

కర పదయుగ్మముల్ కలిపికట్టి కనుల్ పెరికించి తిండి నీ
రెరుగని చావు శిక్షగ వహించుటకున్ తగినట్టిదాని తి
మ్మరుసు స్వీకరించినాడు. దయమాలినవాడయినాడు. తొంటి బు
ద్ధి రమ నశించిపోయిన మతిభ్రమణం బిది కృష్ణరాణ్మణీ!".

*    *    *    *

తెలుగురాజదె శిక్షవిధించినాడు-తిమ్మరుసు మోము రాజుకై త్రిప్పలేదు
భటులు దోషిని వెంటనే పట్టి రాజు-అనుమతిని నిర్వహింపగ నరిగినారు.

"ఒక్క మాటుగా తల నూడగొట్టినపోద బలవన్మృతికి ఏల పాలుచేయ?
ఎంత చేసిన నేమి యీరాచవారికి తుదకిట్టి దురవస్థతోటి చావె ?
అత డొనర్చిన మహత్తరసేవ లోనెంచి క్షమియించు బుద్ధిలే దేమి తనకు?
తనకు రాజ్యంబేమి తగులబడ్డది? అంత అతనిచేతనె దక్కినట్టిదిగద?
కావలయునన్న రాజ్యముకై నిసుంగు-ప్రాణములతీయగానేల? పార్థివునకె
నీళ్లుతోడడా?" యంచు ననేకగతుల-భూపుని కృతఘ్నతకు మంత్రి పొందినట్టి
మహాదవస్థకు లోలోన మరగిపోయి-ఒకరనినమాటగూడ వేరొక్క రనక
పోయినారు ప్రజల్. క్రోధపూరితాత్ము-లంతలోన కృపా పూరితాత్ములు నయి.

* * * *

"పెంచితి. పెద్దచేసితి. అభీప్సితసిద్ధికి జీవవాయు ల
ర్పించితి మొన్నదాకి. పుడు పెద్దతనంబున లేనిపోని క
ల్పించినవాదుకై పరిభవించి కనుల్ డులిపించె భూపుడీ.
వంచన నీపరీక్ష? తగవా? పగవాడవ? శ్రీవధూధవా!

ఆంధ్రసమ్రాట్టు నన్నయ్యా యనిననాడు నీరూపులోన వర్ణించుకొంటి
ఆంధ్రక్షమారిపు లవఘళించిననాడు నీశంఖరవము ధ్వనించుచుంటి
ఆంధ్రసత్కవిబృంద మగ్గించి పొగడిన నీపొగడ్తలరీతి నేర్చుకొంటి
ఆంధ్రమహోజను లతడె తిమ్మరుసన నీవంకచూపుల నిలుపుకొంటి
అడుగడుగునందు నీయాశ లల్లుకొంటి-నైన పూర్వార్జితంబె నన్నునరించె
నీమహాలీలలో మాయనేర్వలేని-బుద్ధిహీనుడనై దేవ, పొగులుచుంటి.

కూటికి నీటికిన్ వదలుకొంటి ఋణంబు. కనుల్ కృపాణ దు
ష్పాటితముల్. మనస్సు వివశం బౌక చేయని నేరపున్ విధిన్.
మాటలు తొట్రిలున్. తలపుమాత్రము నీపయి లగ్నమైనదీ.
పాటికినైన ప్రాణములు బాపుము గోపకులాంగనా స్మరా!

ఆపదనాడె చూపులకు నందును దేవుడు. సౌఖ్యమందుచో
తోపడటంచు వెక్కసముతో యమలోకమహానలార్చులన్

తాపితు చేయుచుంటివి వృథా. ఇక రోజొ మరొండొ గాని అ
బ్బా పడువాడగా నిహాముపై నిముసంబును బాధ మాపతీ.
తిమ్మరుసు ఇంతభక్తుడా తెలుగురాజు-నానవెట్టంగలట్టి మేధా నిధాన
మంత్రియే యనుకొంటివో? అటులకాదు-నిన్నులోగొన్న బాహ్యాసంపన్నుడితడు.
రేనికి లేదుపో దయ! భరించుట నీకును కష్టమైనగా
నీ; నను ద్రోహిగా జనము నిందయొనర్చని రీతిచేయు మం
తే నిను వేడుకొందును. విధిన్ తలక్రిందొనరించలేవు నీ
వైనను. మంచిచెడ్డలు స్వయంకృతముల్ అనుభూతి ముక్తముల్.
నామరణాంతమందున కనంబడు సత్యమ. రాజు స్వీయ శం
కామలినుండు. భూప్రజవికారజితుల్ తమ తప్పెరింగి నీ
తో మొరవెట్టుకొందురని తోచెడి న. ప్పుడు చెప్పవయ్య "చిం
తామృతులార, తిమ్మరుసు ధన్యుడు శాశ్వత జీవితాత్ముడున్."
అనిమహామంత్రి తిమ్మరుసయ్యవైదు-కటకటాలకు చేతులు కలియబట్టి
మొండివారిన దేహమునుండి వెలికి-ప్రాణములుపోని దురవస్థ పరితపించి
నాల్గురోజులు చెరలో ననాథవోలె-చితికి కృశియించి మూల్గి త్యజించె తనువు.

* * * *

కన్నులు లొట్టలై జలము కార్చు మొగంబున క్షీరనిర్మలం
బు న్నవమై కపోలముల ముంచు దరస్మితమూర్తియొండు భూ
భృన్నయనాగ్రభాగము చరించుచు "క్షేమమ నీకు నీప్రజల్
తిన్నగనుందురా? సంగదిద్దుదువా నృపనీతి ధర్మముల్?
మునుపటిరీతిగా దెసలమ్రోయుదువా? జయభేరి కానుకల్
కొనియెదవా? సమస్తమనుకోనివిధంబున సత్కరించుటల్
కనియెదవా? రిపుప్రకరకంఠ విదారణహేతి సంహతి
స్వసితముగా తెలుంగుధర శాసనమున్ పొనరింతువా ప్రభూ?
వీరనృసింహ రాయ లనిపించిన "అయ్యపదంబు" నేటి కె
వ్వారికి చెందుచున్న దనువారల కేమని చెప్పెదీవు? తత్
ప్రేరణలేని రాజ్యపదవీపరివృత్తసుఖావబోధ సం
జ్ఞా రమణీయతా గుణవిచారణ లేరికి తెల్పుదో ప్రభూ?

రాయచూరున మ్లేచ్ఛరాజు కంపించిన గతికి కారకు తెల్పగలవె యిపుడు?
గజపతినెత్తిపై కాలు ఘట్టించిన యుక్తికారకు డెవం డూహసేయు?
మాకొండవీటి నల్లాడించి విడిచిన తరి దారిజూపు బోధకుని తలతె?
బహ్మనీ మ్లేచ్ఛ సంపదలవిద్యాపురి రాసులపేర్చు హర్తకు డెవండు?
సామదానక్రియా భేదచండతా సు-ధీవిశేషణ చతురుడౌ తిమ్మరుసును
కొడుకునుఁ చంపె నను మిష గ్రుడ్లుతీసి-చంపగల్గితివా? తొంటిజాడ మరచి.

ఈరక్తపుంబొట్టు నెవరు పెంచిరటన్న "అప్పాజి" యనురోజు లరసికొనుము
చనిపోవుతండ్రి యెవ్వని కప్పగించెనాఁ "అప్పాజి" కనుమాట లరసికొనుము
ఆమహాసామ్రాజ్య మంత నీగెల్పనాఁ "అప్పాజి" శక్తియం టరసికొనుము
ఆమహారాణి పెండ్లాడిన దెట్లన "అప్పాజి" యుక్తియం టరసికొనుము
రాత్రిపగ లనకుండ నీరాణివాస-సౌధముల నాకు కేల్మోడ్చి స్వాగతంబు
లిచ్చి "మామయ్యవచ్చె వాయించవచ్చు-వీణ" నని సంతసమున దేవేరులకును
ఆజ్ఞయిడు రోజు లొక్కమా। రరసికొనుము."

అని పృచ్ఛించుచు, వెంట నంటుచు, నృపాంతర్యంబు మండించుచుఁ
పని యొక్కండును తోచనీనిగతిగా బాధించుచుఁ, రాజుప్ర
క్కను, ముందుఁ, వెనుకఁ, అహర్నిశము ధిక్కరించి తర్జించుచుఁ.
కునభవ్యాప్తముగా కనంబడుచు, గగ్గోలించి రాపాడుచుఁ.

ఒక మహాభూతమై రాజునోరగజేసె. చివికి, జీర్ణించి, శల్యమై చివర కతడు
మంచమునుపట్టె. మనసులో మరగుచున్న-వ్యాధి కెవ్వండు మందు నీయం గలండు?

*        *        *        *

ప్రాతర్భానుమరీచిమాలికల పైపైదాల్చి కాలంబు మి
ధ్యాతంత్రాంకము, నాడు పొల్చినది. విద్యారణ్య పౌరశ్రుతిఁ
ద్యోతం బైనది కుట్ర. రాజశిశుహత్యోద్యోగ పారీణచిం
తాతూర్యంబులు మ్రోగి, మేలుకొని అంతఁ విన్న రారాజునుఁ.

ముకుళితమైన కన్నుగవముందర నాడుచునున్న మూర్తివై
పురు తలత్రిప్పి అశ్రుకణముల్ దిగజార్చుచు చూచి "తండ్రి మ్రొ
క్కుకొనెద. నఁ క్షమింపు మిక కోపము మానుము. దోషమున్న వా
రికి తగుశిక్ష నీవె పొనరించితి వాత్మను* చీల్చినావు పో.

కొడుకును చంపినా వనెడి కోపమునన్ వివరించలేక దుం
దుడుకున "తిండి నీరముల దూరముచేసి కనుల్ పెకల్చి చం
పు డ"ని విధించినాను సుమి. భూపుని గొప్పతనంబు చూప; ఇ
ప్పుడు నను చంపుచుంటివి. ప్రబుద్ధుడవే! చనిపోయి మంత్రివే!
అన్నము నీరు లేక కనులైనను విచ్చక నిన్నుబోలె నీ
పిన్నటనుండి సూనువలె పెంచిన రాజు గతించుచుండె నో
యన్న త్వదీయశిక్షయె స్వయంధృతమైనది నాకు గూడ నే
కన్నులు గల్గి విచ్చుటకు గాంచను తావకమూర్తిముందుగన్.
బాకీచెల్లిన దీమహాకథను చెప్పంజాలువా రెవ్వరున్
నాకే తప్పును కట్టిపెట్టరు. సమానంబైన శిక్షాగతిన్
నీకున్ నాకును చావు సంఘటిలె. కానీ! తెల్గుసామ్రాట్టు మే
ధాకాలుష్యము శాశ్వతంబగునుగాదా? తిమ్మరాయాగ్రణీ."
అనిభావించుచు నేత్రయుగ్మకము సాయంసంధ్య కాలాబ్జ రా
గిణిపై రేకుల మూతమూగుట ప్రసంగించెన్. దివాంతంబుతో
డను, రాజన్యుని ప్రాణవాయువులతోడన్ తిమ్మరాణ్మూర్తి పో
యినదాంధ్రావని కంటినీఁగిరి పోయిం దంతరాగ్నిచ్ఛటల్.

## పా ణి గ్ర హ ణ ము

[కళింగ రాజు గజపతి. కృష్ణరాయలచే పరాజితుడు. తత్ప్రతీకారనిరీక్షకుడును. కూతురిని కృష్ణరాయల కిచ్చి ఆమెచే నాతని చంపింప యత్నించినాడు. కాని విఫలుడు. తిమ్మర్సు కృష్ణరాయల కంగరక్షకుడు. కథ కళింగరాజతనయా కృష్ణుల చేతోమేళనములో లీనమైనది. ఇందు కాధారము పెద్దన్నగారి చాటువు "కూతు రాయలకును కూర్చునాడు" అనునది.]

"స్వామీ; కూతురుతోడి పెండ్లిజరిగించన్ మీకు కాళింగు డే
మేమో వ్రాసెనటే? మహార్థబల సామీప్యంబు గుర్తించి పో
తామన్నారట మీకనున్; వరులుగాదా? కన్యకున్ శుల్క మెం
తీ; మాత్రంబును చెప్పకుంటిరి, పోనీయండి సిగ్గైనదో.

సమరములోన నోడియును శత్రుడు మామగ మారి శాశ్వత
ప్రమదము కూర్చునంటి? హాపరంబుల భేదము లేనిరీతిగా.

సమద గజేంద్ర కేసరియు చారుకురంగవిలోకనప్రభా
భ్రమితముగా నృపా బిడియపడ్డది ముందరిచూపు లేకయే.
భూమిధవుల్, సహస్రశత పుష్పసుగంధిపరీవృతుల్, మహా
శ్రీమహితుల్, నవత్వము వరించి గుణాగుణదృష్టిలోభులై
తాము చరింపబోయెడి పథం బనుకూలము కాదొ యెంచరా.
సామెత పైడిపైదలి వశత్వము రాజులకైన తప్పదో?
నిన్నో; మొన్నో; పరాభవింపబడి తానే పిల్చి యర్పించు క
న్య న్నిర్వ్యాజముగా కళింగుడే. దిమాయావాగురం బేమొ? మీ
రన్నీ యోచనచేసియే బదులు వ్రాయన్ చేసినారా ప్రభూ
సన్నాహం బాకయింతలే కరిగి వస్తా మంతయున్ చూడయే."

అనుచు హాస్యము, హితము, ముందాచరింపనైన కార్యము, సూచించి ఆనసమున
చిరునగవు లేతతళుకులు మురియనిల్చె-మా మహారాజుప్రక్క తిమ్మరుసుమంత్రి.

"త్రిప్పల్ వెట్టిన శత్రువోటువడి, స్వాధీనుండునై, కూతురిన్
ఇప్పిస్తానన అట్టులేయనుచు వ్రాయింపించితిన్ గాని నే
తప్పో, ఒప్పో, తలంపలేద.ది ప్రమాణం బేమొ చింతింపలే
ద. ప్పాజీ కల డన్నియున్ సరిగచేయన్ తోడ నెల్లప్పుడున్.
అనుధైర్యమె నాపాలిటి - పెనుదైవము. పోయి, పెండ్లిప్రేరణమేమో
కనివత్తము. వేరైనన్ -చనుగా కాతండు యముసాన్నిధ్యంబున్."

అనుచు కృష్ణరాయలు భార మతనిమీద - డించి, సేనాధిపతుల రప్పించి, తగిన
కట్టుదిట్టంబు లొనరించి, గజపతిపురి - జొచ్చినాడు. పెండ్లికి సర్వశోభనముగ.

* * * * *

"గజపతియింటిలో పులిముఖంబున గోవు జనించె నేటి క
క్కజముగ. నిన్న నే మగడు కట్టిన తాళికి తండ్రిమాటకే
గుజగుజపోవు నీరకపు కూతురు పుట్టుటకంటె రాయొ, ర
ప్పో, జడము లేవయిన పుట్టిన సంతసమంది యుందు నే.
పెండిలిపేర్లు పెట్టి, రిపుపిల్చి, బహూకృతిచేసి, ముగ్ధుడై
యుండగ, నాడు-నేపడిన యుద్ధపరాభవరోష హేతి మ

చ్చండతరార్పు లార్తు నని సంబరమందితి గాని యుంటిలో
నుండిన శత్రువున్ తెలియనోపని యంధుడనైతి నేటికిన్.

జనకునికన్న బంధుని, విశాంపతికన్నను దేవునిన్ ధరన్
కనము. మగండుగా మెడకుకట్టిననూ లోకతెంపులోనె పో
వును. జనకత్వమో; తనువు పోయినదాకను నిల్చునస్థిరం
బునకు స్థిరంబువీడు తలపుల్ జనియించెనె? వైరిమెత్తెనే?
నాయన తీర్చుకొంటిని ఋణంబి.దె శత్రునిమస్తకం బి.వే
తీయని వెచ్చనెత్తురులు తెట్టెలుగట్టిన చేతివ్రేళ్ళి.దే
కాయపు సందుసందును వికావికచేసిన బాకు, దీనితో
పోయిన ప్రాణముల్ తమ కమూల్యపు కానుకలంచు పల్కుకన్.

మగడు మగడని ఎవ్వడో మొగమునైన - మీను పెరుంగని యొకశత్రువును సహించి
కన్నవారల కడుపులు కాల్చినావు-బ్రతికియును చచ్చియును నొక్కఫలమె నీవు"

అని చురకత్తి చేతగొని, ఆత్మజవైపుకు చూచిచూచి, కం
దిన మొగమింతవాంచి, జగతిం పరికించి, శివంబులెత్తువా
నిని బురుడించి, నిల్చునెడ నిల్వక, తోచక, విశ్రమించకన్
కనులను నిప్పులున్ జలము కార్చుచు నున్మదుడైన తండ్రికై.

మొగముత్రిప్పెను రాయలమోజుకత్తె,-క్రొత్తపెండ్లికూతురు, శాంతగుణము రూపు
వోలె నిల్చి, తండ్రికరము ముడిచిపట్టి - నట్టి చురకత్తి తనచేత నట్టెలాగి,

"మగడను ప్రేమభావ మభిమానము నీకయి వీటిబుచ్చి నీ
పగ యడగింతు. ఆపయిన పట్టినిచూడవు. నేడెబంధముల్
తెగియెను నీకు నా క"నుచు దీవ్యదఖండ తటిల్లతా ధగ
ద్ధగల వెలింగిపోయె ప్రమదామణి. తండ్రియె అద్భుతంపడన్.

* * * * *

మదనాస్త్రి మితపీడితాత్మకుడు, ప్రేమస్థాన కాళింగసూ
తదయాపాంగ విలోకనప్రసర మాత్రత్యక్త కాఠిన్యడున్
హృదయాహ్లాది వచస్సమాత్తరతిపారీణుండుగాతోచి, స
మ్మదితుం డట్టుల రాజు పాన్పుపయి పోవున్ నిద్ర జాగ్రత్తలోన్.

నిద్దురమంపులోన శయనించెను రాజనుకొన్నదింతయున్
సద్దునులేక లేచినది. శాటిబిగించినదం. తరవ్యథన్
మొద్దయినట్టి లో ప్రణయమోహములన్ దిగజార్చుకొన్నదా.
ముద్దియ కృష్ణదేవు కనుబొమ్మల నద్దిన దోష్టరక్తిమన్

తలకడ మున్నె గుప్తముగ దాచినకత్తిని తీసికొన్నదు.
త్పల సమనీలతారకలపై పరివేషముగొన్న నీటిబిం
దుల తనపైట నద్దినది. దోసిలియొగ్గి ప్రియాంఘ్రిపద్మముల్
తలపయి హత్తుకొన్నయది. ధ్యానముచేసిన దొక్క-లిప్తపై.

మరునిమిసంబులోన పిడిమాత్రము నిల్చిన కత్తి రాజువే
రురమున నాటుకోవలసియుండెను. కాని నృపుండు మున్నె త
త్క-రకరవాలముల్ కలియగా బిగబట్టుచు, మందహాసనుం
దరవదనాబ్జుడై "తరుణి; తప్పొకయింత యెరుంగనట్టి నన్.

కత్తిపోటులతో చంపగా నదేల ?-కుపిత తావకాలోకన కుంతములనె
గ్రుచ్చి హింసింపలేక.య్యకారకుపడిన-శ్రమము వృథయయ్యె అప్పాజిశక్తి యిద్ది.
అనుకొన్నంతయు నైన దం.తయును సవ్యంబైన దీకత్తితో
పనిలే దింక. విరోధమున్న మొక తీర్పన్ వచ్చు వేరొక్క-వ

ర్తననం" చుల్లసమాడు పార్థివు కరద్వందంబునన్ మూర్ఛవో
యెను కాంతామణి పాపపంకిల కళంకీభూత సౌహార్ద్రితన్.

*  *  *  *  *

గజపతి పశ్చాత్తాపము - గజపతి కన్యానురాగ కందళితమనో౦
బుజుడగు నరపతి మురుపును - ప్రజలకు నాడైన వన్న పానసమములై.

నవవధువుతోడ రారాజు నగరులోన - చిత్రవిభవోత్సవముల వేంచేసినాడు
లలితకళలెల్ల నాటివిలాసములకు - భావసాధనిర్మాణముల్ ప్రబలచేసె.

కాలముదాటిపోయిన దొకానొకనాడు ధవుండు రాణివా
హ్యాళికిపోయినారు. పవనాంతర సైకతవేదికాస్థితుల్
బాలశశిప్రభన్ మెరుగుబారిన వృక్షనికుంజపత్రముల్
గ లికిమ్రోగుచుండగ సుఖంబుగ సంలపనాదిలోలురై.

తామా మానుపొనరించు వర్తనములెల్ల - చెప్పకొనజొచ్చి రాయలు చెప్పచుండె.
తండ్రి తన్ను నాడన్న వృత్తాంత మంత - వింతగా. ఇంతలో గాలివిసురులోన.

"గజపతియింటిలో పులిముఖంబున గోవ్రజనించె నేటి క
క్కజముగ అందుకే తెలుగుకాంతుని నవ్వులచేత కెంపు టం
బుజములు మోముపై విరియపూచిన దం"చు వినంబడెన్ ధరా
భుజుడును రాణి ఆదెసకె మోములత్రిప్పచు లేచిచూడగన్.

తిమ్మకసుచెప్పచుండగా తిమ్మనకవి-వినుచు "ఊఁ"కొట్టుచును పోవుటను గ్రహించి
రాంధ్రరాయలు రాణియు "ఆత్మకథను - మరువదిక జనమంచు లో మురిసికొనుచు
సాగిపోజొచ్చిరంట ప్రాసాదమునకు - చిరునగవు దొంతరలు ముఖసీమ నిలువ."

## శ్రీ కృష్ణదేవరాయలు

[కృష్ణరాయని ఆముక్తమాల్యద చదువగా కలిగిన ఆవేశమే యీ పద్యముల కాధారము]

ఆకడ రాజరాజు మొద లాంధ్రసరస్వతి నిష్టదేవతా
స్వీకృతిలో యజించి మురిపించి భజించెను. అంతరాంతరా
ర్వాకలనంబులోపల విశాంపతు లెందరొ శీర్ష మొగ్గి నా
రీకడ నీవునిల్చి వెలయించితి వంత్యసమర్చనావిధుల్.

అతడొక్క-కవివర్యు నాదరించెనెగాని కవియన్న పేరు తా గాంచలేదు
ఆతడొక్క-టెకృతి నందియుబ్బెనెగాని తత్కాలకృతుల గుర్తగొనలేదు
అతడొక్క-భాషనే అరయగల్గెనుగాని దేశభాషలలెస్స తెలియలేదు
ఆతడొక్క-టె నడయాడజూచెనుగాని అష్టదిగ్గజరూప మరయలేదు
అయిన నాతడె పూర్వుడై యలరుకతన - ఎన్నిలోపించినను తానె. హెచ్చినాడు
అన్నికల్గియు చివరవాడైన నీవు - అతనితోసాటి కైనావు ఆంధ్రరాజ.

నీయాముక్తదమాల్యవాసనలు వాణీకుంభవక్షోజనా
ట్యాయత్తం బగు వీణెతంత్రిపయి బాహాటించె మాధుర్యముల్
స్వాయంభూప్రతిపన్న సృష్టికవి జీవజ్ఞానవిద్యాగుణ
ప్రాయప్రౌఢిమలంచు తజ్ఞులిట చెప్పంజొచ్చి రెల్లప్పడున్.

గండపెండేరములు కవుల కీవచ్చును కవిహృదయము పిండగలడే రాజు
ఏనుగంబారీల నెక్కించవచ్చును కవిమనస్సున కెక్కగలడే రాజు
కృతు లెన్నియైన వేరిచి పుచ్చుకోవచ్చు కవితారసము పీల్చగలడే రాజు
పొగడింతలను వేలు పొందగావచ్చును కవియూహ లందుకోగలడే రాజు
అది మహాయుగ సారస్వతాత్మ పండి - రాజుగా తెల్గు గ్రుడ్డియరణ్యములను
పరువమును కాంతిపోగని పారిజాత - పుష్పమయి నిల్చినది జ్ఞానపూజకొరకు.

పద్దెము పద్దె మొక్కమణి పట్టినదెల్లను పైడిముద్ద యీ
విద్దె నెటుల్ గ్రహించితివొ వేయికి నొక్కడుగూడ నీవలెన్
దిద్దగలేడు కావ్యకళ తీర్చిన ముత్తెపుపేర్లుగా కథల్
సుద్దులు వర్ణనల్ మతపుసొంపులు నీతులు గ్రువ్వినావు పో.

కథ నడిపించు తీవి, మతఖండనముల్ జరిగించుధాటి, భూ
మిధవ నయప్రసక్తిని గమించెడిచాతురి, కాలవర్ణనా
వధులను దాటునేర్పు, కనువారికి నీ "కవితాపితామహం"
బుధి ఒక నీటిబుగ్గ అయిపోవద ? త్వత్కృతవస్తుసృష్టిలోన్.

అవునా లేతతనంబు, హార్దవము, చిత్తాకర్షణాధారభూ
తవరిష్టాద్భుతగోస్తనీఫలరసద్రావంబు నీపల్కులన్
తవులన్ లే దనుమాట సత్యమె భవద్ధాటీనిరాఘాటపా
టవసామ్యంబగు ప్రౌఢిమం బమగఘంటాలంకృతం దున్న దే.

తొలిజన్మంబుల నీవై - సలిపిన సాహిత్యపూజ సార్థకమయి మా
తెలుగున "ఆముక్తముగా" - ఫలియించినదెల్ల కవుల పైపై మెరుపై.

*　　　　*　　　　*　　　　*　　　　*

నతి

ఓంకారస్వరలీనమై నిగమనాదోపాసనాధీనమై
కైంకర్యప్రతిపాద్యమై భువనరక్షాదక్షమై తాండవా
హంకారస్థిరచంద్రమశ్శకల శైత్యప్రాప్తశాంతత్వమై
శంకాసంకులమైన నీయునికి ఆశాసిద్ధి కల్పించుతన్.

తన సెగకన్ను మంటలకు ధగ్ధుడు.— కాని ప్రియావిలాసమా
ర్గణ పరిలబ్ధ నైజ కరుణామృతవృష్టి పునఃప్రభూతజీ
వను డశరీరుడా. తని జవంబున కంతమునందు లోగి పో
యిన ధృతిమూర్తి మమ్ము భరియించుత కష్టసుఖంబులందున్.

తన వేణుస్వన మోహితుల్ మగలబంధాల్ త్రెంచి జాబిల్లి వె
ల్గున పాదంబులజాడ లారయుచు మ్రొక్కుల్ వెట్టుచున్ రాత్రులె
ల్లను బృందావనవీథులన్ తిరుగుచుండన్ యామునశ్రీతన్
తనుకుంజంబుల దాచివెట్టుకొను ధూర్తత్వంబు శంసించెదన్. *

---

## కాంత

ఓలేటి నిత్యకల్యాణమ్మగారు

పురుషుఁడు విశ్వమందున నపూర్వనట న్నవనీలనీరదం
బురుసరణిన్ తదంచలము లొక్కట డాసి వెలుంగఁజేయు ప్రా
జ్యరుచిర మోహా కాంతి విరఁ జల్లెడు తారక వారిజాక్షి; యు
ర్వరను గృహస్థుఁ డెందును గళారహితుండగుఁ గాంత లేనిచోన్.

---

* ఈ పద్యము లన్నియు యథామాతృకముగ ముద్రితములు. —సం. భారతి.

# నన్నయకుబూర్వ మాంధ్ర వాఙ్మయస్థితి

కో. రాడ రామకృష్ణయ్యగారు, యం. ఏ.,

నన్నయ భారతము నాంధ్రీకరించుటకు బూర్వ మాంధ్రభాషావాఙ్మయము లేస్థితిలో నున్నవియను విషయము పరిశీలింపవలసివచ్చినపుడు ఆకాలమునందలి దేశీయభాషల స్థితిగతులు, వాని యాదరణము, సంస్కృతమునకు వానికిని గల సంబంధము, సన్నిహితభాషల లోని వాఙ్మయస్థితి, తమిళకన్నడములలో పూర్వవాఙ్మయము కనబడుచుండగా నీభాషలో నన్నయకు బూర్వమున గల వాఙ్మయము కనబడకపోవుటకు గల కారణము, ఉన్నచో నెట్టిరూపమున నుండి యుండును—అను నీ మొదలగు విషయములను గూర్చి విచారింపవలసి యుండును. కాని ప్రస్తుతము నన్నయకు బూర్వమందు ఆంధ్రవాఙ్మయ మున్నచో నెట్టిరీతి గలదయి యుండునను విషయమును మాత్రము పరిశీలించుచు, కన్నడవాఙ్మయ సంప్రదాయము లాంధ్రమునందలి తొలికవితారీతి నెట్లు దిద్దినవి తెలిసికొన నించుకయత్నింతము.

నన్నయకుబూర్వమునగల చాళుక్యరాజుల తెలుగు శాసనములలో గొన్నిటినిబట్టి చూడగా, నన్నయ తెలుగు రచనను బోలిన సంస్కృతభూయిష్ఠమగు తెలుగురచన యాతనికి సుమారు రెండువందల యేండ్లక్రితమె యుండెనని తలంపదగియున్నను, అట్టి శైలి రాజాస్థానములందలి పండితకవులచే నాదరింపబడుచుండెనేగాని, జనసామాన్యమున వ్యాప్తిజెందియుండలేదనికూడ మఱికొన్ని శాసనములనుబట్టి యూహించుటకవకాశము లేకపోలేదు. ఈశాసనములలోని పద్యములన్నియు దేశీయవృత్తములలోనే గాని సమకాలికములగు కన్నడశాసనములలోవలె సంస్కృతవృత్తములలో రచింపబడకుండుటయు, గొన్నిటియందలి భాష ప్రాకృత సంపర్కమును విశేషముగా జూపుచుండుటయు మఱియొక విశేషము. నన్నయకుబూర్వమున నీభాష కనుశాసనము లేకపోవుట చేతను, అప్పటి శాసనములు గొన్నిటిలో మాత్రము నన్నయశిష్టకవితాభాషను బోలు భాష గానవచ్చినను, నప్పటి శిష్టులగు పండితకవులచే ప్రామాణికముగా గ్రహింపబడు నాభాషలో నుత్తమగ్రంథము లేమియు బయలుదేరి నట్లగపడకపోవుట చేతను, నన్నయకు బూర్వకాలపు తెలుగుకవిత్వయంతయు శిష్టులయాదరమును బడయజాలనిదియు సంస్కృతవిరళంబును సామాన్యజన వ్యవహారప్రచురంబునునగు తెలుగు భాషలో నుండెడిదనియు నిశ్చయింప దగియున్నది. అప్పటి దేశీయ కవులు మనమెఱిగిన శాసనపద్యములను రచించిన శిష్టకవులవలెనే ద్విపద, తరువోజ, సీసము, గీతము మొదలగు దేశీయ వృత్తముల మూలముననే తమ రచనలను సాగించినను, వారు తమ వ్యవహార భాషలో నాయకకథలను, నాయాపద్యములలో పాడి యుందురేగాని, శాసనకవులవలె వ్రాయబడుటకై రచించియుందురని తలంచుట కవకాశము కనబడదు. ఈ దేశీయకవు లాకాలమునపాడిన తెలుగుపాటలు జనముఖస్థములై యుండినవేగాని గ్రంథస్థములై యుండెననియు మనమూహింపజాలము. ఇక వీ రాకాలమున వాడినభాష స్వరూపము మనము తెలిసికొనవలయునన్నచో గొన్ని శాసనములలోని భాషతప్ప మఱి యేవిధమగు నాధారము లేదుగాని, నన్నయాది శిష్టకవులసంస్కృతభూయిష్ఠరచనకును, మార్గకవుల మార్గకవితకును భిన్నమైనదియు దేశికవుల కవశ్యానరణీయమని తరువాతికాలపు శైవకవులచే పేర్కొనబడినదియు, దేశిమార్గమునుబట్టి దేశీయముగా రచింపబడిన జానుకవితకు మూలాధారంబైనదియునగు జానుతెనుగే తత్స్వరూపమును మనకు గొంతవఱకైనను గోచరింప జేయగలిగియుండునని తలంపనగును. జానుతెనుగు స్వరూపమిట్టిదని

  

పాల్కురికి సోమనాథకవి వృషాధిపశతకమున మన కిట్లు తెలిపియే యున్నాడుగదా!

"బలుపొడతోలు సీరయును
బాపసరుల్ గిలుపారుకన్ను వె
న్నెలతల సేదుకుత్తుకయు
నిండిన కీలుపుటేరు వల్లుపూ
సలుగలతోని లెంకవని
జానుతెనుంగున విన్నవించెదన్
వలపు మదిం దలిర్ప బసవా
బసవా బసవా వృషాధిపా."

కాని నన్నయకు బూర్వమున గల దేశికవులజాను తెనుగున కీమాత్రము సంస్కారము నుండియుండదు. అది చాల వఱకప్పుడు వ్యవహారమందున్న భాషకు చేరికగలదై, సంస్కృతదీర్ఘ సమాస విరళంబై నియమరహితంబై యుండియుండును. ఆదేశికవులు తమభావముల నే ద్విపదనో, సీసమునో, యవలంబించిపాడునప్పుడు, భాషా రూపములను, ఛందోనియమములను గూడ నాయా పాట కనుకూలమగునట్లుగా, వికృతినొందించి—అనగా నాపాటలో గురువు కావలసినచోట హ్రస్వాంతపదము నైనను, దీర్ఘాంతముగా జేసియు, లేదా రెండుమాత్రలుగల వూలఁగుమూలిగియు, హ్రస్వము కావలసినచోట దీర్ఘాంతపదమునైనను హ్రస్వాంతముగా జేసియో, లేదా ఆపదమునందలి యొకయక్షరమును సరిగా పలుకక జాఱవిడిచియో — యాయావృత్తములలో పాడియుండుటచే భాషావిషయమునగాని, ఛందోవిషయమునగాని, వారికవిత నియమబద్ధంబైన తరువాతికవుల జానుకవితను బోలియుండునని తలంప నవకాశము లేదు. అవి ఇప్పటి తుమ్మెదపదములు, కుచ్చలకథ, బొబ్బిలిపాట మొదలగు వానినిబోలియుండును. ఇప్పటి తుమ్మెదపదములు స్త్రీల పాటలు మొదలగునవి యాంధ్రజాతీయ సంప్రదాయానుకూలములై వానికి పట్టుకొమ్మలేయైనను నియమబద్ధములు కావనుకారణమున శిష్టులయాదరణము నెట్లు పొందలేకుండెనో, అట్లే యాకాలపు దేశికవితయు సంస్కృతభాషాభిమానులగు శిష్టుల యాదరమును బొందలేక పోవుటచే, వ్రాతలోనికి దిగక, జనులముఖవ్యవహారమున నే పరంపరానుగతమై యుండి కాలక్రమమున నంతరించినను దాని స్వరూపచ్ఛాయమాత్ర మిప్పటి పాటలలో గొంత వఱకు గనబడుచున్నది.

నన్నయకు బూర్వకాలమందు బయలుదేరిన దేశీయకవితా ప్రవాహమందలి యొకపాయ మూలమూలల బడి ముందుకు నెట్టుకొనుచు, మధ్యకాలమునసంతరించుచు మరల పొడసూపుచు నిప్పటివఱకు నెట్టెట్లో ప్రవహించుచు వచ్చుచుండ, మఱియొకపాయ యాకాలముననే యనినుండి చీలి కొద్దికాలమే ప్రవహించి తుదకు నన్నయకాలమున బయలుదేరిన శిష్టకవితామహాప్రవంతిలో బడి యంతరించి నట్లగపడుచున్నది. అదియె నన్నెచోడుడు కుమారసంభవమున జేర్కొన్న మార్గకవితయని నాతలంపు. ఈమార్గకవితను గూర్చి ప్రశంసించిన వాడొక్క నన్నెచోడుడు మాత్రమే గనబడుచున్నాడు. "మునుమార్గకవిత లోకంబున నెలయగ" అను పద్యమునుబట్టి దేశికవితకు బూర్వము దేశమున నెలసియున్నది సంస్కృతకవితయేగదా యనుతలంపుతో 'మార్గ' శబ్దమునకు సంస్కృతమే యర్థమని తలంచినను, ఈతడు తరువాత

" మార్గకుమార్గము దేశియ
మార్గము వదలంగ దనుకు మదివదలక దు
ర్మార్గగపవర్తులనవగు
మార్గకవుల దలపనలతి మహిమకవులకున్."

"అని దోషగ్రాహులను కుకవివరాకులం బరిహరించిన" రీతినిబట్టి విచారింపగా నిందలి 'మార్గము వదలంగదనుకు మదివదలక దుర్మార్గపదవర్తులనవగు' మార్గకవులు కేవల సంస్కృతభాషలో నుత్తమకవితను జెప్పిన కవులుగారని తోచుచున్నది అట్టిసత్కవులనింతకుబూర్వమే యీతను సంస్తుతిజేసియే యున్నాడు—చూడుడు.

" సురవరులంగ్రమంబునవచోమణి సంహతిఁబూజచేసిమ
ద్గురుచరణారవిందములకుం దగసమ్మతిఁజేసి కొల్చి వి
స్తరమతులం బురాణకవిసంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవులసంస్తుతిఁజేసిమనోముదంబునన్"

ఇందీతడు పురాణకవి సంఘమును—అనగా వాల్మీకివ్యాసాదులను—ఉత్తమమార్గ సత్కవీశ్వరులను—

అనగా కాళిదాస, భారవ్యుద్భట బాణాదులను, అనంతరము నామనుచే బేర్కొనని దేశికవులను సంస్తుతిచేసి యున్నాడు. ఈ పద్యమున బేర్కొనిన కాళిదాస బాణాదుల నుత్తమమార్గ సత్కవీశ్వరులని చెప్పుచు, నా వెంటనే "మార్గమువదలంగ దమకునదివదలక, దుర్మార్గ—దుష్టమార్గ-పదవర్తులనదగు మార్గకవులను"-కుకవివరాకులని పరిహరింపజూచుటచే, నన్నెచోడునిదృష్టిలో నాకాలమున మార్గకవులు రెండు విధములుగా నుండిరనుట స్పష్టమగుచున్నది. అందు మొదటివా రుత్తమమార్గసత్కవీశ్వరులనుట నిశ్చయమే. రెండవవా రెవరు అని ప్రశ్న. వారెవరనగా, దేశిభాషలలో కవితజెప్పదలచియు సంస్కృతభాషయందలి యభిమానమువలనను దేశిభాషల యందుగల నిరసనబుద్ధిచేతను నా"మార్గము"వదలుటకు దమకుబుద్ధిపుట్టక, నా సంస్కృతముతోనే యించుక దేశ్యమునుగలిపి కలగాపులగముచేసి, మలయాళభాషలో నొక ప్రత్యేక సంప్రదాయముగా నిలిచియున్న "మణిప్రవాళ" శైలివంటి భాషాశైలిలో, రచింపగడంగిన సంస్కృతకవులై యుందురని తలంపనగును. కావుననే యిట్టివారీనన్నెచోడుని దృష్టిలో దుర్మార్గపదవర్తులన దగు మార్గకవులైనారు! "దుర్గార్గపదవర్తులను పాఠాంతరము గ్రహించినను తాత్పర్యం బొక్కటియే యగును. కావుననే వీరును సంస్కృతమునే ప్రధానముగాజేసికొని యందలి సుప్తిఙంతాదిరూపములతో దేశభాషాపదములను మధ్యమధ్యచేర్చి పద్యరచనచేయుటచే-మార్గకవులే యని చెప్పవలసివచ్చినను, వీరుకాళిదాసాదులవలె నుత్తమ మార్గ సత్కవీశ్వరులుగాక: 'దుర్గా (ర్మా)ర్గపదవర్తులన దగు' మార్గకవులైనారు. వీరు 'దేశి' కవులును గారు 'మార్గకవులలో' నుత్తములగు సత్కవీశ్వరులునుగారు. ఉభయభ్రష్టులగనుకనే "కుకవివరాకు" లయిరి.

కృత్యాదిని నన్నెచోడుడు త్రిమూర్తులను, రవి గణనాథషణ్ముఖస్మరనగజాతభారతులను సురవరులను బేర్కొని పూజచేసియు, జంగమ మల్లికార్జున గురువర ణారవిందములకు దగసన్నుతి జేసికొల్చియు, వాల్మీకి వేదవ్యాసాదిపురాణకవిసంఘమును, కాళిదాస బాణాద్యుత్తమమార్గ సత్కవీశ్వరులను గూడ బ్రత్యేకముగా బేర్కొని సంస్తుతిచేసిన వాడయ్యును, దేశిసత్కవుల నొక్కరినైన బేర్కొనకయే యూరకసంస్తుతి మాత్రము చేసియున్నాడు. ఈకారణముచే నతడట్టి దేశికవులను బేర్కొనుచు జెప్పినపద్యములు గ్రంథపాతముచే పోయినవని తలంచినవారు కొందఱు గలరు. కాని యాతనికాలమున పైజెప్పిన యుత్తమమార్గ సత్కవీశ్వరులను బోలినవారెవరి నాతడెఱింగియుండకపోవుటచేతను, దేశికవులలో నట్టి ప్రసిద్ధిని జెందినవారు లేకపోవుటచేతనే యాతడు పేర్కొనలేదేమో యను సందేహము కలుగక మానదు. నన్నిచోడుడు నన్నయకు దరువాతి కాలపువాడైనచో నాతని నెఱింగియుండడా యను ప్రశ్న కలుగవచ్చునుగాని, యీతడు శైవమతాభిమాని యగుటచేతనో; లేదా, రాజనరేంద్రుని యనంతరము కొంతకాలము వఱకు నన్నయరచించిన భారతమున కంతగా వ్యాప్తికలుగక యది రాజమందిరమున నొక మూల బడియుండుటచే నన్నయనుగూర్చి గాని, యాతని భారతమును గూర్చిగాని దక్షిణదేశమున నున్న నన్నెచోడున కంతగా దెలియక పోవుటచేతనో బేర్కొనకపోయి యుండును. కాని రాజమహేంద్రవరమున రాజనరేంద్రుని తరువాతి చాళుక్యులకును చోళులకును గలిగిన సంబంధమును బట్టి యాతని ప్రోత్సాహమున జరిగిన భారతాంధ్రీకరణమును గూర్చి యాతడు విని యుండునని మాత్రము మన మూహింపవచ్చును. కావుననే పురాణ కవిసంఘమునకు జెందిన వాల్మీకివ్యాసులను, మార్గసత్కవులను ప్రత్యేకముగా బేర్కొని దేశికవులవిషయమై చెప్పవలసివచ్చినపుడు,

" మును మార్గకవిత లోకం
బున వెలయగ దేశికవిత పుట్టించి తెనుం
గునిలిపి రంధ్రవిషయం
బునఁ జనచాళుక్యరాజు మొదలుగఁబలువుర్ "

అని దేశికవిత అనగా దేశభాషలో శిష్టకవిత మున్నమున్నే చాళుక్యరాజగు రాజనరేంద్రుని ప్రోత్సాహమున నాంధ్రదేశమున పొడసూపెనదని చెప్పి, యంతటితో నా ప్రసఙ్గము విడిచెను. కావున నుత్తమమార్గసత్కవులగు కాళిదాసబాణాదులతో సమానముగా బేర్కొన

దగిన దేశిసత్కవుల నప్పటి కాత డెఱుంగకపోవుటచేతనే ప్రత్యేకముగా బేర్కొనలేదని తలంపదగియున్నది.

అట్లుత్తమమార్గ సత్కవీశ్వరులతోపాటు దేశి సత్కవులనుగూడ సంస్తుతించి, దుర్గా(ర్మా)గ్గపదవర్తులన దగు మార్గకవులం బరిహరించిన పదప నూత్నరుచిర కావ్యములను రచించురీతిని గూర్చి నన్నెచోడుడిట్లు చెప్పినాడు.

" సరళముగాగ భావములు
జానుఁదెనుంగున నింపుపెంపుతో
బిరిగొనవర్ణనల్ ఫణితి
పేర్కొన నర్థములొత్తగిల్ల బం
ధురముగ బ్రాణముల్ మధు
మృదుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తులార్యులకుఁ
గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్.

సీ. మృదుకీతి సూక్తులిం పొదవింప మేలిల్లు
భావమ్ము నెలమి క్రీడావహముగ
మెఱుఁగులు గన్నులు మిఱుమిట్లు వోవంగ
గాంతి సుధాసూతి కాంతి జెనయ
వర్ణన లెల్లచో వర్ణనకెక్కంగ
రసములుదలుకొత్తి జా(రా)లువార
దేశిమార్గంబుల దేశీయములగు న
లంకారములఁ దానలంకరింప
నాదరించి విని సదర్థాతిశయమున
బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదేరచింపవరకవీశ్వరునకు
నూత్నరుచిరకావ్యరత్నవీథి.

ఈపద్యములలోని యాలంకారికవిషయముల నటుంచి భాషాశైలివిషయమున మనము ప్రత్యేకముగా గ్రహింప దగిన విషయములు రెండుగలవు.

అందు, సరళముగా భావములు "జానుదెనుంగున" నింపు పెంపుతో బిరిగొనునట్లు రచింపవలయుననుట మొదటిది "దేశిమార్గంబుల దేశీయములుగ న్" రచింపవలయు ననుట రెండవది. వెనుక చాళుక్యులు దేశికవితపుట్టించి యంధ్రవిషయమున దెనుగు నిలిపిరని చెప్పుచు, మార్గ కవితపదలలేని దుర్మార్గపదవర్తులగు కుకవివరాశులను పరి హరించినట్లే, యిచ్చట రుచిరకావ్యరత్నములను రచించు మార్గమునుగూర్చి చెప్పుచు, దేశికవు లవలంబించిన జాను దెనుంగే యుపాదేయమనియు, దేశిమార్గములను-అనగా- దేశభాషాసంప్రదాయములను, మార్గకవితాసంప్రదాయ ములను గలిపి-లేదా దేశభాషలను, సంస్కృతభాషను గలిపి-కవిత చెప్పునపుడు ఆభాషను దేశీయముగనే చేయవలయును గాని, మార్గమును = సంస్కృత మును) వదలంగ మదివదలక, కొంతదేశ్యముతోగూడిన సంస్కృతముగా జేయుట యుక్తముకాదని సూచించి నాడు. ఇచ్చట యీతని యుద్దేశ మిదియేయనియు, నీ దేశభాషలలో - ముఖ్యముగా నాంధ్రకన్నడములలో- నిప్పుడు మనమెఱింగిన శిష్టభాషలలో తొలికవిత బయలు దేరుటకు బూర్వము తత్సమముగా జేయబడని సంస్కృత ముతో గుచ్చియెత్తిన దేశభాషలలో రచింపబడిన కవిత, మలయాళభాషయందలి మణిప్రవాళశైలిని బోలినది కొంత బయలుదేరియుండుననియు, దానినుద్దేశించియే యీత డింతగా జెప్పెననియు, మనము నిశ్చయింపవచ్చును. తిక్కన నిర్వచనోత్తరరామాయణమున "జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెప్పుడు జొన్ప" నని ప్రత్యేకముగా దెలుగుభాషలో తత్సమముగా జేయ బడని సంస్కృతమును దీసికొనివచ్చి కలుపుట జాతీయము కాకపోవుటచే, తా నల్లెప్పుడును జొనుపదలంచుకొన లేదు-అని యొక ప్రతిజ్ఞగా జెప్పుటనుబట్టి కూడ చూడ గా, నట్లు తెలుగుసంస్కృతములను జొనిపి కవితజెప్పు సంప్రదాయమొకటి యంతకుబూర్వము దేశములో నొక కాలమున బ్రచారమందుండెననియు, నట్టికలయిక యీ తని కిష్టము లేకపోవుటచేతను, నంతకు బూర్వమే యాం ధ్రదేశమున దీనియందనాదరము ప్రబలుటచేతను, దాని నాతడు పరిహరింపదలంచి యట్లు చెప్పెననియు నూహింప దగియున్నది.

ఇక నన్నెచోడునికంటె పూర్వులగుకవు లెవరును దీనినిగూర్చి ప్రత్యేకముగా జెప్పియుండక పోవుటచే, నద్దానినిగూర్చి తెలిసికొనుట కాధారమేమియు లేదు.

కాని, రాజనరేంద్రుని ప్రోత్సాహమున నన్నయ భారతమును దెలిగింపబూనినపు డాయాస్థానమందలి పండితప్రవరులతో నీతనికి గలిగిన 'ఘర్షణముల'కు 'భారతాంధ్రీకరణమునసెట్టి భాషప్రయోగింపవలెను' అను విషయముగూడ నొకకారణమై యుండవచ్చునని యూహింపనగు. అప్పటి పండితులలో బలువురు సంస్కృతమునం దభిమానము విశేషముగా గలవారగుటచే, సంస్కృతమునను తెనుగుగలిపి మణిప్రవాళశైలిలో రచింపవలయునను వాదమును బయలుదేరదీసియుందురు. ఈవిషయమున కన్నడభాషాసంప్రదాయ సాదృశ్యమునుజూపి, యాంధ్రమున నట్లే—'దేశిమార్గములను – దేశీయముగనే చేసి'—రచించుటయే యుక్తమని యప్పటి పండితులకు నన్నచెప్పుటలో నారాయణభట్టు నన్నయకు తోడ్పడి నిలిచియుండును. కన్నడభాషలోగూడ నిట్టిసంప్రదాయ మొకకాలమున ప్రబలియుండగా, కన్నడకవులు నన్నయకుబూర్వమే యీ విషయమును జర్చించి తత్సమభాషనే యవలంబింపవలయునని యనుశాసించి యట్లెరచింపదొడగినారు. ఈ విషయము కన్నడభాషలో మొదటి లక్షణగ్రంథమగు 'కవిరాజమార్గ'మునందలి పీఠికాంశములను పరిశీలించినచో మనకునువ్యక్తముకాగలదు. ఆంధ్రమున మొట్టమొదట లక్షణగ్రంథమును రచించినకేతనయు, దన యాంధ్రభాషాభూషణమున నీక్రింది సీసపద్యమున తిక్కనార్యుని "జాత్యముగామినొప్పయిన సంస్కృతమునెప్పుడు తెలుగున జొనుప"గూడదను నభిప్రాయమునే, యనుశాసనరూపమున దెలిపియున్నాడు.

"వృక్షేణదక్షాయ పక్షిభిఃపుత్రస్య
యనువిభక్తులు దెనుంగునకుంజొరవు
అస్తిప్రయాతిగాయంతి భుంక్తేసంతి
వయతిస్మరతి యను క్రియలు సొరవు
గత్వాహసిత్వాప్రకాశ్యసంత్యజ్య నా
దనరుత్వాంత ల్యబంతములు సొరవు
గంతుంపురీం రిపుంహంతుం సుతంపాతు
మనుతుమున్నంతంబులరయంజొరవు
అపిచతుహివైన వానను లనగ బెక్కు-
లవ్యయంబులు చొరవెందు నాంధ్రకవిత
వెరపదంబులతోడను దొరలినిల్చు
నవి తెనుంగును గావింతు నభిమతముగ."

ఇట్టి సంస్కృతరూపములను తెలుగుతో నొక కాలమున గలిపిచెప్పు నాచారముండుటచేతనే, ఆయాచారమును ఖండించు నిట్టి యనుశాసన మావశ్యకమైనది. మలయాళమున నిట్టి యనుశాసన మాదరింపబడకపోవుటచేతనే—అనగా సంస్కృతమునే ప్రధానముగా జేసి దానితో గొన్ని మలయాళ పదములను జేర్చి చెప్పెడు నాచారము ప్రబలమగుటచేతనే—యందు మణిప్రవాళమను శైలి ప్రత్యేకముగా నేర్పడుట తటస్థించినది. అట్టి శైలి కుదాహరణముగా భాషానైషధమునందలి యీ క్రింది పద్యమును జూపుచున్నాను.

"ఞాన్ అజ్ఞుచన్నళవిలే పరిముచ్యగోష్ఠీం
నిద్రాచ్ఛలేన నిజవాస గృహంవ్రజంత్యాః
యన్మేలు మజ్జరయిలుం కుళుర్కొంగమేలుం
గూఢస్మితార్ద్రి ముడనే పతితః కటాక్షః"

ఞాన్ = నేను, అజ్ఞు = అక్కడకు, చన్నళవిలే = పోయినప్పుడే; గోష్ఠీంపరిముచ్య, నిద్రాచ్ఛలేన, నిజవాస గృహం, వ్రజంత్యాః, (తస్యాః) కటాక్షః; అజ్జరయిలుం = ఆగదిలో, యన్మేలుం = నాపయినను, కుళుర్కొంగమేలుం = చల్లనియామె స్తనములపైనను, ఉడనే = (తోడనె) వెంటనే, గూఢస్మితార్ద్రిం యథాతథా, పతితః. అని యీపద్యాన్వయము. ఈవాక్యమునందలి కర్త క్రియ, అవ్యయము, అంతయు సంస్కృతభాషాసంప్రదాయానుసారమైయున్నది. మధ్య కొన్నిపదములు మాత్రమె మలయాళభాషకు సంబంధించినవి. "ఆలేడీ నన్ను చూడడంతోనే ఫ్రెండ్సుతో కాన్వర్ సేషన్ మానేసి నిద్రవస్తూందనే ప్రిటెక్స్టుమీద నన్ను చూచి నవ్వుతూ బెడ్ రూమ్ కేసి వెళ్ళిపోయినది." "అను నిట్టిరీతి గిరీశం తెలుగును దలపించుచున్నది పై మళయాళపద్యము. ఈ మణిప్రవాళశైలిలో వ్రాయబడినకావ్యము లనేకము లిట్లే యున్నవి. కావు

ననే "భాషాసంస్కృతియోర్యోగో మణిప్రవాళం" అని మలయాళలక్షణగ్రంథములలో మొదటిదగు "లీలాతిలక" మీశైలిని నిర్వచించి దాని నంగీకరించుచున్నది. కన్నడాంధ్ర దేశములలో గూడ సంస్కృతభాషకును నార్య మతమునకును ప్రాబల్యము కలిగినను, అపభ్రంశములనితలంపబడిన దేశభాషలలో నుత్తమ కవితరచింపగూడదనువాదము ప్రబలుటచే, నీభాషలలో కవితారచన చేయనొల్లని పండితులాదికాలమున నిట్టిశైలినే యవలంబించినను, నీదేశములలోమాత్ర మిట్టిరచన లంగీకరింపబడకపోవుటచే నవి వెంటనే యంతరించినవి. కాని దీనిస్వరూప మిట్టిదనియు, నీభాషలోగూడ నొకప్పు డిట్టి రచన గలదనియు సూచించుటకోయన్నట్లు పాల్కురికి సోమన వృషాధిప శతకమున రెండుమూడు మచ్చుపద్యములను రచించి చూపియున్నాడు. అందొకదాని నిచ్చట బొందుపరచుచున్నాను.

"అనయము జేతులందు భవ
దంఘ్రిసరోజయుగం నమామి నె
మ్మనమున సంస్మరామి యను
మాటల నిక్క పరిపస్కరోమ్యహ
మ్మనుచు మణిప్రవాళమున
నంకనసేయుదు భక్తలోకహృ
ద్వనజ విహారలోల బస
వా బసవా బసవా వృషాధిపా.

నన్నెచోడాదులకు సుమారు రెండువందల యేండ్లకుపూర్వమున నిట్టి శైలిని ఖండించి, కన్నడ భాషతో సంస్కృతము గలిపి రచింపదగిన రీతిని గూర్చి నృపతుంగుడు తనకవిరాజమార్గమున దెలిపియున్నాడు. అనగా తెలుగులో భారతమును నన్నయ రచింపదొరకొనుటకు పూర్వము రెండువందలయేండ్ల కాలముననే కన్నడభాషలో నీవాదము పరిష్కరింపబడుటయు దానిననుసరించి పంపాదులు గ్రంథముల రచించుటయు జరిగినదన్నమాట. కన్నడభాషలో నవలంబింపబడిన యీపద్ధతినే, నారాయణభట్టు తోడ్పాటుతో నన్నయ రాజాస్థానమునందలి పండితులకు నచ్చజెప్పి, యనుసరించినవాడయ్యెను.

కవిరాజమార్గమునందలి పీఠికనుబట్టి విచారింపగా నప్పుడు రూపుమాసిపోయిన ప్రాచీనకావ్యములు — చౌపది, గీతిక, అక్కర, కందము మొదలగు పద్యములతో గూడినవి 'చెత్తాణం' 'బెదండె' యను పేరబరగునవి కొన్ని కలవనియు, నృపతుంగుని కాలమునకే 'పళగన్నడ'మని (ప్రాచీనకన్నడము) చెప్పబడదగిన భాషలో నవి రచింపబడియుండుననియు దెలియవచ్చుచున్నది. ఈ పళగన్నడము సంస్కృతభూయిష్ఠమగు శిష్టభాషవలె, నాతని దృష్టిలో సుబోధకముగాని, రసవంతముగాని కాకుండుటచే నద్దానిని కావ్యములలో బ్రయోగింపనెంచుట "జరద్వధూ విషయ సురతరసరసికత"వంటి "విరసంకరమవు" ననియు జెప్పి ప్రాచీనభాషాప్రయోగము నీతడు నిరుత్సాహపఱచినాడనియు నీ క్రిందిపద్యములవలన స్పష్టమగుచున్నది.

### పళగన్నడస్వరూపం

పాడవిపతిగె (రవ) నెనెపే
ట్బడెయదు ఇదెకరిసికబ్బిగర్దూఁ (అ)నెయుం
(హడవసమురనిట్టె)సు గెం(?)
ముడియె(శ)మార్గెందునుడివపళగన్నడమం.

### పళగన్నడదనిందె

దొరకొండిరెసాగయి సుగుం
పురాణకావ్యప్రయోగదొళ్ తత్కాలం
విర (సం)కరమవు దేసిగె
జరద్వధూవిషయ సురతరసరసికతవోల్.

కవిరాజమార్గము. ౪౯. ౫౦.

ఇట్లు ప్రాచీన కన్నడభాషా ప్రయోగము విరసముగా నెంచబడినపు డికచేయదగిన దేమి యను ప్రశ్నకు, సమసంస్కృతమును, మిశ్రముచేసి కావ్యములనురచింపవలయునని సమాధానము చెప్పినాడు.

### సమసంస్కృతమిశ్రణాభ్యుపగమ

క. సమసంస్కృతం గళో(ళ్ తు)
(క్షి)మదిర్కెరెకన్నడమ నతెఱు పేర్గెంబుది దా

# కామినియా నూనె

వేనకు వేల కుటుంబములయందు ఉపయోగించబడుచున్నది

## ఎందుకు?




కామినియా నూనె

వెంట్రుకలు ఊడిపోకుండా నాటంకపరచును

కామినియా నూనె

చుండును పోగొట్టును.

కామినియా నూనె

తలకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

తలకు సంబంధించిన వ్యాధు లన్నిటిని కుదుర్చును. ఉష్ణముగా నున్న పుఱ్ఱెకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

యందు వెంట్రుకలు పెరుగుట కవసరమైన వస్తువులు, మెదడుకు కావలసిన అమూల్యవస్తువులు గలవు.

కామినియా నూనె మనోహరమైనట్టియు ఆహ్లాదకరమైన సువాసనగలది.

కామినియా నూనె శిరోజములకు ప్రాణము. ఇట్టి సుగుణము లుండుటవలననే వేలకొలది కుటుంబములందు కామినియా నూనె ఎక్కువగా వాడబడుచున్నది.

కామినియా నూనెను ఉపయోగించునట్టివారు గనుకనే దీనిని "శిరోజములకు ప్రాణ మని" దీనియందు గల లాభకారియైన సుగుణములను బట్టి తెలుపుచున్నారు.

బుడ్డి 1 కి ధర రు. 1. వి. పి. ఖర్చులు అ. 6. ప్రత్యేకము.

బుడ్లు 3 కి ధర రు. 2-10-0. వి. పి. ఖర్చులు 0-12-0. ప్రత్యేకము.

అత్తరులకు రాజైన

## ఓటో దిల్ బహార్ (రిజిస్టర్డు)

హిందూదేశమం దంతటను యిది విరివిగా అమ్మబడుటనుబట్టియే దీనికి గల అసాధారణమైన శ్రేష్ఠత్వమును రుజువుచేయుచున్నది. కొన్ని బొట్లు చేతి రుమాలపైన చల్లిన సీమపుష్పములు, మల్లెపుష్పముల వాసనవలె మనోహరమైన దీర్ఘసువాసనను గలిగించుచున్నది.



½ ఔ. బుడ్డి 1 కి రు. 2. ¼ ఔ. రు. 1-4-0. 1 డ్రా. 0-12-0.

వి. పి. ఖర్చులు అణాలు 6 ప్రత్యేకము.

2 అణాలు తపాలబిళ్ళలు పంపిన శాంపిల్ బుడ్డి పంపబడును.

కామినియానూనె ఓటోదిల్ బహారు సుప్రసిద్ధమైన స్టోరులన్నిటియందును దొరకును.

## ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ.

తపాలుపెట్టె నెం. 2132. బొంబాయి నెం. 2.

# కామినియా నూనె

వేనకు వేల కుటుంబములయందు ఉపయోగించబడుచున్నది

## ఎందుకు?




కామినియా నూనె

వెంట్రుకలు ఊడిపోకుండా నాటంకపరచును

కామినియా నూనె

చుండ్రును పోగొట్టును.

కామినియా నూనె

తలకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

తలకు సంబంధించిన వ్యాధు లన్నిటిని కుదుర్చును. ఉష్ణముగా నున్న పుర్రెకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

యందు వెంట్రుకలు పెరుగుట కవసరమైన వస్తువులు, మెదడుకు కావలసిన అమూల్యవస్తువులు గలవు.

కామినియా నూనె మనోహరమైనట్టియు ఆహ్లాదకరమైన సువాసనగలది.

కామినియా నూనె శిరోజములకు ప్రాణము. ఇట్టి సుగుణము లుండుటవలననే వేలకొలది కుటుంబము లందు కామినియా నూనె ఎక్కువగా వాడబడుచున్నది.

కామినియా నూనెను ఉపయోగించునట్టివారు గనుకనే దీనిని "శిరోజములకు ప్రాణమని" దీని యందు గల లాభకారియైన సుగుణములను బట్టి తెలుపుచున్నారు.

బుడ్డి 1 కి ధర రు. 1. వి. పి. ఖర్చులు అ. 6. ప్రత్యేకము.

బుడ్లు 3 కి ధర రు. 2-10-0. వి. పి. ఖర్చులు 0-12-0. ప్రత్యేకము.

అత్తరులకు రాజైన

## ఓ టో దిల్ బ హా ర్ (రిజిస్టర్డు)

హిందూదేశమం దంతటను యిది విరివిగా అమ్మబడుటనుబట్టియే దీనికి గల అసాధారణమైన శ్రేష్ఠత్వమును రుజువుచేయుచున్నది. కొన్ని బొట్లు చేతి రుమాలపైన చల్లిన సీమపుష్పములు, మల్లెపుష్పముల వాసనవలె మనోహరమైన దీర్ఘ సువాసనను గలిగించుచున్నది.



½ ఔ. బుడ్డి 1 కి రు. 2. ¼ ఔ. రు. 1-4-0. 1 డ్రా. 0-12-0.

వి. పి. ఖర్చులు అణాలు 6 ప్రత్యేకము.

2 అణాలు తపాలబిళ్ళలు పంపిన శాంపిల్ బుడ్డి పంపబడును.

కామినియానూనె ఓటోదిల్ బహారు సుప్రసిద్ధమైన స్టోరులన్నిటియందును దొరకును.

## ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ.

తపాలపెట్టె నెం. 2132 బొంబాయి నెం. 2.

# కతియవారు ట్రేడింగు కంపెనీ

## జగత్ప్రసిద్ధిగల సర్వజనాదరణీయమైన తలనూనెలు, అత్తరులు

## మీరు కోరిన సువాసనలు మీకు లభించగలవు




### మనోహరపరిమళము గల తలనూనెలు

కుసుమాల్ హెయిరాయిలు (రిజిష్టర్డు):— తలనూనెలలో సాటిలేనిది. సంపన్నులు మెచ్చినది.
వెల సీసా 1 కి రు. 1-0-0

వైట్‌రోజ్ హెయిరాయిలు నెం. **777** (రిజిష్టర్డు):—గులాబీపువ్వులనిజసౌరభ మిందుగలదు. రోజాపూవుల కాసక్తి గలవారి కామోద మొసగును.
వెల సీసా 1 కి రు. 0-14-0

కోకోనట్ హెయిరాయిలు నెం. **777** (రిజిష్టర్డు):—టెంకాయనూనె తలనూనె కుపయోగించునని ప్రతివానికిని తెలియును. కాని ఎట్లు సిద్ధముచేసినచో నది ప్రశస్తమో తెలియదు. ఈ **777** నెం|| రులో (రిజిష్టర్డు) చేసిన ఈ టెంకాయనూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగా చేయబడి సూక్ష్మసువాసనాసంకలితముగా జేయబడినది. అందుచే అందరిచే మెప్పునొందినది. వెల సీసా 0-14-0

పుష్పమాలతీ హెయిరాయిలు (రిజిష్టర్డు):— మాలతీ పుష్పసువాసనతో అతిమనోహరమై హృదయరంజకమై యొప్పు తలనూనె యిది.
వెల సీసా 1 కి రు. 0-14-0

సువర్ణమాలా హెయిరాయిలు (రిజిష్టర్డు):—యిది సర్వజనాదరణీయమైన సుకుమార సువాసనగల తలనూనె.
వెల సీసా 1 కి రు. 0-9-0

### సర్వజనాదరణీయమైన పుష్పముల అత్తరులు

ఆటో మధుకర్ నెం. **777**:—ఈ అత్తరునందుగల సొగసైన పూలవాసనచే మోహితులై అనేకమంది యీ అత్తరును తమ యభిమానసౌరభముగా భావించుచున్నారు. ఒకసారి యుపయోగించినచో సర్వదా వరించినట్లగును. వెల ½ ఔ. సీసా 1 కి 1-12-0    ¼ ఔ. సీసా 1 కి 1-0-0

ఓటో కుసుమాల్ (రిజిష్టర్డు) పరిమళములందపూర్వచిత్రములు:—అప్పుడు కోసిన పూవులవాసన యీ అత్తరునందు కలదని సౌరభప్రియు లందరును అంగీకరించిరి. సారా అరఖులతో చేర్చిన యితర అత్తరులను జూచి విసుగుచెందినవారి మనోభీష్టమునకు తగిన అత్తరు. నిది సుకుమారమైన సూక్ష్మసౌరభము వెదజల్లును.

వెల ½ ఔన్సు సీసా రు. 2-0-0    ¼ ఔన్సు సీసా రు. 1-0-0

నెం. **777** ఓటో జాస్మిన్, ఓటో హీనా, ఓటో రోజ్, ఓటో లిలీబ్లాజం, ఓటో మస్క్, ఓటో నీరోలీ, ఓటో బకూల్, ఓటో సురంగి ప్రతిది వెల ½ ఔన్సు సీసా 1 కి రు. 1-12-0    ¼ ఔ. సీసా 1 కి రు. 1-0-0

పాకింగు పోస్టేజీ ప్రత్యేకము. రెండణాలుచీట్లు పంపినవారికి కోరిన అత్తరులలో ఒకమాదిరి సీసా లేక కోరిన తలనూనెలు ఏ రెంటినైనను మాదిరిసీసాలు ఉచితముగా పంపబడును.

నేడే వ్రాయుడు. దొంగమాదిరులను చూచి మోసపోకుడు. వీనికిబదులుగా వేనినైనను అంగీకరించకుడు. ఘఖ్యానాగల ఔషధముల దుకాణములన్నింటియందును దొరకును. లేదా,

## కతియవారు ట్రేడింగు కంపెనీ, బొంబాయి (నెం. 4)

గమకోవిదనిగదితమా
ర్గమిదం బెరసల్కమాగదీ సక్కదబోల్."

ఇట్లు సమసంస్కృతమునే దేశభాషతో గలుపవలయును గాని కేవల సంస్కృత పదములను గలుపగూడదనుట యాగమకోవిదనిగదితమార్గమట. కన్నడభాషా వాక్యమున బ్రయోగింపగూడని సంస్కృతావ్యయములను గొన్నిటి నీక్రిందిపద్యమున దెలిపి వానికిలక్ష్యము నిచ్చియున్నాడు. అట్లు కలిపిన నొగరిడియును మద్దెల నొక్కమారు వాయించుటవలన గలుగు జర్ఝరధ్వని కలుగునట.

"అహరహశ్చైర్న్నచై
ర్ముహుర్ముహురితి స్ఫతిః పునఃపునరంత
ర్బహిరాదిహా ప్రాదుహో
సహసాదిగళవ్యయంగళసహాయంగళ్.

బెరసిరెకన్నడదోళె బం
ధురమాగదుకావ్యరచనె పేల్దోడెపేళం
పరుషతరమక్కు మొత్తుం
గరడెయ మద్దళెయ జర్ఝరధ్వనిగళవోల్."

## కేవలావ్యయప్రయోగదోషక్కెలక్ష్యం

"బహిరంతరుపవనంగళో
ళహరహమాపరభృతం గళులివరవంగళ్
సహసాతళమళగాళిసిదు
వహోమనంగళె నిత్తస్తతం విరహిగళా."

## సంస్కృతావ్యయప్రయోగదోష రాహిత్యప్రకార

"విదితసమసంస్కృతోదిత
పదంగళాళ్ పుదిదుబెరసి బరెకన్నడదోళ్
మదనునవు తక్కనమతిళయ
మృదంగ సంగీతకాది మధురరవంబోల్."

ఇట్లు సమసంస్కృతముతో గలిపి చెప్పినది మృదంగసంగీతకాది మధురరవమును బోలియుండుననియు నట్లు చేసిన కావ్యబంధ మనింద్యమై సొగసుగా నుండుననియు జెప్పి పైదోషభూయిష్ఠపద్యమును సంస్కరించి లక్ష్యము నిట్లు చూపుచున్నాడు.

## నిర్దోషక్కెలక్ష్యం

"బహిరుద్యానాంతరదోళ్
సహసోదితమత్తకోకిలోచ్చైర్ధ్వానం
ముహురాకర్ణిసె పడెద
త్తహర్నిశం పేర్చెవంతరంగక్కెన్నా.

నెట్టిర్ద్దకన్నడంగళో
ళగణితగుణవిదిత సంస్కృతోక్తక్రమమం
బగెదొందుమాడి పేల్దొడె
సొగయిసుగుం కావ్యబంధమెందుమనింద్యం."

పిదప మిశ్రసమాసములుకూడ పరిహార్యములే యని చెప్పి లక్ష్యములను జూపినాడు.

"తళెసందా సక్కదముమ
నఱియదె కన్నడము మంసమాసోక్తిగళోళ్
కుఱితు బెరసిదొడె విరసం
మఱుగువ పాల్గళెయపనిగళం బెరసిదవోల్.

అరసుకుమార నవాయత
తరకడెగణ్ణం, (దనోడి) కెళదిసమేతం,
పరిగతనగె యిందిర్ద్దం
గురుగాణ్కెగదింద మెఱగి ముఖదావరెయం."

## సమాసనిర్దోషలక్ష్యం

"నరపతితనయన నాయత
తరళాపాంగదొళెనోడి కెళదియరొడనాం
పరిగతహాస్యదొళిర్ద్దం
గురులజ్జాభరదిసెఱగి ముఖసరసిజమం"

'అరసుకుమార, ఆయతతరకడెగణ్ణు, కెళదిసమేతం, ముఖదావరె' మొదలగు మిశ్రసమాసములు ప్రయోగార్హములు గావనియవి 'నరపతితనయ, ఆయతతరళాపాంగ, కెళదియరొడె, ముఖసరసిజ,' అని యిట్లుండవలెననియు తెలిపినాడు. ఇట్టివిషయములనే కేతనగూడ ఆంధ్రభాషాభూషణమున వృత్తేణదత్తాయేత్యాది పద్యములలో వ్యక్తము చేసియుండుటను గ్రహించియుంటిమిగదా!

ఇట్లీకవిరాజమార్గపీఠికనుబట్టి చూడఁగా, నన్నయకు సుమారు రెండు వందల యేండ్లకు బూర్వమే, యాకాలమందలి శిష్టకవులు సర్వజనసామాన్యమగు దేశభాష నియమరహితంబగుట చేతనో, ప్రాతపడ్డమాటలతోఁ గూడినదగుటచేతనో, సంస్కృతము నెఱుఁగని వారికి రుచింపక పోవుటచేతనో, విరసంబైన భాషగాఁ దలంచి యది శిష్టకవితారచన కనర్హంబని వదలివేసిరనియు, రాష్ట్రకూటచాళుక్యాది దేశీయప్రభువులు దేశభాషలను బ్రోత్సహింప దలచినపుడీపండితకవులు దేశభాషాపదములను సంస్కృతముతోఁ గలిపి యొకవిధమగు దేశికవితను రచింపదొడంగిరనియు, ఇట్టికవిత సర్వజనాదరణీయము కాకుండుటచే శిష్టులలోనే కొందఱు దీనినిఖండించి, సమసంస్కృతప్రయోగపద్ధతిని వాడుకలోనికి దెచ్చిరనియు, నిదియే కన్నడకవులచే నాదరింపఁబడియుండఁగా, నన్నయాదితెలుఁగుకవులుఁగూడ నీపద్ధతినే యాదరించి భారతాద్యుద్గ్రంథములను రచించుటచే, నామణిప్రవాళకవిత కన్నడాంధ్రములలో నంతరించినను, మలయాళమున మాత్ర మే కారణముననో వాఙ్మయమున పాదుకొనియే యుండుట తటస్థించినదనియు నూనము నిశ్చయింపదగి యున్నది.

ఇట్టిపద్ధతి నంతరింపజేసియు, పండితుల యాదరమును బడయఁగల్గుటకుఁ గా నాది శిష్టకవియగు నన్నయ దేశ్యమును గ్రహించి మిక్కిలి తత్సమబహుళంబగు భాషలో భారతమును రచింపవలసినవాడయ్యెను ఇట్లాయా దేశకాలపరిస్థితులనుబట్టి యాయా భాషావాఙ్మయములందలి రచనాపద్ధతులకును, వాఙ్మయస్వరూపమునకును గల సంబంధమును విమర్శింపవలసి వచ్చినపుడు సన్నిహిత భాషల స్థితిగతులను వాని సంప్రదాయములను దెలిసికొనవలసిన యావశ్యకత యెంతేనియు గానవచ్చుచున్నది.

---

## నీతిగీతులు

శ్రీ విక్రమదేవ వర్మగారు

తనువు శుష్కింప వాడును మనసు దాన
 బుద్ధిబలవ ముడుగంటుట పొసఁగుఁ గాన
జనుఁడు సుస్థముగా నిజతనువు నుంప
సర్వథా యత్నమొనరింపఁ జనును గాదె?

జనుఁడు మితిలేని బంగారుఁ దనగృహమున
గూర్చ సర్వదా చింతతోఁ గుందుచుండుఁ
గాని మృతినొందుతఱిఁ జిల్లిగవ్వనైన
బాళిఁ దనవెంటఁ గొనిపోవఁజాలఁ డకట!

ధనమునందును బ్రతుకునందును నరుండు
దనివిఁ గనఁ డెంతధనముఁబొందినను మఱియుఁ
బొందఁగోరును; శతవర్షము లిల మనిన
మఱియు మనియుండఁ గోరును మమతవలన.

అంత చనుటకంటెఁ గొంత దక్కుట మేలు
కు నృపనగరికంటె వనము మేలు
మానహానికంటెఁ బ్రాణహానియె మేలు
పడపుఁగూడుకంటెఁ బస్తు మేలు.

---

# ధర్మనిరతుడు—కార్లయిలు

తణికెళ్ల వీరభద్రుడుగారు
M, A., L. T., Oosmania U niversity, Hydrabad (Deccan)

కార్లయిలు తన దేశీయులకు బోధించిన విషయములలో 'మహాపురుషు'లను గూర్చి చెప్పిన వాక్యములు భావగర్భితము లైనవి. ఏ దేశమునందైనను ఉన్నతాదర్శము కల పురుషుని జీవితము పవిత్రమైనది. అట్టి జీవితచారిత్రమును నిజమయినబుద్ధితో వర్ణించిన గ్రంథకర్త యుత్తమకవి. ప్రతిశకమునందును కొందఱు ఘనులుందురు. వారు సామాన్యమానవుల వలె నాహార నిద్రాభయములలో దృప్తిజెందక, ఉన్నతాశయములు కలిగి దేశోద్ధరణకై పాటుపడుచుందురు. వారే రాజ్యపరిపాలనమున కర్హులు. వారి ననుసరించుటచేతనే దేశమునకు ముక్తి కలుగును. రాజ్యచక్రమును ద్రిప్పుటకు భుజబలము కలవాడు సమర్థుడు కాజాలడు. బుద్ధిబల మెవ్వనికి కలదో యతడే ప్రజలకు నాయకు డగును. శ్రీమంతు డయినంతమాత్రమున సింహాసనాధిపత్యమునకు దగినవాడని తలపవలదు. ధీమంతుడయినవాడే దేశమునకు నిజమయిన చక్రవర్తి. అతడే సంఘమును క్లేశములనుండి తప్పించి, దేశక్షేమమును సమకూర్చువాడు. అట్టినాయకుని వెదకి కనుగొనుటయే సంఘమున కదృష్టము. ఇట్టి నిజనాయకుని తెలిసికొనుట కష్టమయిన పని. తెలిసిన తర్వాతను వాని యుపదేశము ననుసరించుట కష్టతరమైనది. ఇట్టిశూరులే సంఘచరిత్రకారులని చెప్పవచ్చును. వీరి చరిత్రయే దేశచరిత్ర యనదగును. కాని యొకడు గొప్ప మేధావి యయినంతమాత్రమున దేశచరిత్రయంతకును ఆయనయే కారకుడని చెప్పుట హాస్యాస్పదమని చెప్పెడువారు లేకపోలేదు. దేశచరిత్ర యనునది మహానదీప్రవాహ మనవచ్చును. ఎంత గొప్పవారయినను ప్రవాహముపైని బుడగల వంటివా రని వాదింపవచ్చును. అయినను చక్కగా నాలోచించితిమా వీరు చరిత్ర సృష్టికర్తలని జెప్పనగును. తమ దివ్యచక్షువుతో దమదేశభవిష్యత్తును చూడగల్గి, యా యానందమును దాము గ్రోలి, తమ మిత్రులకు రుచిచూపి, వారి కభినివేశము కలిగించి వారిని సంకల్పసిద్ధులుగా జేయగల మహనీయులు లోకమందు లేకపోలేదు. దేశకష్టములను, సంఘదురాచారములను దెలిసికొన్న, యంధకారములోబడి పశుప్రాయులవలె నున్న ప్రజలను, సరియగు బాటమీద ప్రవేశపెట్టి, వారు బెదరిపోకుండ ధైర్యమును పదేపదే పురికొల్పుచు, వారిని ధన్యులజేయువారే మహాపురుషులు. వీరే సేనాధిపతులు. వీరే శూరులు. ఎన్నికష్టములు కలిగినను పట్టినపట్టు విడువరు. ఎట్టి చీకటి కమ్మినను లక్ష్యమును జూచుట మానరు. ఎట్టి గొప్ప సంగ్రామమైనను వెన్ను జూపరు. ఇట్టి మహనీయులు

భిన్నరూపములతో సంచరించు చుందురు. దేవతగా బరిణమింపబడిన ఓడిను, మతకర్త యగు మహామ్మదు, కవీశ్వరుడగు షేక్స్పియరు, విద్వాంసు డగు జాన్సను, సేనాని యగు క్రాంవెల్లు, వీరిలో నందఱును మహావీరులు. వీరే లోకరక్షకులు. వీరే జగన్నాటక మండలి కథానాయకులు. వీరిని పూజించుటయే మన పరమావధి. వీరే లోకపరిపాలనాధికారము కలవారు.

"ఘనతకలవానిని మెచ్చి, వానిని సేవించుటకంటె మానవులకు భాగ్యమేముండును? ఒక మహావీరుని భక్తితో నారాధించుటచే మనము పవిత్రులము కామా? సంపూర్ణహృదయముతో జూపబడి, సాష్టాంగప్రణామంబులతోగూడిన భక్తి-కినయావచ్ఛక్తిని సమర్పించుట—భగవద్రూపమగు మనుష్యాకారమును చూచినంతనే తలచినంతనే, అగ్నిహోత్రమునదగు నావేశముకల్గుట—మానవ జీవితమందు దీనికంటె నధికమగునది కలదా? ఇది పోయినప్రాణమును లేపగలయట్టి మహాశక్తి యనుటకు సందేహింపనేల?"

ఒక యుగమందు మత సంస్కర్త. మఱియొక యుగమందు యోధుడు. ఒకానొకప్పుడు కవిశేఖరుడు. మఱియొక సమయమున రాజ్యతంత్రజ్ఞుడు. కాని లోకచరిత్రలోని యన్నిభాగములందును నిట్టి వీరపూజ యేదో యొక రూపమును దాల్చియే యుండినది. అనగా మనుష్యజీవితము వీరపూజమీదనే యాధారపడి యున్నది. మనుష్యుడు ప్రపంచమం దెంతకాల ముండునో యంతకాలమును వీరపూజ నిలిచితీరును!

కార్లయిలుచే నుత్సాహముగా వర్ణింపబడిన యీ మహావీరుల సుగుణములు లెక్కింపదగినవి. వీ రందఱును యథార్థప్రియులు; మౌనవ్రతులు. మౌనవ్రతమునుగురించి కార్లయిలు చెప్పిన వాక్యములు చిత్రముగా నుండును. ఒకదిన మెవ్వరితోను మాటలాడక, యొకనరుడు మౌనము ధరించెనా, మఱునాడతడు బలమును నానందమును హెచ్చు, ఔన్నత్యమును బొందినవా డగును. ఈమౌన సామ్రాజ్యము బహువైశాల్యము కలది; మహాపురుషు లనదగు వీరలే దీని కధిపతులు! "చక్కని పదములతో భాషించుట రజతమంటివా, మౌనము సువర్ణ మగునని ధారాళముగా జెప్పగలను." ఒక మహావటవృక్ష మున్నదనుకొనుము. ఏనాడు విత్తనము వేయబడెనో, యెవరు నాటిరో యించుకయినను మనకు దెలిసినదా? తన జీవితకాలమం దీవృక్షము నోరెఱుగినట్లుండి, సహస్రవర్షములు ప్రాణికోటికి సేవచేసినది. గండ్రగొడ్డలితో నరికి వేయబడినప్పుడు మాత్రము ఉరుము ఉరిమినంత ధ్వని కల్గించినది. అప్పుడు బహుదూరము వఱకును ప్రజలందఱును ఈ మహావృక్ష మెంత ఘనమైనదో గమనింపగలిగిరి. మఱియొక యుదాహరణము చూడవచ్చును షేక్స్పియరుకవి నాటకములను రచియించి, ఖండఖండములలోని భాషాప్రియులకు జ్ఞానమిచ్చి, వారిని నాహ్లాదమందు నోలలాడించి కవిసమ్రాట్టను బిరుదువహించి నిరంకుశప్రభువయి సాహిత్యలోకము నేలు

చున్నాడు. కాని యాతడు జన్మించినప్పు డిట్టి మహావ్యక్తిలోకమందు ప్రవేశించినదనిసూచన లేవయినను కనుబడెనా? లేదు. కావుననే మహాపురుషులగువారు తాము ఘనుల మని పదేపదే చాటరు. తమ తమపద్ధతుల ప్రకారము తమతమ కార్యములను నెరవేర్చు చుందురు. కొంతకాలమునకు లోకులు వారి తత్త్వమును గ్రహించి వారికి దాస్యము చేయుదురు. వారి యందు మాటలాడుట కంటె యోజించుట, చేయుట యెక్కువ ప్రాముఖ్యము వహించి యుండును.

భాషించుట (నిర్ణీతమగు) కాలమని చెప్పితివా, మౌన మూనుట (నిర్ణయాతీత మగు) అనంతలోక మని చెప్పవచ్చును. మఱియొక మాట. ఈమహాశయులలో నింకొక వింతగుణ మున్నది. వారు ఘనులయినను, అల్పుల మని తలతురు. తా మున్నతపదవి నొందితిమని యెన్నడును వాదించరు. కార్లయిలు మహాశయునిచే చెప్పబడిన యీవాక్యము వాస్తవమని చెప్పవచ్చును. ఏలయన లోకములో సద్భాగ కృత్యములు జేయగల్గిన మహానీయు నెవ్వారి నయిన మనము చూచినప్పుడు 'ఆహా! అతడు మహాత్ముడు, దేవసమానుడు, అవతారపురుషుడు'అని మనము త్సాహముతో పలుకుచుండుట కలదు. కాని మనమాతని సమీపించి మాటలాడితిమా స్తుతియంతటికంటెను గొప్పవాడయినను, తానేమి చెప్పును. 'అయ్యా! నేమవలెనే నేను మనుష్యమాత్రుడను. నన్ను గిల్లితివా రక్తము రాగలదు సుమా?" పరిపూర్ణులగువారెన్నటికిని ఈ విధముననే ప్రవర్తింతురు. సామాన్యముగా నసంపూర్ణులు పరిపూర్ణుల మని విఱ్ఱవీగుటయును, పరిపూర్ణు లగువారు అసంపూర్ణుల మని భావించుటయును లోకమందు చూచుచుంటిమి. అజ్ఞానులమని తలచువారే పరిపూర్ణులు సుమాయని కార్లయిలు నొక్కి చెప్పును. వీరు సంపూర్ణులు కనుకనే వీరినిగూర్చి దివినుండి భూలోకమునకు దిగి వచ్చిన దేవదూతలని చెప్పవచ్చును.

"ప్రపంచమును 'భగవద్దర్శనము' మహాగ్రంథమనుము. శతాబ్దములును వానిలో జరిగిన ప్రపంచచరిత్రయును, ఆమహాగ్రంథములోని వేర్వేరధ్యాయములుగా భావింపుము. మహాపురుషులనదగువారు ఆయా యధ్యాయములలో సారభూయిష్ఠములగు ముఖ్యవాక్యము లేయని నమ్ముము!"

అనగా నీ మహాత్ములు జగదుద్ధరణమునకై పరమేశ్వరుడు భూలోకమం దవతరించి దాల్చిన రూపములని వర్ణింపవచ్చును. ఈ భావమే భగవానుడు శ్రీకృష్ణుడు పురాతనకాలమున గీతావాక్యములయం దిమిడ్చియుండెను:

"సన్మార్గులను రక్షించుటకొఱకును, దుర్మార్గులను శిక్షించుటకొఱకును, ధర్మమును ప్రతిష్ఠాపనము చేయుటకొఱకును, యుగయుగమందును నేనవతరించుచుండెదను."

వీరపూజయందు కార్లయిలు మహాశయునకు గల విశ్వాస మెట్టిదన: వీరపూజమీద నాధారపడని శాస్త్రమే లేదు. దేశచరిత్రలను గ్రంథము లనేకములు దినదినమును ప్రచురింపబడుచున్నవి. వీని విషయమయి విద్వాంసులు ప్రాచీనకాలమునాటి గ్రంథములను రాజకీయ సంబంధము లగు లేఖలను జాగరూకతతో

జదివి వానిని విమర్శించి యథార్థదృష్టితో దేశచరిత్రను వర్ణించుటకు యత్నములు నలుపుచున్నారు. కార్లయిలు చెప్పిన దేమన గా: ప్రాచీనచరిత్ర మనకు సరిగా తెలియదు. తెలిసినదని నటించి పుస్తకములను రచియించు వారు మనల నందఱను మోసపుచ్చు చున్నారని యూహింపవచ్చును. ఏలయన,

"'చరిత్ర' యందు పూర్వకాలములో జరిగిన మంచి కార్యమొక్కటియును వర్ణింపబడదు. దుష్కార్యము లే కనుపించుచుండును; కావున నే యేదేశీయులకు 'చరిత్ర' లేదో వారు పుణ్యాత్ములని తలపవలెను."

'చరిత్రను' యథార్థ దృష్టితో వ్రాయుచున్నామని చరిత్రకారు లనేకులు గంభీరముగా ఘోషించుచున్న సమయమున కార్లయి లీవిధమున పలుక సాహసించెను:—

"అజ్ఞానముతో నిండియున్న 'చరిత్ర': కొంచె మించుమించుగా, పుక్కిటి పురాణముయొక్క సారాంశమేయని చెప్పగలము!"

ప్రాచీన దేశముల నిజమయిచరిత్ర మనకు సరిగా తెలియలేదనియే కార్లయి లభిప్రాయపడుచున్నాడు. ఒక్కటి మాత్రమే మనకు లభించినదట. మహావీరుల జీవచరిత్ర. అదియే మనకు ముఖ్యమయినది. మిగిలిన దెల్లను బూటకపు మాటలు.

"'చరిత్ర' యనగా లెక్కలేని (వీర పురుషుల) జీవితములలోని సారము."

సామాన్యముగా దేశచరిత్ర యనగా నధికసంఖ్యాకులతోగూడిన సంఘచరిత్ర యనియును, ఒక డున్నతపదవి నొందినంత మాత్రమున ఆతనిచరిత్ర దేశచరిత్రగా భావించుట న్యాయమును కాదనియు వాదింతురు. కాని 'చరిత్ర' యనగా రాజునకును రాజునకును జరిగిన పోరాటములును, దేశమునకును దేశమునకును జరిగిన యుద్ధములుననియును, చక్రవర్తులు సింహాసనాధిష్ఠులయిన తేదులును, లేదా పదభ్రష్టులయినదినములును, శాసనసభలలోని తీర్మానములును మాత్రమేయనిమనము తలంతుము. అట్టియభిప్రాయము మన మూఢతనే సూచించునని కార్లయిలు సాహసముతో చెప్పుచున్నాడు. దీనినిబట్టి 'చరిత్ర'యం దతనికి నిరసనభావము కలదని యెంచుట పొరబాటు దేశచరిత్ర నిజమయిన గ్రంథమయిన చో నత్యంతయుపయోగకరమయిన దని నమ్మవలెను.

"చరిత్ర విద్యాశాఖలన్నిటిలోను మిక్కిలి పురాతనమైనది. చరిత్రవ్రాయుట పవిత్రమగు కార్యము. అది భవిష్యత్సూచనలతోనిండియున్నది. పూర్వికులచే చేతితో వ్రాయబడిన గ్రంథమయియున్నది. కాని దానిలోని యక్షరములెన్నియో నేటివఱకును మనపండితులచే గుర్తింపబడకపోవుట శోచనీయము."

అనగా చరిత్ర వ్రాయుటకు సమర్థతగల సంపూర్ణవిద్వాంసుడు పుట్టలేదు; ముందు పుట్టబోడు. ఏలయన: రాజులను వారియుద్ధములను, శాసనసభా తీర్మానములను వదలి సామాన్యప్రజ లేరీతిజీవించియుండిరో, వారిలో ముఖ్యులు కొంద తేవిధమున రేయుంబవళ్లు దేశక్షేమము నకై యెట్లు కష్టపడుచుండిరో చక్కగా వివరింపవలెను. అనగా యుగతత్త్వమును వెల్లడి

చేయవలెను. ఇదికాక ఆయాకాలములందే మహాశూరులు తమ తేజస్సుతో ప్రకాశించిరో వారిని వెదకి, వారిచరిత్రలను విపులముగా జెప్పి వారియాదర్శములను వారి సుఖదుఃఖములను వర్ణించి, వారివలన జేయబడిన లోకసేవ విస్పష్టముగా జూపవలెను. అనగా దేశచరిత్రకును(History) ఒక్కపురుషునిజీవితచరిత్రకును (Biography) భేద ముండకూడదు. చరిత్రకారుడు తత్త్వజ్ఞాని కావలెను. మఱి యొకటి: నాటకములను రచియించు కవీశ్వరుని కేశక్తి కలదో యదికూడ నుండవలెను. ఇట్లు కార్లయిలు మహాశయుడు సూచించు సుగుణములను గలిగిన చరిత్రకర్త దొరకుట దుర్లభము. చరిత్ర యీవిధమున వ్రాయబడలేదు. దీనిని బట్టి తేలినసారాంశ మిది. కార్లయిలు మహాశయుని యొక్కయు, ఆధునిక చరిత్రకారుల యొక్కయు దృక్కోణములు వేరు. వీరులౌకిక సాంప్రదాయికులు. అతడు వైదికపద్ధతి నవలంబించినవాడు. అనేకత్వముతో నిండియుండిన ప్రపంచములోనుండి యేకత్వమును గ్రహింపుమని బోధించు నీతిబోధకుడు. ఆద్యంతములనెడి కట్టుబాట్లలోనున్న మనలను, ఆద్యంతరహితమగు దివ్యపదార్థ మేదికలదో దాని సారమును గ్రోలుమని ప్రచారముచేయు మతసంస్కర్త.

దేశచరిత్రనుండి సాహిత్యమునకు మన దృష్టి మరల్చితిమా కార్లయిలు పద్ధతి దేనియందయినను ఒక్కటియేయని స్పష్టమగును. అతడు గొప్పవిమర్శకుడేకాని విమర్శకులసాధారణపక్కి నవలంబించినవాడు కాడు. గ్రంథమేదయిన నతడు పరీక్షించునపుడు, ఒక్క ప్రశ్నమును దనలో దాను వేసికొనును. దానికి ప్రత్యుత్తర మెక్కడయినను దొరకునా యని మూలమూలల వెదకుచుండును. కవి యథార్థపరత్వము కలవాడా కాడా, అతని వాక్యములు హృదయాంతరాళము నుండి చొచ్చికొనివచ్చినవా కావా, లేక యవి లోకమును మోసగించుటకు పూతపూయబడిన రిక్తవాక్యములా, ఇదియే ముఖ్యమయిన ప్రశ్న. అందుచేతనే ప్రేమరహితమగు కావ్యమెన్నటికి రసవంతము కాజాలదు. ఇటలీదేశములో డాంటే యను గొప్పకవివరు డుండెను. అత డొక యుత్తమ ప్రబంధమును వ్రాసెను. అతడు లోకమంతకును సరిపోయినవా డెట్లాయెను? దేశదేశములకుబోయి చాటుకొనుట వలన కాదు సుమా!

"భయంకర మగు నిప్పుకణములతో నిండిన కొలిమిలో ఖనిజమెట్లు కరగబడునో యట్లే యాతనిహృదయము, లోపలను ఉడికిఉడికి తుదకు కావ్యరూపమై పైకి ఉబికినది."

మహమ్మదీయులకు పవిత్రగ్రంథ మగు ఖురాన్ అత్యంత గౌరవము సంపాదించుటకు కారణము గ్రంథకారుని యథార్థపరత్వమే యని కార్లయిలు సూచించుచున్నాడు.

"ఏలయన, ఏదయినను మానవహృదయములోనుండి పైకివచ్చెనా, యది యితరులహృదయములలోనికి జేరితీరును. నిజమగుదానిని నిర్భీతితో జెప్పుట గొప్పతనము. అంతకుమించినవి, విద్యాధికుల యుక్తులును పైమెఱుగులును, తుచ్ఛములు."

కవిత్వ మనునది మనము కోరినప్పుడు తెచ్చి, యిష్టము లేనప్పుడు త్రోసిపారవేయ బడునది కాదు. అది కవియొక్క శరీరములోని శరీరమయి ప్రాణములోని ప్రాణమయి యుండును. పదములలోని సారస్యమును గూర్చి విమర్శకులు చెప్పెదరు కాని యీ సారస్యము కవీశ్వరుని హృదయసారస్యమే యని తలపవలెను. కవిజీవితమందే తత్త్వము కలదో యది యే కావ్యమనబడును. కావున

"పదములనుబట్టి (పద్యములనుబట్టి) కవియనిపిలువ బడువాడు క్రియలో కవియయియుండవలెను. వీరశిఖామణుల పరాక్రమమునుగూర్చి ప్రబంధమును రచియింప నెంచిన కవి తన జీవితమును శౌర్యపరాక్రమములతో నిండిన ప్రబంధముగా చేసియుండవలెను"

కావున కవిత్వము పవిత్రమైనది. కవి లోకోపకారి. కావ్యమందును, కవీశ్వరునియందును కార్లయిలునకు గల యుత్సాహ మెంత మిక్కుటమో, అతడు షేక్స్పియరునందు జూపిన భక్తియే వేనోళ్ల జాటగలదు.

"అతడు(షేక్స్పియరు) మనము నేటివఱకును సంపాదింపగల్గిన విషయములలో మహోన్నతమైనది. ఆంగ్లేయులారా, మీ ఇండియాసామ్రాజ్యమును వదలిపెట్టెదరా, లేక షేక్స్పియరును వదలెదరా, అను నొకకఠిన ప్రశ్న వేయబడెననుకొనుము. నిజముగా నిది కష్టతరమైన ప్రశ్నమే యగును. రాజకీయోద్యోగులు తమ రాజకీయ భాషలో నుచితమగు ప్రత్యుత్తరమిచ్చెదరుగాక! మనకు తోచినట్లు మనము మాత్రము జబాబియ్యక యెందువారలుండవలెను. ఇండియారాజ్య ముండనీ, లేకపోనీ షేక్స్పియరు సామ్రాజ్యమునుమాత్రము విడిచి జీవింపజాలము. ఇండియాసామ్రాజ్య మెప్పుడో యొకనాడు పోవలసినదే. కాని యీ షేక్స్పియరుమాత్రము పోడు. అతడెల్లయుగములందును మనతోనేయుండును. అతనిని వదలియుండజాలము!"

ఈవిధమున కార్లయిలు తన దేశీయులకు ప్రతి గ్రంథమందును తత్త్వమును బోధించుచుండెను. మనుష్యుడైహిక సుఖముతో దృష్టి జెందక యుత్తరలోకమునుగూర్చి యోచించుచుండవలెననియు, ధనసేవ మాని దైవసేవ మొదలిడవలెననియు నాతడు వేనోళ్లచాటుచుండెను. ఇదియే యాతని సందేశము. నరుడు సర్వకాలములందును కృషి సల్పుచుండవలెను. బుద్ధితోగాని, చేతితోగాని కృషి చేయువానికి సందేహము లెప్పుడును కలుగవు. ఇట్లు తమ కార్యములను నిర్విఘ్నముగా నిర్వర్తించుటకు ముఖ్యమగునది యొకటికలదు. పురాణ పురుషుని జీవచారిత్రమే మనకు ముఖ్యాధారము. వీరపురుషుని సేవయే మనకు సకల విధముల జయము సమకూర్చునది. 'ధర్మాభిలాష, కృషి సల్పుట, వీరపూజ' ఈమూడు మాటలలోను కార్లయిలు మహాశయుని బోధన యంతయు నిమిడియున్నది. ఈసందేశమునే ప్రతి గ్రంథమందును ఏదో యొకతీరున కార్లయిలుబోధించియున్నాడు. తన యాశయములందు నితడు హైందవశాస్త్రజ్ఞులతో బోల్పదగి యున్నాడని చెప్పగలము. మహాజ్ఞాను లందఱివలెను కార్లయి లున్నతదృష్టికలవాడు. సాధారణశాస్త్రవేత్తకు, వేదాంతశాస్త్రము, దేశచరిత్ర, జీవచారిత్రము, కావ్యము ఈ నాల్గును వేర్వేరు పద్ధతులు కలవిగా నున్నవి. వేదాంతి యనువాడు ప్రత్యేకముగా నొకపురుషునిగురించి

వివరమును జెప్పక మనుష్యజీవితమునుగూర్చి యుఁబ్రకృతి పురుషులనుగూర్చియు, లోకతత్త్వమునుగూర్చియు పామరుల కర్థముగాని వాక్యములతో వాదించుచుండును. దేశచరిత్రను రచియించు గ్రంథకర్త రాజకీయరంగమందు దేశములకు జరగిన విషయములను మాత్రమే వర్ణించును. జీవచరిత్ర వ్రాయబూనిన పండితుడు మహాపురుషుని జీవితమును దీసి యాతని యాశములను, జయాపజయములను వివరించును. కవీశ్వరుడన్ననో సృష్టిలోని వస్తువులను ఉత్ప్రేక్షాద్యలంకారములతో వర్ణించి, వానిని రసపూరితములజేసి చిన్నపదార్థములను వింతవిగాను, వింతవ్యక్తులను స్వాభావికముల గాను మనకు జూపును. ఇటుల నీ నాల్గుశాస్త్రములును ప్రత్యేక శాఖలుగా నుండినను, కార్లయిలునకుమాత్ర మవి యన్నియు సమానమే. వాని యాదర్శము లొక్కటియే కనుక పద్ధతులలో వ్యత్యాస మవసరము లేదు. "దేశచరిత్ర యనగా లెక్కలేని మహాపురుషుల జీవచరిత్రల సారమని యెంచుము." అని కార్లయిలు తఱచు చెప్పెను. "దేశచరిత్ర యనగా ననుభవముతో గూడిన (నిదర్శనములతో నిండిన) వేదాంతశాస్త్రమే యని భావింపవలెను" అని యాతడు మఱియొకచోట చెప్పెను. '<u>దేశచరిత్ర</u>'యందు ప్రత్యేకపురుషులును, లేక, దేశములును, వారివారికి జరిగిన స్నేహావైరములును చర్చింపబడును. వేదాంతశాస్త్రమందు మనుష్యజీవితమునుగూర్చిన చర్చ యున్నను ప్రత్యేకవ్యక్తులతో నిమిత్తము లేదు. ఈ రెండును మిళితము చేయబడినపు డాగ్రంథము 'కావ్య' మనబడును. 'ధర్మమే జయించును' అని వేదాంతి పొడిమాటలతో జెప్పవచ్చును. సత్యాభిలాషుడగు హరిశ్చంద్రుడను మహాపురుషు నొకనిని నిర్మించి, వేదాంతవాక్యమునకునిదర్శనము జూపి, వాక్యములను రసపుష్టిజేసి పద్యరూపమున గాని, నాటకరూపమునగాని యానందము నిచ్చుచు ధర్మమును బోధించువాడు కవి. మఱియు చరిత్రకారుడు, ఇంగ్లండు జర్మనీదేశములకు జరిగిన యుద్ధములను గాని, నెపోలియను చక్రవర్తి జయాపజయములను గాని వివరించును. విజయనగరములోని క్షత్రియులకును, బొబ్బిలిలోని వెలమవారికిని మనస్పర్థ లుండెననియు, గోలకొండ నవాబుగారి సైన్యమును, ఫ్రెంచివారి సైన్యమును వచ్చెననియును, బొబ్బిలికోట నాశనమైపోయెననియును చరిత్రకారుడు పొడిమాటలతో వ్రాయును కవీశ్వరు డయినచో, బొబ్బిలివీరుల మహాశౌర్యమును, మల్లమ్మదేవి మహాశోకమును, వర్ణించి మనహృదయమాలిన్యమును బోగొట్టి, మనుష్యజీవితమును గూర్చిన బోధనలను జేయగలుగును. కాని, కార్లయిలునకు మాత్రము ఈ నాల్గింటిలోను భేదములు లేవు. కావ్య మనగా జీవచరిత్ర యని కార్లయిలు చెప్పెను. కవీశ్వరుని జీవిత మేగ్రంథమందు వర్ణింపబడలేదో యది కావ్యమే కాదు. ఒక మహాపురుషునిచరిత్ర వర్ణింపబడినచో నది పద్యమైనను, గద్యమైనను, మహాగ్రంథమని యెంచదగును. వీథిలో బాట

మీాద నడచువానికి, ఒక మనుష్యునకిని మఱి యొక మనుష్యునికిని, ఒక యింటికిని మఱి యొక యింటికిని, భేదము స్పష్టముగా దెలియును. ఎత్తయిన కొండమీాద కూర్చుండి క్రిందికి చూచువానికి, మనుష్యునికిని మనుష్యునికిని, ఇంటికిని ఇంటికిని, భేదము కానరాదు. సామాన్యముగా భౌతికశాస్త్రమునకును, మతమునకును వైరముండును. భౌతిక దృష్టితో జూడని పదార్థమును నమ్మనని శాస్త్రజ్ఞుడు వ్రతము బూనినప్పుడు ఆతడు దైవమును జూచుటెట్లు? కాని యసాధారణ భౌతిక శాస్త్రజ్ఞుడగు జగదీశచంద్రబోసునకు శాస్త్రమునకును మతమునకును భేదము లేదు. రెండును ఒక్కవిషయమునే సూచించును: అనేకత్వముతో నిండియున్న సృష్టిలోని యేకత్వమును గ్రహింపుమని ఈలాగున ఉన్నతదృష్టికల కార్లయిలునకు శాస్త్రములందలి భేదము లగపడవు. అన్నియు నొక్కతత్త్వమునే బోధించును. వాని సారమిది:

"మానవుడా, పరమేశ్వరుని జూడుము. అట్లు చూచుట కొక్కటియే సాధనమున్నది. అతని యాకారములగు మహాపురుషుల ననుసరింపుము. వారి యడుగుజాడలయందు నడువుము. వారియాదర్శములను తెలిసికొనుము. ధన్యుడవు కాగలవు. లేదా నీకు ముక్తి లేదు!"

---

## కుపితచాలనము

విశ్వనాథ సత్యనారాయణగారు, యం. ఏ.

ఆపునవు నాయెదే పఱియలైనది నెత్రెలు పడ్డదేమి నీ
  పువు బెద అల్ల లో నొలికిపోయెను తేనెలు నేమి తేటి కాల్
తవిలిన నొక్కులయ్యెను వృథా పనిలేని క్షుధాతిరేకితా
చివురుల మెట్టికెంపులను జెక్కెదు నీకను గోసలం జెలీ!

ఏపట నీదురాకకుఁ బ్రతీక్షయొనర్చుచుఁ గూరుచుంటి గ్రీ
ష్మానిలమట్లు రంయిమని సాగెదు వచ్చెదు పోయె దింతలో
మానిని! చెమ్మలేని నవమల్లిక చిట్టచిటారుకొమ్మ పూ
వైనది నాదుగుండె పొగలైనది వాడియువత్తలైనదిః.

దూసినకత్తినావిధుర ధూననవైఖరి నేగుచున్న నీ
యా సొగసైనమైచివర లద్దకమైనవి నాయెడందలో
భాసురగాత్రి! నీకుపితపద్ధతికే శిశిరాలసానిల
శ్రీసరణంబులే! జలదరించెను తాపితవేగితమ్ములై.

రివ్వనుక్రొవ్వెదుళ్ల పొదరేగిన సవ్వడిచివ్వరేగెదో
జవ్వని! చిమ్మచీకటులు చాదెదు వేడిమియూర్పు కోతలో
'ద్రెవ్విన నాదునాస లగుదెంచిన సూత్రము లింతలింతలై
క్రువ్వగరాపు ముళ్లకు త్సరుభ్రుచలద్దు'గమోఘ ఖడ్గికా!

దూకిన ఖడ్గవైఖరి, విధూతహుతాశన శేఖరస్థమా
లాకృతి, కోపితాసితమహాభుజగీ పరిణామముగ్ర వ
ర్షాకృత నైల్యమేఘపరిషత్పరుషస్థితి పాలవెన్నెలఁ
ప్రాకిన నీదుమైఁ గళలురాచిన వేమిటికే వధూనికా!

ఓసి విచిత్రమోహాని! ముహుర్ముహురుత్థవృథా కృతాస్మదీ
యాసమవాంఛితమ్ముల కహా! యధిదేవతవయ్యె దేలనే
నాసాద భావవాటికలనాటిన యూరములందు నీవు నే
నై సరితూగుచుంటిమికదా యిది త్రెంచగరాని బంధమై.

నవనవసోగ యెర్రనితనంబులు, సంజలు, క్రొంజివుళ్లమే
ళ్లవు పసకూడు కట్టిన యొయారివి! నీ కుపితారుణానన
చ్ఛవి నవమామకీన పరిసర్పితభావశిఖా సమానమై
యవుర! కదాచిదస్మదుభయప్రణుతైక్యము సంభవించెడిఁ.

నామెదలో విచిత్రపరిణామముకన్నవి నీమనోధ్రకో
పాయతచాలనోద్ధత విభామదనోగ్ర శిఖాగ్రసంహతుల్
కాయజవహ్నిలేఖ తలకట్లయి వేసవివేగులఁ గళల్
ప్రాయపుదీపకాంతి వరవల్లయి యెత్తని పూవుదుమ్మలై.

ఏనోకభావవీథిఁ జరియించెడు రాజతవల్లి దేహహాం
సీ నత కూజితంబువలెఁ జిన్నరిపాల మొగిల్ జగామెఱుం
గూనిన తెల్లచాఱవలె నూరక సన్నని చిన్నిపాటలో
నీనిలువెల్లనా విలసనీకృత మాన్మథ మంజలించెదఁ.

---

# ఆంధ్రశబ్దచింతామణి పాఠభేదములు

వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు

Junior Lecturer in Telugu, Oriental Research Institute, University of Madras



విచక్షణులారా!

అథర్వణ కారికావళితో జోడింపఁబడిన యాంధ్రశబ్దచింతామణిని నా రచింపఁబడుచున్న యాంధ్రవ్యాకరణమునకు మూలముగఁ జేసికొని యద్దానిని నా రచించు వివరణములతోను, సవరణములతోను, న్యూనవిషయపూరణములతోను విపులీకరింపనెంచి యాగ్రంథద్వయము నిపుడు మున్ముందుగ జోడించుచున్నాను. ఆగ్రంథము పూర్తియగుటకుఁ గొంతకాలము పట్టునని తలఁచి యద్దానిని సంబంధించిన కొన్ని విషయము లాంధ్రలోకమున కప్పుడప్పుడు వ్యాసరూపమున విన్నవించుకొనుచుండఁ దలంచితిని.

బాలసరస్వతీయములోని చింతామణికిని, నప్పకవీయములోని చింతామణికిని జాలభేదము లగపడుచున్నవి. అహోబలపండితుఁడుగాని, యప్పకవీయ సంస్కర్త లగు నధునాతనాంధ్రమహాశయులుగాని యావిషయము నంతగాఁ జర్చించి యుండలేదు. అక్కారణమున మున్ముందుగఁ దద్విమర్శనము చేయుట యావశ్యక మని తలంచి యీ క్రిందిరీతిని దద్విషయమును విమర్శించుచున్నాను.

ఆంధ్రశబ్దచింతామణిపరిచ్ఛేదము లయిదింటిలోను మొదటి సంజ్ఞాసంధిపరిచ్ఛేదములు రెండిటికి మాత్రమె కాక నూర్యప్పకవి వ్రాసిన యప్పకవీయమను వివరణ ముపలబ్ధమగుచున్నది. చింతామణి యైదుపరిచ్ఛేదములకును బాలసరస్వతి వ్రాసిన తెలుఁగుటీక పూర్ణముగ లభించుచున్నది. "పాఠభేదాస్తుబహవో దృశ్యంతే పుస్తకద్వయే." అని యహోబలపండితుఁడు చెప్పినట్లే యప్పకవీయస్థ చింతామణికారికలకును, బాలసరస్వతీయస్థ చింతామణికారికలకును నా రెండు పరిచ్ఛేదములందును ననేక పాఠభేదములు వెలయుచున్నవని పైని వ్రాసియేయున్నాను.

కీర్తిశేషులగు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ యాంధ్రకవులచరిత్రమున వ్రాసినరీతిని బాలసరస్వతిగాని, యాకాలపువారు వేఱొకరుగాని యాంధ్రశబ్దచింతామణిని రచించియుండుటయే నిజమైనయెడల బాలసరస్వతికన్న నలువది యేండ్లు మాత్రమే తర్వాతివాఁడగు నప్పకవికి దొరకిన మాతృక యన్ని పాఠభేదములతో నుండుట యసంభవ మని యెవ్వరికేని తోఁచకమానదుగదా! మఱియు నిజముగా నాంధ్రశబ్దచింతామణి నన్నయభట్టారకుని కాలము నాఁటి దయి యుండుటచేతనే యట్లనేకములగు పాఠభేదములు గల్గినవనియు విమర్శకులకుఁ దోఁచకమానదుగదా!

అప్పకవీయపు సంజ్ఞాసంధిపరిచ్ఛేదముల భాగము మాత్రమే యుపలబ్ధమగుచుండుటచే నా రెండుపరిచ్ఛేదములలోని పాఠభేదములు మాత్రమే చూపఁదగియున్నను నప్పకవీయపీఠికనుబట్టిచూచినను, నంతలి చింతామణికారికలనుబట్టిచూచినను గొఱవడిన యనుపలబ్ధములయియున్న యప్పకవి మాతృకలోని మూఁడుపరిచ్ఛేదములందుఁగూడ ననేకములగు పాఠభేదము లుండియుండునని యూహించుట కవకాశము గల్గుచున్నది.

బాలసరస్వతీయస్థాంధ్రశబ్దచింతామణిలో సంజ్ఞాసంధ్యజంతహలంత క్రియాపరిచ్ఛేదము లయి దగపడుచున్నవి. "ముందు బృందారకభాష నశేష విద్యాజన్మాసనం బగు శబ్దశాసనుండు సంక్షేపంబుగాఁ గూర్చిన యాంధ్ర వ్యాకరణమునందలి సంజ్ఞాసంధి తత్సమదేశ్యక్రియాపరిచ్ఛేదంబు లైదునుం దెనుఁగుఁ బలుకుల నేను విస్తరించి భాషాపరిచ్ఛేదంబును వర్ణపరిచ్ఛేదంబును వళిప్రాసపరిచ్ఛేదంబును బహుపరిచ్ఛేదంబును సంధిపరిచ్ఛేదంబును దత్సమపరిచ్ఛేదంబును దేశ్యపరిచ్ఛేదంబును గ్రియా

పరిచ్ఛేదంబులు నను నాలుంబుల నెనిమిదిగా నెలకూచి బాలసరస్వతి సకలభాషాకవిమహోపాధ్యాయ ప్రణీతాంధ్ర వ్యాఖ్యాన గ్రంథం బాధారంబుగా రచియింపంబూని" (అప్పకవీయము ౧ ఆశ్వా. ౧౦౩) అను నప్పకవి వాక్యములనుబట్టి యాతనికిదొరకిన చింతామణిలో బాలసరస్వతిమాతృకలోని యజంత హలంతపరిచ్ఛేదములకు మాఱుగఁ దత్సమదేశ్యపరిచ్ఛేదములున్నట్లు విశదమగుచున్నది. దీనినిబట్టి యజంతహలంత పరిచ్ఛేదములలోని తత్సమశబ్దసంబంధిసూత్రముల నేర్చికూర్చి తత్సమపరిచ్ఛేదముగను, నా రెండిటిలోఁగల దేశ్యశబ్దసంబంధిసూత్రముల నేర్చికూర్చి దేశ్యపరిచ్ఛేదముగను నెవ్వరేని మార్చిరని స్ఫురింపకమానదు. ఉపలబ్ధమగుచున్న యప్పకవీయ గ్రంథభాగములో నున్న సంజ్ఞాసంధి పరిచ్ఛేదముల నాతఁడు భాషావర్ణసంధి పరిచ్ఛేదములను మూఁటినిగా విభాగించి మార్చినవిషయము వెనుక నుదాహరించిన రీతిని స్పష్టముగా వక్కాణించియుండుటచేతఁ బయిని వ్రాసిన యజంతహలంతపరిచ్ఛేదముల నట్లు మార్చి యావిషయము ను వక్కాణింపక కప్పిపుచ్చెనని చెప్పుట సాహసమనిపించును. అట్లయినను నాతఁడు పైని వ్రాసినరీతిని బాలసరస్వతీయము నొకచేతఁ బట్టుకొనియే తనగ్రంథమును వ్రాయుచుండియుఁ దనమాతృకకును, బాలసరస్వతి మాతృకకును ననేకస్థలములందుఁ గల పాఠభేదములను గుఱించిగాని పెక్కుస్థలములలోఁ దార్మారైయున్న సూత్రముల వరుసనుగుఱించిగాని తనగ్రంథమున నుద్ఘాటింపకుండుట మాత్రము శంకాస్పదమగుచున్నది.

ఇఁక బాలసరస్వతీయము నేఁటికిని బ్రచురింపఁ బడకుండుటచేత నయ్యది యిటీవల నెవ్వరిచేతనైనఁ దార్మారయియుండఁ గూడదాయని సందేహించుట కవకాశము లేదు. ఈవఱకు లభించుచున్న బాలసరస్వతీయపు మాతృకలన్నిటియందు మూలమగు నాంధ్రశబ్దచింతామణియొక్క సూత్రములును, వానివరుసయు నేకరీతినే వెలయుచున్నవి. మఱియు నప్పకవికి సమీపకాలమువాఁడగు నహోబలపండితుఁడు చేసిన కవిశిరోభూషణ వ్యాఖ్యానమునందలి యాంధ్రశబ్దచింతామణి సూత్రములును, వానివరుసయు నిపుడు దొరకుచున్న బాలసరస్వతీయ టీకయొక్క పుస్తకములలో నున్నరీతినే యున్నవి గాని యించుకేని వ్యత్యాసము లేదు. వేయేల? అహోబలపండితున కనేక బాలసరస్వతీయటీకామాతృకలు లభించినట్లును, నింకను బాలసరస్వతీకరలిఖిత మాతృక సైతము లభించియున్నట్లును నాతని కవిశిరోభూషణము నందలి "అత ఏవ శాస్త్రిను పౌరుషమాద్యం ప్రాయిక ('ప్రాలంబక' అనునది ఛందోభంగము చేయుపాఠము) నిత్య ప్రయోగలక్ష్మైతత్, దృశ్యమతిస్థవిరంయజ్ జ్ఞాత్వా శబ్దః ప్రయుక్త ఆర్ష సమః" ఇతిక్వచిత్పుస్తకే సరస్వతీకరలిఖిత ఏవ శబ్దానుశాసన ప్రణీతత్వేన పద్యం స్థితమ్" (అహోబలపండితీయము. 119 పుట) అను గ్రంథమువలన స్పష్టపడుచుండుటచేత నహోబలపండితీయములోని చింతామణి, బాలసరస్వతి గ్రహించిన చింతామణి మాతృకకు నభిన్నముగనే యున్నదనుటకు సందేహము లేదు.

కాఁగా, బాలసరస్వతి చింతామణి మాతృకకును నప్పకవి చింతామణి మాతృకకును గల పాఠభేదములును, సూత్రముల వరుసలోని భేదములును వారికిఁ బూర్వమే సంభవించియుండుటగాని, వారి యిరువురలో నొకరిచేతఁ గల్పింపఁబడి యుండుటగాని జరిగియుండవలె ననకతీరదు. రెండుమాతృకలకును నధికపాఠ, పాఠభేదాది భేదములుండుటయేగాక పరిచ్ఛేదములవిభాగములోను, సూత్రముల యానుపూర్విలోనుగూడఁ జాల వ్యత్యాసములుగలవు. వీనిలోఁ గొన్ని యధికపాఠములును, గొన్ని పాఠభేదములును, సూత్రముల వరుసలోని భేదమును, బరిచ్ఛేదవిభాగములోని భేదమును నప్పకవిచేఁ గల్పింపఁబడినవే యని చెప్పక తప్పదు. ఈ విషయము ముందు విశదీకరింపఁబడును. మఱొకవింత! అహోబలపండితునకు దొరకిన యప్పకవీయమాతృకలో లేని చింతామణి సూత్రములును వాని పద్యవివరణములును, నిప్పటి యప్పకవీయములోఁ బ్రవేశించెనాయని యహోబలపండితీయములోని "సర్వత్రాజ్వత్కార్యమితిసూత్రంతు తత్పుస్తకే నదృశ్యత ఏవ" (అహోబలపండితీయము ౧౫౫ పుట) అనువాక్యము వలన విశదమగుచున్నది. ఇప్పటి యప్పకవీయములోని సంధిపరిచ్ఛేదమునందలి చింతామణికారికల పట్టికలో "సర్వత్రాజ్వత్కార్యం

జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః, లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్యసర్వత్ర లుక్సమానేషు" అను కారిక మూఁడవది గా నుదాహరింపఁబడియున్నది. మఱియు నక్కారిక వివరణసందర్భములోఁగూడ నుదాహరింపఁబడియున్నది. ఆకారికలోని సూత్రములకు "ఉ. ఆరయవైకృతోక్తులఁ బదాదులయందు యకార ముండ దాతీరున........" అను మొదలగు పద్యగద్యముల (౮౨—౫౦)వివరణము గూడ నగపడుచున్నది. దీనినిబట్టి వీనినెవ్వరేని యహోబల పండితునకుఁ దర్వాత నప్పకవీయమునఁ బ్రక్షిప్తము లఁచేసిరనిగాని, యహోబలపండితుఁ డప్పకవీయమును పరికఁజూచుకొనక యట్లు వ్రాసెననిగాని యంగీకరింపక తీరదుగదా!

అప్పకవి తన చింతామణి మాతృకపరిచ్ఛేదము లన్నిటియందునుగల కారికలమొత్తముసంఖ్య యెనుబది రెండని యీక్రిందిరీతిని జెప్పియున్నాఁడు:

క. "ఇల నెనుబది రెండార్యలు
గలుగు పరిచ్ఛేద పంచకంబునఁ దగునీ
విలసితఫక్కి మతంగా
చలవిప్రునివలన నీదు సదనముఁ జేరున్."

అప్పకవీయము (౧ ఆ. ౫౮ ప.)

..............................

క. "ఆ విప్రు నతిథిగా సరి
భావించి భుజింపఁబెట్టి భాషించు నెడన్
దా విశ్వశ్రేయస్సను
నీవచనము సదువ నెచటి దిది యన నతఁడున్."

క. "నన్నయభట్టీయములో
నెన్నఁగఁ బ్రథమార్యగాదె; యీ పొత్తములో
నున్నవి యవి యెనుబది రెం
డన్న మహాద్భుతముఁబొంది యవుడెల్లరకున్."

(అప్పకవీయము, ౧ ఆ. ౬౬, ౬౭ ప.)

ఇపు డుపలబ్ధములగుచున్న యప్పకవీయ మాతృకల లోను, ముద్రితాప్పకవీయపుస్తకములలోనుగల భాషావర్ణ సంధిపరిచ్ఛేదములు మూఁడిటియందును నున్న శ్లోకముల సంఖ్య నలువదినాలు గయియున్నది. (భాషాపరిచ్ఛేదము లోనివి, ౬ + సంజ్ఞాపరిచ్ఛేదములోనివి, ౨౦ + సంధి పరిచ్ఛేదములోనివి, ౧౮=కలిసిన (౪౪) నలువదినాలు గగుచున్నవి.) ఇందువెనుక నుదాహరించిన వివాదస్థమగు "సర్వత్రాజ్వత్కార్యమ్......" అను శ్లోకముచేరియే యున్నది. "శాస్త్ర మపౌరుషమాద్యమ్........." అను శ్లోకము చేరియుండలేదు. ఇఁక నప్పకవి గ్రంథాది ని బ్రతిజ్ఞచేసిన యెనిమిది పరిచ్ఛేదములకుఁ గొరవడి య నుపలబ్ధములయియున్న తత్సమదేశ్య క్రియాపరిచ్ఛేదము లనెడి మూఁడిటిలోను ముప్పదెనిమిది శ్లోకములు మాత్ర మే యుండవలసియున్నది. బాలసరస్వతీయమందలి చింతామణిలోని యజంత హలంత క్రియాపరిచ్ఛేదముల శ్లోకము లేఁబదియెనిమిదై యున్నవి. ఈయేఁబదియెనిమి దిటిలోఁ జేరినసూత్రములుగాని, వానివిషయములుగల సూత్రములుగాని నుమారు రెండుకారికల పరిమితిమాత్ర మె గల్గియున్నవి. "........అయిగవుగాదేశౌ స్తః; క్రమేణ సర్వత్రవక్రతమయోర్వా." 9. "వాస్యాత్క్వ చిద్గకారో నాదిగత స్యాద్యవర్గసరళస్య......" 10. (వర్ణపరిచ్ఛేదము); "కవిభిల్లల్సైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు, ప్రథమైకవచనమాత్రే విక్ర తౌ నాంతాదయోపికథ్యంతే,""వికృతిపదే లౌటోరపి... ......" (సంధిపరిచ్ఛేదము) అనునవిమాత్రమె యప్పక వీయములోని యుపలబ్ధపరిచ్ఛేదములలోఁ జేరియున్నవి. కాఁగా రమారమి పదునెనిమిది శ్లోకములు బాలసర స్వతీయమాతృకలోని యజంత హలంత క్రియాపరిచ్ఛే దములలో నున్నవి యప్పకవి మాతృకలోని తత్సమదేశ్య క్రియాపరిచ్ఛేదములలో లోపించినవని విశదమగుచున్నది. కాని యట్టి మూఁడు పరిచ్ఛేదములును లభింపమిం జేసి యేయేకారిక లాతని మాతృకలో లేవో, వానివిషయ ములు వేఱువిధమునఁ జేర్పఁబడెనో, లేదో గ్రహింపవీలు పడకున్నది. బాలసరస్వతీయమాతృకలో లేని పెక్కు విషయముల సూత్రములతోనున్న యుపలబ్ధపరిచ్ఛేద ములు విషయబాహుళ్యములయి యుండఁగా, గొఱవడిన పరిచ్ఛేదములు బాలసరస్వతీయ మాతృకకంటె విషయ హైన్యముతో నుండుననుట మిక్కిలి యాశ్చర్యము నొద వించుచున్నది. విషయహైన్యమన నింతింతగాదు. గ్రంథ ములో మూఁడవభాగము తగ్గియుండుట!

ఇఁక బాలసరస్వతీయ మాతృకలలోఁ జింతామణి కారికలెనుబదియెనిమిది యగపడుచున్నవి. వానిలో "సర్వత్రాజ్వత్కార్యమ్" ఇత్యాది శ్లోకము చేరియేయున్నదని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. 'శాస్త్ర మపౌరుష మాద్య' మిత్యాదికారిక చేరలేదు. అద్దానిని మూలములోఁ జేర్చిన వావిళ్లవారి టీకగల పుస్తకములో నెనుబదితొమ్మిదికారికలున్నవి. అహోబలపండితుఁడు బాలసరస్వతిమాతృకనే యనుసరించినవాఁడుగాన నాతని గ్రంథమునందును నాయెనుబదియెనిమిది కారికలకే వ్యాఖ్య చేయఁబడినది. మఱియుఁ బై విషయములనెల్ల నహోబలపతి తన వ్యాఖ్యానముఖమున నీ క్రిందిరీతివిశదీకరించియున్నాఁడు.

"మత్స్యేంద్రనామ సిద్ధేంద్ర మహిమ్నా సిద్ధతాంగతః,
జగ్రాహ వ్యాకృతిం తస్మాత్ కవి ర్బాలసరస్వతీ.
ఎలకూచి కులాంభోధి శరద్రాకానిశాకరః,
సనుస్తకవితాదక్షో వత్సరే కీలకాహ్వయే,
తత్రపంచపరిచ్ఛేదా శ్శబ్దశాస్త్రే నియంత్రితాః,
ఆర్యాఖ్యపద్యై స్తత్సంఖ్యా సమ్మితా స్సాద్గజైర్గజైః,
మతంగశైల విప్రేంద్రా దన్యద్వ్యాకృతి పుస్తకమ్,
కామనూర్యప్పకవినా గృహీతం తత్రపద్గతాః,
పాఠభేదాస్తు బహవో దృశ్యంతే పుస్తకద్వయే,
మయా ప్రాయ స్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే.
అప్పార్య పుస్తకారూఢ పాఠభేదా ద్యదుత్థితమ్,
మయా సంగృహ్యతే రూపం తదస్యాకరశ్లోకీర్తితః.
(అహోబలపండితీయము. 4-5 పుటలు)

ఇఁక నుపలబ్ధములగు పరిచ్ఛేదములలోఁ గల పాఠభేదములు మాత్రమే విమర్శింపవలసియున్నది. అద్దానికన్న మున్ను గ వేఱొక చిన్నవిషయమును విమర్శించుచున్నాను. పాఠభేదవిమర్శనమునకన్న నీ విషయము ముందుగ విమర్శించుటయే యావశ్యకమగుటచే నట్లు చేయుచున్నాను.

"ఆర్యాఖ్యపద్యైః" అని యహోబల పండితుఁడును, "ఇల నెనుబదిరెండార్యలు", "ప్రథమార్యగాద" అని యప్పకవియుఁ జింతామణికారిక లార్యావృత్తములనియు నందలి మొదటిశ్లోకమార్యయె యనియుఁ జెప్పియున్నారు. బాలసరస్వతియు "విశ్వశ్రేయః కావ్యమ్..." అను శ్లోకమునకుఁ డీక వ్రాయనారంభించి "ఈ ఆర్య నాలుగుసూత్రాలు" అని వ్రాసియున్నాఁడు. నిజమారయఁగాఁ జింతామణి (బాలసరస్వతి మాతృక) యంతటిలోను సామాన్యార్యాశ్లోకములు నాలుగుమాత్రమే కనఁబడుచున్నవి. తక్కినవెల్ల గీత్యుద్గీతులనెడి యార్యావిశేషములై యున్నవి. అప్పకవి మాతృకలోని యధికపాఠములలో నొక యార్యవినాశ్లోకమై యున్నది. మఱియు బాల సరస్వతిమాతృకలోని యొక యుద్గీతి యప్పకవీయ పాఠములో సామాన్యార్యగా మాఱినది. ఏనుబది యెనిమిదిగాని, యప్పకవి యధికపాఠములనుబట్టి యంతకన్న నధికసంఖ్యగాని గల చింతామణిశ్లోకములలో నయిదాఱు మాత్రమే సామాన్యార్యలై యుండఁ దక్కినవెల్ల గీత్యుద్గీతులే—అందును నధికసంఖ్య (ఎనుబదికిఁబైఁగా) గీతులే—యైయుండ గ్రంథమెల్ల సామాన్యముగ నార్యలని వ్యవహరించుట యుక్తము కాదుగదా!

ఈసందర్భమున నార్యాభేదముల లక్షణములను జూపుట యావశ్యకమని తలఁచి వాని నీ క్రిందిరీతి నుదాహరించుచున్నాను.

"లక్ష్మైతత్సప్తగణా, గోపేతా భవతి నేహవిషమేజః
షష్ఠోఽయం నలఘూవా, ప్రథమేర్ధే నియత మార్యాయాః।
షష్ఠేద్వితీయలాన్నే, పరకేముఖలాచ్చసయతిపదనియమః
చరమేర్ధేపంచమకే, తస్మాదిహ భవతిషష్ఠోలః" (వృత్తరత్నాకరము. ఆర్యాప్రకరణము. ౧,౨ శ్లోకములు.)

"ఆర్యాప్రథమదళోక్తం, యది కథమపి లక్షణంభవేదుభయోః, దళయోః కృతయతిశోభాం, తాం గీతింగీతవాన్ భుజంగేశః. ఆర్యాద్వితీయకేర్ధే యద్గదితంలక్షణం తత్ స్యాత్, యద్యుభయోరపిదళయో, రుపగీతింతాంమునిర్బ్రూతే, ఆర్యా శకలద్వితయం వ్యత్యయరచితంభవేద్యస్యాః, సోద్గీతిః కిలగదితా, తద్వద్యత్యంశ భేదసంయుక్తా" ఆర్యా పూర్వార్థంయది, గురుణైకేనాధికేననిధనేయుక్తమ్, ఇతరత్తద్వన్నిఖిలం యదీయముదితేయమార్యాగీతిః. ('దళంయదీయముదితేయ మార్యాగీతిః' అని శ్రీశోధనీ వ్యాఖ్యాపాఠము)

(వృత్తరత్నాకరము-గీతిప్రకరణము. ౧-౨-౩-౪ శ్లోకములు.)

ఏడు చతుర్మాత్రాగణములు నొక గురువును బూర్వార్ధమునందును, నాలు చతుర్మాత్రాగణములు నొకగురువును, బంచమషష్ఠగణములనడుమ నొకలఘువును నుత్తరార్ధమునందును గల శ్లోకము సామాన్యార్య. అట్టియార్యయొక్క పూర్వార్ధలక్షణముతోనే పూర్వోత్తరార్ధములు రెండును నున్న శ్లోకమునకు గీతియని పేరు. ఆర్యయొక్క యుత్తరార్ధలక్షణమే పూర్వోత్తరార్ధములు రెంటనుగల శ్లోక ముపగీతియనఁబడును. ఆర్యయొక్క యుత్తరార్ధ లక్షణముపూర్వార్ధమునందును, బూర్వార్ధలక్షణ ముత్తరార్ధమునందునుగల శ్లోక ముద్గీతియనఁబడును. ఆర్యాశ్లోక పూర్వోత్తరార్ధములు రెంటను నొక్కొక్కగురువు నెక్కువగానిల్పినశ్లోక మార్యాగీతి యనిపించుకొనునని కొందఱ యభిప్రాయము. (ఇదియే సిద్ధాంతము.) ఆర్యయొక్క పూర్వార్ధమునమాత్ర మొక్కగురువధికముగానుండునట్లు చెప్పిన శ్లోక మార్యాగీతి యని మఱికొందఱ యభిప్రాయము. ప్రథమ తృతీయపాదములు పూర్వోత్తరార్ధములందలి మొదటి మూఁడేసిగణములతో పదచ్ఛేదము నందినచోఁ బథ్యార్య యనఁబడును. అట్లు కానిది విపులార్య యనఁబడును. విస్తరభీతి నాశ్లోకముల నిట వ్రాయ లేదు.

పయిలక్షణములనుబట్టి చింతామణిశ్లోకముల ఛందస్సును బరిశీలింపఁగా నీక్రింద నుదాహరించిన పట్టికలోని పదిశ్లోకములు తప్పఁ జింతామణిలోని తక్కిన శ్లోకములెల్ల గీతిశ్లోకములై యున్నవి.

చింతామణిలోని సామాన్యార్యలు

1. "ఔపవిభక్తిక సంజ్ఞా వర్ణాః..." (సంధి-30)
2. "నిత్యందారాదేశ్చ ... ..." (అజంత-49)
3. "అనుతాంస్త్రియాం సమానామ్" (అజంత-52)
4. "ప్రథమైకవచనతుల్యమ్ ..." (హలంత-54)

చింతామణిలోని యుద్గీతులు

1. "ఆద్యప్రకృతిః ప్రకృతి, శ్చాద్యే ఏషాతయోర్వికృతిః." (సంజ్ఞ-5)

(అహోబల పండితీయమునను, వావిళ్ల రామస్వామిశాస్త్రులు & సన్సువారి పుస్తకమునందును "ఏషాతయోర్భవేద్వికృతిః" అని పాఠాంతరముండుటచేత నాపక్షమున నిదియు గీతియే యగుచున్నది. ఉద్గీతికానేరదు.)

2. "ద్వివిధాఢిదుదేదోతో ఽచో వక్రతమావను స్వారా" (సంజ్ఞ-7)

("వక్రతమావథాప్యను స్వారా" అని యహోబల పండితీయాప్పకవీయములలోఁ బాఠాంతర మగపడుచుండుటచే నిదియు నీపక్షమున గీతియె యగుచున్నది. ఉద్గీతికానేరదు.)

3. "సమ్చోతః పరుషాణాం, గసడదవాః స్యుః పదాద్వ్యంద్వే, సామానాధికరణ్యే, పూదంతానాం టుగా గమోఽచిస్యాత్". (సంధి. 28 శ్లో.)

("ప్రథములుగపిద్వితులోర్ద్విత్యస్య సర్వత్ర లుక్సమాసేషు, హేమో క్తేః పరుషాణాం. గసడదవాస్స్యుః పదాద్ద్వంద్వే" అని యప్పకవీయములో వ్యత్యాసముగాఁ బాఠాంతరమున్నది. ఈపక్షమున నిది సామాన్యార్య యగుచున్నది. ఉద్గీతికానేరదు.) ఇఁక నిర్వివాదములగు నుద్గీతు లీక్రిందివిమాత్రమే.

4. "కేషాంచి దుదంతానామ్..." (అజంత-51)
5. "ఆత్మన ఇనునంతానామ్..." (హలంత-56)
6. "ద్విగుకర్మధారయా... ..." (హలంత-69)

పయి నుదాహరించిన పదిశ్లోకములును, ముందు విమర్శింపఁబోవు మఱొక శ్లోకమునుదప్పఁ దక్కిన చింతామణి శ్లోకములెల్ల నెనుబదికిఁ బైఁగా గీతిశ్లోకములెయైయున్నవి. సామాన్యార్యాశ్లోకములు నిర్వివాదములైనవి నాల్గుమాత్రమె యున్నవి. ఇట్టిస్థితిలో గ్రంథమెల్ల సామాన్యముగా నార్యలని వ్రాయుట సరికాదుగదా!

అహోబలపండితుఁడు చింతామణికారికలు పైరీతి నార్యలని వ్రాసియు, 'శిష్టశ్రేయః కావ్యమిత్యాది సూత్రవ్యాఖ్యానావసరమున మాత్రము "సర్వాణి



# మలేరియావలన గలుగు బలహీనతను శానటోజిన్‌వలన జయించుడు.

ఒక ప్రఖ్యాతిగాంచిన డాక్టర్ హెచ్. డబ్లియు. ఎస్. అనువైద్యుడు యిటుల వ్రాసియున్నాడు:—

"శానటోజిన్ మలేరియాజ్వరానంతరము కలుగు బలహీనతను తొలగించుటలో యమోఘమైనది."

క్వైనైన్ మలేరియాను తొలగించునుగాని జ్వరము యొక్క బలహీనతను తొలగింపజాలదు.

మీ బలమును మరల సంపాదించుకొనుటకుమార్గము సరియైన బలవర్ధకాహారము భుజించుటయే. ఇట్టి యాహారము శానటోజిన్ యొక్కటిమాత్రమే.

శానటోజిన్‌నందు బలమును కలుగజేయు పదార్థములు చేరియుండి, రక్తమును తక్షణమే వృద్ధిచేయగలిగియున్నది.

నేటినుండియే శానటోజిన్ సేవించుటకు ప్రారంభించుడు. (3)

# SANATOGEN

నిజమైన బలవర్ధకాహారము.

# జేబునం దిముడు చరఖా

స్వరాజ్యమును పొందుటకు ముఖ్యపరికరము చరఖాను హిందూదేశమునందున్న 700000 గ్రామములందును ఉపయోగించి, నూలును వడికి సహాయపడుడు.




ఈ జేబునం దిముడు చరఖా దీర్ఘ కాలపరీక్షచే కనుగొనబడినది. ఇతర అన్ని మాదిరిలను ఇది ప్రధానస్థాన మాక్రమించుచున్నది పసివారు, ముసలులు, పురుషులు, స్త్రీలు కూర్చున్నప్పుడును నడుచుచున్నప్పుడును సులభముగా దీనిపై నూలు వడుకవీలుగలదు. దీనియొక్క బరువు 10 తులములుమాత్రమే. అయితే దీనిచే నడుకబడునట్టి నూలు మామూలు పెద్ద చరఖాయందుకంటెను మించిపోవుచున్నది. దీనిని ప్రతి చోటను ప్రవేశపెట్టుటకై 1-కి ధర రు. 1 చొప్పుననే యివ్వబడును. 3-కి ఆర్డరు ఒకేసారిపంపిన తపాలా ఖర్చులు యితరఖర్చులు యినాం 6-కి ఒకేసారి ఆర్డరు పంపిన ఒక చరఖా యినాముగా పంపబడును. తక్షణమే ఈ దిగువవిలాసమునకు వ్రాయవలెను.

NAVAJIVAN BHANDAR,
P. B. 533, CALCUTTA.

# త్యాగరాజస్వామి చరిత్రము

ఇది ఆంధ్రగ్రంథమాలలోని ఆరో పుస్తకము. దీని ఆంధ్రదేశములో పేరుగన్న హరిదాసులలో నొకరగు శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు రచియించినారు శ్రీ రామభక్తాగ్రేసరు డయిన త్యాగబ్రహ్మం చరిత్రాన్ని ఇందు గ్రంథకర్త సరసంగా వర్ణించారు. అక్కడక్కడ త్యాగరాజకృతులను చక్కని వాటిని, ఇందులో చేర్చారు. పద్యాలు చదువుతూ నడుమ నడుమ కృతులు పాడుతూంటే కలిగే ఆనందం అనిర్వాచ్యం.

క్రౌనుసైజు పుటలు ౨౧౦, వెల అ. ౧౦.

అంచెకూలి కొనువారిదే.

ఆంధ్రగ్రంథమాల,

## మీ జీవితపర్యంతము మీ శిరోజములను కాపాడుకొనుడు

శిరోజములు మిక్కిలి సున్నితమైనవి. వాటిని మీరు సరిగా పోషించిన అవి చక్కగా పెరిగి, అందముగా నుండును. లేనిచో వాటిని అలక్ష్యముచేసినట్టి చిహ్నములు ప్రారంభమగును. మీ శిరోజములు యే విషయమునందైనను ఆశాభంగమును గలిగించిన వాటిని భయపరచునట్టి అపాయము లన్నిటినుండి రక్షింపుడు.



# సు సా మ

ప్రాగ్దేశమునందు శిరోజముల నభివృద్ధిపరచునది

కొన్నియేండ్లనుండి వాటిని లక్ష్యముచేసియుండినను, లేక సరిగా వాటిని పోషించకయుండినను మీ శిరోజముల కిది తప్పక ఆరోగ్యము నొసగును. గడచిన 50 సంవత్సరములనుండి దేశమందంతటను వాడుకలో నున్నది.

ప్రతిచోటను అమ్మబడుచున్నది.

**P. SETT & Co.,**
**Perfumers, Calcutta.**

# లివరు వ్యాధికి అమోఘమైన చికిత్స

మాదిరి ఔషధములు బయలు దేరినవి. మోసపోకుడు.

వీరి ఔషధరాజము అనేకమంది ప్రజలచేతను, గొప్పగొప్ప డాక్టర్లచేతను, ఆమోదింపబడి వేలకువేలుయోగ్యతాపత్రములు పొందియున్నది. గొప్ప గొప్ప డాక్టర్లుగూడ వదలివేసిన లీవరు వ్యాధులను వీరు అతి జయప్రదముగా గ్యారంటీగా నివారణచేయుచున్నారు.

ఎచ్చటను యీ లీవరువ్యాధికి తగిన ఔషధము లేకపోవుటచే వీరి ఔషధమునే అనేకమంది డాక్టర్లు ప్రతిదినము పోస్టుద్వారా తెప్పించుకొనుచు, వారి వారి రోగులకు వాడి వారి సంతృప్తుల దెలిపియున్నారు.

మరా:—మా ఔషధమును చూచి అనేక మాదిరిఔషధములు బయలు దేరినవి, గాన మోసపోకుండగలందులకై ప్రజలను హెచ్చరించుచున్నాము.

☞ అన్నిచోట్లను వీరి ఔషధరాజములనమ్ముటకు పలుకుబడిగల ఏజంట్లు గావలయును. వివరములకు;

విజయనగరవాస్తవ్యులగు;

## డాక్టర్ జమ్మి వెంకట రమణయ్యగారు,

లీవరు అండ్ స్ప్లీనువ్యాధులకు ప్రత్యేకవైద్యులు.

గ్రంథేఽస్మిన్ పద్యాన్యార్యాగీతివృత్తాని-'లక్ష్మీస్తత్సప్త గణా గోపేతా భవతి నేహవిషమే జః' ఇత్యాది సామాన్యలక్షణాత్, 'త్రిష్వంశకేషు పాదో దళయో రాద్యేషు దృశ్యతే యస్యాః, పథ్యేతినామ తస్యాశ్ఛందో విద్భిస్సమాఖ్యాతమ్' ఇతి విశేషలక్షణాచ్చ, 'ఆర్యాద్యర్ధ సమా గీతిః' ఇతి పైంగళసూత్రాచ్చ, గురులఘుప్రమాణనిశ్చయాది తత్తత్స్వరూపం నంతు వృత్తరత్నాకరే తద్వ్యాఖ్యానే లలితే చ ద్రష్టవ్యమ్" (అహోబల పండితీయము. ౬-౭ పుటలు) అని యిట్లు వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి యహోబలపతి చింతామణిశ్లోకము లార్యాగీతులనెడి యార్యశ్లోకవిశేషము లని చెప్పెనో, లేక గీతిపథ్యార్యావిశేషములని చెప్పెనో? యను సందేహము పాఠకులకుఁ బొడమక మానదుగదా! ఇఁకఁ జింతామణిశ్లోకములలో నొకటియు నార్యాగీతిశ్లోకము లేదనుట యెల్లరకును విదితమేగదా! ఇంకఁ జింతామణిశ్లోకములెల్లఁ బథ్యార్యాగీతిశ్లోకములు గావు. "డు ము వు ల పః...... (అజంత. ౩౭ శ్లో)" "ద్విగు కర్మధారయౌ తత్పురుష...... (హలంత. ౬౯ శ్లో)" అను మొదలగు విపులాశ్లోకభేదములుగూడఁ జింతామణిలో ననేకములు గలవు. ఆర్యాభేదములలో నేదైనను బథ్యగాని విపులగాని కాకతీరదు. కాఁగా సామాన్యార్యకుఁ బథ్యాభేదము విశేషము కానేరదు. 'సామాన్యార్యకు గీతిభేదములు విశేషములు కానోపును. ఆర్యలు జాతు లగుటచే వృత్తము లనిపించుకొనవు. కొందఱు వ్యాఖ్యాతలతోపాటుగ నహోబలపతి యట్లు వాడుట సరికాదు. కాఁగా నీసందర్భమున నహోబలపండితుఁడు వృత్తరత్నాకర పింగళసూత్రాదులను జింతామణికారికలనడకను స్థూలదృష్టినిమాత్రమే చూచి యట్లువ్రాసెననియు, నా ఛందోగ్రంథములలోని యార్యాభేదముల లక్షణములను జింతామణి కారికలనడకను సాకల్యముగా సూక్ష్మదృష్టిని బరిశీలించియుండ లేదనియుఁ జెప్పకతీరదు.

ఇఁక నహోబలపండితుని వాక్యములోని "ఆర్యాగీతివృత్తాని" అనుదాని కార్యాశ్లోకములును, గీతిశ్లోకములును ననియర్థమనియు, గీత్యుపగీత్యుద్గీత్యార్యాగీతులు నాల్గును గీతిప్రకరణములోనివే యగుటచేత వానినెల్ల గీతులని యాతఁడు వాడియుండెననియు నభిప్రాయవర్ణనము చేయుట కవకాశ మగపడుచున్నది. కాని 'ఆర్యాగీతి, గీతి' అనునవి ప్రత్యేకముగా వేర్వేఱు జాతిశ్లోకములకు సంజ్ఞలై యుండునపుడు పైరీతిని వ్యవహరించుట సరికాదుగదా! మఱియు, నా వాక్యములోని 'సర్వాణి' అను పదముయొక్క స్వారస్యముచేతఁ జింతామణిలోని శ్లోకములెల్ల నొక్కవిధముగల శ్లోకములేయని గ్రంథకర్తయభిప్రాయము స్ఫురింపకమానదు. మఱియు నీయహోబలపండితుఁడు "ఆర్యాఖ్యపద్యైః శతసంఖ్యాసమ్మితాస్స్యద్గజైర్గజైః" అని యిట్లు చెప్పిన చింతామణిలోని యెనుబదియెనిమిది శ్లోకములును నేకవిధముగల యార్యలే యనువాక్యము విరుద్ధము కాకతీరదు.

"గీతి చతుష్టయ మిత్థం ప్రత్యేకం షోడశ ప్రకారం స్యాత్ సాకల్యే నార్యాణామశీతిరేవ భేదాః స్యుః" (దీనిచే గీతులెల్లఁబథ్యార్యలె కావలయుననెడి వృత్తరత్నాకర ధీశోధనీవ్యాఖ్య పరాస్తమగుచున్నది). అను ఛందశ్శాస్త్ర సంప్రదాయము చొప్పున గీతిభేదములెల్ల నార్యాభేదములే యగుటచేత వాని నార్య లని వ్యవహరింపనగుననియు, "నార్యాభేదము లగు గీతిశ్లోకములు" అను నర్థమును బయి యహోబలపండితుని "ఆర్యాగీతివృత్తాని" అనుదానిచే గ్రహింపనగుననియు నిటులఁ జెప్పనగునా యని యాలోచింపవలసియున్నది. గీతులెల్ల నార్యాభేదములే యైనను గీత్యుపగీత్యాది సంజ్ఞలతోను "గీతిపథ్యార్య, గీతి విపులార్య" అను మొదలగు సంజ్ఞలతోనుమాత్రమే వాడుట సంప్రదాయముగాని, ప్రత్యేకశ్లోకములకు సంజ్ఞలై యున్న "ఆర్యాగీతి" "గీత్యార్య" అను మొదలగు రీతులను వ్యవహరించుట యొప్పుటను నగపడకున్నది. తుదికి ప్రత్యేకముగ గీతులను వేర్వేఱునపు డార్య లనుటగూడ ఛందశ్శాస్త్ర సంప్రదాయము కాదు.

ఈ సందర్భమును, సంబంధించిన దగుటచేత నీ క్రింది పాఠభేదము ముందుగ నిచట విమర్శింపఁబడుచున్నది. అప్పకవీయమున మాత్రమె యగపడుచున్న యీ క్రిందిశ్లోకము వేర్వేఱు పుస్తకములలో వేర్వేఱు విధముగ నగపడుచున్నది. ఒక్కొక్కపాఠమున

నొక్కొక్కవిధముగు ననుపపత్తికన్పట్టుచున్నది. మీఁదు మిక్కిలిగ నీ శ్లోక మప్పకవి మాతృకలోనిది మాత్రమే యయి యుండఁగా నీ పాఠములలో నేదియు నప్ప కవీయ వివరణమునకు సరిపడియుండలేదు.

(ఎ) "శుభవర్ణాశ్శుభశబ్దా
యేచ శుభగణాస్త ఏవ కావ్యాదౌ;
గ్రాహ్యాః పురాస్త్ర రసగిరి
రుద్రేష్వ కచటహ మాతృకానింద్యాః".
(అప్పకవీయము)

మ-రా-శ్రీ, రావుసాహేబు గిడుగు వెంకట రామమూర్తిపంతులవారు పరిష్కరించిన వావిళ్ల రామ స్వామిశాస్త్రులు అండు సన్సువారి ౧౯౨౨ సంవత్సరపు ముద్రణపుఁ బుస్తకము. ౨ ఆశ్వాసము, ౧౮ శ్లో. ౮౫ పుట, ౧౧౫ పుట.

(బి) "......రుద్రేష్వకచటతపామాతృకానింద్యాః"
(౧౧౧ పుట.) (అప్ప)

"......... రుద్రేష్వకచటతపానింద్యాః"
(౩౯ పుట.) (అప్ప)

I "పమ్మి యరుణాచలశెట్టిగారి ౧౯౦౨ సంవత్సరపు ముద్రణము పుస్తకము. ఇది నాసొంత పుస్తకము.

II యద్దనపూడి సంజీవయ్యగారి ౧౯౦౧ సంవత్సరపు ముద్రణపుఁ బుస్తకము.

(సి) ".........రుద్రేష్వకచటతపానింద్యాః"

I అహోబలపండితీయము. ౧౬౮ పుట.

II ద్వితింత్రిణీ సీతారామకవిగారి వికృతివివేక టీక ౧౯ పుట.)

పైచింతామణి శ్లోకము నీక్రిందిరీతి నధర్వణుఁడు పూరించియున్నాఁడు :

శ్లో. తృతీయోచ్చతృతీయోష్మా తృతీయేసరళాస్త్రయః;
షోడశే వ్యంజనం చాపి షష్ఠస్థానేన యుజ్యతే.
(వికృతివివేకము-సంజ్ఞ ౨౯ సూ.)

పైవాని (అప్పకవి కధర్వణకారికావళి పూర్తిగ దొరకకున్నను, నందలి కారికలు పండితపరంపరా పారాయణము మూలమున లభించియుండెనని మున్ముందు విమర్శించు దానికీసందర్భమును సహాయపడఁగలదు.) నప్పకవి యీ క్రిందిరీతిని బయి చింతామణిసూత్రపు వివరణము సందర్భమున నాంధ్రీకరించియున్నాఁడు

క. ఆదిస్వరమును బ్రథమై
కాదశ షష్ఠార్ణములు కకారాదులలో
నాదట దంతోష్మము లిడ
రాదు పురరర్తు గిరి హరస్థానములన్.

క. మూఁడవతావున మొదలిటి
మూఁడుసరళవర్ణములును మూఁడవస్వరమున్
మూఁడవ యూష్మాక్షరమును
గూడదు కదియింప నెట్టి కూళకు నైనన్.

తే.గీ. వ్యంజనాహ్వయమున నొప్పు వ్రాలలోన
షోడశాక్షర మాఱవచోట నిలిపి
మచ్చరంబునఁ దనుఁ జంపవచ్చినట్టి
చెడుగునకునైనఁ బద్యంబు నుడుగవలదు.
(ఎ గుర్తు పుస్తకము)

పయి మూఁడుపద్యములలో నీ క్రింది యొక్కచోటమాత్రమే (బి) గుఱుతు పుస్తకములలోఁ బాఠభేద మగపడుచున్నది.

"...... ౧ ఆదటదంతోష్ఠ్యము లిడరాదు . ..."

పయిచింతామణి శ్లోకపాఠభేదములలో 'ఏ' గురుతు గల పుస్తకములోని పాఠము పక్షమున నీశ్లోకము చింతామణిలో సాధారణముయిన యధికతమసంఖ్య గలిగి యున్న గీతియేయగుచున్నది. కాని యీపాఠ మప్పకవ్యంగీకృత మాతృకలోని దనుటకు వలనుపడదని యాతని యీసందర్భములోని యాంధ్రీకరణ పద్యములవలన సువ్యక్తమగుచున్నది. "ఆదటదంతోష్మము"లను నప్పకవియొక్క పయి యాంధ్రీకరణమునుబట్టి యీచింతామణి సూత్రములోఁ దక్కినయక్షరములతోపాటు తకారముండవలెనని యంగీకరింపక తప్పదు. అట్టితకార మందుఁ జేర్పఁబడియుండనందున నాపాఠ మప్పకవి గృహీతమాతృకలోనిది కాదని చెప్పవలసియున్నది.

ఇఁక 'బి' గుర్తుగల పుస్తకములలో, "మాతృకా" శబ్దఘటితపాఠము ఛందోభంగదోషదూషిత మగుటచే నది లేఖకపాఠకాదిభ్రమప్రమాదకృతమనుటకు సందియము లేదు. ఇంక "అకచటతపానింద్యాః" అను పాఠమును గ్రహించుచున్న నదియు నప్పకవ్యంగీకృత మాతృకలోని దనుటకు వీలుపడకున్నది. పై సూత్రములలోని తత్తత్స్థాన నింద్యాక్షరములకు లక్ష్యములు చూపుటలో నప్పకవి కంఠోక్తముగ హకారమును జేర్చుచు రెండు లక్ష్యముల నీక్రిందిరీతిని నాసందర్భమునఁ జూపియున్నాఁడు:

"వేములవాడ భీమకవి పదునొకండవచోట హకారంబు నిలిపి.........ఉ. చక్రిదసంబు దీవియగు సాహిణిమారఁడు........." (462-ప).

"ఎడపల్లి పర్వతన్న పంచమస్థానమునను హకారమునుగూర్చి......... "కం. అంగజసంహారుండగు.........." (468-ప)

పై రీతి నప్పకవిచేఁ జూపఁబడిన హకారోదాహరణములు సందర్భశూన్యములయి యసంగతములు కాకుండుటకయి మీఁదిలక్షణములలోఁ జింతామణిశ్లోకమునఁ గాకున్నను నప్పకవి వివరణములోనైన హకారనింద్యత చెప్పఁబడియుండి తీరవలెనుగదా! పై యప్పకవి వివరణములో నట్టి హకారనింద్యత లేనందునఁ జింతామణిసూత్రములోని హకారమును వీడినపాఠ మప్పకవిమాతృకలోని దనుట యెంతమాత్రమును బొసఁగదుగదా! పరిశీలింపఁగా నప్పకవీయమున నీ సందర్భమునం దీ క్రిందిరీతి నార్యగఁ బయిశ్లోక ముండకతీరదని యప్పకవీయాంధ్రీకరణపద్యములవలనను, నాతని యుదాహరణములవలనను విశదమగుచున్నది.

శ్లో. "శుభవర్ణా శ్శుభశబ్దా యేచ శుభగణా స్తయేవ కావ్యాదౌ, గ్రాహ్యాః పురాస్త్ర రసగిరి రుద్రే ష్వకచటతహానింద్యాః"

ఇఁక నీసందర్భమును బాగుగ విమర్శింపనపు డీ యప్పకవి మాతృకాపాఠము సైతము చింతామణి కర్త్రభిప్రేతము కాదేమో యని సందేహింపవలసియున్నది.

ఛందోగ్రంథములం దెల్లెడలను ద్వితీయాదిస్థానములలోన కచటలతోపాటు 'తప' వర్ణములుగూడ నీ క్రిందిరీతిని నిందింపఁబడుచు వచ్చుచున్నవి.

క. అకచటతపయాశలెనిమిది, ప్రకటితగిరిబుత్తుల మాటఁ బదునొక్కింటన్, వికటముగఁబెట్టి పద్యము, సుకవులు సత్ప్రభులకిడ రశుభకర మగుటన్.

(సులక్షణసారము-110)

క. పురశర రసగిరిరుద్రుల, నరయనకచటతపలిడుట యనుచితము య్యక్షరములును రసభజంబులుఁ బరిహరణీయంబు లాదిఁ బంకజనాభా. (అనంతామాత్యుని ఛందోదర్పణము-1 ఆశ్వా-25 పద్యము).

మఱియు నప్పకవీయమున నీయఁబడియున్న లక్ష్యములయొద్ద నప్పకవి వ్రాసిన వాక్యములలోఁ జేర్పఁబడకున్నను నా లక్ష్యములలో నీ క్రింద మూఁడుపద్యములందుఁ బకారము దుష్టస్థానములలోఁ బ్రయుక్తమై యున్నది.

"నెల్లూరి తిరుమలయ్య ఆఱవచోటఁ బకారంబు నిలిపి తనగుఱ్ఱమును దొంగిలించిన శ్రీపతిరాజు పోతరాజును నేడుదినములకుం జావఁదిట్టిన చాటుధార.

చ. హయ మది సీత పోతవసుధాధిపుఁ డారయ రావణుండు....." (అప్ప. 2 ఆశ్వా. 467 పద్యము)

ఏలూరిమంత్రి యైదవచోటఁ గకారము నిలిపి శ్రీశైలముం ద్రోచిన.........

చ. మునుపొకకేల రావణుఁడు......"(465-ప)

"తెనాలీరామకృష్ణయ్య పంచమస్థానంబునఁ గకారంబును సప్తమంబున దకారంబును గూర్చి చెప్పిన పద్యము,

క. బసవనకుఁ బుట్టినప్పుడె పసరము గోవింద రాజు...... (అప్పకవీ. 2-ఆ. 470-ప)

పయి సందర్భమునుబట్టి పకారముగూడఁ బయి సూత్రములోఁ జేరియుండఁదగిన దని విశదమగుచుండుటచేతను, పై నిజూపిన యనేకమాతృకలలోఁ బకారఘటితపాఠము లగపడుచుండుటచేతను, నందుఁ బకారస్థితి సంగీ

కరింపనగునని తోఁచుచున్నది. ఇట్లు తపలు రెండిటిని బై సూత్రములో నిలిపి "అకచటతపానింద్యాః" అను పాఠ మంగీకరించునపుడు వెనుక నుదాహరించిన యప్పకవీయమునందలి పద్యములోని "ఆదట దంత్యోష్ఠ్యములిడ,రాదు........." అను పాఠాంతరము సమూలకమగును. మఱియు నందలి 'ఆదట' అను వ్యర్థపదమును దీసివేసి "ఆదులు దంత్యోష్ఠ్యము లిడ, రాదు........." అని సంభావ్యతనుబట్టి సవరించినచో నర్థసందేహముదీరి మఱింత యుక్తముగా నుండును అట్లయినను బయిని వ్రాసినరీతి నప్పకవీయమాతృకలో నాతని యాంధ్రీకరణమునుబట్టియు, నాతఁడిచ్చిన లక్ష్యములనుబట్టియు,హకారఘటిత పాఠమె యుండెనని యంగీకరింపక తీరదని యీవఱకు వ్రాసియేయున్నాను. కాఁగా, నప్పకవ్యాంధ్రీకరణానుమేయ మగు "అకచటతహానింద్యాః" అను పాఠమునుగాని, పైనివ్రాసినరీతిని బకార మేళనావశ్యకతనుబట్టి "అకచటపహానింద్యాః" అను పాఠమునుగాని యంగీకరింపవలసియున్నదని తేలుచున్నది. చింతామణిన్యూనవిషయపూరణమాత్రపరమగు వికృతివివేకమునందలి పయి నుదాహరించిన కారికలోఁ దకారము చెప్పఁబడియుండుటచేతను, బై నుదాహరించినరీతిని బకారఘటితపాఠమును యుక్తమగుటచేతను బై పాఠద్వయములోను బకారఘటిత పాఠమె చింతామణి ప్రయుక్తమేమోయని తోఁచుచున్నది. ఇఁకఁ దకారఘటిత పాఠపక్షమునందును,జింతామణి సూత్రములోఁ దకారము తృతీయాది స్థానపంచకమున దుష్టమని తేలుచుండఁగా షష్ఠస్థానమున మాత్రమె దుష్టమని సవరించుటకయి యథర్వణకారికలోఁ దకారము చెప్పఁబడియుండుటచేత నయ్యది పునరుక్తము కానేరదనియుఁ బకారఘటిత పాఠపక్షమునఁ దకారమునకు షష్ఠేతరస్థానములలోని ప్రసిద్ధమగు నింద్యత చెప్పఁబడకుండుట లోపముకానట్లే తకారఘటిత పాఠపక్షమునందును బ్రసిద్ధమగు పకారనింద్యత చెప్పఁబడకుండుట యొక లోపముకానేరదనియు వాదించుట కవకాశము లేకపోలేదు. కాని యీ వాదమునందుఁ దకారపునరుక్తివారణసంధర్భమున షష్ఠేతరస్థానములలోఁ దకారప్రయోగము నింద్యముకాదను నియమము నథర్వణప్రామాణ్యమున నంగీకరించుచు నాపక్షమునందుఁ బకారనింద్యత చెప్పఁబడని లోపము షష్ఠేతరస్థాన తకారనింద్యతను జెప్పని లోపమునంటిదేయనుట యుక్తమై యుండఁజాలదు.

చింతామణిలోని న్యూనవిషయములను బూరించెడి వికృతివివేకమున నిట్టికారిక యుండుటంబట్టియే యట్టి పూరణమునకు మూలమనఁదగు "శుభవర్ణాః...... అకచటపహానింద్యాః" అను మొదలగు ఛందోవిషయక శ్లోకములు బాలసరస్వతీయమాతృకలో లేకున్నను బ్రక్షిప్తములుకావనియు, నథర్వణాచార్యుల నాఁటికే చింతామణిలోఁ జేరియున్నవనియు సిద్ధాంతితమగుచున్నది. కృత్యాదిప్రయోజ్యవర్ణగణాదివిషయము స్థానాంతరములందుఁ బ్రసిద్ధముగా నిశ్చయమైయున్న "అకచటపహల" విషయమును జెప్పకయే యథర్వణుఁడు "తృతీయోప్చ తృతీయోష్మా............" అను మొదలగు కారికను జెప్పియుండెనని యెవ్వరును జెప్ప సాహసింపలేరుగదా! చింతామణి వ్యాకరణగ్రంథ మగుటచేత నందలి యీ ఛందోవిషయకశ్లోకములు ప్రక్షిప్తములయి యుండునని భ్రమించి పై యథర్వణకారికావళి సంబంధమెఱుఁగని లేఖకపాఠకాదులు పై "శుభవర్ణాః శుభశబ్దాః"అను మున్నగు కారికలను వ్రాయకవిడిచిన మాతృకలు బాలసరస్వతికి లభించియుండవచ్చునని యూహింపవలసియున్నది. పైని వ్రాసినరీతినున్న చింతామణ్యథర్వణకారికల సంబంధమును బాగుగఁ బరిశీలింపలేక ద్వితింత్రిణీ సీతారామకవిగారు పై యథర్వణకారికల కర్థము వ్రాయునపుడు "తృతీయః = మూఁడవదియైన, అప్చ= అకారమును......సరళాః=సరళవర్ణములైన కచటలును..." అని యీరీతిగ వ్రాయుట కేవలము ప్రామాదికమనుటలో నెవ్వరును విప్రతిపన్నులుకాఁజాలరని నానమ్మకము.

పయివిషయములను బాగుగ గమనింపని లేఖకపాఠకాదు లెవ్వరో పై చింతామణిసూత్రములో వారికప్రసిద్ధమగు హకారముండుటయుఁ, బ్రసిద్ధ మగు తకారము లేకుండుటయుఁ జూచి భ్రమించియుఁ దక్కిన పరుషములతోపాటుగఁ దకార ముఁడవలెనని తలంచియుఁ బై చింతామణి సూత్రమును "అకచటతపా

నిందాః" అని సవరించి యుండవచ్చును. ఈ శ్లోక మప్పకవీయములోనిది మాత్రమే యగుటచేతను నప్పకవి లక్ష్యములలో పకారము కంఠోక్తముగాఁ జేర్పఁబడకుండుటచేతను నిటీవలివా రందలి పకారమును దీసివేసి శ్లోకపూరణమునకయి మాతృకాశబ్దమును జేర్చి "అకచటత మాతృకానింద్యాః" అను గీతిశ్లోకపాఠమును గల్పించియుండవచ్చును. మఱికొంద ఱాపాఠములోఁ బ్రసిద్ధపకారము లేకుండుట సరికాదని తలఁచి ఛందోభంగమును జూచుకొనక "అకచటతపా మాతృకానింద్యాః" అను పాఠమును గల్పించియుండవచ్చును. ఇటీవలివా రట్టి ఛందోభంగమును గ్రహించియుఁ దకారము పునరుక్తమని తలంచియు నప్పకవియిచ్చిన లక్ష్యములలో హకారము కంఠోక్తముగఁ జేర్పఁబడి పకారమట్లు చేర్పఁబడకుండుట నరసియు తపలను విడిచి హకారమును జేర్చి "అకచటహ మాతృకానింద్యాః" అను పాఠమును గల్పించియుండవచ్చును.

బాగుగఁ బరిశీలించినయెడలఁ బైని వ్రాసిన "అకచటహ మాతృకానింద్యాః" అను నీపాఠమె యప్పకవ్యంగీకృతచింతామణి మాతృకలో నుండియుండెనని చెప్పుట యుక్తముగ నగపడుచున్నది. ఈ పాఠమునకు విరుద్ధమైయున్న "ఆదట దంత్యోష్ఠ్యములు" అను నప్పకవి వివరణపద్యభాగమున "ఆదట నంత్యోష్ఠ్యమను" అని సంభావ్యముగ సవరించినచో నట్టి విరోధము వారింపఁబడుటయేగాక యప్పకవీయమునఁ బకారముదాహరణవాక్యములలోఁ జేర్పఁబడకుండుటయు సమూలకము కాఁగలదు. అట్లయినను "ప"కార నింద్యత సకలచ్ఛందోలక్షణగ్రంథ ప్రతిపాదిత మగుటచేత వానికి మూలముగఁ జింతామణిలోఁ గాని వికృతివివేకమునఁ గాని యుండియుండునని తలఁచి పైరీతి నీపాఠము చింతామణ్యభిప్రేతము కాదేమోయని వ్రాయఁబడెను.

తాళపత్రమాతృక లిట్టి లేఖక పాఠకాదుల భ్రమప్రమాద సాహసాది కృతములగు పాఠాంతరములచేఁ గలుషితములయిపోవుటచేత నాంధ్రవాఙ్మయమునందలి గ్రంథకర్తృప్రయుక్త పాఠములను గ్రహించుట దుష్కరమగుచున్నదని విమర్శకమహాశయులు గ్రహింతురుగాక!

---

# ఉత్తరా విలాపము

శ్రీమతి సీరము సుభద్రయాంబ గారు

విజయుని కూర్మినందనుఁడు వెన్నుని ముద్దుల మేనయల్లుఁడున్
త్రిజగములందుఁ బేర్వడిన ధీరుఁడు, శూరుఁడు, మేటి వీరుఁడం
గజసమసుందరుండు గుణగణ్యుఁడునైన మదీయకాంతునిన్
నిజముగఁ గూలఁజేసితివె నిష్కరుణం గరుణానిధీ, విధీ!

సంగరరంగ నిర్దళిత శాత్రవచండచమూసమూహా, యో
మంగళదేహ నిన్ బతిగ మామకభాగ్యముచేతఁ బొంది యు
ప్పొంగుచునుంటి; నింతటనె పోయెదవంచును నేనెఱుంగ; నీ
సంగతినాకు లోకమున శాశ్వతమంచుఁ దలంచితిం జుమీ.

పలువురు ముట్టడించినను బాహుబలంబును శౌర్యసారమున్
సులలిత శస్త్రకౌశలముఁ జూపఱ కద్భుతరీతిఁ దోఁపఁగా
నలఘుపరాక్రమస్ఫురణ నందఱకుం దగ నన్నిరూపులై
చెలఁగుచుఁ బోరి యాయలఁతచే నిపు డొందితె పెద్దనిద్దురన్?

అరిబల మఱియమ్మగుచు సమ్మోయిఁ జుట్టునుగ్రమ్మి యమ్ములన్
బిరబిరఁ గ్రుమ్మరింపఁగను బీరము వీడక నీవు వైరులన్
మరణముపాలు చేయఁగను మార్తులు నిల్వఁగలేక తాము ప
ల్వురొకటిగాఁగఁ గూడి యనిలో నినుఁ గూల్చిరి మాయదారులై.

ధర్మరణంబునందు నినుఁ దాఁకఁగ శక్యమె శూలికైన? దు
ష్కర్ములు పాతకంబునకు జంకక ప్రాణము మీఁది యాశ నీ
ధర్మము చేతినుండి తొలుతం బడఁగొట్టిరి; జేపు వారి నీ
కూర్మి పితల్ వధించెదరు ఘోరరణంబున దారుణంబుగన్.

ప్రోడలు, గాఢవిక్రములు, పోటుమగల్, బలు, లొక్కబొలు బల్
దాడికి నాఁగలేక మది ధైర్యముతప్పి, త్రపావిహీనులై,
పాడి తొలంగి, కృత్రిమపుఁ బద్ధతిఁ బైఁబడి చంపిరన్న యా
వాడుక వైరు లొంద, ననవద్యయశంబును నీవు పొందితే?

శారదచంద్రచంద్రికల చాయ హసించుచు నీయశఃప్రభల్
ధారుణి నెల్ల వెల్గఁగను, దావకవైరుల దుర్యశశ్ఛటల్
నూతె గుహాంతరాళములఁ; దూఱును వారి హృదంతరంబులన్
కౌరవవాహినీభయద గాండివముక్తశరప్రకాండముల్.

తల్లులుఁ, దండ్రు లన్నలును, దమ్ములు, నీకయి తల్లడిల్లఁగా
వల్లభ, ఏటి నిద్ర యిది? వారిని నన్నును డించిపోవ నీ
యుల్లమదెట్టులొప్పె? మును పోర్వవు మమ్ము క్షణంబు వీడఁగాఁ;
గల్లరి ధాత యీగతి నకాలమృతిన్ ఘటియించె నీకయో?

ఉత్తర, నీయనుంగు సతి, యుత్తలమొందుచునుండ, డించి లో
కోత్తర, పోదె నాకమున? కోరిచి యెట్లు భరింతు ప్రాణముల్?
చిత్తజరూప, త్వచ్చరణ సేవ యొనర్పఁగ, వెంట నేనును
న్వత్తును; జేకొనంగదె యనాథను నాథ, దయాసనాథతన్.

వేలుపు వీట నచ్చరలు వచ్చిన కన్నుల నిన్ను మెచ్చుచున్
లోలతఁ జేర, నన్ను మది లోనఁ దలంచెదవో, తలంపవో?
యేల పరిభ్రమించుట? మదీశ్వర! పార్థుని పట్టివంచుఁ దా
నాలలనా శిరోమణుల యాశల నూర్వశి మాన్పకుండునే?

# నల్లబిందె—దుక్క—చెంబు

భోగరాజు నారాయణమూర్తిగారు

౧

మా పెరటరుగు మాంచివిశాలంగానున్నూ, చాలా పొడుగ్గానున్నూ వుంటుంది. తెల్లవారేసరికి యింట్లోవున్న రెండు కుటుంబాల వాళ్లమున్నూ కూడా మొహాలు కడుక్కోడాని కక్కడ చేరుకుంటాం. కలిసీమెలిసీ వుండడంచేత, మాకూమాకూ అరమరాభ్యాంతరాల్లేవు. ఆపక్క వాళ్ల కాఫీ పొయ్యి-ఈ పక్క మా కాఫీపొయ్యి. కాఫీ డబ్బాలు, పంచదార డబ్బాలు, కప్పులు, సాసర్లు మొదలైన సామగ్రులతో 7 గంట లయేసరికి చీడీఅంతా చిన్న కాఫీహోటేల్లాగ తయారవుతుంది. మొహాలు కడుక్కోడానికి ప్రారంభించింది మొదలు కాఫీతాగేసేవరకూ మా పెరటరుగు పెళ్లివారి విడిదిలాగ కలకల్లాడుతూ, చెరువొడ్డుచెట్టులాగ కిలకిల్లాడుతూ మహా సందడిగా వుంటుంది. నిజంగా శోభంటే అదే కదండీ? ఒక్క కుటుంబమే కానీయండి, రెండుకుటుంబాలే కానీయండి. ఆడవాళ్లే కానీయండి- మొగవాళ్ళే కానీయండి; మూతులు పొడిగించుకొని, మొహాలు ముడుచుకొని, ముక్కులు బిగించుకొని, మూసివాయినవు ముత్తయిదువుల్లాగ మాటాడుకోక అలకలూ, కోపాలూ, ద్వేషాలు పెట్టుక్కూచుంటే ఆకొంపకి శోభేమిటి? దిక్కుమాలిన శోభ. మావాళ్లంతా పానకాల భీమేశ్వరస్వాములు. నిత్యం కాఫీపుచ్చుకొంటూ వుంటారు.

కథలు, నవ్వులు, హాస్యాలు, పకపకలు, చకచకలు వీటితో క్రమంగా కాఫీల దగ్గిర కూర్చుండేసరికి పువ్వులు కోసుకోడానికి, పాటవ్వ హాజరవుతూ వుంటుంది. రోజూ మావాళ్లకి పాటలు చెపుతూవుండడంచేత మగవాళ్లమంతా అవ్వకి పాటవ్వని పేరుపెట్టేం. అవ్వ వచ్చేసరికి ఆడవాళ్లంతాచుట్టూ మూగుతారు. ఒక్కొక్కచరణం అవ్వచెప్తూవుంటే వెనకాల వీళ్లంతా యేకరువు పెడుతూవుంటారు. బియ్యేలు ప్యాసయి, ట్రయినింగయిన పెద్దపెద్ద మొగవాళ్లకంటె నాకా అవ్వే బాగా నచ్చింది. నేనే వో డైరక్టరోన్నో, మినిష్టరోన్నో అయివుంటే అవ్వని వో ట్రయినింగు స్కూలికి హేడ్ మేస్టరుగా వేసేసుందును. ఏమంటారా? మా నాన్నికి నిండా నాలుగేళ్లేనా లేవా! దానిక్కూడా ఆ పాట లొచ్చేశాయి.

"ఆకత్తైతను లోకంతెలియక
అత్తిత్తయితిని కుత్నా!"

అని గెంతుతూ పాడుతూ వుంటుంది.

రెండుపూటలా మావంటలుకూడా పెరటరుగుమీదే. వంటిల్లు నట్టిల్లు లేక్కాదు సుమండీ! సదుపాయంగా వుంటుందని. మాది బ్రహ్మాండమైనంత యిల్లు; గొప్పనాలుగిళ్ల భవంతి. ఇదంతా మాపెరటరుగు తాలూకు వుద్ధయగాథ. రాత్రిళ్ళభోగట్టా కూడా వినవలసిందే. వంటలూ భోజనాలూ అయింతరవాత

ఆపక్క వెంకమ్మగారూ, ఈప్రక్క మాఆవిడా అరుగు కడగడానికి ప్రారంభిస్తారు. వీళ్ళచాదస్తం బంగారంగానూ, అది కడగడం కాదు. చూసేవాళ్ళకి ప్రాణాలు విసిగిపోతాయి. వీళ్ళిద్దరికి రోజూ కాంపిటిషనే; ఎవరు చాలాసేపు కడుగుతే వాళ్లంత ఆచారవంతులూ, అంత శుచివంతులూ! ఆపోటీపరీక్షలో నల్లబిందె, దుక్కచెంబు, చీపురుకట్టా పట్టుకొని, తరుచుగా మాఆవిడే గెలుస్తూవుంటుంది. వెంకమ్మగారికీ విజయకాంక్ష వుందిగాని, కాస్తకాలం గడచిన మనిషా-మాఆవిడతో సమానంగా నిలువలేదు. భోజనాలుచేసి తాంబూలాలు వేసుకుంటూ మేమంతా వోమారు పెరట్లోకి వస్తాం. నవ్వుకుంటూవుంటాం. వెంకమ్మగారితో పోటీసందడేకాని, మాఆవిడ నాసంగతీ, మానాన్నసంగతీ ఆలోచించదు. చీపురుకట్ట విడిచిపెట్టడవంటూ వుంటేనా పక్కలెయ్యడానికి? పక్కలేస్తేనేకాని మానాన్న పడుకోడు. అదిపడుకుంటేనే కాని నారాత జరగదు. ఏంచెయ్యమన్నారు చెప్పండి! రోజూ కూకలేస్తూవుంటాను; కసురుతూవుంటాను. నయాన్నీ భయాన్నీ చెప్పతూ వుంటాను. అయ్యా! మొగుడుముండా కొడుకన్న జ్ఞానం వాళ్లకి పుట్టాలికాని చెపుతే వస్తుందిటండీ? ఆలాగని కేవలం అర్ధాన్నం కాదుసుమండీ! కాస్త చెప్తేవింటుంది. వింటుందికాని పంతమెక్కువ. ఆపంతమేనా వట్టి మొండిపంతం కాదు. కాదుకాని ఏంలాభం? నాకు రాతా కోతా జరగనీదు. కోపం తెప్పిస్తుంది. ఒక్కొక్కనాడు అమాంతంగావెళ్లి ఆచేతులోవున్న చీపురుకట్ట లాక్కొని, ఆనల్లబిందే, దుక్కచెంబూ కిందపడేట్టొక్క తాపుతన్ని-జుత్తోట్టుగొని లోపలి కీడ్చుకొద్దామన్నంత విరాళం పుడుతూవుంటుంది. నాది మాంచెడ్డ వెర్రికోపం లెండి! అయితేనేమి? యుద్ధంలో గెలిచిన చీపురకట్టా, దుక్కచెంబూ వొకచేతా-నల్లబిందె వొకచేతా పట్టుకొని-పైటకొంగుతో బిగించికట్టిన నడుంకట్టుతోనూ, వంగికడగడంచేత మొహంమీదికి జారిన ముంగుర్లతోనూ, భుజంమీదనుండి ముందుకు వేలాడుతూవున్న తాచుపాంలాంటి జటతోనూ-ఆయాసపడ్డంవల్ల కలిగిన ఎగూర్పులూ, నిట్టూర్పులతోనూ-చిరునవ్వులు నవ్వుకుంటూ పిల్లనాడిస్తూవున్న నాదగ్గరకువచ్చి "పాపం మీపని కాలస్యమయిపోయింది కాబోలు! ఇదిగో వచ్చేశాను; కోంపడకండి" అంటుంది. ఆస్వరూపం చూసేసరికి, ఆమాటలు వినేసరికి - దిక్కుమాలిన కోపం——ఇంతకోపం ఏమయిపోతుందో మహామ్మాయమయి పోతుంది. గుండె నీరైపోతుంది; కడుపు చెరువై పోతుంది. వెఱ్ఱి మొహం వొకటి పుట్టుకొస్తుంది. నేం చెప్పేనుకానండీ? కాస్త చెపుతే వింటుంది. ఉన్న గట్టి చిక్కదొక్కటే. కొత్తచీపురు పట్టుకుంటేఅంటే గొరకైతేనేకాని విడిచి పెట్టదు. రోజుకో చీపురు. పట్టవాసంలో చీపురు కానీ. కిందటినెల్లో కేవలం చీపుళ్లకీ, ముగ్గుకీ 0_14_6 అయిందంటే నమ్ముతారా? ఎవడితో చెప్పకోడం? చెపుతే వెక్కిరించేవాళ్లేకాని అయ్యో అనేవాళ్లులేరు.

ఇదంతా సామాన్యంగా నిత్యం జరుగుతూవున్న వ్యవహారం. 'అయం విశేషః' అన్నట్లు ఒకనాడో చిత్రమైన నాటకం జరిగింది. ఆ నాటకానికి రంగస్థలం మాపెరటరుగు. ప్రధాన పాత్రలు మాఆవిడానూ, వెంకమ్మగారున్నూ. నాటకకథాబీజం మానల్లబిందే, దుక్కచెంబు. ఇంక కథ వినండి. రాత్రి మేంవుభయులం భోంచేస్తూవుండగా ఎవరో స్నేహితులువచ్చి నాకోసం వీధిచావిట్లో కూర్చున్నారని తెలిసింది. అందుచే త్వరలో నే భోంచేసి—"పెద్దమనుష్యులు వచ్చారు; వెళ్లి మాటాడాలి; పిల్లనాడించడానికి వీల్లేదు; నువ్వుమాత్రం ఇవాళకట్టే విజృంభించక కాస్త పెందరాళే తెములుకోవమ్మా" అని మరీమరీచెప్పి సావిట్లోకి వచ్చాను. స్నేహితులతో మాట్లాడ్డానికి ప్రారంభించాను. ఇంట్లో మానాన్ని యేడుపు ప్రారంభించింది. భోంచేసి మాఆవిడ యథావిధిగా వెంకమ్మగారితో యుద్ధం ప్రారంభించింది. పావుగంటయింది; అరగంటయింది; గంటయింది. మానాన్ని యేడవడం మానదు-మాఆవిడ కడగడం మానదు. ఎంత అమాయకుడికేనా అలాంటప్పుడు కోపంవస్తుందా రాదా చెప్పండి! ఏంగ్రహచారమోకాని అన్ని విషయాల్లోనూ ఆడవాళ్లమనసు మెత్తగానే వుంటుందిగాని పిల్లలు కడుపులు పొంగిపోయేటట్టు యేడుస్తూవుంటే ఎవరిపిల్లలోఅన్నట్లు నిర్లక్ష్యంగా పనిచేసుకుంటూ వూరుకుంటారు. ఇది ఆడవాళ్లలో సామాన్యంగావుండే అవగుణం. మావొదినగారికి ఓవేలు విడచిన మేనమామ తాలూకు సవితన్నగారి కుమార్తుండేది. ఆవిణ్ణిచెప్పండీ నిజంగా పిల్లల్ని ఆదరించడంలో. మాగొప్పయిల్లాలు; కిక్కురుమన్నిచ్చేదికాదు.

స్నేహితులతో మాటాడుతున్నానన్న మాటేకాని, నాదృష్టంతా యిటువేపే వుంది. లోపట రవరవ మండుకొస్తూంది కోపం. నేను పరధ్యాన్నంగా వుండడం కనిపెట్టే కాబోలు పెద్దమనుషులు లేచి సెలవుపుచ్చుకొన్నారు. చిత్తమని నేనూ లేచినాను. ఎలా లేచానో, యెలాపెరట్లోకి వచ్చానో నన్నడక్కండి. నాది వెఱ్ఱికోపమని చెప్పేవున్నాను. ఆ వెఱ్ఱికోపంతో వాళ్లు తెలియకుండావచ్చి మా ఆవిడవీపుమీ దేమో దెబ్బ వేశాంట. నిజంగా వేశేవుంటాను లెండి. లేకపోతే అంతకోపం వచ్చి వుండదు. చీపురు తటాలున కిందపారేసి, వీపు తడుముకుంటూ, నా వేపు మొహం తిప్పి కొరకొర చూసింది. కాస్తగట్టిగా వేసుంటానేమో పాపం నొప్పెట్టింది కాబోలు కళ్లంట నీళ్లుకూడా వచ్చాయి. అది చూసేసరికి నాకూ కళ్లంట నీళ్లొచ్చాయి. గుండె దేవుకు పోయింది. మించాచెయ్యివిసిరేశాను. ఏం లాభం? మానాన్ని వొక్కమారే యేడుపు మానేసి, మాయిద్దర్నీ మిడుతూమిడుతూ చూడ్డం ప్రారంభించింది. "గుంటముండా! ఇప్పుడు నీ కడుపు నిండిందా? ఇఖహాయిగా పడుకుందుగాని రా" అంటూ మాఆవిడ వొక్కవిసురుతో గుభీమని పెరటి తలుపులువేసి పిల్లని తీసింది. తలుపు పక్కనేవున్న నా కప్పుడు కపాలమోక్షం కావ

లిసిందే. కాని కొంచెంలో తప్పిపోయింది. ఇహ నే నట్టేనే పక్కడ వుండడం వుభయులకూ క్షేమంకాదని భావించినటువంటివాడనై సావిట్లోకి వచ్చేశాను. చుట్టకాలుస్తూ వోఅరగంట సేపు ఈజీచైరుమీద కాలక్షేపం చేశాను. చుట్టయిపోయింది. ఇహ తమలపాకులు చుట్టిమ్మందామా, వీధిలోకి వెళ్లి కిల్లీ తెచ్చుకొని గుప్ చప్ గా వూరుకుందామా అన్న సందిగ్ధంలో పడ్డాది మనస్సు. పడ్డాదికాని కొంచెంలోనే మళ్లా సద్దుకుంది. ఈకోపాలూ తాపాలూ ఎందుకు! రాజీ చేసుకుందామనే నిశ్చయం చేసుకున్నాను. దీర్ఘకోపం వుండకూడదుచూడండీ! ఏవో పొరపాట్లు వస్తాయి మరి! సర్దుకోకపోతే యెలాగ? ఆవుద్దేశంతోటే లోపలికి వచ్చాను. నేను వచ్చేసరికి పరుపులు వేశేసున్నాయి. పెరటితలుపులుకూడా వేశేశేవున్నాయి. లాంతరు ఖణీగా వెలుగుతూంది. తల్లీపిల్లా పడుకున్నారు. ముందరి తలుపులు గడియపెట్టేసి, దీపం తగ్గించి మంచం కాస్తదగ్గరగా యీడ్చుకొని కాళ్లు దులుపుకొని పెద్దమనిషిలా పడుకున్నాను. "ఏయ్! ఇదిగో! చూడూ! తమలపాకులు చుట్టావ్?" అన్నాను. పలక లేదు. దాహంవేస్తున్నాది మంచినీళ్లు కావాలన్నాను. సపోటాపళ్లు ముగ్గేయేమో చూడమన్నాను. మీనాన్న కుత్తరం రాశావా కవరు తెచ్చావన్నాను. ఇవాళేమోగాని కాళ్లు పీకుతున్నాయన్నాను. కొంతసేపు దగ్గేను. కొంతసేపు కూనిరాగాలు తీశాను. ఎన్ని చేసినా నాశపభిషలేమీ పనికొచ్చాయి కావు. ఇహ రాజీ కుదరడం అసాధ్యమనే తోచింది. అందుచే మన ఖర్మాన్ని మనం హాయిగా పడుకోవడమే అత్యుత్తమ మనుకొని దీపం ఆరిపేశాను. ఆరిపేశానుగాని నిద్రపట్టడం యెలాగ? దొంగనిద్ర అభినయిస్తూ కదలకుండా గంటలకొలదీ పడుకోవడంలో ఆడవాళ్లకున్న నేర్పు మనకుండదు. మనస్సులోవున్న యీబాధకు తోడుగా పైని దోమలబాధకూడా అఖండంగా బాధిస్తూంది. "ఇదిగో! చూడూ! దోమలు కరిచేస్తున్నాయి. పిల్లకేమేనా కప్పేవా? లేదా" అని గంభీరముగా గద్దించి యడిగేను. అడగడమే కాకుండా స్వయంగాలేచి చేత్తో తడిమి చూశాను. పిల్లక్కప్పలేదు. "ఇదిగో! చూడూ! పిల్లక్కప్పకుండా పశువులా పడుకున్నావ్! లే! కప్పూ! లేచావా? ఏం? చూడూ! ఏమిటీ! ఇదుగో!" అని తట్టిలేపేను. ఇదుగో అన్నా లేదు; అదుగో అన్నా లేదు. ఇహ నట్టే తాపత్రయం పడ్డం మనకంత పౌరుషంకాదనుకొని యథాప్రకారం తిష్ఠవేశాను. మూడురోజుల్దాకా గిజామన్నా మాటాడకూడదని శపథం చేసుకున్నాను.

౨

ఎలాగో తెల్లవారింది. యథాక్రమంగా అంతా పెరటరుగుమీద చేరుకున్నారు. రాజీనామా వ్యవహారంలో పడి రాత్రి చాలాసేపు నిద్ర లేకపోవడంచేత నాకింకా తెలివి రాలేదు. నవ్వులో, హాస్యాలో, పాటలో, పద్యాలో నాకు రోజూ తెలివితెప్పిస్తూండడం మామూలు. ఆవేళ మాత్రం ఆలాక్కాదు. "అయ్యో!

అయ్యో దుక్కచెంబే? దుక్కచెంబే? నల్ల బిందే? నల్లబిందే. ఎంత దారుణం? ఎంతదారుణం?" అన్నమాటలు నన్ను నిద్రమంచంనుండి గుభీమని లేవదీశాయి. చెవిని బడగానే అవి వెంకమ్మగారి మాటలని పోల్చేశాను. తలాపు దిక్కున పరుపుకింద వున్న చుట్టా అగ్గిపెట్టీ తీసి చుట్టముట్టించి పెరట్లోకివచ్చాను."దుక్కలాంటి చెంబే కూతరా" అని వెంకమ్మగారు బుగ్గలు నొక్కుకొని వింతపడుతున్నారు. "గుమ్మిడిగింజ లాంటి బిందే అమ్మా!" అని పాటవ్వ గుండె బాదుకొంటూంది. "నన్ను చంపేస్తారు కాబోలు?" అంటూ బిక్కమొహంవేసి మా ఆవిడ బల్లిలాగ గోడకంటుకుపోయింది."మీఆయన్తో చెప్పక గుప్‌చప్‌గా వూరుకో వోవోవిడా" అని కాఫీపొయ్యి వూత్తూ మొహం యెత్తి పొగచేకళ్లు మిటకరిస్తూ వొకావిడ సలహా చెపుతూంది. అలాంటి రసగంధాయంలో నేను రంగస్థలం ప్రవేశించాను. నన్ను చూస్తూనే అంతా తెల్లపోయారు. ఎవరిపనులు వారు చేసుకుంటూ నిశ్శబ్దంగా వూరుకున్నారు. మాఆవిడి కరచరణాలాడ్డంలేదు. ఎవరేనా భోగట్టా చెప్తారేమో అని కాస్త పస్తాయించి చూశాను. ఎవరూ మాటాడరు. చుట్టయిపోయింది. పుల్ల నోట్లో పెట్టుకొన్నాను. మా ఆవిడ కాఫీ పొయ్యదగ్గిర మెల్లిగా చేరుకుంది. 'నల్లబిందే దుక్కచెంబూ అంటున్నారేమిటి భోగట్టా' అని అడగడానికి వీల్లేకుండా,మూడురోజుల్దాకా మాటాడనని రాత్రి ఘోరమైన శపథం చేసుకున్నాను. అలాంటి విషమావస్థలో మానాన్ని యేమూల్నుంచో చేతు లూపుకుంటూ, బొ జ్జాడించుకొంటూ పరుగెత్తు కొచ్చి, "నాన్నాలూ,నాన్నాలూ! అమ్మ బిందేను తెంబూనూ ఎత్తలోపాలీచిందందీ! తూతేలా ?" అని చెప్పింది. అక్కడ వున్నవాళ్లంతా ఆ మాటలువిని నవ్వుకున్నారు. చెప్పేసిందని మానాన్నిని ముద్దుతిట్లు తిట్టేరు. "వెంకమ్మగారూ! బిందేనూ చెంబూనూ ఎలాంపోయుంటాయండీ? చూశారా? దీని అజాగ్రత్త! ఇహ నీజన్మానికి దీనికి బుద్ధిరాదండి!" అని యింకానేనేమో చెప్తూవుండగానే, వెంకమ్మగారొచ్చి, "మీరాట్టే తొందరపడకండి ఎక్కడో వుంటాయి. ఏమవుతాయివుండక ? ఇంకా చిన్నతనమా! సంసారం. జాగ్రత్త అప్పుడే యెలాతెలుస్తాయి? మాకాలంలో ఈయీడుకింకా మాకన్నం తినిపిస్తూవుండేది మాఅమ్మ." అన్నారు. నేను విసుక్కుంటూ, "ఔనమ్మా! బాగానేవుంది. దీనిక్కూడా అన్నం తినిపించనీయండీ! నా కభ్యంతరం లేదు. బిందెమాటా చెంబుమాటా ఏమిటాలోచిస్తారు? వున్నట్టా? పోయినట్టా? కొంప తీసి రాత్రి ఇంట్లోపెట్టడం మరిచిపోయి ఆతామసంమీద తలుపులు వేసేసుకొని పడుకొంది కాబోలు? పెరట్లో మరిచిపోతే మరిదొరికేదేమిటి వెంకమ్మగారూ! ఉత్తపశువు! పశువు! ఛీ? అని పళ్లు పటపట కొరికేను. నాకు కోపం వస్తే చేతులు వొణుకుతాయి. ఆవొణకడంలో నాలిగ్గీసుకుందా మనుకుంటూవున్న పుల్ల కింద పడిపోయింది. మరోపుల్లకోసం ఇటూ అటూ

చూశాను. మాఆవిణ్ణి తన్నడానికి చూస్తున్నానని వెంకమ్మగారు మొదలైన వారంతా అనుమానంపడి, 'లోపలికి వెళ్లిపో' అని సంజ్ఞలు ప్రారంభించారు. మాఆవిడమాత్రం కాఫీ పొయిదగ్గరనుండి కదలలేదు. నాలుగ్గీసుకోడానికి బద్దతెమ్మందామా అనుకుంటూ శపథం జ్ఞాపకంవచ్చి నేనే లేచాను. నేనులేవడం వాళ్ల అనుమానానికి మరింత కారణ మయింది. అందుచే మరింత గాబరాపడ్డారు. మాఆవిడికి వొళ్లువొణకడం ప్రారంభించింది. లేచి అరుగ్కొసనువున్న కర్రలమోపుదగ్గరకు వెళ్లి వొకర్ర తీశాను. దాని బద్దతీసి నాలుగ్గీసుకుందామని నావుద్దేశం. నేనాకర్రతీసి తియ్యడంలో అంతాగొల్లు మన్నారు. మా ఆవిడికప్పుడే గంగా దేవి ప్రత్యక్షమయింది. "కర్రపడేయండి! కర్రపడేయండి! వొద్దువొద్దు" అని వెంకమ్మగారు నాకడ్డంగా వొస్తున్నారు. "అడ్డుకోకండి పిన్నీ! అడ్డుకోకండి! చంపేసీయండి! నన్నుచంపేసీయండి" అని మాఆవిడ యేడుస్తూ అంటూంది. నాఖర్మాన్ని నేనుబద్ద తీసుకొని ఏమిటీ హడావిడని తిరిగిచూసేసరికి, పార్సీ నాటకపుస్టేజిలాగ రంగమంతా అత్యద్భుతంగా మారిపోయింది. చంద్రమతిని నరికేయడానికి సిద్ధపడ్డప్పుడు హరిశ్చంద్రుడికి పార్వతీపరమేశ్వర్లు ప్రత్యక్ష మయినట్లు-వెంకమ్మగారి గుమ్మంలో మానల్లబిందె దుక్క చెంబూ నాకు ప్రత్యక్షమయినాయి. నాకత్యద్భుతమనిపించింది. మా ఆవిడ తెల్లపోయి వెర్రి మొహంవేసింది. వెంకమ్మగారు మొదలైన వారంతా గుసగుస నవ్వుకుంటున్నారు. రాత్రి మాఆవిడ ప్రణయకోపంచేత-ప్రణయ కోపం కాదు—ప్రళయకోపంచేత - పెరట్లో మరిచిపోయిన నల్లబిందే దుక్కచెంబూ తీసి దాచి వెంకమ్మగారే యిలాంటి తమాషా చేశారని బుద్ధిమంతుణ్ణి కాబట్టి వెంటనే పోల్చేశాను. కింద ధుమ ధుమ లాడుతూ నిశ్శబ్దంగానున్న మాపెరటరుగు, ఇప్పుడు పకపకలు, చకచకలూ, చప్పట్లూ, హాస్యాలూ నవ్వులూ—ఓ! కావలసినంత కలకలం పుట్టింది. మొహం బాగా వికసించి మాఆవిడ కూడా నవ్వ ప్రారంభించింది నేనూ వోమారు నవ్వుకున్నాను. ఇహ నేమంది ?

---

## మా చందా దారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారులసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుపగోరెదము

మేనేజరు, 'భారతి.'

# సంపెంగ

ఉభయభాషాప్రవీణ, మిన్నికంటి గురునాథ శర్మ గారు

౧

చంపకమా! వనీపకులునల్పిన చేఁతలచేత వారిఁ గో
పింపకుమా! కడుం బడలితేనియు నీ కెవరమ్మసాటి? — నె
య్యంపునుడుల్ గ్రహింపవో, అనన్యసువర్ణ సుసౌరభంబుల
న్నింపిన ధాతపైఁగినియు నిన్ సృజియించినవాఁడు గావునన్.

౨

రమణీయంబగు సుందరత్వము, ననర్ఘ్యంబైన సౌరభ్యబం
ధము, లోకోత్సవదాయి పూజ్యగుణము న్నాకుండెఁ జుమ్మంచు గ
ర్వమునుం జెందకు మెంతకాలమె యిటుల్ భాసిల్లుటల్, వృద్ధభా
వమునుం జెందవొ? వృంతము న్విడువవో? వాతాహతింగూలవో?

౩

పువ్వులు నొవ్వకుండ రసముంగొను నేరుపు నభ్యసించెఁ దా
నెవ్వరికే నలభ్యమగు హృద్యమధుస్వర మాలపించుఁ గ్రొం
బువ్వులఁగాని చేర దలిపోతము దుర్గుణ మేమిచూచి నీ
వవ్వలి మోముసేసెద వయారె రసజ్ఞత లేదొ? సంపెఁగా!

౪

అన్నికుజంబులవలెనీ-వున్నావని పాదుఁ గూడ నొనరింపని నా
కు న్నవ్య కుసుమగంధ-ప్రోన్నతి సిగ్గు గలిగించితో సంపెంగా!

౫

ఎంతసువర్ణముగల ధన-వంతుఁడవైన నిధి యేమిపని? పాపము! పొ
ర్లింతలు పెట్టెడి మధుకరసంతతి కన్నుఁగవ దుమ్ముఁ జల్లఁగ నీవున్.

౬

ఆరసిచూడఁ జిత్త మనయంబును గర్కశమే; సుసౌరభో
దారతయెప్డులే; దొరులఁదారసిలుం దను సంగ్రహించినం
గ్రూరత రాఘు; మిట్టిదగు కూళను హేమమెఱింగికూడ నా
పేరులనే యదేమిటికో పెట్టిరి నీకు నరుల్ సువర్ణమా!

౭

నీ పరిమళంబున దేమిదాఁపఱికమొ? ఆహరించి మరుత్ప్రశ్యతోహరుండు
విందు వెట్టు స్వబంధుల కందఱకును-దవ్వునున్న వారికి ఘ్రాణతర్పణముగ.

౮

కలదు డాబు సరిగ నీకుఁ గాంచనాఖ్య-కూటికా? గుడ్డకా? యెందుకు ఫలరహిత
మింత యొకరికిఁ బెట్టఁ దానింత తినఁగ-లేనిసిరి యేల? కాల్చుటకేని తగునె?

౯

ఎందు నీకు ముఖప్రీతియందు నాస-మొందు, కాకున్న నొయ్యారి మొలఁత మొగము
కనులఁ బడఁగనె నిలువెల్ల ననుచుటేల? సంపెఁగా! యింతలో నెంతజాణవైతి.

౧౦

తలదాఁచుకొని నెలంతల-తలఁదలఁగిన నేమి నీవు, తలకొని నీ చెం
తలఁ దారు వింటి కుట్టుఁడెతలగామై తెల్పె నీ కతల గంధఫలీ!

(అడవి పువ్వులు)

అనగనగా ఓఊరు (అంతమాత్రాన్ని ఇది పిట్టకథా కాదు, బాతుకథా కాదు!) ఆ ఊళ్ళో ఓయిల్లుంది. మరెక్కడా ఉండడానికి వీల్లేక, లోగడ చాలా ఊళ్ళకి పేరు పోయినట్టే ఆఊరికిగుడా పోవడంచేతనున్నూ, రాబోయే జనాభాలెక్కల సందర్భాలలాంటి వాట్ల వల్ల ఇంటినెంబర్లు మారుగుడు కావడంచేతనున్నూ, బోలెడు పాత రికార్డు దులిపితే గాని ఆ ఊరి యొక్క వెనకటిపేరు తేలదు; బోలెడు ఇతర ఒడిసుట్లు పడితేగాని ఆయిల్లున్నజాగాయొక్క నయినం తేలదు. అందుకని తబిసీళ్లు గురించి నన్ను ఆట్టే రొకాయించక ఎందుకన్నానో అన్నాను, ఇల్లాపోనీండి ఈ తభాకి. ఆయింటి యజమాని ఒకాయనే అనికొందరూ, ఇంట్లో ఉండేజనం యావద్విశిష్టం యజమాన్లే అని మరికొందరూ పట్టింపులు పోయేవారు. పోనీ మనం ఏదోకాడికి రాజీకి దిగి ఒకాయనే అని ఒప్పుకుందాం. ఆయనకేనా ఏదో సంజ్ఞఉంటే తప్ప వ్యవహరించడం కష్టం గనక, ఆయన్ని "సుభర్త" అందాం. ఇంటావిడగార్ని అప్పుడు సుభార్య అనిన్నీ, వారి కుమారుణ్ణి "సుపుత్రుడు" అనిన్నీ పిలవచ్చు. ఇంటివారంతా కుడా అఖండజ్ఞానులైనప్పుడు, పేర్లు మంచిగా ఉండడంలో చెడుగుఏమీ లేదు. సుభర్తగారి తల్లి ఉంది. ఆవిణ్ణి—వ్యాకరణంసిఖాకోసిరిగాని "సుబామ్మ" అంటే తప్ప సుపుత్రుడు కొంప పీకేస్తాడు.

ఒకనాడు, (ఎప్పుడూ అంటే, వెనక. అంత కంటే అడగద్దు: మనివి చేశాగా!) పొద్దుటివేళ ఆయింటికి ఉన్న ఒకానొక సావిడిలాంటి మెల్లాలోకి ఒక మునీలిస్వాములారువెళ్లి కుర్చీమీద కూర్చుని, మోచేతులు కుర్చీచేతులికి ఎక్కించి అరిచేతుల్లో గడ్డం ఆనుకుని, కళ్లు మూసుగుని ధ్యానం దాటిపోయి సమాధిలోపడిపోయాడు. సుభర్త యింటోలేడు. అది అతడు కాఫీకి వెళ్లే వైను. అతడు సకృత్తుగా ఇంటో కాఫీ పుచ్చుగున్నా, విధిగా బయట కతికితీరతాడు. అతని మహిమవల్ల అతనికి ప్రతీ కాఫీహోటల్లోనూ కాతాయే. ఏదేనా పాత కాఫీహోటల్లో తను ఇవ్వదేలిన బాకీమొత్తం బాగా ముదరబారినప్పుడు, ఆయన ఆశ్రేణికి వెళ్లడం మానెయ్యవలసిన అవసరం వస్తూండబట్టి, ప్రతీకొత్త కాఫీహోటల్లోనూ వారిదే. శ్రీసుపుత్రుడు ఇల్లట పల్లుడు. అతని అత్తారి కుటుంబంలో ఎవరికో మందిప్పించుగోడానికి వారంతా స్వగ్రామం నించి పట్నంవెళుతూ అతణ్ణి విడిచిపెట్టలేక కూడగట్టుకెళ్లడంవల్ల అతడు ప్రస్తుతం పట్నంలో ఉన్నాడు. సుబామ్మగారు తనకొడుకుతో గాని, కోడలితో గాని కాలయాపన కోసం మాటాతిట్టూ ఆడుకుంటూ మహాధ్వాయంగా

ఉపన్యాసం ఊరిమేటప్పుడు గాని కనిపించదు. మొత్తంమీంద అప్పుడు ఇంట్లో సుభార్య ఒకర్తే ఉంటూ. కొంతసేపటికి ఆవిడ మెల్లా లోకివచ్చి ఒకగ్లాసూ, పప్పుగిన్నీ, చమ్చావగైరాలు చప్పుడు కాకుండా స్వాములారిదగ్గిర పెట్టి లోపలికి వెళ్లింది. స్వాములారు, చుట్టుపక్కల అయ్యో అలికిడికూడా చెవిని పట్టని యోగంలో ఉంటూన్నప్పటికీ, తన దివ్యజ్ఞానమహిమవల్ల, కాఫీ పరికరాలు తన సాన్నిధ్యానికి అరుగు తెంచడం పోల్చాడు. తత్క్షణమే కళ్లువిప్పి, వేళ్ల సంధులు బెట్టించి, ఆవలించి చిటిగేసి, గొంతుక బాగుపడే నిమిత్తం దీర్ఘంగా సకిలించి, గుటకేసి, 'నారాయణ' అనుకొని, ఆయన గ్లాసులో ఉన్న పాలుపోసి ఆ పప్పుగిన్నెలో ఆయొక్క క్షీరకషాయసమ్మేళన మహోత్సవవైభవం చేతులారా జరుపుతూ, కళ్లారా చూస్తూన్నాడు. నవనవోదయం దాలుస్తూ, సకలకశ్మలహారమై ఒప్పేటటువంటి ఏతత్కాఫీద్రావకగంధం వారి నాసికాగ్రాన్ని డీక్కొనేసరికి, వారికినోరూరి, నాలికజలడి, వాగ్ధారప్రవహించేటంత పనీ జరిగింది. కాని సుభార్యగారు క్షణానికోమాటు ఊహూ ఎగమీలుస్తూండడం, నిరంతరం ఊహూ చీత్తూండడంకూడా స్వాములారికి ఇంట్లోంచి వినిపిస్తున్నాయేమో, ఇంతా ముస్తాబుచేసుకుని తయారైన వారియొక్క లెక్చరుదేవి వేషం తీసేసి వెనక్కి వెనక్కి అణగారడం మొదలెట్టింది: అయినాసరే, ఆవిడదుఃఖానికి కారణం ఏమిటో గమనించితీరాలనేబుద్ధి ఆయన్ని వదలకుండా పట్టుకోడంవల్ల, ఆయన, తనికి కావలిసిన పంచదార పక్కనే ఉన్నట్టు చూసీకూడా, అడిగీ అడగనట్టు—"అమ్మా! కాస్త పంచదార!" అని "ఒహో, ఇక్కడ పెట్టేశారా! మరి తేనక్కర్లేదు, తల్లీ!" అన్నాడు (మహా అక్కడికి, తనుకేకేసిన దరిమిలానే అది తనకంట పడ్డట్టు!) ఇల్లాంటి అర్థకుసి పరామర్శ తనికి నచ్చకగావును, సుభార్య తన మూగనోంలేనే ఉండిపోయింది. దాంతోటి స్వాములారు తప్పకుండా ఏదో కమామీషు ఉందనుకుని, ఒక చిన్న 'తనలో' (అనగా స్వగతం) ప్రారంభించారు: "క్షీరం బ్రహ్మ, చక్కెర ప్రకృతి, కషాయం జీవుడు. కాఫీద్రావకం స్వయంగా సృజన గావించుకునే భక్తకోటికి ఆయొక్క ప్రకృతి జీవబ్రహ్మైక్యవిషయబోధ ప్రత్యక్షంగా సిద్ధిస్తుందిగదా. తిన్నగాచూస్తే అంతా తత్త్వమే. అదే నీవు" అని.

ఈ వాక్యాలతోటి, సుభార్య సావిడి తలుపు దగ్గిరికొచ్చి, "నాయనా, ఒక్కరవ్వ వడ్డించమన్నారాండి?" అని కనుక్కుంది.

స్వా.—ఉన్నదమ్మా. మరి అవసరం లేదు. అయితే అమ్మా, తమరు తత్త్వంవింటూంటారుగదా, దుఃఖంలో ఉన్నారే! సుఖానికి గర్వించరాదనీ, దుఃఖానికి ఏడవకూడదనీ, నిన్నటి ప్రసంగంలోనేగా అయ్యగారూ నేనూ ముచ్చటించాం! ద్వంద్వాలయెడ సమభావం ఉండద్దూ, తల్లీ!

సుభా—నిజమేనండి. నేనూ విన్నా. కాని, స్వంతవ్యాపారం వచ్చినప్పుడు తత్వాం హుళాక్కీ అవుతుంది.

స్వా—అయ్యగారు వీథులోకెళ్లి ఎంత సేపైంది?

సుభా—ఇప్పుడిప్పుడే. ఆయన వెళ్లిన అరగంటకి మీరొచ్చారు. మొహం కడుక్కుంటూనే వారు నన్ను కాఫీ కాచమన్నారు. నాకు చెయ్యి ఊరుకోక, చేతులో పని చేసేసుగుని కాస్తానండీ అన్నాను. అంటే ఆయన, 'పోన్లే వద్దు, కాఫీహోటేలికి వెళ్లి పుచ్చుగుంటాలే, స్వాములారు వస్తేమాత్రం కాచు' అని నాతో చెప్పేసేసేసి, చక్కా పోయారు. ఇక రావాలి.

స్వా—వారేమన్నా ఆగ్రహం దాల్చి వెళ్లడంవల్లగానీ తమరు చింతిల్లటం లేదుకద!

సుభా—కాదండి. మావాడు పట్నంనించి ఉత్తరం రాల్చాడు. వారూ బయటికి వెళ్లగానే వచ్చింది.

స్వా—ఏం? అంతా క్షేమమేకదా?

సుభా—మీదయవల్ల.

స్వా—ధననష్టం ఏమన్నా వచ్చిందా?

సుభా—అల్లాంటి దిప్పుడు స్మరించడానికే సీలు లేదండి.

స్వా—మరేమిటమ్మా! ఏముంది ఉత్తరంలో? అబ్బాయిపరీక్ష పేలిపోయిందా? మీ దావా పరాయిపక్షం అయిందా?

సుభా—అవేవీ కాదండి! పొరుగింటా రబ్బాయిచేత ఉత్తరం చదివించాను.

స్వా—చెప్పవమ్మా, తల్లీ!

సుభా—దేశదేశాలా మాకున్న కీర్తి నాశనం అయిపోయిందిటండీ, బాబుగారూ! మాయింటివాటాలో అద్దెకి తగులడ్డ చచ్చినాడి వల్లేనండీ నాయనా! (అని బారుమని కుసిళ్లుతుంది)

స్వా—అన్ని దేశాల్లోనూ ఏకకాల మందే పోయిందా? ఉండు, ఉండవమ్మా. తమాయించు. ఏదీ, ఆ ఉత్తరం!

సుభా—(లోపలికెళ్లి తెచ్చి), ఇదుగోనండి.

స్వా—బాబుగారొచ్చి చదివేస్తే బాగుండును, నాకు ఆనదు. అరుగో! చిరంజీవ! రండి!

అనేసరికి, సుభర్త, అప్పుడే కొండలు పిండికొట్టి దండయాత్రనించి వచ్చే తీవితో ఇంటికొచ్చాడు. స్వాములారు ఉత్తరం ఆయన చేతికిచ్చాడు. మెల్లాలో ఉన్న మరోకుర్చీ మీద సుభర్త కూలబడి ఉత్తరం చదువుకున్నాడు. చదువుకుని, కుర్చీలో వెనక్కి ఒరిగి, కళ్లుమూసుగుని,

సుభ—స్వామీ! ఓటి చెప్తాను వినండి. ఇవి న్యాయానికి రోజులుకావండి.

స్వా—కావు, నాయ్నా! బడితె బాజాకి రోజులు!

సుభ—నేను ఓగొప్పపొరపాటుచేశాను.

స్వా—(ఏదో తెలియక) చిత్తం. అల్లాగే మరీ! పొరపాటా,పొరపాటున్నరా? ఏమిటండి?

సుభ—నాయింట్లోవాటా ఓడికి అద్దె కిచ్చాను. ఆరేళ్లనించి వాడు లుచ్ఛా అని కని పెట్టలేకపోయాను. మావాడు, దెబ్బతో గ్రహించాడు.

స్వా—ఎవడా అద్దెవాడు?

సుభ—ఉన్నాడులెండి, మీ రెరుగరు. విషధరం!

స్వా—ఏంజేశా డిప్పుడు?

సుభ—నన్నూ, నావాళ్లనిన్నీ పత్రికలో నున్నూ, ఏకేసీనిన్నీ, దేశదేశాలానున్నూ, నాకీర్తి డాగుచేశాడు.

స్వా—మీ జాతకప్రభావంబట్టి మీకు దేశదేశాలా కీర్తి ఉండడంలో అబ్బరం లేదు. కాని, ఎప్పుడూ మీరు నాతో చెప్పనే లేదే ఆమాటా! ఆ ఉత్తరంలో ఇదేనా మీవాడు రాసింది? చదవండి.

సుభ—(చదువుతాడు) "నాన్నగారికి.- అంతాక్షేమం. మనింటో ఉన్న విషధరం మంచివాడని భ్రమించకండి. అతడు పయో ముఖవ్యాఘ్రము.

స్వా—ఇక్కడ రెండు పాతసమాస భాగాలకి వివాహం జరిగినట్టుంది. కానీండి.

సుభ— (చదువును) నాడు తొమ్మిది నెలలకిందట మనికి జరిగిన ఘర్షణ యావత్తూ ఫలానాపత్రికలో రాసేసి, దేశదేశాలా మన కున్న కీర్తి వాడు నాశనం చేశాడు. ఇంకా నయమే. కొన్ని కొన్ని లోగుట్టు సంగతులు ఎక్కించాడు కాదు, మరీ చిక్కుగా ఉండేది. ఈపాటి ఆవ్యక్తిని ఇంటోంచి గెంటెయ్యండి. బెంగపెట్టుకోకండి. తగిన సమాధానం నేను రాస్తాను."

స్వా—ఆపత్రిక ఏమిటో,అసలుఆసంగతి ఏమిటో, మీపేరెట్టి ఉందో లేదో, ప్రపంచ కపురీతో చూసుగోవద్దా నాయ్నా!

సుభ—ఇంకా సంశయం ఎందుకయ్యా, మా వాడు రాసింతరవాతా? మావాడిసూక్ష్మ బుద్ధి మీ రెరుగరు. (సుభార్యకేసి తిరిగి) ఒసే, మనకీర్తి నాశనం అయిపోయిందిటే! మనకీర్తి ఉన్న ప్రతిమూలకీ వెళ్లి వాడు మన్నీ యాగీ పెడుతున్నాడుటే! (అని వాపోతాడు.)

సుభా—భడవా చట్రం అండీ, భడవా చట్రం! ఆరేళ్లనించీ కళ్లు పొరగమ్మి కానలేక పోయాం.

స్వా—ఆపత్రిక ఓసారి తెండి, నాయనా!

సుభద్రకుర్చీమీంచి చివాల్నలేచి, వీధు లోకి ఒక్క గంతేశాడు. ఆమట్టున అతడు వీధులో ఈమూలనుంచి ఆమూలకి ఉప్పట్లాట లోకి మల్లే గాల్నికవ్వించి, కనపడ్డ ప్రతీవాణ్ణీ జబ్బట్టుగుని ఆపి, (స్త్రీలనిమీద ఆయన చెయ్యి చేసుగోలేదుట, అందువల్ల ఆయన కొందరి కంటె ధీరుడే!) నిలేసి:

సుభ—విన్నారా?

ప్రతీవాడు—లేదండి.

సుభ—ఛీ! ఇంకా వినకపోడం ఏమిటి, మీ మొహాం!

ప్ర—రామరామ! నాకు బొత్తిగా తెలియదండి.

సుభ—తెలియక పోడం ఏమిటి! మా యింటోనున్నూ, అద్దెకున్న లుచ్ఛా, మా మీదరాసేసి, దేశదేశాల్లోనున్నూ మా కీర్తి తుడిచేశాడు.

ప్ర—ఎక్కడండీ, రాస్తా?

సుభ—ఫలానా పత్రికలో, తెలిసిందా?

ప్ర—సరేలెండి. తెలిసింది. చదువుతాం, జబ్బ వొదిలిపెట్టండి.

అన్నతరవాతే వాళ్లని విడుదలచేస్తూ, ఈరీతిగా కొంతకాలం స్వవిషయప్రచారం ప్రతిఫలాపేక్ష లేకుండా ప్రచారం చేసుగుని, అక్కణ్ణించి ఫలానాపత్రికలుండే రెండుమూడు చోట్లకి ఎగడి ప్రయత్నించినమీదట అవి ప్రతీ చోటా నిండుకోడం విని, మళ్లీ హాలోలక్ష్మణా అంటూ అద్దెవాడైన విషధరం దగ్గిరకేవచ్చి,

సుభ—(చిరునవ్వుతో) అయితే చూడండీ! మీరు తొమ్మిదినెల్ల కిందట ఏదో రాశార్ట. ఆపత్రిక ఓమాటు ఇల్లా యివ్వండి, వేరేప నుంది.

వి—తమకు ఏ నెలది కావాలి? తొమ్మిది నెల్లూ,నుంతెడు నీళ్లూ అంటే ఏమిటి తెలిసేది?

సుభ—సరేలేవయ్యా, మహా! వెటకారంమాటలూ నువ్వూనూ!

అప యింట్లోకి దూకేసి, కుర్చీలో జార్లపడి కూచుని, ఆయన ఆ ఉత్తరం మళ్లీ గొణుక్కుని, తొమ్మిదినెల్లసంగతి బోధచేసుగుని, మళ్లీ సర్రున విషధరం దగ్గిరవాలి,

సుభ—ఈనెలపత్రిక ఇవ్వండి, పోనీ!

వి—చిత్తం. (అని లేచివెళ్లి పట్టుగొచ్చి, యిచ్చాడు.)

పత్రిక విషధరం చేతులోంచి లాక్కుని, సుభర్త తూటాలాగ నిష్క్రమించి, మళ్లీ వెనకటి కుర్చీమీదే ఆనుకుని, కొన్ని పేజీలు ఇట్టే అని, ఒకవ్యాసంతీసి, అది తనమీదే అనుకుని, ఆవ్యాసంలో భార్యాభర్తలకి ఉన్న పేర్లు తనికీ తనభార్యకీ అనుకుని, అందులో మరొకపేరు వ్యాసకర్తదే అనుకుని నిర్ఘాంతపోయి, "నామీదే నస్రోయ్!" అని ఒక్క రావణా కేకేసి వెనక్కి ఘూర్ణిల్లిపోయాడు. "చిలకా గోరింకల్లాంటి వాళ్లకి ఎంతొచ్చిందండీ! రామచంద్ర!" అంటూ సుభార్యగారొచ్చి, "ఫరవాలేదులెండి. లేవండి. ఎవరివల్ల అబద్ధం ఉంటే వార్నే కొడుతుంది. ఆకుంక తక్కినవాళ్ల మర్యాదలుమాత్రం ఉంచాడనా మీ ఊహ? చిగురంటా చూడండి" అంది. సుభర్త, "అరి, లుచ్ఛా!" అంటూ నిమ్మళంగా లేచి, "మా అమ్మని పిల్వవమ్మా!" అన్నాడు పిలవకుండానే, సుభామ్మ వచ్చింది. ఆవిణ్ణిచూసి, "నాకూ నాభార్యకీ ఇద్దరికీ చెరో రాక్షస ప్పేరూపెట్టి, తను మంచిపే రెట్టుగుని, మమ్మన్ని విషధరం ఏకేశాడమ్మోయ్!" అంటూ సుభర్త దీర్ఘాలు తీశాడు.

సుబా—అయ్యో! అయ్యో! వీడికేంవచ్చిందర్రోయ్! (అని యేడ్చి, ఏమపు ఆపుగుని) ఓ చాపపట్రా కోడలా! (అని, చాప వేసింతరవాత) చాపమీాద కుదిమట్టంగా కూచుని, హైరానలేకుండా ఏడవరా నాయ్నా!

అన్నతరవాత, అంతా చాపమీాద సర్దుకొని గోల మొదలెట్టారు. స్వాములారు కాఫీ చల్లారపోస్తూనే ఉన్నాడు

సుభ—అమ్మా! నీమీాదా రాసినట్టేనమ్మోయ్! నువ్వు రాకుసితల్లివిగా మరీ!

సుబా—నామీాదా! ఓరి వీడిమొహం పొక్కా! నేనేంజేశాన్రా మసిలిపీనుగునీ! వీడి ప్రజ్ఞ తగలేసిరిగదరా, వీడిప్రజ్ఞ తగ లెయ్యా! తనూ, పిల్లలు గలవాడుగదా, ఇంటిగుట్టు తన కెందుకమ్మా, అడిగేవాళ్లు లేకగానీ!

సుభ—(కొంచెం సమాళించుగుని)ఎదో పరికు తగులడ్డాడుకదా! ఉన్నఊళ్లో మెతుకు లేక, పొట్ట చేత్తోబట్టుగుని, బస్తీకి యెగడి వచ్చాడు. లేనివాణ్ణి రక్షించడమే రక్షించడం. శరణాగతరక్షణానికి మనం పేరుపడి ఉన్నాం. ఈవ్యక్తి తలదాచుకుంటానని నా యింటో జాగా అడుగుతున్నాడు, గయుడికి మల్లే. పోనీగదా, అని చెప్పి వీణ్ణి నేను జేరదీస్తినిగదా, చివరికి వీడు నాకే పంగనామాలు పెడుతున్నాడే! తెగతిని, తిన్న యింటికి వాసాలు లెక్కెట్టి, ఊడగొట్టి పట్టుకుపోయే బాపతు! సంకరజాతిఖండాలుడు, తల్లీ తోడూ లేదు.

స్వా—ఆయన మీాయింటో ఊరికేటండీ ఉంటా? ఊరికేజేరి ఇదోటా!

సుభ—అబ్బే! అద్దెకే!

స్వా—అంతేగద! అద్దెకిసున్నా చుడుతూంటాడా ఏమిటి?

సుభ—ఏమాటకామాటే అనాలి. అద్దె తిన్నగానే యిచ్చేసేసేస్తారండి. అయితే మాత్రం, నాకు రాకుసప్పేరు పెడతాడా? ఇదా వీడిమర్యాదా? (అని మళ్లీ మొదణ్ణించి రాగాలెడుంది).

స్వా—ఆ రాత మీామీాదే అని ఋజువు లేందేటండీ?

సుబామ్మ—నిక్షేపరాయుళ్లలాంటి వాళ్లకి రాకుసప్పేర్లు అంటించేసిన తరవాత ఇహ నేముందయ్యా! నువ్వూ నాకు మల్లేనే చాదస్తపుఘటంలా ఉన్నావ్!

సుభ—ఊరుకోండి, స్వామీ! స్పష్టంగా తెలుస్తూంటేనే!

ఇల్లా గోలచెయ్యడం నించి వీథంటపోయేవాళ్లు లోపలికి వస్తూండడంవల్ల చిన్న తీర్థం ఏర్పాటైంది. స్వాములారు అప్పుడప్పుడు ఊదుకుంటూ కాస్తకాస్తే కాఫీ కతుకుతూ కుర్చీలోనే కూర్చున్నాడు. విషధరం, సంగతి చూవత్తూ వింటూ తనవాటాలోనే గదిలో ఉన్నాడు. సుభద్రలేచి, జనాన్ని ఎల్లానో పాయ చేసుగుని, వీథులోకి వెళ్లడానికి దారి నిర్మాణం చేసి స్వాములారితో,

సుభ—స్వాములారూ! ఇంకా చూస్తావేం?

స్వా—కళ్లుండబట్టి, నాయ్నా!

సుభ—అది కాదోయ్! నువ్వు కాఫీస్వాము గారవని విషధరం నిన్ను పేపర్లో ఝూడీం చేశాడు. నువ్వు మాకుమల్లే ఇదవాలి, వాణ్ణి ఏదో శాస్త్ర గదమాయించాలి. ఇల్లా ఊరికే కాఫీ పీలుస్తూకూచుంటే ఏమయినట్టూ! నువ్వు బొత్తిగా కంగారుపడుతూన్నట్టు లేదే?

స్వా—ఎక్కడో ఓపంక్తి నీ కన్పయిస్తే, రాసి ఉన్నదంతా నీమీదే అనుకుని నువ్వు ఏడుస్తూ, కడంవాళ్లని కుడా ఏడవమనా, నాయ్నా! (అని కాఫీ తాగుతాడు)

సుభ—అల్లాయితే, నేను విషధరందగ్గిరి కెళ్లి వాణ్ని నాలుగూ అడగాలి, నువ్వు కుడా వస్తావా రావా?

స్వా—కాఫీ తాగనీండి, నాయ్నా, మీరిచ్చిందేగా!

సుభ—అల్లాయితే, ఏడు!

అని సుభర్తఒక్కడూ విషధరం దగ్గిరికి వెళ్లపోతూంటే, ఇంటిఎదట పోగుపడ్డ జనంలో ఇద్దరు కొట్టుగుంటూండడం గమనించి, ఆగిపోయాడు. వాళ్లిద్దర్లో ఒకడు పింఛను ఇనస్పెక్టరు; రెండోవాడు ఉద్యోగంచేస్తూన్న ఇనస్పెక్టరు.

పింఛనువాడు—ఆ రాత నామీదే!

కడంవాడు—ఛీ! నామీదే! మనోవర్తివాడవ్; నీలో ఏముంది రాయడానికి!

పిం—అందులో తాగుడువిషయం లేదు గనక, ఆ రాత నన్ను గురించే!

కడం—స్త్రీవ్యసనం గురించి ఉందిగనక అక్షరాలా నామీదే! నీమీద ఎల్లాఅవుతుంది, నీశార్థం!

పిం—లంచాల మాట ఉందిగనక నామీదే!

కడం—చిల్లర బాకీలు సంగతి లేదుగనక నామీదే!

పిం—అవతతవకగా ఉందిగనక అచ్ఛంగా నామీదే!

ఈదెబ్బలాట చూసేసరికి సుభర్త కొంత విచారం తగ్గి, స్వాములారితో,

సుభ—చూశావా, స్వాములారూ! నువ్వు ఇంకా దొడ్డిదార్నే ఉన్నావ్! వాళ్లు ఎంతో సూక్ష్మబుద్ధి ప్రయోగించి తమసంగతి ఎక్కడెక్కడ రాసిఉందో అల్లా కనిపెట్టుగుంటూంటే, నీ కామాత్రం బుద్ధే లేదే!

స్వా—నోరు కట్టేయ్ నాయ్నా, నోరు కట్టేయ్! నువ్వు ఏంమాట్లాడు తున్నావో నువ్వెరగవ్! (అని కాఫీ తాగుతాడు.)

సుభ—(జనంకేసి తిరిగి, అవతలకి నడుస్తూ) అల్లాయితే పోనీ మీరంతా రండయ్యా! వాడి దగ్గిరి కెళ్లి ఈసంగతి కనుక్కుందాం!

అని విషధరం వాటాలోకి నడిచాడు. జనం కుడా అక్కడికి కదిలారు.

సుభ—ఏమయ్యోయ్! విషధరంగారు! మీకు మాగృహం నచ్చకపోతే ఖాళీ చెయ్యండి. అంతేగాని, మావాటా బాగు

లేదని అక్కడా ఇక్కడా అనడం ఏంగొప్పనీ! మీరిచ్చే ఆద్దెఖర్చులికి, నేను ఎక్కడలేని హంగులూ చేస్తూ కూర్చోలేను.

వి—మీమాటా నాకు నచ్చింది. దీన్ని గురించి యాగీ నేను ఎక్కడా చెయ్యలేదు, నాకు హంగులు అవసరం లేదు.

సుభ—ఏమో, ఉన్న సంగతదీ!

వి—ఏదీ? సమాధానం చెప్పండి! ఇంత మందిని ఎందుకూ పిల్చుగొచ్చారు?

సుభ—నువ్వు నామీద రాతలు రాయ గలవ్, రాతునప్పేరేటీ?

(అని చేతు లాడిస్తూ విషధరంమీదకి పడతారు.)

వి—నీమీద ఎవరయ్యా రాసిందీ!

సుభ—నువ్వే! నువ్వెప్పుడు రాసినా ఎవడిమీదో దెబ్బ!

వి—నీమీద, నే రాశానా? ఏం గర్వంగా ఉంది నీపని! నువ్వు మహారాజువనా, గొప్ప గుణాలు నీలో ముద్దకట్టిపోయి ఉన్నాయనా, నువ్వు ఆదర్శప్రాయుడవనా, పోనీ, నువ్వే మొన్నా రౌండు టేబిల్ కాన్ఫరెన్సుకి వెళ్లి వచ్చావనా?

సుభ—ఓ కాఫీహోటల్లో గుండ్రటిబల్ల దగ్గిర కొంతమంది ఎరగనివాళ్లతో చేరి కాఫీ తాగొచ్చాను.

వి—రాసిందంతా నిన్ను గురించే?

సుభ—[illegible]

వి—అదంతా నిజమే?

సుభ—ఓ.

వి—అయితే నీకు కోపం ఎందుకూ?

సుభ—నిజం అంటే, అదంతా నిజమూ కాదు. కొంత అబద్ధం.

వి—అబద్ధం అయితే, అసలు నీ కెందుకూ?

సుభ—ఇంకా వాదిస్తా వేమిట్రా నాతోటీ, కొంతనిజం, కొంతఅబద్ధం గుచ్చెత్తి నామీద రాసీ?

ఈసమయానికి స్వాములారు కాఫీ పూర్తిచేసి వచ్చి,

స్వా—ప్రపంచకపురీతే అంత, నాయనా, ఆయన్ని ఏంజెయ్యమన్నావ్!

సుభ—నిజం అయితేమాత్రం వీ డెవడయ్యా, నా సంగతి రాయడానికీ! నిజమైన సంగతులు బోలెడు మనం కప్పెట్టుగోడం లేదూ?

స్వా—అవును, నాయనా. నిజం అయినా సరే, అసభ్యం అయితే మాట్టాడకూడదు, నాకేం అని మాట్టాడితే ఛీఛీప్రయోగంచేస్తారు. నిజం అయినాసరే రాజకీయరీత్యా దేశానసం అయితే మాట్టాడనియ్యరట. నాకేం అని మాట్టాడితే లాటీప్రయోగం చేస్తారు.

సుభ—సరే, అహోరించారుగాని మీరు వాక్కండి, వాక్కాయి లాగ. ప్రతీ సన్యాసి పీనుగూ నాయింటో తొంగుచూస్తూ, శత్రు

పక్షం వాదించడమూను, నాలో బోలెడు మంచిలక్షణాలు ఉంటూంటే అవి తీసుకురాయ కూడదు వీడూ? నన్ను వచ్చి అడిగితే నే చెప్పనూ?

వి—తమయొక్క మంచిలక్షణాలు తమరి నోటంటగాని జనానికి తెలియడంలేదు. సరే, ఇది మీ మొదటి మంచిలక్షణం కావును.

సుభ—లోట్లు పట్టుకు ఏడుస్తావేం నా కుళ్లు మీద ఈగవాలినట్టూ! పాకీపని చెయ్యడం అనుకున్నావురా, రాయడం అంటేనూ!

వి—చిత్తం. అంతటి అదృష్టంపడితే జన్మ తరించినట్టే అని మహాత్ములు చెప్పలేదూ?

సుభ—నన్నేడిపించి నువ్వు నవ్వుకోడమా నీ ప్రజ్ఞ?

వి—స్వతస్సిద్ధం, శారీరకం అయినలోట్లు చూస్తే జాలి. స్వార్జితం, మానసికం అయిన లోట్లు చూస్తే సరదా.

సుభ—ఇహ నామీద రాశావంటే, జాగ్రత్త.

వి—నీమీద ఎన్నడూ రాయను, మనుష్యులమీద రాస్తాను.

సుభ—అసలు నాకు కోపం వచ్చిందంటే, మనిషినిగాను.

వి—కోపం రానప్పుడూ అంతేలా కనపడుతున్నారు. పోనీ, కీర్తినష్టానికి దావా తెచ్చుకోండి! (అని దగ్గిరికెళ్లి గట్టిగా అంటాడు.)

స్వా—ముందు మాట, కీర్తి ఉన్నతరవాతేగా, నష్టం రావడానికి!

సుభ—ఒరేయి, స్వాములారూ: నువ్వు లేచిపో! నాగడప తొక్కకు!

స్వా—చిత్తం. హాశిష్యా! తత్వం నీలో జీర్ణించిందిగా! సెలవు.

(అని వెళ్లిపోతాడు.)

సుభ—ఒరేయ్!విషం!మీదిమీది కొస్తావురా! పొగరుపోతురకం! నన్ను కొట్టబోతావుట్రా! పైగా నన్ను డిఫర్మేషన్ తెచ్చుకోమంటావురా, భడవా! అయితే నాయిల్లుఖాళీ చెయ్యి! తక్షణం! ఈ ఊళ్లో నీకు ఇల్లు ఎవడిస్తాడో చూస్తాను!

వి—చిత్తం.

విషధరం ఆయిల్లు తక్షణం ఖాళీచేశాడు. అతనికి ఇంకోయిల్లు ఇప్పించినాయన్ని చూస్తే కూడా సుభర్తకి కోపం. లోగడ సుభర్త విషధరం దగ్గిరకూచుని, "మీదగ్గిర చాలా 'విట్టీ' ఉందండీ!" అని స్తోత్రాలు చేసేవాడు. ఇప్పుడు అతను రాసింది విమర్శించుతూంటాడు. సహజం! అతడు ఒకనాడు గ్రంథవిమర్శ చేస్తూ (చాలా మూలం తెలియకుండా కసి వెళ్లబుచ్చుకుని తద్వారా ఒకవిధమైన ఔన్నత్యం సంపాదించాలని కొందరు విమర్శకులు సంపాదించే పడికట్టు విమర్శకుప్పెలు సుభర్త కూడా కొన్ని జాగ్రత్త చేశాడు!) ఒకప్రదర్శన గ్రంథంలో "త్రాణా, రసం లేందే!" అని తీర్మానించాడు. (విమర్శ ప్రపంచంలో అతని తీర్మానం వినేవాళ్లులేరు మరి; ఎన్నింటికని ఇదవం.") మర్నాడు, ఆగ్రంథం రాసింది విష

ధరం పేరింటిగాడైన మరొకాయన అని తెలిసి, ఆయనదగ్గిరికి వెళ్లి, "అయ్యా! ఆ గ్రంథం మీదే అని లోగడ ఎరగను. వాడి దనుకున్నాను. మీదని తెలిస్తే నేను దాన్ని మెచ్చుకునే ఉందును" అని సెలవిచ్చాడు. సుభద్ర ఇల్లాగ్గా తనప్రజ్ఞ వాడుతున్నాడు. సుపుత్రుడు రాయదల్చిన సమాధానం తయారు కాలేదు. తక్కిన అంతా క్షేమం. స్వాములారు మరోచోట కాఫీ తాగుతూనే ఉన్నాడు.

ఈముక్కలు నాలుగూ చదువుకుని, ఇది మళ్లీ "నామీదేనట్రోయ్!" అని ఘూర్ణిల్లే సుభద్రలుగనక ఎవరేనా ఉంటే ఉండవచ్చు. వారు లేచింతరవాత, వారికి నమోన్నమః.

---

## కోకిల*

సెట్టి లక్ష్మీనరసింహముగారు B. A.

పరమసుఖభరితమ్మ, యో పరభృతమ్మ-మరల వచ్చిన నిను వింటి మురియుచుంటిఁ;
గోకిలా పిట్టవందునో లేక తిరుగు లాడు-కేవలధ్వనివని యందునో నిను ?

కుహుకుహూ యన్చి రెట్టింపుకొన్న నీదు-కేక వనముల వినఁబడె నాకుఁ గొండ
నుండి కొండకుఁ బోయినట్లుండె నొక్క-తఱినె యయ్యది దవ్వును దాపు నగుచు.

క్రొన్ననలఁ గూర్చి పండ్లను గూర్చి వనుల-తోడ నచ్చికబుచ్చికలాడుకొఱకె
వచ్చియును జిన్ననాఁటి నా ముచ్చటులను-జ్ఞప్తికిం దెచ్చుచుంటివి నాకు నీవు.

ఆమనికిఁ గడుఁ బ్రేమ గలట్టి చుట్ట-మా పికను స్వాగతమ్ము ముమ్మాటి కిపుడు;
నాకు నేఁటికిం బిట్టవుగాక కనుల-కగపడనిదానవు ధ్వని వత్యద్భుతమవు.

చిన్ననాఁటఁ దోఁటల నేను విన్నయట్టి-దానవే యాదువుగద యాధ్వని నను మును
వేయి దెసలను గనునట్లు చేయుచుండెఁ-బొదలయందు వృక్షములందుఁ జదలునందు.

నిన్నుఁ గనుఁగొను నాశతో నేఁ బలుమఱు-నడవులం దోఁటలం దిరుగాడినాఁడ;
నేను వాంఛించుటే తప్ప నెప్పటికిని-దొరక కాశవై ప్రేమవై పరఁగితీవు!

ఇప్పటికి నీదు పాట నా కిష్టమె యిల-పైని వెలికిలం బన్నుండి దాని విందుఁ
గడచి చనిన యట్టి యుల బంగారు వంటి-వయసు క్రమ్మఱ వచ్చినట్లయినవఱకు.

మేము మెలఁగుచు నున్న యీ భూమి యపుడు-నీవు నివసింపఁ దగినట్టి దేవతా
కేశమై మిథ్య మైనరీతిగను మగుడఁ-గనఁబడును ధన్యజన్మంబు గలుగు పులుఁగ!

---

* Wordsworth's 'To the Cuckoo.'




## కోమిటి యుక్తి

బి. జ్ఞానాంబ

ఒక అడివిలో ఒక పెద్దపులి. ఆ పెద్దపులికి ఒక నక్కమంత్రి. పెద్దపులి రోజూ మాంసం వేటాడి తెచ్చి తాను కొంత తిని నక్కకు కొంత పెడుతూఉండేది. ఒకరోజు బొత్తిగా అహారం దొరకలేదు. పెద్దపులీ, నక్కా ఆకలితో నకనక లాడుతూ దోవలో పొంచున్నవి. ఇలా ఉండగా ఒక కోమిటి శెట్టి వడలమ్ముకోడానికి పొరుగూరికి వెళ్లుతూ వాటి కెదురుపడ్డాడు. అతన్ని చూస్తూనే నక్క యీలలు వేసింది. పెద్దపులి గర్జిస్తూ అతనిమీదికి దూకింది. పాపం, కోమటి శెట్టి కంగారుపడి,

"నాదొక మనవిఉంది. దేవరవారు చిత్తగించాలి" అన్నాడు చేతులు జోడించుకొని.

"సరే. త్వరగా కానీ." అన్నది పులి ఆగ్రహంతో.

"ఈ గంపలో కావలసినన్ని వడ లున్నవి. దేవరవారు వాటిని తినిచూచి రుచిగా లేకుంటే తర్వాత నన్ను భక్షించండి."

పెద్దపులి వడలన్నీ తిని పచ్చిమాంసం కంటె పదిరెట్లు బాగుండడంవల్ల చాలా సంతోషించి,

"సెట్టీ! నీవు తెచ్చిన వడలు చాలా పసందుగా ఉన్నవి. కాబట్టి నిన్ను రక్షించాను. ప్రతిరోజూ ఇదేమాదిరి వడలు తీసుకొనిరా. ఆ గుహలో వెండీ బంగారం దండిగా దాచి వుంచాను. నీకు కావలసినంత తెచ్చుకో" అన్నది. అప్పటినుంచి ప్రతినిత్యం వడలు తీసుకొనివెళ్లి వెండీ బంగారం తెచ్చుకోవడం సెట్టికి మామూలయింది. ఇలా ఒక నెల రోజులు గడిచినవి. వడలరుచి మరిగి పెద్దపులి వేటాడడము మానుకోవడంవల్ల నక్కకు తిండి దొరకలేదు. దినదినానికీ కృశించిపోవడం మొదలెట్టింది. ఇక ఆలస్యంచేస్తే బతకడం కష్టమనుకొని పులివద్దకు వెళ్లి నక్క

"మహాప్రభో! తామీమధ్య దాసునిపై దయతప్పినట్లున్నారు. అయినా పరవాలేదు.

పలిసవారు చల్లగావుంటే మేము సున్నగా ఉంటాము. మాకంతేచాలు. కాని ఆ కోమటి వాడినిమాత్రం నమ్మవద్దు. వాడు మహాచెడ్డ టక్కరి. రేపటిదినం వడల్లో విషంపెట్టుకొని వచ్చి మిమ్మల్ని చంపి వెండీ బంగారం అంతా ఒకేసారి దోచుకొని వెళ్లడానికి వాడు ప్రయత్నం చేస్తున్నాడు." అన్నది.

"అయితే ఇందుకు ఉపాయ మేమిటో నీవే చెప్పు." అన్నది పెద్దపులి కొంచెం ఆలోచిస్తూ.

"వాడు రేపటిదినంవడలు తెస్తూనే ముందు నాకు తినబెట్టండి. తిన్నతర్వాత నేను యథాప్రకారంగా ఉంటినా సరే. లేకుంటే మీరు వాటిని తాకవద్దు."

మరునాడు మామూలు మేరకు శెట్టి వడలు తెస్తూనే నక్కను తినమని చెప్పింది పులి. నక్క తొక్కలు పూడేటట్టు తిని కింద పడి విలవిల తన్నుకొని ఊపిరి బిగపట్టింది. అదచూచి పెద్దపులి మహాకోపంతో ఎగిరి సెట్టి జుట్టు పట్టుకొని,

"కోమిటివెధవా! నీజీవితం ఇంతటితో ఆఖరు. నీ కడపటికోరిక ఏమిటో చెప్పుకో" అని గర్జించింది. సెట్టికి నక్క చేసినతంటా బోధపడినది. అతడు చప్పున ఆలోచించుకొని:

"మహాప్రభో! మానాయన చనిపోయేటప్పుడు నక్కతోలు కాస్త జంధ్యానికి తగిలించుకోమని చెప్పేడు. అది చాలాకాలమునుండీ దొరకక యిప్పుడు దొరికింది. కాబట్టి తమసెలవైతే కాస్తచర్మం కోసుకొని జంధ్యానికి తగిలించుకుంటాను." అన్నాడు. పులి సరే అనింది. సెట్టి పేనాకత్తితో చురుకు పుట్టేటట్టు నక్కచర్మం పరపర కోయసాగేడు. నక్కనొప్పికి భరించలేక 'బతుకు జీవుడా' అని పరుగెత్తింది. సెట్టి పకపక నవ్వుతూ,

"పులిరాజా! ఈమధ్య సరిగా తిండి దొరకక పోవడంవల్ల నక్క యీ తంతు చేసినది. దేవరవారు రద్గ్రహించలేక నాపైన నిష్కారణంగా కోప్పడ్డారు. ఇకసెలవు." అని తిరిగిచూడకుండా ఇంటికి వెళ్లేడు. కథకూడా కంచికి వెళ్లింది.

---

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విశదాక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.



# తాబేటిబావ



ఒక అడవిలో ఒక పాడుగుంట ఉండేది. దానిలో ఒక తాబేలు ఉండేది. ఆపక్కనే ఓ చెట్టుమీద రెండుకొంగలుండేవి. ఆకొంగలకూ తాబేలుకూ చాలా స్నేహం. ఇట్లా ఉండగా పన్నెండేండ్ల కరువొచ్చింది. వానలేక లోకం అంతటా నీరెండిపోతూంది. తాబేలున్న గుంటలో నీరు కూడ బురదయింది. అది చూచి కొంగలు 'మేము నీరుండే మరోచోటికి పోతా' మన్నవి. తాబేలు 'అన్నా, నాగతేమిటి! నన్నూ తీసుకొపోండి' అన్నది. కొంగలు ఒక సన్నకట్టెను తెచ్చి తాబేలును ఆకర్రను నోటితో పట్టుకోమన్నవి.

తాబేలు పట్టుకోగానే కొంగలు ఆకర్రను చెరోకవైపు ముక్కుతో పట్టుకొని ఎగిరి పోతూంటేనవి. ఇది చూడడానికి ఒకవింతగా ఉన్నింది. ఆకలిగొన్న ఓనక్క యీవింతను జూచి తాబేటిని ఎట్లయినా తినేయాలని ఆలోచించి 'ఇటువైపు అటువైపు ఉండే ఆతల్లోటి వారు మా మామలేకాని, నడను వేలాడుతుండే నల్లటాత డెవరో' అని తాబేలు వినేటట్లుగా అరిచింది. అదివిని 'నక్కబావా, నక్కబావా! నేగదా తాబేటి బావను' అని తాబేలు అన్నది. అ నేలనడంతో ఠక్కిందబోర్లపడిపోయింది. నక్క పరుగెత్తి దగ్గరకువచ్చి దాన్ని కాలితో తొక్కిపట్టి పండ్లతో పెకుక్కొని తినడానికి చూచింది. ఎంతసేపటికి సాధ్యంకాలేదు. పైనచిప్ప ఉండడంచేత. తాబేలు తప్పించుకోవాలని ఒక యుక్తి పన్ని, 'నక్కబావా, నక్కబావా! ఇట్లా ఎంతసేపు కష్టపడ్డా లాభం లేదు. నన్ను తీసుకొపోయి నీళ్లలో నానబెట్టినావంటే క్షణంలో దూదివలె నాని పోతాను. మెత్తగా మింగేయవచ్చు' అన్నది. నక్క దానియుక్తి తెలుసుకోలేకదాన్ని ఆ దగ్గర నీరునిండా ఉండే ఓగుంటకు తీసుకోపోయి నీళ్లల్లోపెట్టి కాలితో తొక్కిపెట్టుకొని నిలుచుంది. కొంతసేపు అయిన తర్వాత నక్క 'తాబేటిబావా! తాబేటి బావా, నానినావా' అని అడిగింది.



"ఇది చూడడానికి వింతగా ఉన్నింది."

'అంతా నానినాను గాని బావగారి బంగారుపాదాలకిందమాత్రం నానలేదు.' అని తాబేలుఅన్నది. నక్క కొంచెం కాలుపైకెత్తింది. తిన్నగా తాబేలు తప్పించుకొని దూరంగాపోయి నీళ్లపైకితేలి 'ఓయ్ నక్కబావా, నక్కబావా, నానినాను చూచావా' అని వెక్కిరించింది. 'ఓస్ నీ తస్సకొయ్యా! నక్కజిత్తులన్ని నాదగ్గరేఉంటే తప్పించుకొని ఎలా పోయినావే తాబేలా!' అని నోట్లో వేలుపెట్టుకొని వచ్చినదోవన్నే పోయింది నక్క. కథా కంచికి పోయింది; మనం ఇంటికి వచ్చాము.



"ఓయ్ నక్కబావా,..........అని వెక్కిరించింది."

'ముసలమ్మ'

# ఎండ్లూరు—మైనంపాడు

మ. పీ. రా.

ఒంగోలు తాలుకాలో ఎండ్లూరు అంటూ ఒక ఊరుంది. దాని పొలిమేర మీదనే మైనంపాడనే మఱో ఊరుంది. పూర్వం ఒక నియోగి బ్రాహ్మడికి ఎండ్లూరిలో అక్కగారిల్లూ, మైనంపాట్లో మామగారిల్లూ ఉండేవి. ఏదో పనిమీద పదిరోజులుగా మామగారింట్లో ఉంటూన్న ఆ బ్రాహ్మడొకరోజున, పొద్దుటి పెత్తనం పదిఘళ్యా అయిన తర్వాత, స్నానం జేసి బాగా నామాలు తీర్చికూర్చొన్నాడు. ఉన్నట్టుండి అక్కగార్ని చూడాల్న నే బుద్ధిపుట్టింది. ఆపళంగా లేచి అత్తగారితో, మామగారితో చెప్పి బయలుదేరాడు ఎండ్లూరికి. అప్పుడు భార్యఅంది 'ఏమండీ! భోంచేసి వెళ్లండి. ఇప్పటికే చాల పొద్దెక్కింది. పడమటి గాలికూడా కొట్టోంది' అని. "ఎందుకూ, రెండునిమిషాల్లో వెళ్లనూ" అంటూ గొడుగు చేతపుచ్చుకొని బయలుదేరి వెళ్లాడు. మధ్యదార్లో కరణంగారు కనిపించడంచేత ఆయనతో మాట్లాడుతూ నిలబడి ఒకగంట ఆలస్యం చేశాడు. అంచేత మైనంపాడు చేరేటప్పటికి బాగా రెండు ఝాము లయింది.

ఆ బ్రాహ్మడి బావగారు అతన్నిచూచి నములుతూన్న తాంబూలాన్ని మింగి "ఒహో! బావగారే! ఎప్పుడూ రావటం.... ఎక్కణ్ణుంచి" అంటూ అరుగుమీద చాప వేస్తూ "ఏమేవ్! చుట్టంవచ్చాడు." అని

భార్యకు తెలిపాడు. ఆమె కాళ్లకు నీళ్లిచ్చింది ఆయన కడుక్కున్నాడు. ముగ్గురూ కుశల ప్రశ్నలతో, జవాబులతో, ఆకబుర్లీకబుర్లతో ఒకగంట గడిపారు.

పాపం! ఆ బ్రాహ్మడి తీర్చి దిద్దిన బొట్టు చూచుటచేత భోంచేసి యుండడని భార్యా భర్త లిరువురిలో ఒకరికీ అనుమానమైనా కలగలేదు. అదీగాక రెండు జాములు తిరిగి నా స్థితిమంతులు భోంచెయ్యకుండా వుంటారని యెవరనుకుంటారు? మఱీ అత్తగారింటనుంచి రావడం. అంచేత ఆమాటే యెత్తలేదు వారి ద్దరిలో ఒకరూనూ. ఎంత అక్కఅయినా తాను నియోగిబిడ్డగదా! అంచేత అతడూ చెప్పలేదు తాను భోంచేయలేదని. ఇంతలో బావగారు తమలపాకుల తబుకును ముందుకు జరుపుచూ 'వేసుకోండి' అని అన్నాడు. వేసుకోనా? వద్దా? అను సందేహాన్ని నిమిషంలో త్రోసేసి, వేసుకొన్నందువల్ల నష్టంలేదనీ, మఱీ ఆకలికి కొంచెము ఉపశమనంగా ఉంటుందనీ ఆ బ్రాహ్మణుడు తాంబూలం వేసుకొన్నాడు. కొంతసేపటికి ఆకలి మళ్లీ కనిపించింది. వారా-ఆప్రస్తావనే చేశేట్టు కనిపించలే. వారడగందే తనంతట తా నెలా చెప్పటం. ఇవ్వన్నీ యోచించి యెలాగైనా తిరిగి మైనంపాడు అప్పడే వెళ్లాలేనని నిశ్చయించుకొని "బావగారూ! నేనిక వెళ్తాను" అని అన్నాడు.

వారుండమంటం, అతడు కాదంటం కొంతసేపు జరిగింది. ఎలాగయితేనేం తానా సాయంకాలమే తనభార్యను వంగోలుకు పిల్చు కెళ్లాలనీ, ఆరోజు తప్పితే యిక రెండుమూడు మాసాలవరకు వీల్లేదనీ, తిరుగా తాను పది పన్నెండు రోజుల్లో వస్తాననీ, నచ్చచెప్పి యింటి దారి బట్టాడు. కడుపూ, కాళ్ళూ మాడుచూ అతను రెండుగంటల కిల్లుచేరాడు. "ఏం! ఇంత యెండలోనే తిరిగి వచ్చారు?...చల్లబడ్డానికె బయలుదేరక పోయారూ?...అంతా బాగు న్నారా? కనకాం ఏమంటూంది?...కిష్టాయి మిమ్మల్ని గుర్తుపట్టి కొత్తలేకుండా దగ్గర కొచ్చాడా?..."యిలాంటి ప్రశ్నలు తప్ప తనకు కావలసిన ప్రశ్న అత్త, మామ, భార్యా, బావమరదులూ వీటిలో ఒకరినుంచికూడా వచ్చిందికాదని అతను నొచ్చుకొన్నాడు. కానీ, వారి ప్రశ్నలకేవో సమాధానాలు చెప్తూ, వసారాలో ఉన్నమంచం వాల్చుకొని పండు కొన్నాడు. వారందరూ మండేడు ఎండవల్ల అలసి పండుకొన్నాడని అనుకొన్నారుగాని మండేడు ఆకలిచే అని అనుకోలేదు. అసలు అలా అనుకోడానికి అవకాశమేదీ? అక్కగా రింటికి వెళ్లినవారు భోంచేయకే అపరాహ్ణ మైనా, తిరిగివస్తారని యెవరనుకుంటారు?— అందునా అంత యెండలో? దానికి తోడుగా నీటుగా నామాలూ; భోంచేసిన గుర్తుగా అంత కంటే తాంబూలపుచిహ్నాలు—

పాపం! ఆ బ్రాహ్మడికి వెంటనే నిద్ర పట్టింది. సాయంత్రం ఆరింటికి కాబోలు మెల కువ వచ్చింది. ఆకలీ అప్పుడే తిరుగా కన్పించింది. అప్పుడాత డోపెత్తుగడవేశాడు. వెంటనే మేలుకొలుపులు పాడ్డం ఆరంభించాడు.



## ఉయ్యాలపలక

రా. నరసింహాచారి గారు

ఇది రెండు స్తంభములపై నిలిచి రెండుకొనల యందును క్రిందికిని మీందికిని ఊగెడి పలక. దీనిపై రెండుకొనల యందును ఇద్దరు బిడ్డలు కూర్చుండి ఒకరు మార్చి యొకరు క్రిందికిని మీదికిని పోవుచుందురు. వారు ఊగునపుడు ఈపలక యొక్క త్రాసును బోలియుండును. ఈ పలకను అట్టతో చేయుటను గుఱించి చెప్పెదను.

ఈపలకయందు మూడుముఖ్యభాగములు కలవు. అవి: ౧. అరుగు, ౨. స్తంభములు, 3. ఊగెడిపలక.

### ౧. అరుగు

అ, ఆ, ఇ, ఈ అను ఒక పెద్దఅట్టను ౨౪"×౧౬" వైశాల్యము గలదానిని దీసికొని దాని నాలుగు అంచులయందును ౨" వెడల్పు గలభాగములనుగుర్తించికోయవలెను.(చిత్రము ౧.) అపుడు అట్టయొక్క నాలుగుమూలలందు క, క, క, క అను రెండంగుళముల చతురము లేర్పడును. అవి అరుగుయొక్క ప్రక్కలను వంచినపిదప, వాటిని మూలలందు చేర్చిపట్టు కొనుటకు ఉపయోగించును. అ, ఆ, ఇ, ఈ అను

---

అది విని అతని బావమరది "ఏం! బావ గారూ! యిప్పుడే తెల్లవారిందనుకొన్నారా ఏమిటి"అని హాస్యం చేసాడు. అతడన్నాడు "అదికాదోయ్! తెల్లవారితేనేం. అస్తమించి తేనేం. పరగడుపున గదా మేలుకొలుపులు పాడాలిశింది, అని పాడుతున్నాను." అని. అందరూ యిది విన్నారు. నిజం కనుకొన్నారు. లోలోన నవ్వుకొన్నారు. కాని భార్య వెంటనే వంటచేసింది. గుప్ చిప్ లాడక ఆ బ్రాహ్మణుడు ఆతురతలతో భోంచేశాడు.........

అది మొదలు "ఎండ్లూరు మైనంపాడు అయిందా?" అంటే "భోజనంలేక వస్తా?" అని అర్థం వచ్చింది.

అట్టయొక్క మధ్య గల ల, ల అను రేఖపై ల,ల అను రెండుసందులను, ర, ర అను రెండు రంధ్రములను చిత్రమునందు చూపిన రీతిని చేయవలెను. పిమ్మట చ,ఛ,జ,ఝ అను మధ్య భాగమునకు చుట్టును గుర్తించబడిన రెండంగుళముల వెడల్పు ప్రక్కలను క్రిందికి వంచి మూలలందు క,క,క,క లను తునుకల నతికించి అరుగును పూర్తిచేయవలెను. అట్టను వంచుట, కోయుట మొదలగువిషయములందు సూచికయందు జూపినరీతిని ఆయా రేఖలతీరు ననుసరించి కోయవలెను. పూర్తిచేయబడిన అరుగు చిత్రము ౫ నందు చూడవలసినది.

### ౨. స్తంభములు

చిత్రము 3 నందు జూపబడినట్టి స్తంభములు రెండు కావలెను. చిత్రము ౨ నందు జూపబడినరీతిని రెండుఅట్టలను కత్తిరించవలెను. కొలతలు చిత్రమునందే కలవు. అట్టయొక్క పైయంచు ట, ఠ ౪" పొడవును, క్రిందియంచు డ, ఢ ౧౦" పొడవును, ఎత్తు ప, ఫ ౭"

ఉండవలెను. డ,ఢ కు క్రింద ఒక అంగుళము వెడల్పున అతికించుటకు గాను అట్టను వదలవలెను. ట,ఠ అను అంచునకు ఒక అంగుళము క్రిందుగా ర అను రంధ్రమును చేయవలెను. పైరీతిని రెండుఅట్టలను సిద్ధపఱచుకొనవలెను.

### 3. ఊగెడిపలక (చిత్రము ౪)

౨౦"×౬" వైశాల్యము గల అట్టను ఎ, ఏ,ఒ,ఓ దీసికొని దాని పొడవు అంచులు రెంటియందును ఒక్కొక్క అంగుళము వెడల్పుస్థలములను గుర్తించవలెను. వాటియందు నడుమ రెండర్ధవలయములను మ,మ గుర్తించి తక్కిన భాగములను (నల్లని పూతగల భాగము) కత్తిరించి తీసివేయవలెను. మిగిలిన అట్టయందు నాలుగంచులయందును అంగుళము వెడల్పుగల స్థలమును గుర్తించి అరుగునకు కోసినరీతిని కోయవలెను. నాలుగు ప్రక్కలను వెనుకకు వంచి మూలలందు గల క,క,క,క లతో నతికించవలెను. మ,మ అను అర్ధవలయములందు ర ర అను రంధ్రములను చేయవలెను.

### భాగముల నమర్చుట

మొదట చిత్రము ౧ యందు జూపబడిన అట్టతో జేసిన అరుగుపై మధ్యభాగమున చిత్రము 3 నందు జూపబడిన స్తంభములను చిత్రము ౨ నందు జూపినరీతిని అతికించవలెను. తర్వాత స్తంభములమధ్య ఊగెడిపలకను పెట్టి, స్తంభములందును, పలకయొక్క అర్ధవలయములందును గల ర అను రంధ్రములగుండా నొక కమ్మిని దూర్చి పలకను స్తంభములపై త్రాసువలె ఆడునట్లు అమర్చవలెను. పిమ్మట కమ్మి కిరుప్రక్కలను సుమారు మూడేసి అంగుళముల దూరమున రెండుదారములను కట్టవలెను. అరుగుయొక్క వెడల్పుప్రక్కలందు చేయబడిన ల, ల అను సందులగుండా $\frac{3}{4}$" వెడల్పును అరుగుయొక్క పొడవునకన్న నెక్కువ పొడవునుగల (సుమారు ౨౨" పొడవు) అట్ట ముక్కను దూర్చవలెను. పలకకు కట్టిన దారములను అరుగునందు జేయబడిన రంధ్రములగుండా క్రిందికి దీసికొని, అరుగునందు దూర్చబడిన అట్టకు కట్టవలెను. ఈఅట్టను ముందు వెనుకలకు లాగుటవలన పలక క్రిందికిని మీదికిని ఊగుచుండును. ఉయ్యాలపలకయొక్క రెండుకొనలయందును రెండు కర్పూర (Celluloid) బొమ్మలను కూర్చుండబెట్టినయెడల అందముగా నుండును.

# ఆర్కిమెడీస్ చరిత్రము

జి. వి. రాఘవరావుగారు, B. A.

మన భరతఖండమునకు దిగువన సింహళద్వీపమున్నట్లే ఇటలీదేశమునకు దక్షిణాగ్రమున 'సిసిలీ' ద్వీపమున్నది. పూర్వకాలమునం దాద్వీపము దివ్యసౌధములు, గొప్పదేవాలయములు గల పెద్దపట్టణములతో నలరారుచుండెను. పచ్చని చేలతోను, నానావిధఫలముల నిచ్చు వృక్షజాలములతోను నిండి యాద్వీప మొక యుద్యానవనమువలె చూచుట కెంతో రమ్యముగా నుండును.



ఆర్కిమెడీస్

ఆద్వీపమునందు 'ఎట్నా' యను నొక గొప్ప అగ్నిపర్వత మున్నది. దానిశిఖరమునుండి పొగయును, ఆవిరియును తఱుచుగా పైకెగయుచుండును. ఒకప్పుడు కరగిన లోహములతోనిండి మహాగ్నిమయమైన 'లావా' ప్రవాహము ఆపర్వతశృంగమునుండి ఘోరముగా వెడలి ఆప్రాంతమంతయు భస్మీభూతము గావించివైచును. భూకంపములచట తఱుచుగా నగపడును. 1908 సంవత్సరమున గొప్ప భూకంపము గలిగి 'మెసీనా' యనుపట్టణము ధ్వంసమైనది. ఈమధ్యను గూడ ఇట్టి ప్రమాదము సంభవించినది.

ఆద్వీపమునకు తొలుత గ్రీసుదేశమునుండి బహుజనులు వలసవచ్చి యందు నివసించుచుండిరి. అందలి నగరము లన్నిటిలో 'సైరాక్యూజు' నగరము ప్రాచీనచరిత్రయందు మిగుల ప్రసిద్ధమైనది. ఇపు డాపట్టణమునందు ఇరువదియైదువేలమంది జనులైన లేరు. కాని పూర్వ మొకప్పుడు మూడులక్షలమందికి తక్కువకాకుండ నివసించుచుండిరి.

ఇప్పటికి రెండువేల రెండువందల సంవత్సరములకు పూర్వము ఆనగరమునందు 'ఆర్కిమెడీస్' అను పేరుగల మహనీయుడు నివసించుచుండెను. అతడు చాలసంపన్నుడు; బుద్ధిమంతుడు; ఆదేశము నేలుచుండిన 'హీరో' మహారాజునకు దగ్గర బంధువు. వావివరుసలకు వారు బావమఱదులు; గాఢస్నేహపాశబద్ధులు. మహారాజ కుమారుడగు 'గేలో' యను బాలుడు 'ఆర్కిమెడీస్'నకు ముఖ్యశిష్యుడు.

శ్రీమంతుడును, రాజబంధువునైన 'ఆర్కిమెడీస్' భోగపరాయణుడైన పక్షమున వేటలాడుచునో, వేడుకలు చూచుచునో, విహరించుచునో కాలముగడపి పేరు లేకుండ పోయియుండును. కాని అత డట్టివిలాసపురుషుడు కాడు. అతనిమనస్సు ప్రకృతియందును, సత్యమునందును లీనమైయుండెను. ప్రకృతికార్యములను పరిశీలించి, వాని విధానములను గమనించి, సత్యముల నారసి సూత్రీకరించుట యం దాతనికి ప్రీతి యత్యధికము. విశ్వమునం దెప్పు డెచ్చట నేమిజరిగినను అది యేదో యొకపద్ధతిని, నియామకమును అనుసరించి జరుగుననియును, ఆరహస్యము భేదించి యాపద్ధతిని తెలిసికొనిన పక్షమున ప్రకృతికి మనము దాసులముగాక యజమానులమై యేలవచ్చుననియు నాతడు విశ్వసించెను.

క్రీస్తుపూర్వము 287 సంవత్సరమునం దాతడు జననము నొందెను. అతనిబాల్యమునందు దేశములో ఘోర

యుద్ధములు జరుగుచుండెను. సారవంతమైన సిసిలీద్వీపము లోనికి మొదట గ్రీకులు వలసవచ్చిరి. వారిపై తమ యధికారము నెఱపవలెనని రోమనులు దండెత్తివచ్చిరి. ఆద్వీపము తమకు కావలెనని కార్తేజీనియనులు పోరాడ దొడగిరి. హీరోమహారాజు సమయానుకూలముగ రోమనులతో జేరి కార్తేజీనియనులను పరాజితులచేసి వెడల గొట్టెను.

పిమ్మట దేశమున శాంతి నిలిచెను. వర్తకవ్యాపారము లభివృద్ధిచెందెను. తొందరలులేక దేశాధిపుడు నెమ్మదిగా నేబదిసంవత్సరములు రాజ్యమేలెను. సిసిలీ ద్వీపవాసులు పెద్దపెద్దయోడ లనేకము తయారుచేసి, ఇటలీమొదలగు సమీపదేశములతోను, స్పెయిను మొదలగు దూరదేశములతోను వర్తకవ్యాపారములు సాగించి ధనికులగుచుండిరి.

ఆర్కిమెడీస్ విశేషకాలము నౌకాస్థానముల యందే గడపుచుండెను. అచట వడ్రంగులు, కమ్మరులు, లోనగు యాంత్రికుల పనిపాటులు దీక్షతోచూచుచు, వారికి తెలియని సులువులు చెప్పుచు నచటివారి నందరిని సంతోషాశ్చర్యపరవశుల చేయుచుండెను.

## మీట (LEVER)

నౌకాస్థానములో పదిమంది మనుష్యులైన కదల్పలేని పెద్దమ్రానులు, రాళ్లు, లోనగు గొప్పబరువులను నిడుపుగల యినుప గునపములతో నొకరిద్దరు మనుష్యులు మీటించి, పైకి తేల్చి సులువుగా దొర్లించుకొని పోవుచుండుట ఆర్కిమెడీస్ తఱుచుగా చూచుచుండెను. ఇట్టి గునపములతో మీటించినంతమాత్రముచేత పదిమంది మనుష్యులకు లేనిశక్తి ఒకనికెట్లు వచ్చెనని యాతడు యోజింప సాగెను. ఇందునుగూర్చి పెక్కుపరిశోధనలు చేసెను. ఎన్నోలెక్కలు కట్టెను. ఎత్తి తేల్చవలసిన బరువునకు గునపమానుకొనెడి యాధారము సమీపమై గునపపునిడుపు వృద్ధియైన కొలది సులువు అధికమగుచుండునని యాతడు తెలిసికొనెను. తగినంతపొడవును, మందమును, దార్ఢ్యమునుగల గునపమును, అది యానుటకొక తగిన యాధారమును, కావలసిన దూరమున నిలుపుటకు తగిన యవకాశమును ఉండినపక్షమున ఒక్కమనుష్యుడే భూగోళము నంతను అవలీలగ మీదకు మీటించివేయ గలడని యతడు గుణించి చూపెను.

## స్క్రూసాధనము (THE SCREW)

ఈ సాధనముచేత బరువులను అనాయాసముగా లాగవచ్చును. ఈ చమత్కారము ప్రత్యక్షముగా చూపుటకు అత డొకసారి సముద్రతీరమున నిసుకమీద పెద్ద దోనె నిలిపి, దానిమీద పూర్తిగా సరకు వేయించి, ఆపైని మనుష్యుల నెక్కించెను. పిమ్మట రాజసమ్ముఖమున నందరియెదుటను ఆదోనెను ఆర్కిమెడీస్ స్క్రూసాధనముచేత సులువుగా నీడ్పించివేసెను. ఇంత సరకును జనమును దోనెలోపలనున్నను, నీటిపై తేలి యానునట్లే దోనె ఇసుకపైగూడ సులభముగా సాగిపోవుట చూచి యెల్లరు నద్భుతపడి యతనిని ప్రశంసించిరి.

ఇట్టి స్క్రూసాధనముచేత పల్లమునుండి మెరకకు నీరుకూడ తోడవచ్చును.

## 'ఆర్కిమెడీస్'సూత్రము (PRINCIPLE OF ARCHIMEDES)

వీనియన్నిటికంటె ముఖ్యమైనదియు, భూమిమీద నీతనిపేరు శాశ్వతముగా నిలిపినదియునైన ముఖ్య సూత్రమొకటి గలదు. ఆసూత్రము నిర్వచింపక పూర్వము దానితో సంబంధించిన రమ్యకథయొకటి చెప్పవలసి యున్నది.

ఆద్వీపము నేలుచున్న హీరోమహారాజు తన యిష్టదైవమునకు బంగారముతో కిరీటముచేయించి సమర్పింతునని మ్రొక్కుకొనెను. మ్రొక్కుబడి తీర్చుకొనుటకు అతడు బంగారపు పనివానిని పిలిపించి తగినబంగారము తూచియిచ్చి కిరీటము చేయుమని సెలవిచ్చెను. మరికొన్నిదినములకు పనివాడు కిరీటమును తయారుచేసి తీసుకొనివచ్చెను. రాజు కిరీటమును తూపించి చూచుకొనెను. తూకము సరిపోయెను.

కాని పనివాడు కొంత బంగారము తస్కరించి, వెండికలిపి, మోసముచేసి కిరీటము తయారుచేసెనని

రాజునకు తెలియవచ్చెను. అతడు బహుయోగ్యుడు. తగినరాజువు దొరకినగాని పనివాడు దొంగయని నిర్ణయించు టెట్లు? ఏమిచేయుటకును తోచక దేశాధిపుడు ఆర్కిమెడీస్‌నకు కబురంపి పిలిపించి కిరీటమునుచూపి "ఇందులో బంగారమే ఉన్నదా? వెండి యేమైన కలితీ ఉన్నదా నిజము కనిపెట్టిచెప్పవలెను" అని నియమించెను.

ఆర్కిమెడీస్ కిరీటము నందుకొని బహువిధముల పరీక్షించిచూచెను. ఎత్తు, వన్నె సరిపోయిన ట్లగపడెను. నిజము కనిపెట్టుటకు సులభమైనమార్గము తెలియక అతడు బహుకాలము యోజించెను. తుదకు అతడు రెండుదిమ్మెలు తయారుచేయించెను. ఒకటి మేలిమి బంగారుదిమ్మె. రెండవది వెండిదిమ్మె. రెండును పొడుగు, వెడల్పు, మందము నను విషయములందు సరిసమానముగా నుండెను. తూచినపుడు వెండిదిమ్మెకంటె బంగారుదిమ్మె సుమారు రెండు రెట్లు ఎక్కువ తూగెను.

"ఇపుడీ కిరీటమును కరగించి దిమ్మెగా పోయించి దీని ఘనమానమెంతో నిర్ణయింతము. అంతేఘనమానము గల శుద్ధస్వర్ణమెంతతూగునో చూతము. రెండును ఒకటే అయినయెడల కలితీలేదు. లేనిపక్షమున కలితీ ఉన్నదని నిశ్చయింపవలెను." అని యతడొకప్పుడనుకొనెనుగాని ముద్దులు మూటగట్టుచు నెంతో సొగసుగానున్న యాకిరీటమును కరగించి చెడగొట్టుట కాతని మనసొప్పలేదు. వస్తువు కరగించి పాడుచేయక ఆలాగు ననే యుండనిచ్చి దొంగతనమును పట్టవలెనని యతడు నిశ్చయించుకొనెను. "ఈ కిరీటముయొక్క ఘనమానము (Volume) ఎంతో నిరూపింపగలిగిన పక్షమున కమసాలి ఏగాచేసినాడో లేదో సులభముగా తెలిసిపోవును. కిరీటము కరగించకుండ దానిఘనమానము నిరూపించు నుపాయముకనిపెట్టవలెను. అది యెట్లు సాధ్యపడును?" అని యతడు దేపనిగ యోజించుచుండెను.

అతడైదైనసమస్య నందుకొనినతరువాత దానిని పూర్తిచేసినదాక విడుచు స్వభావముగలవాడు కాడు. అతని ధ్యాన మన్యాయత్తముగాకుండ ఆసమస్యయందే నిమగ్నమై యుండెడిది. విఘ్నములేమైన రాజాచినను రానిచ్చువాడుకాడు. చేతితో చిన్నచీపురుపుల్లగాని, కొబ్బరియీనెగాని పట్టుకొని బూడిదలోనో యిసుకలోనో అంకెలువేయుచు, గీతలు గీయుచు నతడదేపనిగ లెక్కలు కట్టుచుండెను. అభ్యంగస్నానము చేయులోపున నూనెపట్టించిన కాలుచేతులమీద గోళ్లతో గీతలు గీచి గుణించుచుండెను.

ఒకనాడతడు వేరొకగృహమున స్నానము చేయుచుండగా మెఱపుమెఱసినట్లతని కొకయుపాయము స్ఫురించెను. ఆకాలములో నాదేశపు జనులు పెద్దగోలెములో నీళ్లుంచుకొని అందులోనే స్నానముచేయుట ఆచారమై యుండెను. గోలె మైదారడుగులు ఎత్తు గలిగి యుండెను. గోలెములో నీరధికమయినప్పుడు పొర్లిన నీరు గోలెము క్రింది తొట్టెలో పడుచుండెను.

ఆనాడు స్నానార్థమతడు వచ్చుసరికి గోలెము నిండ తొణుకును నీళ్లుండెను. అతడందులో దిగుచుండగా గోలెములోని నీరుపొర్లి క్రిందనున్న తొట్టెలో కొంతపడెను. తలనిండ మునిగి స్నానముచేసి యతడీవలకు వచ్చిచూడగా గోలెములో నీరుతగ్గి అంచులకు దిగువ కొంతలోతున నగపడెను. గోలెములో నీరుతగ్గియుండుటకు కారణమేమి? అతని శరీరమందులో ప్రవేశించి ఆస్థలము నందులో నున్న కొంతనీటిని పైకి నెట్టివేసినది. గోలెములో నప్పుడిక చోటులేక కొంతనీరు పైకిపోయినది. ఎంతనీరు పొరిపోయినది? అతనిశరీరమంత అనగా అతనిశరీరముయొక్క ఘనమానమెంత గలదో అంతే ఘనమానముగల నీరు క్రింది తొట్టెలోనికి తరుమగొట్టబడినది. తొట్టెలో పొర్లిపడిన నీటిమానమే అతని శరీరముయొక్క ఘనమానమని చెప్పవచ్చునుగదా! ఈలాగే కిరీటముయొక్క ఘనమానముకూడ సులభముగా నిర్ణయింపవచ్చునే! కరగించి దిమ్మెబోసి పాడుచేయ నక్కరలేదే!

ఈ కిరీటసమస్యపై కేంద్రీకరింపబడిన ధ్యానము గలవాడగుటచేత నామహాత్ముడు పైవిధమున నాలోచించుకొనుచు, బాహ్యప్రపంచమును మఱచి, తాను చేయుచున్న స్నానము మాటమఱచి యొడలు తుడుచుకొనుట మఱచి, తాను వివస్త్రుడను సంగతికూడ మఱచి

"తెలిసింది! తెలిసిందండోయ్! తెలిసిపోయింది! ఆసంగతి నాకింక బోధపడింది!" అని గావు కేకలు వేయుచు పిచ్చివానివలె నత డింటికి పరుగులెత్తెను.

ఇంటిలో నతడొకపాత్రనిండ నీరునింపి, రాజకిరీటమున కొక సన్ననిత్రాడుగట్టి యాపాత్రలో మెల్లగా దానిని జారవిడిచి నీటిలో పూర్తిగా ముంచి పైకెత్తెను. పాత్రలో నీరు తగ్గిఅంచుకుకొంత దిగువనుండెను. పిమ్మట కొలిచి కొంతనీరు పాత్రలోబోసి, అంచులవఱకు యథాప్రకారముగా నింపెను. మరల కొల్చిపోసిన నీరెంతో, పైకిపడిపోయిన నీరును అంతే. అనగా కిరీటముయొక్క ఘనమానమెంతో, అంతే ఘనమానముగల నీరుపోసి పాత్ర యెప్పటివలె నింపబడినది. ఇందువలన కిరీటముయొక్క ఘనమానము సులువుగా తేలినది.

పిమ్మట, ఈ కిరీటమంతే తూనికగల శుద్ధ సువర్ణమును, రజతమును తెప్పించి వేర్వేరుగా రెండు దిమ్మెలు పోయించెను. ఇట్లుచేయుటచేత సమానగరిమ గల వస్తువులు మూడు తయారయినవి. ౧. కిరీటము, ౨. బంగారు దిమ్మె, 3 వెండిదిమ్మె. ఆటు తరువాత నతడు తనజలపాత్రతెచ్చి వీటిని ఒకొక్కటిగా నందలి నీటిలో ముంచియెత్తి ఘనమానములు నిరూపించెను. మేలిమిబంగారుదిమ్మెయొక్క ఘనమానముకంటె వెండిదిమ్మె ఘనమానము సుమారు రెండు రెట్లుండెను. కిరీటముయొక్క ఘనమానమున్నో మేలిమిబంగారు దిమ్మె ఘనమానమునకంటె అధికము గాను, వెండిదిమ్మెఘనమానమునకు తక్కువగాను ఉండెను. ఇందువలన కిరీటము కేవలము మేలిమిబంగారము కాదనియు, అందుకొంత వెండికలగలుపు కలదనియు స్పష్టమయినది. కంసాలి దగాచేసినట్లు ఋజువైనది. కాని ఎంత తస్కరించినాడో స్పష్టముగా తెలియలేదు. అదిగూడ నిశ్చయింపవలెను గదా!

అదికూడ తేల్చుటకు అతడు వేర్వేరు పాళ్లలో వెండియు బంగారమునుకలిపి, యీకిరీటమంత తూనిక గల దిమ్మెలు అనేకముగా చేయించెను. పిదప నొకొక్క దిమ్మెకు త్రాడుగట్టి, తన జలపాత్రములో ముంచి యెత్తుచు, వాటివాటి ఘనమానములు కనుగొనుచువచ్చెను. తుదకు కిరీటమంత ఘనమానమేగల దిమ్మెయొకటి యతని చేతికివచ్చెను. ఆదిమ్మెలో వెండిబంగారము లేపాళ్లలో కలపబడినవో ఆపాళ్లలోనే కిరీటములో గూడ వెండిబంగారములు కలిపినట్లు తెల్లమయ్యెను.

ఇట్లా పరిశోధకుని బుద్ధికుశలతచేతను, నిరంతర పరిశ్రమచేతను బంగారపు పనివాడుచేసిన మోసమంతయు వెల్లడియయ్యెను. హీరోమహారాజు ఆమేధాశాలియొక్క సూక్ష్మబుద్ధిని, పరిశ్రమను మిగుల కొనియాడెను. పిమ్మట పనివానిని పిలిపించి యడుగగా వాడు తననేరము నొప్పుకొని తాను హరించిన బంగారము నిచ్చివేసి కొంతకాలము చెఱసాలలో శిక్ష ననుభవించెను.

అంతటితో తనకృషి విడువక ఆర్కిమెడీస్ ప్రకృతిరహస్యముల నింకను తెలిసికొనుటకు పెక్కు పదార్థములతో బహువిధపరిశోధనలు చేయుచునేయుండెను. కొన్నిటిని నీటిలో ముంచి తూచెను. పిమ్మట వెలుపలకు తీసి తూచెను. తూనికలో తప్పక భేదముగ పడుచువచ్చెను. పదార్థములు గాలిలో నెక్కువగాను, నీటిలో తక్కువగాను తూగుచుండుటకు కారణమేమయియుండును? నీటిలో తూనిక ఎంతతగ్గును? ఈసంగతుల సూత్రపద్ధతిని తెలుపలేమా? అని యోజించుచు నా మహానుభావుడు పెక్కు ప్రయోగములు చేసెను. ఆతని పరిశోధనల ఫలితములను చక్కగా ఋజువు చేయగల రెండు ప్రయోగముల నిట వర్ణించుచున్నాము.

ఈప్రక్క చిత్రములో:—

గొ—అనునది ఒక ఇత్తడిగొట్టము. చిన్నజంతికా గొట్టమువలె నున్నది. దానికి మీదను క్రిందను కూడ కొక్కెము లమర్చబడియున్నవి.

వ—అనునది ఇత్తడి వర్తులము (Cylinder). అనగా స్తంభమువలె గుండ్రముగానుండు గట్టికడ్డీముక్క. దీనికిని మీదిభాగమున కొక్కెము మనర్చబడియున్నది.

విశేషించి 'గొ' అను గొట్టములో 'వ' అను వర్తులము సరిగా పట్టిపోవును. గనుక గొట్టపులోపలి మానము (Internal volume) వర్తులపు పైమానమును

(External volume of the cylinder) ఒక్కటే యగును.




1=త్రా. (త్రాసు)
2=ము. (ముల్లు)
31=సి1. (కొక్కెము గల సిబ్బి)
32=సి2. (కొక్కెము లేని సిబ్బి)
4=గొ. (గొట్టము)
5=జ. (జలపాత్రము)
6=గుం. (గుండ్లు)

త్రాసు సిబ్బిలలో కొక్కెముగల-సి1 గుఱుతు గల-సిబ్బియడుగు కొక్కెమునకు-గొ-గొట్టముమీద నున్న కొక్కెముతగిలించవలెను. దానికి వర్తులపు కొక్కెము తగిలించవలెను. పిమ్మట త్రాసు రెండవ సిబ్బి—సి2—లో గుండ్లు వేసి గొట్టమును, వర్తులమును సరిగా తూచవలెను.

పిమ్మట 'జ' అను జలపాత్రను తెచ్చి వర్తులమొక్కటిమాత్రము పూర్తిగా నీటిలో మునిగియుండునట్లు గొట్టముదిగువ నుంచవలెను. ఇప్పుడేమి యగపడుచున్నది? మనము క్రొత్తగా గుండ్లువేయలేదు. రెండవతట్టు సిబ్బిలోనుండి ఏమియు తీసివేయలేదు. అయినను యీసిబ్బి-సి1—కొక్కెము గల్గి గొట్టము-వర్తులము తగిల్చిన సిబ్బి—గొట్టముతోను, వర్తులముతోనుగూడ మీదికి తేలిపోవుచున్నది? ఈ తట్టుబరువు తగ్గినట్లు కనబడుచున్నది. ఎంతతగ్గినది? అది తెలిసికొనుటకు మనము రెండవతట్టు సి2—సిబ్బిలో క్రొత్తగా గుండ్లువేయ నక్కరలేదు. ఈతట్టు సి1 సిబ్బిక్రిందనున్న కాళీగొట్టమునిండ నీళ్లుపోసి చూతము. ఇప్పుడో త్రాసు ముల్లు సరిగానున్నది. వర్తులమును నీటిలో పూర్తిగా ముంచి తూచినపుడు దాని బరువుతగ్గినది. దానిపరిమాణముగల నీరు దాని మీది కాళీగొట్టములో పోసినపుడు తూనిక సరిపోవుచున్నది.

ఇందువలన నేమి తేలుచున్నదనగా:—ఏదైన ఒక వస్తువును నీటిలో ముంచి తూచిన పక్షమున దానిబరువు కొంతతగ్గును. ఎంతతగ్గుననగా దాని పరిమాణముగల నీటి బరువు మేరకు తగ్గును. ఇదే ఆర్కిమెడీస్ సూత్రము. "ఏదేనియొక వస్తువును నీటిలో ముంచి తూచినపుడు, ఆవస్తువుతో సరిమానము గల నీటిబరువు మేరకు ఆవస్తువు బరువుతగ్గును." నీటిలో మునిగెడి పదార్థముల సంగతి పైనిచూచినాము. నీటిలో తేలెడి పదార్థముల సంగతి పరిశీలింతము.




4=జ—అనునది యొక జలపాత్ర. దానికి మీదిభాగమున జారీగొమ్మవంటి '2=కొ' అను కొమ్ము ఉన్నది. ఈ కొమ్ము నుండి నీరు వచ్చునపుడు క్రింద పడిపోకుండ పట్టియుంచుటకు '3=చి' అను చిన్నపాత్ర యొకటి ప్రక్కనే ఉన్నది.

1=క—అనునది కఱ్ఱ లేక కొయ్యముక్క.

'జ' అను జలపాత్రలో కొమ్మువఱకు నీళ్లుపోయవలెను. మరియొక్క చుక్కపడిన పక్షమున కొమ్ము వెంబడిని పైకిపోవునంతవఱకుపాత్రనిండ నీళ్లుపోయవలెను. పిమ్మట జలసహితముగా పెద్దపాత్రను సరిగా తూచి ఆ తూనికను వ్రాసియుంచుకోవలెను. తరువాత చిన్న పాత్రను కొమ్ముక్రింద నుంచవలెను.

ఆవెనుక 'క' అనుకఱ్ఱ లేక కొయ్య ముక్కను పెద్దపాత్రలోని నీటిలో వదలవలెను. ఆక్షణమందే జలపాత్రలోని నీరు కొంతపొర్లి కొమ్మువెంబడిని చిన్న పాత్రలో బడును.

ఇపుడు కఱ్ఱముక్కతోకూడ జలపాత్రను మరియొకమారు తూచిచూడవలెను. మొదటి తూనికకును రెండవ తూనికకును వ్యత్యాసమేమియు నగపడదు.

జలపాత్రలో క్రొత్తగా కట్టెముక్కను పడవేసినాము. అందువలన పాత్రలో నీరు కొంత పైకివెడలి గొమ్ము ద్వారా చిన్నపాత్రలో పడినది. అయినను తూనికలో భేదములేదు. అనగా కొయ్యముక్క ఎంత తూగునో, దానివలన పైకి నెట్టివేయబడిన నీరుకూడ అంతేతూగును. ఇందువలన మనము నేర్చుకొనవలసిన దేమనగా:—ఏదైన నొకవస్తువు నీటిలో తేలినపు డది తనయంత బరువుగల నీటినే పైకి నెట్టును.

‘ఫిజిక్సు’ (Physics) అనబడు పదార్థవిజ్ఞానశాస్త్రములో జలాదిద్రవపదార్థధర్మములను వివరించు సందర్భమున నీసూత్రముయొక్క ప్రాముఖ్యము వివరముగా తెలుపబడును. భూమ్యాకర్షణముచేత వస్తువులకు గరిమ లేక బరువు ఏర్పడును. ద్రవపదార్థములందలి యణువులు గలిగించెడి యూర్ధ్వపు టొత్తిడిచేత అందు బడిన వస్తువులు బరువుతగ్గి మీదకి తేలజూచుచుండును. ఒత్తిడి బలమెక్కువై వస్తువుబరువు తక్కువయినపుడు అది మీదకి తేలిపోవును. బరువెక్కువై, ఒత్తిడిబలము తగ్గినపు డది మునుగును. ద్రవపదార్థముల శక్తులనుగూర్చి యతడొక గొప్పగ్రంథము వ్రాసెను.

ఆర్కిమెడీస్ ఇంకను అనేకప్రయోగములు చేసి గోళవర్తులములకు గల ఘనమానసంబంధము నిరూపించెను. ఏదేని యొకగోళమును అనగా బంతివంటి గుండ్రని పదార్థమును గైకొని దానిఘనమానమును తెలిసికొని, ఆగోళమంత వ్యాసమేగల వర్తులపాత్రను, అంతే యెత్తుగల దానిని, ఖాళీగానున్న దానిని గైకొని దానిలోపలి ఘనమానమునుకూడ నిర్ధారణచేసినపక్షమున పాత్రఘనమానములో గోళఘనమానము మూడింట రెండుపాళ్లుండునని స్పష్టముకాగలదు.

## సైరాక్యూజు ముట్టడి:
## ఆర్కిమెడీస్ నగరసంరక్షకు డగుట

సిసిలీద్వీపమునకు తొలుత గ్రీకులు వలసవచ్చి సముద్రతీరమున సైరాక్యూజునగరము కట్టిరని పైని చెప్పియుంటిమి. కావున నీపురమున్నప్పుడు గ్రీకులే అధిక సంఖ్యాకులై యుండిరి. ఇటీవల హీరోమహారాజుగారి సర్వసేనలకు ‘హిపొక్రేటస్’ అను గ్రీకుయోధుడు అధిపతియై యుండెను. వీరికి కార్థేజీనియనులపై నభిమానమును, రోమనులపై ప్రబలవిద్వేషమును కల్గియుండెను. ఒకప్పు డీ గ్రీకుయోధుడు రోమనుసేనాపతియైన ‘మార్సెలస్’ అను వీరవరునిపై కొన్ని యసత్యప్రకటనములు గావించెను. ఆవార్తలబద్ధములని మార్సెలస్ ఎంతచెప్పినను వినువారు లేకుండిరి. అందుకు మార్సెలస్ మిక్కిలి కోపించి సైరాక్యూజుప్రజలకు గట్టిగా బుద్ధిచెప్ప నిశ్చయించెను. ఆనగరమును అనేకతెరలలో చెక్కవలె నొక్కి ముక్కలు చేయదలచి రోమనుసేనాపతి, సముద్రము మీద నౌకలతోను, భూమిమీద సేనలతోను ఏకకాలమున ముట్టడివేయుటకు ప్రబలసన్నాహములు చేసెను. పెద్దనౌకల నెనిమిదింటిని చేర్చి కట్టించి వాటిమీద విశాలమైన వేదికయొకటి నిర్మించి, దానిపై వీణయాకారముగల గొప్పయంత్రసాధనము నత డమర్పించెను. ఈవీణాయంత్రముచే సైరాక్యూజుకోటమీద శరవర్షము గురియించి ధ్వంసముచేసెదనని ప్రగల్భములు ప్రకటించుచు నరువది నౌకలుగల ప్రబలదళమును తాను స్వయముగా నడిపించుకొనివచ్చి యొకప్రక్క సముద్రముమీదనుండి రోమనుసేనాపతి యాపురమును ముట్టడించెను. అటుభూమిమీదనన్నో ‘అప్పియస్’ అను రోమనుయోధుడు గొప్పకాల్బలములను, అశ్వికదళములను నడిపించుకొని వచ్చి యాపురము రెండవప్రక్కను ముట్టడించెను.

ఇవ్విధమున ప్రచండనౌకాబలముతో మార్సెలస్ ఒకప్రక్కను మహానీకవీరభటవిరాజితమైన సేనతో అప్పియస్ రెండవప్రక్కను మహోత్సాహముతో విడిసి సైరాక్యూజు పౌరులకు మహాభయము గలిగించిరి. ఆయార్భాటముచూచి హీరోమహారాజు కలగినమదితో కర్తవ్యము నిశ్చయింపనేరక ఆర్కిమెడీస్నకు కబురంపి, పిలిపించి “ఈనగరము రక్షించుభారము నీది. నీ మేధాసంపత్తి, నీగణితశాస్త్రవిజ్ఞానము ఇప్పుడుకదా లోకమునకు తెలియవలసిన తరుణము. మమ్మును నీనగరమును నీవే రక్షించుకోవలెను. నీయంత్రసాధనములచేత నీభూమండలమును నీవొక్కడవే మాటింపవచ్చునని చెప్పితివి. ఈశత్రుసేనలు నీకొకలెక్కయా? గుడిమ్రింగు వానికి

లింగ మెంత?" అనుచు నగరసంరక్షణభారమంతయు మహారాజా యంత్రజ్ఞునిమీద విడిచిపెట్టెను. పురవాసు లందరును అతడు చెప్పిన పనులు శిరసావహించి చేయ వలయునని కూడ శాసించెను.

సైరాక్యూజు నగరమందలి నౌకాశ్రయములో నిర్భయముగా నిలిచిన శత్రునౌకల వైఖరి యంత్రజ్ఞు డార్కిమెడీస్ జాగ్రత్తగా పరిశీలించెను. అటు భూమి మీద నిలిచిన శత్రుసేనల సంగతులన్నియు కూడ నతడు గమనించెను. వాటిని విధ్వంసముచేయగల మీటలు, కొక్కెములు, కప్పీలు, వడిసెలు, మొదలగు సాధనము లనేకములు కల్పించి నగరసంరక్షణకువలయు సన్నాహములు పూర్తిచేసెను.

యుద్ధమారంభమైనది. వీణాయంత్రమునుండి రోమనులు కోటపై శరవర్షము కురిపించిరి. ఆర్కిమెడీస్ తాను తయారుచేసియుంచిన యొకయంత్రమునకు నిటు త్రిప్పెను. అంతలో నోహో! ఆశ్చర్యమేమని చెప్పవచ్చును? పదిపుట్లు భారముగల మహాశిలయొకటి యఖండవేగముతో నావీణాయంత్రముపై గుభాలుమని వచ్చిపడెను. మరియొక్క నిముషములో నంతరాయి మఱియొకటివచ్చి పిడుగులాగున పడెను. ఇంకొకటి, వేరొకటి పిడుగులవలె గుభిల్లుగభిల్లుమని వచ్చి పడిపోవుచుండెను. ఎడములేకుండ గండశిలలీరీతిని మహాధ్వనితో శతఘ్నులట్లు పడుచుండ వీణాయంత్రము, యంత్రవేదిక, నౌకలెనిమిదియు సమూలముగ కుండపెంకులలాగున ముక్కముక్కలయి స్వరూపనాశనమయిపోయెను. ఏసన్నాగముచేత మార్సెలస్ సేనాపతి సైరాక్యూజుదుర్గము నవలీలగ వశముచేసుకొందునను నుత్సాహముతో నుండెనో, ఆ యంత్రరాజము రెండు గడియలలో తుత్తుమురై రూపుమాసిపోయెను. ఇదేమిచిత్రమని రోమనుసేనాపతి యక్కజపడి చూచుచుండగా నంతలో నద్భుతమైన కొక్కెమొకటి రాక్షసిలాగున ప్రచండబలవేగములతో నాకాశమార్గమున వచ్చి గ్రద్ద కోడిపిల్లను తన్నుకొనిపోయినట్లు ఒక నౌకను పొదివిగ్రుచ్చిపట్టి యంతరాళమున కెత్తి యటునిటు నూగించి అందలి నావికుల ప్రాణము లక్కడనే యెగిరిపోవునట్లు ఆకాశముమీదనుండి యెత్తికొట్టెను. ఆదెబ్బతో నౌకపట్లును, అతుకులును సడలిపోయి సముద్రమున బడిమునుగుచు తేలుచు ముక్కలు చెక్కలునై పోయెను. అంతలో మరియొక కొక్కెమిట్టె బయల్పడి వేరొకనౌకను పొదివిపట్టి పైకెత్తి యూపి యాడించి ఘూర్ణించి దూరముగా విసరివైచెను. ఆనౌక సమీపపర్వతసీమపై నెక్కడనోపడి ధ్వంసమయ్యెను. "ఇట్టివింత లెప్పుడును కనివినియెఱుగము. ఏమి యీచిత్ర"మని మార్సెలస్ దిగ్భ్రమచెంది ఆత్మరక్షణార్థము నౌకలను దూరముగా గొనిపొండని యాజ్ఞాపించెను.

నావికులు నౌకల లంగరులెత్తి దూరముగ నడిపింప జొచ్చిరి. అయినను శిలాపాతభయము తప్పకుండెను

అటు భూమిప్రక్క విడిసిన సేనకూడ జాలవానచే నుగ్గునూచనుగుచుండెను. ఆసేనకూడ దూరము పోవలయునని సేనాపతి యాజ్ఞాపించెను. దూరముగా తొలగిపోవుచున్నను శిలాపాతభయము మాత్రము తగ్గలేదు. కోటలోపలినుండి యొక త్రాడుగాని, వెదురుగడకాని, కొయ్యకాని పైకగపడుసరికి రోమను సైనికుల గుండెలు పీచుపీచుమను చుండెను. అట్టి దేదైన కంటపడుసరికి "అమ్మయో! చచ్చినాము! అదేవో మఱొకసన్నాగము! మా ప్రాణములమీది! దయ్యములాగున వచ్చి పడుచున్నది" అనుకొనుచు రోమనులు పఱిపోవుచుండిరి.

అపుడు మార్సెలస్ సేనాపతి కొందఱు యోధులతో మంత్రాలోచనచేసెను. సేనలు దూరముగాపోవుచున్నను, కోటలోపలి యంత్రజాలము అందుకుతగినట్లే నడుపబడు చున్నందున సేనలున్నచోటనే జాలవాన గురియుచుండెను. డేగలవలె కొక్కెములిట్లె బయల్పడి నౌకల నవలీలగ తన్నుకొని పోవుచునే యుండెను. ఇట్టి యంత్రములు దూరమున కనుకూలించును గాని దగ్గరనుండు సేనలను కారింపజాలవు. "కావున మనము కోటగోడలపైబడి లగ్గలుపట్టుదము" అని రోమనుయోధులు నిశ్చయించుకొనిరి. పిమ్మట నొకనాటి రాత్రి యాప్రకారమే వచ్చి కోటగోడలపై పడిరి.

ఆర్కిమెడీసున కింతమాత్రము తెలియకపోలేదు. రోమనుల యుక్తులకు తగినట్లే అతని యంత్రజాలము

నడువజొచ్చెను. శిలావర్షము మరింత తీవ్రమయ్యెను. రోమను సైనికుల తలలు పగిలి నెత్తురుకాలువలై పారుచుండెను. గింజుకొనుటకైన నెడములేకుండ రోమను యోధులు తారున చచ్చుచుండిరి.

మఱియొక విశేషము. కోటగోడలో పైకి కానరాని చిన్న చిన్న రంధ్రము లనేకములుండెను. ఈ రంధ్రములనుండి ఎఱ్ఱతేళ్ల వంటి కుఱుచతూపులు వేలకొలది దారుణముగా వెడలి రోమనుసేనలను నేలకూలగొలకు తెచ్చుచుండెను. ఈ ములుకులు గ్రుచ్చుకొని చావక మిగిలినవారు మిక్కిలి యాతనపడుచు "అబ్బబ్బ! ఎఱ్ఱతేళ్లవలె నీబాణములు మాప్రాణముల కెక్కడ దాపురించినవో! దేవుడా!" అని యేడ్చుచుండిరి. ఈ "యెఱ్ఱతేళ్ల" బాధలకోర్వక, సమీపమున నిలువజాలకను రోమనుసేనలు కోటలగ్గలు పట్టు ప్రయత్నము చాలించి దూరముగా పోవలసివచ్చెను.

అటు రోమనునౌకలపై మహాశిలలు పిడుగులకంటె బెడిదములై పడి తుత్తుమురు చేయుచువచ్చెను. రాకాసులవంటి కొక్కెములు నౌకల నవలీలగ బట్టి బంతులలాగున నెగురవైచుచు నాటలాడుచుండ దానికి ప్రతివిధానమెఱుగకను, కర్తవ్యముతోచకను, రోమనులు ఇంద్రజిత్తుని యుద్ధమునాటి రామసైనికులవలె తడబడుచు ధైర్యము గోల్పోవుచుండిరి ఆర్కిమెడీస్‌తో యుద్ధము చేయుటయని వారలకెవ్వరికి తోచకుండెను. దేవతలతోనో, రాక్షసులతోనో, పిశాచములతోనో వారికి యుద్ధము పొసగినట్లుండెను.

"అమానుషశక్తి సంపన్నుడైన యీశాస్త్రజ్ఞుని పోరిలో సాధించుట సాధ్యమా? అబ్బబ్బ! ఎంతవాడు ఆర్కిమెడీస్? దేవాంతకుడు! కమ్మగా తిని, కడుపులో చల్లకదలకుండ నీడపట్టున కుర్చీమీద కూర్చొని లెక్కలుకట్టుచు, నీయంత్రభూతములను పుట్టించి మనమీద ప్రయోగముచేయుచున్నాడు! అవి మనలను మట్టిమల్లాడి పీకికొని తినుచున్నవి! మృత్యుదేవత తలవిరియబోసుకొని మనసేనలపై తాండవమాడుచున్నది! వీని యంత్రప్రజ్ఞ మనకొంప తీయుచున్నది! ఏమియు చేతగాక మనము చేతులు నులుపుకొనుచు నూరక చూచుచు నుండవలసినదేనా? కానిమ్ము, ఘాతము. ఇట్టినగరమును ఎంతకాల మీతడొక్కడును సంరక్షింపగలడు?" అని వితర్కించుచు మార్సెలస్ సేనాని తన నౌకలను సేనలను బహుదూరము గొనిపోయెను గాని ముట్టడిమాత్రము మానలేదు.

ఒకటి రెండు మూడు సంవత్సరము లిట్లు గడచెను. రోమనులకును సైరాక్యూజు యోధులకును మధ్యమధ్య చిన్న పోరాటములు మాత్రము జరుగుచుండెను. ఒకనాడు కొందరు రోమనుయోధులు సైరాక్యూజు యోధులతో పోరి పరాజితులై పట్టుపడిరి. వారిని కోటలోనికి ఖయిదీలుగ తీసుకొనివెళ్లగా మార్సెలస్ సేనాని విశేషధన మిచ్చి తన యోధులను విడిపించి తెచ్చుకొనెను. ఖయిదీలవలన కోటరహస్యములు కొన్ని రోమను సేనాపతులకు తెలియవచ్చెను. ఒక బురుజులో శత్రుసేనలు అనాయాసముగా ప్రవేశించుటకు వీలుకలదను వార్తనీ రోమనుసేనలకు తెలిసినది.

పిమ్మట నొకనాడు సైరాక్యూజు పురవాసులు నగరములో గొప్ప యుత్సవముచేసుకొని ఇష్టమృష్టాన్నము లారగించి మధురాసవము కుత్తుకబంటి త్రాగి మైకముచేత నొడళ్లు మఱచి హాయిగా నిద్రించుచుండిరి. యంత్రపాలకులు, ద్వారపాలకులు—వీరువారననేల? ఎల్లవారు తెగత్రాగి యదేపనిగ నిద్రపోవుచుండిరి. గస్తీవాండ్రు కూడ తప్పత్రాగి పడిరి. నాటిరాత్రి ఆర్కిమెడీస్ పట్టుపడలించుకొని సైరాక్యూజునగరము మద్యదేవత పరశమైనది. ఆరాత్రి కల్లుసముద్రము గట్లుతెగి సైరాక్యూజుపురమును ముంచివేసినది. ఈ యుప్పెనలో నంతయు మునిగిపోయినది.

ఆర్కిమెడీస్ ప్రభావమున కతీతమైనది మద్యప్రభావము. దానియెదుట నిలువగలిగిన సామర్థ్యము మరిదేనికున్నది? ఈ సంగతి కనిపెట్టినాడు మార్సెలస్. ఇక చెప్పుట కేమున్నది. ఇదే మంచి సమయ మనుకున్నాడు. చీమచిటుకుమనకుండ చేనెత్తురుగాకుండ సేనలతో నతడు చల్లగా కోటలో జొరబడినాడు. చెదలపుట్టవలె నెక్కడచూచినను తామెయై రోమనుసైనికు లాపురము నాక్రమించివేసిరి.

కల్లుఁడు ప్పైనలో పడి కొట్టుకొనిపోలేదు ఆర్కి-మెడీస్. ఏదో సమస్యనుగూర్చి యేకాగ్రచిత్తుడై తీవ్రముగా యోజించుచున్నాడు. అప్పుడీకలకు రోమనుభటు డా యింట ప్రవేశించినాడు. 'ఎవరునీ'వని వాడు ప్రశ్నచేసినాడు. "ఉండు-చెప్తానా. ఈ లెక్క తేలనీ" అన్నా



డు ఆర్కిమెడీస్. "అబ్బో నీకింత గీర్వాణమా?" అనుచు నామూర్ఖభటుడు తక్షణమాతనిని చంపెను.

ఉగ్రమేధావి ఆర్కిమెడీస్. ఇంకను బ్రతికి యున్నయెడల తనగుట్టు బట్టబయలుచేయక మానడని భయపడి ప్రకృతిదేవత యామూర్ఖభటు నీతని చంప బంపినదికావలయును. కాకున్న నామహాత్ముని కిట్టి దుర్మరణము ప్రాప్తించుటకు హేతువేమి?

ఈమేధావికొఱకు పురమంతయు వెతికించుచున్నాడు రోమనుసేనాపతి. ఈ దుర్మరణవార్త విని మిగుల పరితపించినాడు. ఇతనియెడ తనకుగల గౌరవాధిక్యముచేత నీతని కుటుంబస్థులకును, బంధువులకును, వారి యాస్తులకును ఏమియపాయము చేయకూడదని భటులకు సుగ్రీవాజ్ఞ కావించినాడు. నగరసమీపమునం దతని శరీరము భూస్థాపితము గావించి సమాధి గట్టించిరి. దాని మీద స్మారకచిహ్నముగా నొకవర్తులపాత్రమును అందులో సరిగాపట్టినగోళమును ప్రతిష్ఠించిరి. ఇట్టివర్తులపు ఘనమానములో నిట్టిగోళపు ఘనమానము మూడింట రెండు పాళ్లుండునని తనసామర్థ్యముచేత నింతకుముందే నిరూపించిన గణకశిరోమణికి-గణితశాస్త్ర విషయముల ప్రయోగించి ప్రకృతి ధర్మరహస్యముల నెన్నిటినో భేదించిన యీమహామేధావి కీస్మారకచిహ్నము ప్రతిష్ఠించుట మిగుల సమంజసమేకదా!

---

## చాటుపద్యములు

కొత్తపల్లి సూర్యరావుగారు

కనుఁగీట న్మెఱపం జిటుక్కుమనవో కాలంబులోఁ జూచిన
న్వినిన న్ధ్యానము చేసిన న్ధనము సంవిద్రూపముం బుట్టెడున్
మునుముందు న్వెనువెంటఁ గాంతు యదివో మోసంబు గావించు నె
మ్మనము న్మిత్రమ! కాంతులో మనము లో మర్మంబు యోజింపుమా.

పికమ నిరర్థకంబులగు పెక్కుకలస్వనముల్ వచింతు వో
పిక నొక రెండుమాసములు ప్రేయసికై యవి యర్థవంతమై
సకలఋతు ప్రపూర్ణముగ సాగున వైనను మాటకారివై
కక వికలండె దిట్టె కలకాలము వర్ధిల మాటరాదుసూ.

అదియొక పెద్దగాదు పలుకాడఁగ నేర్పుట మాటమాత్రలోఁ
గుదురును గాని నిగ్గనినఁ గోయని మారుఁడు మేనుపూనఁడే;
విదురుఁడు విల్లుపట్టుగతి విశ్వము నింతకు మించియేఁచు, వ
ల్వదు మిము మీయథాస్థితుల వర్ధిలఁజూచుటె మాకు శ్రేయమౌ.

వేసవి నాసచేతఁ దన వేయికరంబులఁ బీల్చి పిప్పిగాఁ
జేసి గ్రహించి సారమును జిత్రకరుం డిమిడించుకోఁగలే
కాసవపాయిరీతిఁ బదియంతలు గ్రక్కెడు భద్ర మాఫ్తుఁడా
త్రాసునఁ దూఁచినట్టులు మితంబుగఁ దించును మేనుఁ బెంచుమా.

చల్లనిరసంబు గొంచు నుష్ణకరుఁడయ్యె-భానుఁడతితాపహారియై పద్మవైరి
శీతకరుఁడయ్యె బేరువాసి యదియంతె-గాని తత్త్వంబులో మార్పుగలుగలేదు.

చదువఁగలేదొ శాస్త్రములు చల్పఁగలేదొ మహార్థభాష్యముం
గుదుఁరుపలేదొ దుష్కవుల కుత్సితగర్వము షణ్మతంబులన్
మొదలకయుండఁ గట్టి బలిమి న్నిలుపండె స్వభావపద్ధతి
న్మొదటియతీంద్రుడు శంకరునిఁ బూర్వకవు ల్నుతియింప రేలొకో.

ఆదిమభాష్యకారుఁడును నాదిగురుండును నాది శంకరుం
డాదిమషణ్మతోద్ధరణహారికువాదమదేభసింహ మా
యాదికపీంద్రతుల్యుఁడును నద్వయవాదియు నట్టివాని గ్రం
థాదిని బేరుకోరు కవు లచ్చెరువయ్యెడు నింతకాలమున్.

ఇది యద్వైతులలోననె-మొదలిటినుండియును లోపముగ నున్నది కూ
డదు గురు వందన నిస్పృహ-మదిమెంతటి కావ్యమైన నలగొఱఁతయగున్.

భక్తిప్రపత్తులాతని-సూక్తంబులఁ బొడముసెట్టి శూన్యున కైనన్
వాక్తరుణీమణి యాతని-వ్యక్తప్రతిభాన్వితుని నవశ్యము చేయున్.

భావశబలత

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరాయఁడు

జన్మమున ఆరాధ్యుఁడు; కర్మమున వైశ్యుఁడు. బ్రాహ్మణహృదయము-క్షత్త్రియవాక్కు. వ్యవసాయమునఁ గర్షకుఁడు. సంఘసేవయందుఁ గింకరుఁడు. ఆంధ్రవాఙ్మయమునఁ గృషి చేసినాఁడు. ఆంగ్లముఁ జదివినాఁడు. సంస్కృతము నభ్యసించినాఁడు. నాట్యరంగమున విహరించినాఁడు. వర్తకసరళిలో పాండిత్యము కుదిరినది. అహంతతో, ఆడంబరముతో, పటాటోపముతో పరిభవముతో, ధనసమార్జనతృష్ణతో, దర్పముతో జీవనమునందలి ప్రథమపాదము ప్రారంభమైనది. తానే లోకమనుకున్నాఁడు.



శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు

దృష్టాదృష్టములకుఁ బెనఁగులాట పొసఁగినది. నాగేశ్వరరాయని దైవము బొంబాయి చేర్చినది. కాలము పరిపాకము చెందినది. దృష్టము మఱుఁగైనది. అదృష్టరేఖ మొలచినది. ఆ మొలకయే "అమృతాంజనము". దాన "ఆంధ్రపత్రిక" ప్రభవించినది. అంజనముతో "ఆంధ్ర" పందెమువేసి పరువిడినది. అంజనము సాగరములను లంఘించి ఖండాంతరముల విహరించినది. "ఆంధ్ర" తెలుఁగుసీమ వదలలేక పామరత్వమునఁ బ్రాఁకులాడుచున్నది. అంజనమున కున్న చుఱుకు "ఆంధ్ర"కెక్కడిది? దానికి గుణము ప్రధానము; దీనికి భాషయే ప్రధానము. దానికి పైసా సంపాదనము పరమోద్దేశ్యము; దీనికి జన్మదేశసమారాధనము పరాకాష్ఠ. నేఁడు అంజనము నెఱుఁగని మానవమాత్రుఁడు లేఁడు. దానికిఁ బ్రచారములేని ప్రదేశము లేదు. "ఆంధ్ర"నెఱుఁగని ఆంధ్రుఁడు లేఁడు. దానినిఁ జేబట్టనివాఁడఖండు రాస్యుఁడగు నాంధ్రుఁడు గాఁడు. ఈ యుభయమునకు రెండుపుష్కరములు గడచినవి.

అంజనము నాగేశ్వరరాయని ఖ్యాతికిఁ గారణమా?— నాగేశ్వరుని కృషి అంజన వ్యాప్తికిఁ గారణమా? — సమాధానము ఆయనగ్రహచక్రము చెప్పఁగలదు.

నూనూగుమీసాల నూత్నయౌవనమున బొంబాయి కేఁగిన నాగేశ్వరుఁడు పలితశిరస్కుఁడై పట్నము చేరినాఁడు. ఆయన ఆంధ్రపత్రికాకార్యస్థానము 'ముసాఫర్ ఖానా' యైనది. దానధార జాల్కొన్నది; వఱదలు గట్టినది; వట్టోడినది. కులగోత్రము లడుగలేదు. 'విద్యార్థిని', 'బీదను' అని చెవినిఁబడిన తక్షణము నెలచందా మంజూరు చేసినాఁడు.

అన్నదానసమాజములకే కాదు, ఆంధ్రగ్రంథాలయములకే కాదు, గోరక్షణశాలలకే కాదు, ఘోషాఆసుపత్రులకే కాదు, పండితసత్కారములకే కాదు, పాఠశాలలకే కాదు, అనాథశరణాలయములకే కాదు, ఆగంతుకయాచకులకే కాదు, సప్తాహములకే కాదు, సవనతంత్రములకే కాదు, నాట్యసమాజములకే కాదు, నవీనగ్రంథకర్తలకే కాదు, తాత్కాలికోద్రిక్తపత్త్రికాసంపాదకులకే కాదు, తాలింఖానాలకే కాదు- గుళ్లకు, గోపురాలకు, పెండ్లిండ్లకు ప్రయాణపు ఖర్చులకు, నియోగపు బిచ్చగాండ్రకు, నిరంతరఋణయాచకులకు, పండితులకు పరమశుంఠలకు, వేదాంతులకు, వెకలిసన్నాసులకు, సోమరిపోతులకు, పోఁదాలకు, ఒకరికేమిటి?—అడిగినవానికి లే దనలేదు; ఆదరించి వానినిఁ బొమ్మనలేదు. వివేకములేదు, వినియోగముం గూర్చిన ప్రశ్న లేదు. క్రెస్సెనోటుకు లేని చెల్లుబడి "కా-నా" చీటీకిఁ గలిగినది. ఆయనకు విశ్వాసపాత్రములు గాని వారు కొలఁదిమంది. ఆయనను వంచింపనివారును కొలఁదిమందియే. కన్నపుదొంగలకు ఖజానా అప్పగించి కార్బారు సాగించునేర్పరి. దానమాయనకు నిత్యవినోదము; ఉపకారమాతని కొకవిలాసము. దాక్షిణ్యమునకుఁ బెట్టినది పేరు. మోమోడని గడియయుండదు. వేసరుకపడని క్షణ ముండదు. ఈగిపట్టున పరేంగితజ్ఞత పరారీ చిత్తగింపవలసినదే. అధికారానధికారతారతమ్యమునకుఁ జోటుండదు. ఆవితరణశీలమునకు మహారాజులుగూడ కనుబొమ లెగరవేసినారు. ఆవినయసంపత్తికి ఆత్మద్రష్టలు సైతము వెఱగందినారు. లౌకికమున అలౌకికుఁడు; కార్యసాధనమున కాముకుఁడు; రక్తిననుభోగించిన విరక్తుఁడు; లాలసత్వమున పద్మస్థాయినందిన నిర్లిప్తుఁడు; వదాన్యతయందు వర్తకుఁడు. ఆంధ్రదేశమందలి ప్రజాహితకరోద్యమముల నన్నింటి నొక్కమాఱుగ నాపోశనము బట్టనుంకించు నగస్త్యుఁడు. వినయమున విజృంభణము చూపినాఁడు; తలఁచినదానినిఁ దలపెట్టినాఁడు, తలపెట్టిన వానినిఁ బెక్కంటిని సాధించినాఁడు. "భారతి"నిఁ బ్రతిష్ఠించినాఁడు; "ఆంధ్రవిజ్ఞానసర్వస్వము"నకుఁ బ్రాపాసఁగినాఁడు. ఆయన అగ్రాసనాధిపత్యము వహించి సభలు నిర్వహింపని ఆంధ్రసంస్థ లింకను కడమ యున్నవా? ఊరేఁగినాఁడు, పట్టమేఁగినాఁడు, లోకమేఁగినాఁడు, తెలుఁగునాఁట మ్రోఁగినాఁడు.

భక్తికి మిగిలిన రక్తి, రక్తికి మించిన యుక్తి, యుక్తిని నిర్వహింపఁగల శక్తి— ప్రకటించినాఁడు.

* * * *

లోకమునఁ దన్నుఁ గాంచినాఁడు. "భగవద్గీత"ను ప్రమాణముగ వరించినాఁడు. కర్మయోగముతో జ్ఞానయోగమును మేళవించి పారాయణము చేసినాఁడు. నిరాడంబరుఁడైనాఁడు. నైతికమున ధార్మికత్వము దర్శించినాఁడు. కారాగారవాసమునఁ గర్మయోగమునకు శాంతిచేసినాఁడు; జ్ఞానయోగమునకు మంగళాచరణము చేసినాఁడు;—అనుష్ఠాత యయినాడు.

* * * *

ఆతని ఆర్జనము లోకముకొఱకు; ఆతని జీవనము పరహితార్థము. ఆయన దాతృత్వము 'ఓ' యని పలుకని ఆంధ్రదేశస్థధార్మికప్రతిష్ఠాపనము లెన్ని యున్నవి? 'కా-నా' ఉపకృతి ప్రతిఫలింపని బీదవిద్యార్థుల ముఖము లెన్ని గలవు? ఆతని సార్థకసమ్మానమును గీర్తింపని గ్రంథములు నేఁడెన్ని యుండును? ఆర్జనమును మిగిలిన దానములు చేసినాఁడు. కోట్లుగడించినాఁడు; కొల్లలిచ్చినాఁడు; సాంఖ్యయోగజిజ్ఞాసలోఁబడని సన్యాసి యైనాఁడు. శేషించినది? అజరామరమైన విఖ్యాతి. తన దాన మంతయు సంగీతమువలె సద్యఃఫలకారియైనది. ఆ దాన మహిమకు దృష్టాంతముగ నొక్క ప్రతిష్ఠాపన వెలయు నేని శాశ్వతప్రయోజనకారి కాఁగలదు.

* * * *

తనమతము, తనసర్వస్వము విశ్వజనని సాన్నిధ్యమే యని నమ్మినాఁడు; నమ్మినట్లు చరించినాఁడు; సమర్పించుకొన్నాఁడు. ఉదాహరణభూతుఁడైనాఁడు; భోగియై, త్యాగియై, యోగి యైనాఁడు.

కృతార్థుఁడు! మహాయోగజాతకుఁడు!!
"జరయు, మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు-
ధనము విద్య గూర్పఁ దలఁపవలయు; ధర్మ
మాచరింపఁదగు మృత్యుచేఁ దల-పట్టి యీడ్వఁ
బడినవాఁడు వోలె."

అనిన తిక్కననుడి ఈ మహామహుని యెడ సార్థకతఁ జెందిన దని అనుసంధింతును.

తద్వదాన్యతకుఁ గైమోడ్తును.

ప్రతివాది భయంకరం రంగాచార్యులు గారు

౧

ఆది కరుణాస్వరూప; మఖిలావని యచ్చటనే వసింపగా
మదివడు; దానిదర్శనమె మాన్యము; మానవకోటికెల్ల సం
పదయది; అట్టులయ్యు కడుపారగ గన్నయపత్యమే కటా!
యిది జనయిత్రియంచు గరువించుటె నే డొకదోస మయ్యెడిన్.

౨

నీనిశ్శ్వాసపరీమళానిలములో నిద్రాణతన్ జెందితిన్
నీనైర్మల్య విముగ్ధహాసములలో నిశ్చేష్టతం జెందితిన్
నీనిష్పందవిలోచనప్రభలలో నీరూపతం జెందితిన్
నీనిర్ణిద్రతనూవికాసములలో నిశ్శేషతం జెందితిన్.

౩

చలువలజిమ్ము నీనయనశాంతతలో ప్రభవించు నెట్టిజీ
రలు శతవృద్ధుడౌ నొకతిరస్కృతభిక్షుకు నూర్పుగాలుల,
ట్లలఘుపవిత్రమైన నవనావనిబుట్టు నజార్తనాదముల్
వలె, హృదయమ్ముజీల్చుకొని పర్వులువారు దిగంతరంబులన్.

౪

నవ్వులు పువ్వులై కురియు నాళ్లవి దృష్టికి దాపుదప్పగా
జివ్వన ప్రాణసంచయము జీల్చు హిమాద్రితుషారపుంజముల్
రివ్వని లోకమెల్ల బధిరీకృతముం బొనరించు గాడుపుల్
నెవ్వగనేర్చి జాలివడు నీదువిషాదపుగీతి విన్కిచేన్.

౫

నీనిట్టూరుపుగాడుపు ల్విడుచు నగ్నిజ్వాలలేమో! వియ
ద్యానోద్వేగ దిశాదిశాంత బహుళవ్యాధూతధారాకణో
ల్లూనారుణ్యములన్ ధరాస్థలిని రాల్చున్ నేడు తల్లీ! సహ
స్రానేకాశ్రనివర్గము ల్దుమికె నీరావంబులై మాపయిన్.

---

# కులశేఖరుడు

పి. కృష్ణమూర్తిగారు

మలయాళ దేశమున తిరువంజిక్కాల మను పట్టణమున సుమారు ౫౦౦౦ సంవత్సరములకు పూర్వము ప్రభవ సం॥ మాఘ శుద్ధ ద్వాదశీ గురువారమున పునర్వసునక్షత్రమున కులశేఖరుడు జనన మొందినట్లు తెలియుచున్నది. ఈయన శ్రీ మహావిష్ణువు యొక్క కౌస్తుభావతారమని వాడుక. ఏది యెట్లున్నను నది ప్రాచీనసాంప్రదాయకుల నమ్మకము.

కులశేఖరుడు తిరువాన్కూరు రాష్ట్రపు విశుద్ధచరిత్రులగు చేరరాజుల వంశీయుడు. ఈనాటికిని తిరువాన్కూరు ప్రభువులు వారి పవిత్రాచారములను నిలబెట్టియున్నారు. నేటికిని ఆ ప్రభువులు తమరాజ్యమును శ్రీ అనంతపద్మనాభస్వామివారి పేర నేలుచుంటయు స్వామివారి ప్రసిద్ధాలయమున కనుదినము పాదచారులయిపోయి స్వామిని సేవించుటయు, సంవత్సరాంతమున తమరాష్ట్ర ప్రభుత్వనివేదికను స్వామివారికి ప్రసాదించుటయు నాచారముగ నున్నది.

కులశేఖరుని తండ్రి దృఢవ్రతుడు. ఈతడు చిరకాలమువరకు సంతానహీనుడగుటచే శ్రీమన్నారాయణుని గూర్చి యొనరించిన నిరంతరప్రార్థనలవలనను, తపస్సువలనను, కులశేఖరుడు జనన మొందెను. కులశేఖరునికి వేదశాస్త్రములయందు ప్రవేశము కల్పింపబడెను. యుద్ధసంబంధ మగు విద్యాశిక్షణమును పొందెను. అన్నిటికంటె నెక్కుడుగ బాల్యముననే యితనికి భగవద్ధ్యానము, ఈశ్వర భక్తిబీజములు హృదయమున నాటుకొనుటచే, సకలమానవప్రపంచమునుద్బోధింపజేయు శక్తి గలిగిన పవిత్రత, భక్తి ఫలించెను. ఇతనికి వయస్సురాగానే తండ్రి, రాజ్యస్వీకారార్హత గలిగినదని సంతోషించి ఇతనిరాజ్యాభిషిక్తునిజేసి, తాను తన జీవితమందలి యంత్యదశను భగవదారాధనకు వినియోగింప నెంచి పూర్వచక్రవర్తులవలె అరణ్యములకు జనెను.

కులశేఖరు డచిరకాలముననే సత్పరిపాలకుడన్న కీర్తి బడసెను. అతని భవిష్యజ్జీవితమున రానుండిన ఆధ్యాత్మికవిజయమునకు బూర్వము, ఐహికవిజయము లసంఖ్యాకములుగ గలిగినవి. అతడు చేరరాజ్యమునకే కాక, పాండ్యచోళరాజ్యములకును ప్రభువాయెను. అతని ప్రజారంజకౌదార్య పాలనమున, పాలితులు రామరాజ్యమున నుండినట్లు భావించిరి. కాని కులశేఖరుని యాంతరమానసికాపేక్షలు, ఈ రాజ్యచిహ్నములచేతను వైభవములచేతను సంతృప్తిని బడయకుండెను.

క్రమక్రమముగా నీతని హృదయమందాత్మావబోధ ముదయించి, యభివృద్ధిచెందినకొలదిని, ఈ ప్రాపంచికసుఖములపయి విముఖత గలిగెను. తనజీవితమున వీనికంటె నుత్తమమైనదీ పొందదగిన దున్నట్లు గోచరించెను.

బంధుమిత్రవైభవములను త్యజించి, సకల జీవులకును కడపటి శరణ్యమగు నీశ్వరుని పాదపద్మముల సన్నిధిని బడయ నిచ్ఛగించెను.

'నన్ను రాజు నొనర్చినది రాజులకధి రాజగు వాని పాదపద్మము లను కిరీటముగాని, మనుష్యులచే నా శిరమున నుంచబడిన కిరీట ముగాను' అని తఱచుగా చెప్పుచుండువాడు. తన రాజ్యమును విడిచి, ఇది రంగమని గణుతి కెక్కిన శ్రీరంగమును జేరి, యచ్చట శ్రీరంగ నాథుని సేవించి, అచట నుండిన బహుమంది భక్తులలో తా నొకడై తనజీవితమున శేషించిన దినములను, ఆధ్యాత్మికచింతతో గడప గోరుచుండెను. కొన్నిసమయములందు శ్రీ వేంకటేశ్వర స్వామివారి సాన్నిధ్యమున నుండ గోరి తిరుపతి క్షేత్రమునకు పోబోవును; ప్రతి క్షేత్రమును జూడగోరును. ప్రతిస్థలమునను నివసింప నాసక్తుడగును; ప్రతిదేవతను సేవింప నుద్దేశించును.

ఇట్టి పరిస్థితులలో రాజుయొక్క మనోవృత్తిని రాజ్యవిషయములందే లగ్నమగునట్లు చేయుటకును, రాజ్యముయొక్క పారంపరికప్రతిష్ఠను నిలువబెట్టుటకును మంత్రులకు కష్టకార్యమయ్యెను. ఈశ్వరభక్తి, ఐహిక కనిరపేక్షమనమున చక్కగా నాటినవి. "ధర్మము మీద గాని, ధనరాసులమీదగాని, కామ ఫలములైన యనుభవములమీదగాని, నా హృదయము నెప్పుడును నుంచలేదు. పూర్వజన్మకృతములను బట్టి నిర్ణీతమయినమార్గమున జీవితమెట్లు జరిగినను నాకు సంతసమే. కాని ప్రభువా! అనేకజన్మపరంపరలందును, నాచిత్తమన్యాయత్తముగాకుండ భవత్పాదపంకేజాయత్త మగునట్లు వర మనుగ్రహింపుము. ఇదియే నా కోరిక"యని కీర్తించువాడు.

ఇతడు భక్తులన్న నెక్కువ ప్రేమతో నాదరించువాడు. రాజసభ యంతయు, భక్తులచేతను, ఋషులచేతను నిండిపోయెను. ఈశ్వరవిషయమై వారుచేయు ప్రసంగముల నత్యంతశ్రద్ధాభక్తులతో విని మురియువాడు. ముఖ్యముగా రామాయణపఠనమునం దాసక్తి గలిగియుండెను. రాజపురోహితుడు పఠించునప్పుడు తన్మయత జెంది కథాసందర్భములనను సరించి యానందమును, సంతాపమును వెలిపుచ్చువాడు. ఒకనాటి పాఠమున ప్రస్తావవశమున కుల బ్రాహ్మణు డిట్లు చెప్పెను. "పదు నాలుగు వేలమంది రక్కసులు క్రూరహస్తులై యపవిత్రహృదయములతో నచట నిలువబడి యుండగా సకలసద్గుణాకరు డగు రాము డొక్కడు వారి నెట్లెదుర్కొనగలడు?" "రాము డొక్కడు వారి నెట్లెదుర్కొన గలడు"అను వాక్య మాతని హృదయమందు ప్రతిధ్వనించెను. అంతట కులశేఖరు డుద్రేకపూరితుడై కూర్చుండినస్థలమునుండి దిగ్గునలేచి రామ సహాయార్థమై సత్వరముగ నడవవలసినదని సేనల కాజ్ఞయిచ్చెను. ఈ వింతచూచి పురోహితుడు వెంటనే కొన్నిపుటలు దాటించి, మరియొక కథపట్టునకు నాతని హృదయము నాకర్షించెను. అప్పు డతని హృదయమున జనించిన సంతసమునకు మేరలేదు. నాటినుంచి

## బరాడీ (వరాళీ)





రుపభరీ రస రంగభరీ కలకోకలా సో కామ బఢావే,
పీతమచాహ ఉరోజ ధరే కరతా సిరశ్చారు కలంగీ చఢావే,
భువన అంగ ఉమంగ భరీతికా మలాజన అంతర ఆవే,
దీపగ రాగకీ రాగనీ సోజీ బరాడీ యహ బహు జిహి నామ కహావే.

[జయపుర చిత్రము: దివాన్ బహాదూర్ గోవిందదాసు చతుర్భుజదాసుగారి యనుమతిని.]

రామాయణపాఠమున పురోహితుడు జాగరూకుడై యుండెను. కులశేఖరుని మానసికోద్రేక మింత చులుకుగా నుండినది.

రాజహృదయమందలి యీమార్పున కిసుమంతయైనను ప్రధానులు సంకటపడక రాజు సదా వైష్ణవుల సద్గోష్ఠిని కాలముగడుపుచు నాముష్మికచింత శ్రుతిమించి రాగమున బడుటెఱిగి యాతని భిన్నప్రవృత్తికి వారే కారకులని నిశ్చయించి వారిని నిందింపసాగిరి. వీరి సాంగత్యమునుండి తప్పింప ప్రయత్నించిరి. కాని రా జిదివరకే రాజ్యమునువీడి శ్రీరంగమునకు బోవ ప్రయత్నించు చుండెను. ఇట్టి స్థితిలో రాజు తమకుగాడని తలచిరి.

రాజు శ్రీరంగప్రయాణసన్నాహమున నుండునంత, పదిమంది వైష్ణవభక్తు లాతనికి సంఘముగా నెదురగునట్లు గావించిరి. అంతటితో రా జానాటికి ప్రయాణసన్నాహమును విరమించి వారిని రాజమర్యాదల ననుసరించి యుచితరీతిని ఆదరించుచు వారిగోష్ఠిని సేవయందును కాలక్షేపము చేసెను.

దినములు గడచినకొలదిని నిదియంతయు మంత్రుల కసహ్యముగ దోచినది. రాజమందిరములు, నిర్వ్యాపారులును, భోజనప్రియులు నగు నీవైష్ణవభక్తబృందముచే చీమలపుట్టలవలెవెల్లి విరియుచుండెను. రాజగృహములలోని యంతర్భాగములలోనికి గూడ ధారాళముగా పోవు నధికారము వీరికి కల్గి యుండెను. ఒక్క శ్రీవైష్ణవభక్తునిభజించుట అరవై వేలవత్సరములు భగవంతుని సేవించుటకంటె నుత్కృష్టమైనదను ప్రాచీనసూత్రమునే రా జనుష్ఠించు చుండెను. మంత్రు లేమిచేయవలెననుసందిగ్ధస్థితిలో నుండిరి. ఒకవేళ వీరిని వెడలగొట్టిన, రాజు కూడ తమకంత్యనమస్కారముచేసి వారిననుసరించునేమోయని భయపడుచుండిరి. రాజుండవలెనని గోరినచో, ఈయగణితములైన భక్తబృందముల కధికార మివ్వవలసియుండెను. ఇట్లు యోచించుచుండిన మంత్రుల కొక కృత్రిమసాధనము మనసున తట్టెను. శ్రీవైష్ణవభక్తుల ప్రవర్తనకు నేదేని యొకకళంక మాపాదింపజేసి, వారిని రాజదృష్టిలో హ్రస్వపరుప నుద్దేశించిరి. శ్రీరామవిగ్రహము నలంకరించుచుండిన యొక నగ కనబడకుండినట్లును, దానిని వీరిలో నెవరో యొకరు సంగ్రహించినట్లును ఒకవదంతి రాజమందిరమున నొకనాటి ప్రాతఃకాలమున బయలుదేరదీసిరి. దీని విషయమై రాజునకు నివేదించిరి రా జెంతమాత్రమును నమ్మలేదు. మంత్రుల కృత్రిమమును పసి పట్టెను. ఎట్టి భగవద్భక్తునికైనను చౌర్యముచేయవలెనను సంకల్పమే కలుగదనియు, అట్టియెడ నాకార్య మెట్లు చేయనగు ననియు ప్రకటించెను. తన ప్రకటనయొక్క సత్యనిరూపణము చేయగోరి యొకభాండమున విషసర్పము నొకదాని నునిచి తనవద్దకుగొని రావలసినదిగ నాజ్ఞాపించెను. "మదీయమిత్రులు శ్రీవైష్ణవభక్తులు యథార్థముగా పవిత్రులై, నిరపరాధులైనచో నేను సర్పదష్టుడను గాకుందును" అని చెప్పుచు నాభాండము

లోనికి తన హస్తమును బోనిచ్చెను. సర్పము భీతిలి ప్రక్కకొదిగియుండెను. ఈ విధమున రాజు మంత్రుల కపటోద్దేశమును బయల్పరచి భక్తులను మన్నించెను. ప్రధానులును తా మొనరించిన యీ దుర్మార్గమును సాకల్యముగ నివేదించి క్షంతవ్యులయిరి.

రాజింక రాజ్యమున నుండగోరలేదు. యుక్తవయస్కుడగు తనకుమారుని పట్టాభిషిక్తునిజేసి తాను తనకుమార్తెతో గూడ శ్రీరంగమునకు జనెను. తనపుత్రికను శ్రీరంగనాథునికి సమర్పించి తానుబహువత్సరములచ్చటనే కాలము గడపెను. అనేకక్షేత్రములను దర్శించి కృతార్థతనుజెందెను. ౬౭ వ ప్రాయమువరకును జీవించి తనయంత్యదినమందు మన్నారుకోవెలయందు రాజగోపాలస్వామివారి సాన్నిధ్యమున నుండెను.

భగవదైక్యమును బొంది ఈశ్వరునియందు గలిగిన దృఢభక్తిపరాయణతవలన కులశేఖర పెరుమాళ్ అను బిరుదము ఇతనికి సార్థకమైనది. ౧౦౩ శ్లోకములతోనుండిన 'పెరుమాళ్ తిరుమొళి'యను ద్రవిడప్రబంధమును, "ముకుందమాలా" స్తోత్రమును అనునవి యీకులశేఖరుని రచనములు.

ఈ స్తోత్రములు ఈరాజర్షియొక్క గాఢమైనయీశ్వరభక్తిని ప్రేరేపించుచున్నవి. నేటికిని దక్షిణహిందూస్థానమున ననేక వైష్ణవ గృహములందు ప్రతియుదయమునను, సాయంత్రమునను ఈస్తోత్రములు పఠింపబడుచున్నవి.

---

## శిథిలాంధ్ర విభవము—పెద్దాపురముకోట

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

ఏడుమూఁడు బురుజుల ప్రాకారమున నామమునకు మాత్రము మూఁడు బురుజు లుండె
హనుమాన్ బురుజుమాత్ర మానాఁటి పెనుఱాల కట్టడంబులతోడఁ గానిపించె
ఱాలు దీయంగ ధారావర్షములు గరంచెడి యొక్కబురుజునఁ జెముడు గప్పె
శిల్పముల్ చెదరిన శ్రీ విష్ణువిగ్రహంబులతోడ కొనతోక బురుజు పడియె
వైభవంబు సమస్తంబు వదలెఁ గాన-కటకటా కమ్ముకొనియెను గచ్చపొదలు
విభవమేః యున్నఁ బొద లిట్లు పెరుఁగఁగలవె?-వత్సవాయి జగపతుల ప్రాంగణముల.

యుద్ధరక్తంబుల నోలలాడిన శూరభటవతంసంబుల వంశజులును
రాజకార్యంబుల యోజన లెఱిఁగిన జాణలౌ వక్తల సంతతులును
శత్రు భేదోపాయానుసరణ లెఱింగిన గూఢచారుల కులాంకూరములును
జయలక్ష్మి వరియింప సైన్యముల్ నడిపిన దండనాయకులకుఁ బిండదులును

బీదతనపుఁ బాటులతో నన్న పేదలగుచు - కూరనారల నిపు డమ్ముకొనుచునుండి
రకట మూలపురుషుల శౌర్యములు మఱచి - ప్రాఁత పెద్దాపురము కోట ప్రక్కలందు.

పోతుటీఁగ దూఱఁగలేని ప్రాతిగోడ - యావరణ మసూర్యంపశ్య లడుగు లిడిన
కుట్టిమంబులున్ గాక ఘూక భీక - రంబులై యుండె పెద్దాపురంబులోన.

నగరప్రవేశ మందఁగ రానిపండైన శాత్రవుల్ మఱలిన స్థలము లివ్వి
రాజదర్శన మనర్హంబైన వేళల సుకవుల్ నిరీక్షించుచోటు లివ్వి
శౌర్యధుర్యుఁడు తిమ్మజగపతి వాహ్యాళి వెడలిన సువిశాలవీథు లివ్వి
రాజభామినులు సోరణగండ్లనుండి క్రేఁగన్నులఁ గాంచిన తెన్నులివ్వి
అనుచు నానావిశేషకల్పనల నీదు - వాసిగలవార్తలను వల్లెవేసికొనుచు
దూరదేశముపాంథు లెంతో తపింత్రు - ప్రాఁత పెద్దాపురంబ! నీప్రాంతమందు.

పదునెనమండ్రు మన్నెదొరల్ బలంబుతో బలసియుండెడి జగపతుల తీవి
పదునెనిమిది పెద్దపరగణాలను బరిపాలించు క్షత్రియ ప్రభువిభవము
పెద్దాపురం బనుపేరుకు హేతువై పరఁగు పెద్దారెడ్డి ప్రాభవంబు
తొమ్మిదిమూర మహమ్మదీయుఁడు రిపువిదళనం బొనరించు విస్మయంబు
నీదు సరిహద్దులోఁ బాదమూఁదినంత - గుప్పుగుప్పున స్మృతిత్రోవఁ గప్పుచుండు
ప్రాఁత పెద్దాపురంబ! నీప్రాఁతవిభవ - మాంధ్రులప్రతిష్ఠ కాలంబ మైనకతన.

## పెద్దాపురము కోటలోని మఱ్ఱి

కాలము తీఱిపోయిరి జగత్పతులై యలవత్సవాయి భూ
పాలురు వీరిప్రాపు నెడఁబాసియు నూడలతోడ వేళ్లు పా
తాళముదాఁక నాటుకొన ధాత్రిని వీడఁగఁజాలనట్లు నీ
వేలొకొ! చేయుచుందు తప మీస్థలమం దిట మఱ్ఱివృక్షమా?

చని రిట నిన్ను వేసిన విశాంపతు లెల్లరు కన్నులార నిన్
గనుఁగొను రాణివాసము సుఖంబుగ స్వర్గములోన నుండె నీ
కనఁదగు నీడలన్ నిలిచి కత్తులు త్రిప్పెడి జోదు లెల్లరున్
గనులకు దూరమైరి యెది గన్గొననుంటివొ! మఱ్ఱివృక్షమా!

ఆలోకంబు నలంకరించిరి స్వకీయాలోక సామగ్రిచే
శీలాచారయుతుల్ నృపుల్ జగపతుల్ చెల్వొది నీ విచ్చటన్
గాలమ్ముం గడపంగఁ జొచ్చితి మహాకాశాధ్వయాత్రాచణ
వ్యాలోలాంచల శాఖలన్ దివిజరాజ్యం బందుకోరాదొకో!

# రూపు మాసిన వ్యక్తి

శ్రీమతి కుమారి కూచిమంచి వెంకటరమణమ్మగారు

(H. G, WELLS నుండి ఎత్తి వ్రాసినది)

నా పూర్వపు పేరు 'జానకినాథుడు'. ఇప్పుడు ఇంకా వాడిని నేనెందుకు కాదో ముందు ముందు, మీకే తెలుస్తుంది. పేరుమాత్రం ఇంకా అదే. వ్యక్తిత్వము మాత్రం అదృశ్యం అయింది. తత్త్వమంతా మారిపోయింది. ఈనాటికికూడా నాదురదృష్టంచేత నేను "వాఙ్మయప్రబోధ" పత్రికకు నాటకవిమర్శకుడుగానే ఉన్నా. కొంచెం కాలములో నేనేమవుతానో నాకే తెలియదు. మనస్సంతా అల్లకల్లోలం, అయోమయం గాఉంది. వీలైనంతవరకు చెప్పవలసిన విషయమును, స్పష్టంగా విశదపరుస్తా. ఈ చెప్పడంలో మీకు నేనిచ్చే శ్రమ కాస్త భరించాలి. ఒకవ్యక్తి తన వ్యక్తిత్వం కోల్పోతుండేటప్పుడు, తాను పూర్వము ఎట్టివాడో అనే స్మృతిపోతూ ఉండేటప్పుడు, తనుచెప్పవలసినవిషయాలు చెప్పడం ఎంతకష్టమో మీరే ఊహించాలి. అయితే కథాభాగంలోనికి దిగితే బాగా చెప్పగలనని నమ్మకం.

ఇంతకుముందు వ్రాసే వ్రాతల్లో, 'నేను నే'నని సర్వనామాన్ని ఉపయోగించడానికి లజ్జించి ఉండేవాడిని. ఈకథలోమాత్రం అనేకసార్లు 'నే' ననేశబ్దం వస్తుంది; నేననే వ్యక్తిలేకపోయినా నేను నాటకవిమర్శకుడనైన నాటనుండీ, దేశంలో వెలువడిన నాటకములను చదివి, విమర్శించి, ప్రదర్శనాల్ని చూచి, దినదినము పత్రికలకు వ్రాస్తున్నప్పటినుంచే, నావ్యక్తిత్వంలో మార్పుకలిగింది. అహంకారంచేతమాత్రం కాదు ఆశబ్దం ఉపయోగించింది.

నిజంగా నాపూర్వజీవనము, ఆవ్యక్తినిగురించి, తలంచుకుంటే దుఃఖం వస్తుంది. అప్పుడు నేను చాలా మంచి వాడనే. ఒక విధమయిన బిడియము. బాగా చదువుకున్నా. రూపసిని. లలితకళలంటే ప్రేమ. నూతనంగా వ్యక్తమగుచుండే యౌవనదశలో కలుగు హాయి ననుభవించేవాడిని. ప్రేమలత కూడా అప్పుడే హృదయంలో ప్రారంభించింది పూవులువేయడం. నా ప్రేమదేవత 'సహానా'కుమారి శోభనాంగి; పక్వఫలం వలె నవనవలాడుచు, వికసిస్తూన్న ఆమె మధురాకృతి ఎల్లప్పుడు నన్ను అచురుణ్ణి చేసింది. మంచి విద్యావతి. నన్ను గాఢంగా ప్రేమించింది. ఆప్రేమతరంగాల్లో మేమిద్దరమును ఊగులాడుతుండేవాళ్లము. ముందువచ్చే దుస్థితి నాకేమీ లీలవలె కూడ స్ఫురింపలేదు దినము మే మాఊరిలోనున్న గ్రంథాలయంలో కలుసుకొంటూ ఉండేవాళ్లం. గ్రంథపఠనంటే నాసహానకు విశేషమైన ఆసక్తి. అనేకవిషయాలగురించి, ఎల్లప్పుడు మేము మాట్లాడుతూ ఉండేవారం. మాభవిష్యజ్జీవనం గూర్చి అనేక ఆలోచనలు చేస్తుండేవాళ్లం. ఇట్లాకొంతకాలం జరిగింది.

నాజీవితంలో ఘోరవిపత్తును కలిగించిన దినము వచ్చింది. ఒకరోజు గ్రంథాలయంలోనుంచి బైటకువస్తుండగా, నాస్నేహితుడు పద్మకుమారు డెదురయ్యేడు. నన్ను చూడడానికే వచ్చేడక్కడకు.

'ఏమి జానకీ నీకోసానే వస్తున్నా' అన్నాడు. అప్పుడే పద్మకుమారుడు రసవంతమైన ఫలహారంచేసేడు. అతి ఉత్సాహంగా ఉన్నాడు. వెంటనే తన ఆఫీసుకు తీసుకొనిపోయి కుర్చీలో కూలవేసేడు. బీరువాతీసి పచ్చని మూడు కాగితపు ముక్కలుతీసి నాచేతిలోపెట్టి "లక్ష్మివారం, శుక్రవారం 'మనోరంజని' శాలకు, శనివారం 'కృష్ణకళా' మందిరానికి పోవడానికిమూడు టిక్కెట్లు" అన్నాడు.

నేనేమో చెప్పడానికి ప్రారంభించేసరికి ఆపి 'నీకేమీ పనిలేదు, బాగా చదివేవు' అంటూ, కొన్ని వ్రాతప్రతులుగానుండే నాటకాలు నాచేతిలో నుంచెను.

"నేను వీని నేమిచేయాలి, విమర్శించాల్నా ?" అని మెల్లగా అన్నాను.

"ఏదో ఒకటి చేస్తూ" అన్నాడు.

"కాని నాకు చేతకాదే, నాజన్మంలో ఎప్పుడు నాటకానికే వెళ్లలేదే, ఎట్లా విమర్శించను?"

"మరీమంచిది, మాపత్రికకు కావలసినదే అది. నూతనంగా ఉన్న మనస్సే విమర్శించాలి. ఇదివరకు నాటకం అంటే ఏమిటో తెలియకుండా ఉన్నవారెట్లా నాటకాన్ని ఆనందిస్తారో కావాలి. మాపత్రిక సజీవమైనదని నీకు తెలుసా?"

నేనింకా ఏమో చెప్పబోతుంటే తనగది తలుపు తీసి, నన్ను బైటకునెట్టి, 'రామమూర్తి నడగవోయ్, అతనంతా నీకు బోధపరుస్తాడు' అని తలుపువేసెను. వెంటనే తలుపుతీసి, 'ఇదిగో ఈవేళకు టిక్కెట్టని టిక్కెట్టిచ్చేడు.

నాకు వాదంఅంటే ఇష్టంలేదు. పద్మకుమారుడు చెప్పినట్టే నాటకవిమర్శకుణ్ణి కానిశ్చయించుకున్నా. నాటకానికి వెళ్లడానికి అట్టే కాలం లేదు. 8.30 అయింది. వెంటనే బసకుపోయి, దుస్తులుమార్చి, కారెక్కి నాటకశాలకు వెళ్లేను.

ఆనాటితో ప్రారంభం అయింది నాజీవితంలో పతనం.

ఆతొలినాటిరాత్రి నాకు కలిగిన అనుభవాల్లో ముఖ్యమైనదాన్ని ఒకటిచెప్తా. నటకుల అభినయం నాలో విశేషసంచలనం కలిగించింది. క్రమంగా నాలో ఘోరమైన మార్పుకలగడానికి కూడ కారణం ఇదే. నాకు మొట్టమొదట కలిగిన భావం ఆశ్చర్యం, భయం కూడాను. ఆ అభినయం అంతా బహు అసహజంగా ఉండెను. చిన్నప్పటినుండీ నాటకాలకు వెళ్లడం నుంచి, అనేకమంది ప్రేక్షకులు ఆ అసహజత్వానికి అలవాటవుతారు. ఆ చోద్యంగా ఉండే అభినయం, కళ్లు తిప్పడం, చేతులు ఆడించడం, ముఖం చిట్లించడం, ఆ నడక, పిచ్చి పిచ్చి ఉచ్చారణ, ఒయ్యారంగా నడవడానికి ప్రయత్నించి, గార్దభంలాగ తయారవడం— ఇవన్నీ నాకుక్రొత్త. ఇదివరకు నేనెప్పుడు నాటకానికి వెళ్లలేదని చెప్పేగా. ఆదుర్భరమయ్యే అరుపులు, పెదిమెలు చప్పరించడం, అసందర్భభావవ్యక్తీకరణ— ఇవన్నీ నాకు అద్భుతం కలిగించేయి.

నాప్రకృతిలో ఉండే ప్రత్యేకలక్షణంచేత ఈ అభినయం నాయందు ఘనమైనమార్పు కలిగించింది.

రంగస్థలంమీద ఉన్నవారు మానవలక్షణాల్ని వ్యక్తపర్చడానికి ప్రయత్నిస్తున్నారో, సృష్టిలో మరే వర్గులోచేరినవారివలె ప్రవర్తిస్తున్నారో నిశ్చయించలేక పోయా. రాజువేషం వేసినవాని మాటలలోనున్న కృత్రిమశైలి, అసమంజసమైన శబ్దాలు నాలో నేదో చెప్పడానికి వీలులేనటువంటి భావాన్ని కలిగించినవి.

ప్రేక్షకులవైపు అనేకమార్లు నేనుండేస్థలంనుంచి తిరిగిచూచా, చాలా ఆశ్చర్యంతో. నాటకప్రదర్శనాలస్థితి మార్చడానికి ప్రయత్నం చేయాలని నిశ్చయించా. నాటకాంతం కాగా ఇంటికివెళ్లేను. ఉదయాన్నే నేనొక విమర్శవ్రాసేను. పద్మకుమారుడు విశేషంగా సంతోషించేడు.

నాటకంనుంచి వచ్చి నిద్రపోగానే, కలలురావడానికి ప్రారంభించేయి. కళ్లు పెద్దవిచేసి చూచేవాళ్లు, గుండెబాదుకొనేవాళ్లు, బాధకరంగా నవ్వేవాళ్లు, నిస్పృహచేత నవ్వేవాళ్లు, గుభేలున నేలను పడేవారు, అసందర్భంగా, ముద్దుగా చచ్చేవాళ్లు వచ్చేవారు ఆ స్వప్నంలో; అట్లాంటినటకులను చూచేవాణ్ణి.

తొలినాడురాత్రి నిద్రపోయి, ఉదయంకాగానే మేల్కొన్నా. కాలకృత్యాలు తీర్చుకున్న తరువాత క్షవరంచేసుకుందామని, కత్తికోసాన్ని వెతికేను. కనబడలేదు. వెంటనే నేననుకోకుండానే, నోటినుంచి 'అహా ఎచ్చటనున్నదోకదే,' అనేమాటలు వచ్చేయి. ఎడమచేయి ముందుకు అభినయంగావిసరి, నాటకాల్లోచేసే మాదిరిగానే, కుడిచేత్తో పొట్టపట్టుకున్నా. ఇదంతా అనుకోకుండానే జరిగింది. ఆశ్చర్యంవేసింది. ఈనూతనలక్షణంచూడగానే నా కీవింత గలిగింది.

మొదటి రోజులలో ప్రతిసాయంకాలం 'సహన'ని కలుసుకునేవాణ్ణి. ఈ నా క్రొత్తగావచ్చిన పనిని

గురించి మాట్లాడేవాళ్లం. కాని ఈనూతన ఉద్యోగమే నా దుస్థితికి కారణం. ఆనాటినుంచి దినమూ నాటకానికి వెళ్లుతుండేవాణ్ని. క్రమంగా నా ప్రకృతిలోకూడా మార్పు వచ్చింది. నా ప్రేయసి కలుసుకునే టప్పుడు నాటకాల్లో మాదిరి ఆమె చేయిపట్టుకోవడం, నడవడం, ఆవిధంగానే భుజంమీద, వీపుమీద, అసహజంగా ఉండేనవ్వుతో చేయివేసి తట్టడం, పెద్దపెద్ద మాటలతో ఆమెను పిలవడం మొదలుపెట్టాను. నా క్రొత్త వైఖరిచూచి వింతపడ్డది. ఆఫీసులో కూడ! ఎవరితోనైనా మాటాడేటప్పుడు మూతిమీద వేలు పెట్టుకోవడం, మాటమాటకు 'అహా!' అనడం, తలతిప్పడం, కూడా కలిగేయి. ఇతర్లతో వ్యవహరించేటప్పుడుకూడా నటకుడిలాగే ప్రవర్తించా. ఏంచేయను ?

నే చేస్తున్నది తప్పని తెలుసు, అసందర్భమనీ వికృతమనీకూడా. కారణంకూడా తెలుసు. నా నాడీ సమూహం అభినయనృత్యంచేత కలిగే తీవ్రమైన ఆయాసాన్ని భరించలేకపోయింది. నా నాడీ సంపుటి అతి మృదువయింది. ఈ ఎడతెగకుండా ఉండే అభినయనృత్యం, నా ప్రవర్తనాన్ని మార్చేసింది. నా ప్రకృతిమీద అచ్చుగుద్దినట్లయింది ఆకృత్రిమ అభినయం అంతా.

నా సహజవ్యక్తిత్వం క్రమంగా పోయింది. నాట్యరంగమనే కారాగారంలో తయారైన ఒక కృత్రిమ నిర్జీవపు నూతనవ్యక్తి వచ్చి ఆవేశించింది నన్ను. ఉద్యోగం మానేద్దాం అనుకున్నా. కాని పద్మకుమారుడు వినలేదు.

ఇంతకన్నా దుర్భరంఅయిన విషయం, నా ముద్దుల సహన నాయందు పూర్వప్రేమ చూపెంచడంలేదు. ఆమెలో మార్పే నాకు దుర్భరం. ఇదివరకు మేమెంత హాయిగ కలుసుకొని సల్లాపను లాడేవాళ్లమో అదంతా పోవడం ప్రారంభించింది. ఆమె నన్ను అసహ్యించుకుంటుందనికూడా తెలుసు. నేచేస్తూన్నవన్నీ నాకు తెలుసును. ఆమె వాటిని ఎంతగా అసహ్యించుకొంటుందో తెలుసు. నా బాధ ఎవరికి తెలుసు. కాని ఆకృత్రిమత్వం నుంచి ముక్తి లేకపోయింది ఇంక నాకు.

ఒకనాడు, ఆదినము నాకు బాగా జ్ఞప్తిఉంది, గ్రంథాలయం వెనుకనుండే ఉద్యానవనంలోనికి వెళ్లా. ఆదినం రోజుకన్నా ముందు పోయాను అన్నటకు. నే వెళ్ళేసరికి ఒక పొదదగ్గర ఉండే కుర్చీమీద కాలిమీద కాలువేసుకొని కుడిచేతిమీద శిరస్సువాల్చి తీవ్రంగా ఏదో ఆలోచిస్తుంది-ఆదృశ్యమాధుర్యం ఎప్పటికీ మరుపురాదు. కాని నాట్యాభినయమహామారిచే కబళింపబడిన ఈదురదృష్టపు వానికి అది లభింపదు మరెన్నడు ఈజన్మాన్ని.

వెనకనే వెళ్లి నాటకాల్లో మాదిరిగా భుజముతట్టి 'మన్మనోహరీ' అని అసహజమైన కంఠంతో అన్నా. హృదయంలో ఉన్న ప్రేమ సహజం ఐనమాటల్లో పైకి రాదు. పరాత్పరు డెరుగు నా బాధ.

వెంటనే ఉల్లిపడి సహన లేచి "జానకీ, అనేక దినాల్నించి చూస్తున్నా. నేను ప్రేమించే సహజమైన వ్యక్తిలేదు. నీకు వెర్రి ఎత్తినదా లేక ఏమైనా జబ్బు చేసినదా? పూర్వంవలె నీమాటలుగాని, ప్రవర్తనగాని లేదు. ఇంతటితో మన ప్రేమ సమాప్తమయింది. ఈ నీ నూతన వ్యక్తిని ప్రేమించను" అని గద్గదంగా ఉన్న కంఠంతో చెప్పి బాష్పాలతో నిండినకళ్లతో ఒక్కసారి నన్ను చూచి గిరుక్కున తిరిగి తోటవిడిచి పోయింది.

'సహనా, సహనా' అని అని పిల్చాను బాధ పొందుతుండే హృదయముతో. నిష్ఫలం! దుర్భరం! జీవితం అంతా ఇంక ఎడతెగని ఎడారి. ఆమె విడిచిన కుర్చీలో నే కూర్చుని మోకాళ్లలో తలపెట్టి ఏడ్చా. బాల్యం దాటినతరువాత అంత వెక్కి-వెక్కి ఎప్పుడూ ఏడవలేదు. ఆ నిమిషములే మధురం, కష్టతరం కూడాను.

తరువాత పూర్తిగా నావ్యక్తిత్వం నశించింది. నాదుస్తులు, జుట్టువైఖరి అంతా నటకులమాదిరే. నా సహచరులు నటకులే. స్నేహితులు నటకులే. జీవితం అంతా నటమయం అయింది.

సత్యమేమంటే నాయథార్థమైనరూపు మాయమయింది. మాయరూపం నిర్జీవమైంది వచ్చింది. దాన్ని చూచి నవ్వువస్తుంది, ఏడ్పువస్తుంది. ఏం చేయను ?

నటకులయొక్క జీవితలక్షణాలు నన్ను అంటువ్యాధివలె పట్టేయి. నిశ్చయంగా ఇది ఒక గొప్పజబ్బు. మహారోగమని గ్రహించా. మహత్తరమైన వ్యక్తిత్వంవస్తే సంతోషంగా ఉండును—ఈ హ్రస్వవ్యక్తిత్వంపోయి. కాని ఈమార్పు సజీవశవత్వం. తప్పుకోడానికి దారిలేదు. శక్తి లేదు. వీలులేదు.

---

## బౌద్ధనీతులు

బులుసు పాపయ్యశాస్త్రిగారు

నిలక పరుగులువెట్టుఁ జంచలము మనము-హృదయగుహా నంగహీనమైయుండునొంటి;
బెట్టు దుష్కర మద్దానిఁ బట్టఁగట్ట;-దాని లోఁగొన మృత్యుబాధలు తొలంగు.

ధరపయి నేది శాంతి యిడు దాని నెఱుంగు పరోపకారత
త్పరుఁ డగునట్టిమానవుఁడు దక్షత, యున్నతభావ, ముక్తిమా
ధురియును శీఘ్రమే పొడము తుష్టియుఁ, దృప్తియు, సాధు శీలము
న్సరళతయున్, హృదంతరమున న్నిరహంకృతిఁ గైకొనన్వలెన్.

మేను మంటికుండ; మానసమును గోటఁ-జేసి, జ్ఞానశరము చేత మాయఁ
గడిమి గెల్చి, తన్నుఁ గాచుకొనుచు, నిర్వి-కారుఁడగుచు నిల్వఁ గావలయును.

మేలు సేయ నెపుడు మిక్కిలి త్వరపడు; చెడుతలంపు మదిని జేర నీకు;
మేలు సేయుపట్ల జాలము సేసిన-దుష్టచింత కద్ది త్రోవ సేయు.

అధికతరమైనలాభ మనామయంబు;-తుష్టి యెపుడును నరున కుత్కృష్టధనము;
నమ్మఁదగు మిత్ర మనుఁగుఁజుట్టమ్ము జగము - నందు; నిర్వాణమే మహానంద మరయ.

ఉండదు కామవహ్నిసమ మొండొకవహ్ని నరున్ దహింపఁగా;
నుండదు ద్వేషమట్టిది మ ఱొక్క-మృగంబు నరున్ గ్రసింపఁగా;
నుండదు మోహతుల్యమగు నొండొకజాలము మర్త్యుఁ బట్టఁగా;
నుండదు పో దురాశ కెన యొండొకవాహిని మర్త్యు ముంపఁగా.

---

# కృషీవలుడు

మంత్రవాది వెంకటరత్నంగారు

౧

ఉన్నతమగు పర్వతముపై నొక చదును బండమీద తనువువాల్చి నిశ్శబ్దనిశీథమునందలి ప్రకృతిదేవి నారాధించుచుంటిని. చీకట్లు నన్ను దట్టముగ కౌగలించుకొన్నవి. చుక్కకన్నెలు తొంగిచూచుచున్నవి. జీవతతి సుఖముగ నిద్రించుచున్నది. మరి, నాకు నిద్ర యేది?

ప్రశాంతవీథులందు ప్రకృతికన్య స్వస్తి గీతముల నాలపించువేళ నాహృదయవిపంచి ప్రళయగర్జనలు పలుకుచున్నది. తుపానున సంక్షుబ్ధమైన సాగరమువలె నా మనస్సంతయు చెదిరిపోయినది. భావభంగముల యొరపిడివలన గల్గు మహాగ్నిజ్వాలలు నన్ను దహించుచున్నవి. నా శరీరము అగ్నిపుంజ మయినది. నేత్రములు నిప్పుకణములవలె మండుచున్నవి. నాసిక వేడిగాడ్పుల గ్రక్కుచున్నది. ప్రకృతి కంపించుచున్నది. జీవవాహిను లింకిపోవుచున్నవి. అబ్బా! దాహము ... ప్రాణములే పోవుచున్నవి. దుర్భరము. దుర్భరము. నమస్తే! నమస్తే! జీవనవల్లభా! నమస్తే. దాహము... ప్రా...ణా...ము......

* * * * *

వేడిచెమటల నోడ్చి పొట్ట పోసికొనుట నాకు నిత్యకర్మ మయిపోయెను. అంతేగాని ప్రపంచమునందు నాకు మరొకప్రసక్తి లేదు. ఏదినము రెక్కలాడకున్న ఆ దినము నాకు పస్తు. విశ్రాంతి యనునది నాకు మిక్కిలి దూరమైపోయినది. కూడుగుడ్డలకు రోసి, హాలాహలప్రాయమగు క్షుద్బాధచే కృశించి కృశించి వరడైపోయిన ఈమందభాగ్యుని యాక్రందన మెవరికర్ణపుటముల బడును? నా రక్తమంతయు స్వార్థపరుల ధనాగారములకు బలిచేసితిని. నా యౌవన మంతయు పొట్టకూటిపోరాటమున తెల్లవారినది. ఈ పేదకాపు క్రమక్రమముగ కృశించి కృశించి చచ్చుటె గంతవ్యమా?

ఓవిశ్వమయా! ఎంతకాల మీ భయంకరాంధకారము? ఎంతకాల మీ యాతనాలోకము? ఎంతకాల మి ట్లీ పొట్టకూటిపోరాటము? ఈమహాహృదయవేదననుండి బయల్పడుటకు మార్గమేది? ఈదారుణబాధలకు ప్రతీకార మేమియు లేదా?

౨

భయంకరమగు ఆకాళరాత్రిమధ్యమున, నే నెంత వేదన పొందితినో తెలియదు. భూమ్యాంతరిక్షముల నడుమ నా మనసు పరిభ్రమించుచున్నది. ప్రకృతి వైమనస్యము పూనినట్లున్నది. వేడినిట్టూర్పులు నన్ను దహించుచున్నవి. తారకలు న న్నారడించుచున్నట్లున్నవి. మరి నాకు శాంతి యేది?

ఛీ, ఛీ! మానవాధమా! నీవెంత స్వార్థపరుడ వైతివో తెలియగంటివా? నీ యవినీతి

వలన ప్రపంచమునకు ఎంతటిముప్పు రానున్నదో తెలిసికొనుము. ని న్నిక ప్రపంచ మెట్లు సహించును? ఎట్లు భరించును?

అనుభవించుటకు మిక్కుటముగ నున్న బాధలను పొట్టకూటికై సహించి ఎన్నెన్ని అగచాట్లు పడుచున్నాడో చూడుము నా కాపు సోదరుడు! సత్యమునకు, ధర్మమునకు, నియమమునకు దూరమై, ఆచరింపవలసిన స్వల్పకృషియు మాని, అనర్హమైన ఐశ్వర్యమునకు గావలిగాయు నీస్వార్థపరసోదరుల జూడుము.

జీవితాంతమువరకు వేడిచెమటల నోడ్చి, తుది దినములలో కూడుగుడ్డలు కరవై, ఆలుబిడ్డలతో ఊరూరు పల్లెపల్లెలు దిరుగుచు, కడుపుమంటకు తాళలేక కృశించి కృశించి, ఏచెట్టుక్రిందనో, ఏపుట్టయొద్దనో, ఏనదియొడ్డుననో రాలిపోవు నా మందభాగ్యసోదరులను జూడుము.

సోదరమానవుని కష్టసుఖములందుపాల్గొనరుకద, అతనిని పాదాక్రాంతుని జేసికొని, అతని రక్తమాంసముల మూలమున ఆస్తులను పెంచుకొని హంసతూలికాతల్పములపై సర్వప్రపంచమునకు దామె కర్తలనుకొను నీ పుట్టుభోగుల యవినీతిని జూడుము.

మానవుని సాటిమానవుడె బలిగొని పొట్ట నిమురుకొనుటయా? మనుజుని సోదరమను జూడె పాతాళమున కూలనేసి రక్త మాంసములు పీల్చుటయా?

కష్టజీవుల రక్తమాంసములపై, కాయకష్టములపై నిర్మింపబడిన మహాసామ్రాజ్యముల గుంజుకొని కృషీవలుని పాతాళమున బడద్రోసిన ఈ పుట్టుభోగుల, ఈఅనర్హైశ్వర్య సంరక్షకుల, ఈ స్వార్థపరుల గృహాంగణముల ముందు మహాకష్టములచే మానసికశాంతిని గోల్పోయిన మందభాగ్యులగు నా కాపుబిడ్డలు తిరిపెమునకై దేవురించుటయా? ఎంత దారుణము? ఎంతహైన్యము?

## 3

కృషీవలుడు బాధాలోకమునందు కూలిపోయెను. మృత్యువే అతనికి శరణ్యము. అతడు మృత్యువు నుపాసించుచున్నాడు. ఆ ప్రళయమూర్తిపాదపంకజములకు భక్త్యాంజలు లర్పించుచున్నాడు. తన్మయత్వమున శరీరము పులకలెత్త తాండవించుచున్నాడు ప్రళయతాండవమా అది?

భయంకరము, భయంకరము! మృత్యుదేవతాసాక్షాత్కారమా? జగజ్జననీ! నమస్కారము, నమస్కారము. నీ దివ్యపాదపీఠమునకు నన్ను అర్పించుకొనుచున్నాను. తల్లీ! నీకిదె జోహారు. నన్నాశీర్వదింపుము, అనుగ్రహింపుము, పరిగ్రహింపుము.

నాకు నోట మాట వచ్చుటలేదు. నాలుక తడియారుచున్నది. దాహము, దాహము. ఆయాసము. దుర్భరము! నాశరీరమున మంటలెత్తుచున్నవి. నేత్రము లప్రయత్నముగ మూతవడినవి. సర్వ మంధకారమై పోయినది.

భీకరము, భీకరము. దారుణసంగ్రామము. కవచధారులగు యోధులు. అవస్కందనము చేయుచున్నారు. జయధ్వానములు దిక్కుల పిక్కటిల్ల జేయుచున్నవి. భయంకరకోలాహలము. మృత్యుదేవత నాట్యమాడుచున్నది. వేడిరక్తమున జలకమాడుచున్నది.

ఓ పిశాచమా, భూతమా! ఏమనుచుంటివి? శాంతియా? పొమ్ము పొమ్ము. ఎచ్చటి శాంతి? ఎచ్చటిలోకము? భయంకరమగు కోలాహలమునందు విశ్వమంతయు దారుమారగుచుండ, నీకు శాంతియా? ప్రపంచమునందలి ధనాగారములనెల్ల కొల్లగొట్టి స్వేచ్ఛానువర్తివై నన్నీ దుస్థితికి దెచ్చిన నీ కీవేళ ప్రతికారము జరుగనిదే శాంతియా? కాలముకొరకు నిరీక్షింపుము. ప్రపంచశాంతియా? ఏమి ప్రల్లదనము.

మనుజుడా! లెమ్ము, లెమ్ము. మాతృదేశము-మానవజాతి నిన్నాహ్వానించుచున్నది. కన్నుదెరిచి కన్గొనుము.

మాతృగృహములు నీ కిక దూరము. నిన్ను ప్రేమించినవారి ముఖములు నీకు గోచరించవు. బ్రతికియున్న సత్యమును జూరగొందువు. నశించినను సత్యలోకమే దక్కును. నీకు నాశన మెచ్చటిది? నిన్ను నాశనము చేయగల బలశాలి యెవడు?

సత్యము నుద్ధరింప గలవు. ధర్మమును స్థాపింపగలవు. కనుక మనుజుడా! లెమ్ము లెమ్ము. ప్రాచీనమగు ధర్మము నుపాసింపుము.

అబ్బా! తెగిపడినతలలు, విరిగిపోయిన కాలు సేతులు, కాల్వలై ప్రవహించు వేడి రక్తధారలు, కుప్పలై పడియున్న మాంసఖండములు, గుట్టలవలెనున్న మృతకళేబరములతో కదనరంగమంతయు భీకరముగ నున్నది.

పాపము! కొనయూపిరి గల హతయోధులు ముంగాళ్ల ప్రాకులాడ ప్రయత్నించుచున్నారు. లేవజాలక క్రిందపడుచున్నారు. మరలమరల ప్రయత్నించుచున్నారు. మిక్కుటమగు బాధలు. వేదన...దాహము... దుర్భరము. పాపమా యార్తనాదము లా వాయుపథమునందే విలీనమై పోవుచున్నవి. అంత్యసందేశములు...తుదిపలుకులు...అంత్యప్రార్థనలు...

త్రుళ్లిపడి లేచితిని. పక్షి కూయుచున్నది. తూర్పుదిక్కు వెలవెలబారుచున్నది. నా కాయాసము క్రమముగ తగ్గుచున్నది.

మనుజుడా! లెమ్ము లెమ్ము. ప్రపంచము మేల్కాంచినది. తమస్సు విడిపోవుచున్నది. విహంగములు మంగళవాద్యములు ప్రయోగించుచున్నవి. పూర్వదిక్కునుండి నవయౌవన ప్రభాతకాంతులు బయల్వెడలుచున్నవి. విశ్వమంతయు రక్తవర్ణమున ప్రకాశించుచున్నది. మానవహృదయము నూతనవాహినులం బడి పరుగిడుచున్నది. కన్నుదెరిచి కన్గొనుము!

నన్నిక వేధించున దేదియు లేదు. స్వస్థత జేకూరినది. నూతనోత్తేజము బొందినట్లు

యేను. సత్యరాజ్యమునకు మార్గము దృగ్గోచరమైనది.

మనుజుడా! ధూళిధూసరితమైన ఆ ప్రళయమేఘమధ్యమునుండి భయంకరమగు ఆ సంగ్రామసీమనుండి జాజ్వల్యమాన మగు నీ రెండలో సింగారముగ కులుకుచు స్వస్తిగీతములు పాడుచున్న ఆమంగళయువతీరత్నమును దిలకింపుము!

ఆదిశక్తీ! నమస్కారము. నమస్కారము. నీకిదె జోహారు. శాంతిదేవీ! నన్నీనాడే సత్యలోకమునకు గొంపోదువా? ధన్యుడను. ధన్యుడను.

---

# పద్మాసనము

'వనవాసి'

ఏనిశీథినీ యౌవనామ్లానదశల
భావవిద్యుల్లతావీథి ప్రణయవతి ప
విత్రదర్శనజ్వాల స్రవించినదియొ,
ఆయమూల్యానురాగ తేజోభిషేక
భాగ్యసుసమాసనాథ మీ పరిసరమ్ము.
ఇది కళావాటి, సౌభాగ్యసదన మంగ
ళాంగణమ్ము, జగచ్ఛోభ లల్లుకొన్న
శాశ్వతైక కల్యాణ ప్రశస్తరంగ
మిందు పచ్చిసౌందర్యముల్ కందళించు.
పాలవెన్నెల మడుగులో పూలముగ్గ
వోలు నీనగస్వామి ప్రేమాలసగతి,
వెండికొండ శంకరుతీవి, వెలయునా 'ప్ర
ణయసమాధి'కి పద్మాసనమ్ము నిష్ఠ.
ధవళహిమనగ కందరతల్పసుప్త
చంద్రికావాహినీ గాన శైత్యమధువు
లివతళింప డెందాన నే నిట వసింతు,
ముచ్చటింతు నాశావమానముగ్ధగోష్ఠి.
ఏయతీతఫలాప్తి శాసించినారొ!
రాగవతులు దిక్సతులట్టి మూగనోము;
ఈయమోఘప్రణయపిపాసాయతి తెగి
తొలకరించు టెప్పుడో! వ్యథావిలహృదయము.
నేనిట వసింప ప్రియతమమానమూర్తి
భావనిశ్శబ్దముగ జీల్చి పలుకరించు;
కలయొ! స్మృతియొ! హృదబ్జవికాసశోభ
బరిమళించు నపూర్వపిపాస యేదొ!
అప్పు డీయంధహృదయమ్మునం దభినవ
జీవరేఖాశుభోదయ శ్రీ లిగుర్చు;
కామ్యలీలాదరిద్ర హృద్గగనవీథి
ప్రణయగర్వశరజ్జ్యోత్స్న పరిణటించు.
కాలవాహినీ పులినతలాల నింకి
పాడువడు నే యమూల్యానుబంధ చిహ్న
లారిపోవునాత్మనో ఊటలూరు మరల
మధుర జీవితాశయ మధుమార్దవములు.
పావనోత్కలి కాకళికా వికాస
జీవన వసంతగీతివిరావములకు
మన్మనోనంత ప్రేమసామ్రాజ్యవాటి
మారుమ్రోగు నవోత్సాహ మంగళముగ.

---

## చింత చచ్చినా పులుపు చావదు



# గురుశిష్యసంవాదము

కూచి నరసింహముగారు, B. A.

శి:—అయ్యా! నమస్కారము.

గు:—శుభీభవ! కూరుచుండుము. నేఁటి ప్రసంగము పరిపాలనవ్యయములఁ గూర్చి జరుగనున్నది గావున అంకెలతోను, వేరీజులతోను నుండి యది కొంచెము విసుగుగలిగింపక మానదు.

శి:—స్వదేశముయొక్క యథార్థస్థితిఁ గనుఁగొనఁ గుతూహల పడువాఁ డామాత్రపు విసుగుభరింపఁగలఁడు లెండు. అదియుఁగాక యట్టి కష్టసమయములను స్వీకరించుటకుఁ గావలయు శ్రమ మీరేపడి పతితలబాధ తగ్గింతురని నే నెఱుఁగుదును.

గు:—ఇవి నమస్కారబాణములు కాఁబోలు! కానిమ్ము. ముందు ప్రసంగమునకుఁ బునాదిగాఁ గొన్ని మాటలు విషయగ్రహణసౌకర్యార్థము మొదటఁ జెప్పకొందము.

శి:—చిత్తము.

గు:—తగిన యుద్యోగులనేర్పఱిచి భూమిపన్నులు మున్నగునవి వసూలుచేయుట, న్యాయస్థానములు నెలకొల్పి వివాదములు పరిష్కరించి దుష్టశిక్షణశిష్టరక్షణములు చేయుట, పోలీసువారినిఁబెట్టి ప్రజల యర్థప్రాణములు కాపాడుట—ఇట్టి సర్వదేశసామాన్యవ్యవహారములు యుక్తవ్యయముతో నడపుట రాజ్యతంత్రములో నొకభాగము. ఇంగ్లీషులో దీనిని Civil administration అందురు.

పరులు దేశముపైఁబడి కొల్లమున్నగు నుపద్రవములు గావించి రాజ్యమునకు నష్టముఁ గలిగింపకుండఁ గావలయు సైన్యమును తగిన జీతములిచ్చి పెట్టి రాష్ట్రరక్షణముచేయుట రెండవ భాగము. దీని నింగ్లీషులో Military administration అందురు.

చెఱువులు, కాలువలు త్రవ్వి, రెయిల్లు మున్నగు గమనాగమనసౌకర్యములు కల్పించి, ఇంక నిట్టి యితరశాశ్వతోపకారకకృత్యములు గావించి, తన్మూలమునఁ బ్రజాసౌఖ్యసంపదల నభివృద్ధిపఱుచుట మూఁడవ భాగము. వీనివలన దేశమునకుఁ దాత్కాలికలాభము కంటె భావిలాభ మెక్కువగాఁ గలుగవలెను. ఇట్టి పనులకుఁ జేయువలయు వ్యయ మత్యధికముగా నుండును. ముందువారికై వెచ్చించునంతధనమును, క్రొత్తపన్నులు యిప్పటివారినుండి రాఁబట్టుట యధర్మమేకాక ప్రజాపీడాకరముగ నుండును. కనుకఁ బరిపాలకు లట్టి పనులకుఁ గావలయుధనమును, ఈయఁగల స్వజనమునుండికాని, విత్తవంతులగు పరదేశీయులనుండికాని ఋణరూపముగాఁ బుచ్చుకొని, దానిపై నుచితమైనవడ్డీ చెల్లించుచుందురు. అందుచేతనే యీవ్యయభాగమునకు ఋణాపాకరణభాగము (Debt services) అనుపేరు వచ్చినది. ఇట్టి యప్పులు సప్రయోజనములై దేశమునకు పూర్ణప్రతిఫలదాయకములై యుండవలెను. ఉండనిచో నవి దేశానర్థకరములగును. అట్టిఋణము లతిమాత్రములుగాకుండ మొదటి రెండు శాఖలకుఁ బట్టువ్యయమును దూరదృష్టిగల ప్రభువులు సాధ్యమైనంతవఱకుఁ గుదించుకొనుచుందురు.

ఈమూఁడు తెఱఁగుల వ్యయమున కగు మొత్తము పోఁగా దేశపుటాదాయమునుండి మిగిలిన నిలువసొమ్మెంత యధికముగానున్న దేశాభ్యుదయ మంతచక్కఁగాసాగును.

శి:—ఎందుచేత?

గు:—దేశపురోభివృద్ధికిని, ప్రజాపుష్టితుష్టులకును ప్రభువులు దాని నుపయోగింపవచ్చును గనుక.

శి:—సరియే, ఇఁక నామూఁడు బాపతులక్రింద ను మనదేశపు వచ్చుబడి యెట్లు వ్యయమగుచున్నదో సప్రమాణముగఁ జెప్పుఁడు.

గు:—బేరీజులలోనికి వచ్చుచున్నాము. సావధానచిత్తుఁడవై వినుము. 1925–26వ సంవత్సరమున మన దేశపు టాదాయమెట్లు వ్యయింపఁబడెనో పరిపాలకులు ప్రకటించిన యీక్రింది తఖ్సీళ్ల వలన గోచరించుచున్నది.

i. మొదటి భాగముగు సామాన్య పరిపాలన వ్యయముల నిమిత్తము:— } 39.2%

(విద్యావ్యాప్తికైన 7.6% ను, వైద్యకృత్యములకైన 2.28% ను, ప్రజారోగ్యరక్షణమునకైన 1.25% ఇందుఁ గలిసియున్నవి.)

ii. రెండవ భాగముగు సైన్య పోషణమునకు:-
(పోలీసుశాఖకగు వ్యయము i లోఁ జేరినది అదియిందు లేదు.) } 39.5%

iii. మూడవభాగముగు ఋణాపాకరణమునకు:— } 15.2%

ఇతర ప్రయోజనములకు 6.1%

100.0

శి.—అనఁగా ఆయములో 93.9% అప్పులకును, సేనలకును, సామాన్యపాలనకృత్యములకును, వినియుక్తమైన దన్నమాట; రాష్ట్రీసత్వాభివృద్ధికై వినియోగించుటకు 6.1% మాత్రమే మిగిలినదన్నమాట.

గు:—ఔనట్లే. విద్యారోగ్యాదిపోషణముకై వెచ్చించిన 10.59% మాత్రమా 93.9% లో నిమిడియున్నది. ఇది పరపరిపాలనములో నున్న మన దేశపుస్థితి. ఇఁక స్వాతంత్ర్యశక్య మనుభవించుచు ఆయవ్యయములు తమ యధీనతలో నుంచుకొన్న ప్రజలదేశమగు అమెరికా సంయుక్తరాష్ట్రములస్థితి యీసంవత్సరమున నే యెట్లుండెనో పోల్చి చూచుకొందము.

శి:—చూచుకొనవలసినదే. ఒకటి పరమదరిద్ర దేశము; రెండవది లక్ష్మీదేవి యెప్పుడు తాండవమాడుచుండు మహాభాగ్యవంతమగు దేశము.

గు:—I. సామాన్య పరిపాలన వ్యయములకు:— 7.8%
(విద్యాదులకై చేసిన వ్యయము IV లో నున్నది. ఇందుఁ జేరలేదు.)

II. సైన్యపోషణమునకు:— 18.7%
(పోలీసుశాఖకైన వ్యయముకూడ నిందే యున్నది.)

III. ఋణములకు:— 22.3%

IV. ఇతర ప్రయోజనములకు:— 51.2%

100.0

శి:—అబ్బా! ఋణ, సేనా, పరిపాలన, వ్యయములకు శ్రీమంతులగు నమెరికాసంయుక్తరాష్ట్రములవారు 48.8% ఖర్చు పెట్టినారు మనము 93.9% ఖర్చు పెట్టినాము. ప్రజాపుష్టికరములగు పనులకువారు 51.2% వినియోగపఱిచినారు, మనము 6.1% మాత్రమే వినియోగపఱుచుకొన్నాము.

గు:—51.2% లో విద్యాసంబంధవ్యయము కలిసియున్నది గనుక నందుకై వారువ్యయముచేసినది 31.7% మాత్రమే యని చెప్పవలయును.

శి:—అయినను మనకంటె నైదురెట్లుఁ బైగా వారు వెచ్చించుకొన్నారన్నమాట. విద్యావ్యాప్తికైనను మనవారు 7.6% వ్యయముచేసినారు. వారు 19.5% వ్యయముచేసినారు.

గు:—ఔను. ఆ స్వల్పవ్యయములోఁ గూడ నొక యన్యాయము గలదని కుమారప్పగారు వ్రాసినారు.

శి:—ఏమది?

గు:—హిందూదేశపరిపాలకులు చదువునిమిత్తము దేశీయులగు హైందవుల బిడ్డల కొక్కొక్కనికి 4 అణాల చొప్పునను, దేశమందుండు విదేశీయులగు యురపియనుల బిడ్డల కొక్కొక్కనికి 25 రూపాయలచొప్పునను ఖర్చు పెట్టుదురఁట.

శి:—వారి దృష్టిని తెల్ల విదేశీయశిశువు నల్ల స్వదేశశిశువుకంటె నూఱురెట్లు విలువగలవాఁ డన్నమాట. ఇట్లు చెప్పుటకాధార మేమి?

గు:—లజపతిరాయిగారు వ్రాసిన గ్రంథము.

శి:—ఇఁక సామాన్యపాలనకృత్యములకై అమెరికావారికంటె మన కంత యెక్కువ ఖర్చగుటకు హేతువేమి?

గు:—కుమారప్పగారు హేతువులు వివరించి చెప్పినారు, విను:

పెరటిలోఁ బండించినకూరకంటె బజారుకూర ప్రియమైనట్లు, ఎక్కడనోయుండు "గ్రేట్బ్రిటను" నుండి దిగుమతి చేసికొనిన యుద్యోగిబృందము, దేశీయోద్యోగిబృందముకంటె నెక్కువ వ్యయాత్మకములగును. తెల్లవారి తిండి, దుస్తులు, ఉనికి, భోగములు, ఇనవానికంటె ఎన్నోమడుఁగులధికవ్యయసాధ్యములు. పెద్దయుద్యోగములకు బ్రిటన్వారినే తెత్తురుగాని మనవారిని నియోగింపరు.

శి:—బ్రిటిష్పరిపాలనప్రారంభదశలో వారిభాష, రాజ్యపద్ధతులు, మనకు క్రొత్తవి గనుక వారివారిని వారెత లోకానుభవములేని యల్పవయస్కులైనను, దెచ్చి యుద్యోగములలోఁ బెట్టి, పెదపెద్ద జీతములిచ్చి, యచిరకాలసేవాంతమున నమితపారితోషికములతో దేశమునకుఁ దిరుగనంపుట క్షంతవ్యము గావచ్చును గాని, రాజనీతిపారంగతులగు హైందవులు వేలకొలఁదిగా నుండు నీకాలమునఁగూడ, నట్లుచేయుట యన్యాయము కాదా? అల్పవ్యయముతోఁ బాలనకృత్యములు జరిగించుకొని, నిలువ సొమ్ముతో దేశధనోత్పాదనశక్తి హెచ్చు చేయరాదా?

గు:—చేయవలసినదే. చేయకుండుట యధర్మమే. కాని నీయరణ్యరోదనములు వినువారెవరు? పొరుగింటవారిఁగడవ విరుఁగ జుఱ్ఱుకొనుట కలవాటుపడిన యదృష్టవంతుఁ డదివదలి నిజగృహమునకేగి నిస్సారభోజనము చేయుట కిష్టగించుట యెట్లు? కథాప్రవాహమున కడ్డురాక శ్రద్ధతో విను.

శి:—చిత్తము.

గు:—1913 వ సంవత్సరమున నెలకు వేయిరూపాయలు అంతకంటె నెక్కువ వేతనముగొను నుద్యోగస్థులలో నూటికి 96గురు తెల్లవారును, మన నల్లవారు నలుగురును ఉండిరట. రాజ్యములో యూరపియను ఉద్యోగుల సగటుజీతము రూ. 933లును హైందవోద్యోగుల సగటుజీతము రూ. 371లును, అని కుమారప్పగారు వ్రాసినారు.

శి:—పరిపాలనవ్యయము ప్రజావర్గములోని యొక మనుష్యుని సగటురాబడి కిన్నిరెట్లకంటె మించఁగూడదు—అని యొక మితి యేర్పఱుచుకొనుట మంచిదని మాలసూత్రములలోఁ జెప్పినట్లు నాకు జ్ఞప్తిలోనున్నది.

గు:—ఔను, అట్లే కుమారప్పగారు మొదటఁ జెప్పినారు. ఆ సూత్రమిట నెట్లు వర్తించు చున్నదో చూచుకొందము. పన్నుచెల్లించు మనుష్యుని సంవత్సరపు సగటురాబడి 1911 వ సంవత్సరములో రూ50లు—అనఁగా నెల 1కి రూ 4-2-8 అన్నమాట. అందుచేత, యూరపియను ఉద్యోగియొక్క సగటాదాయము దానికి 224 రెట్లున్నది, హైందవోద్యోగి యొక్క సగటాదాయము 84 రెట్లున్నది.

శి:—పన్నుచెల్లించుటకుఁ గల ప్రజాసామర్థ్యమునుబట్టి చూచిన రెండునుఁ గడునధికముగ నున్నట్లే కాన్పించుచున్నవి.

గు:—ఔను. అమెరికాసంయుక్తరాష్ట్రము లన్నిదేశములకంటెను ధనవత్తమములైనవి అందులో న్యూయార్కుమండలము తక్కిన యన్నిమండలములకంటెను ధనవత్తమమైన మండలము. దాని పెద్దపరిపాలనాధికారికి సంవత్సరమునకు 10 వేల డాలర్లు (అనఁగా రమారమి రూ. 26,666లు) జీతమిత్తురు. అది యామండల ప్రజలలో నొక్కని సగటాదాయమునకు 14 రెట్లు. ఇఁక మన బొంబాయి గవర్నరుగారి వర్షవేతనము రూ. 120,000లు; పన్నుచెల్లించువాని సగటురాబడికి అది 2,400 రెట్లు.

శి:—పొట్టివాని ప్రక్క నిలఁబెట్టి చూచిన పొడుగుమనుష్యునివలె, అమెరికాతోఁ బోల్చి చూచుకొను మన దేశపరిపాలనవ్యయము మఱియు విపరీతముగాఁ జూపట్టుచున్నది.

గు:—1913 వ సంవత్సరము తర్వాతఁ గొన్ని పెద్ద యుద్యోగములు తత్పూర్వముకంటెఁ దఱచుగా మన హిందూదేశస్థుల కిచ్చుచున్న మాట నిజమే. దాని వలన నల్పసంఖ్యలగు దేశీయులు బాగుపడుచున్నారు

గాని, అధిక వేతనములవలన దేశప్రజలకుఁ గలుగుచున్న పీడ యీవిధముననే యున్నది.

శి:—అత్యున్నతస్థానము లింకను ఆంగ్లేయుల చేతనే యధిష్ఠింపఁబడుచున్నవి. ఎన్ని చీమతలకాయలు గలిసిన నొక యేనుఁగు తలకాయ కాఁగలదు? వారు నిలువ చేసికొను పెద్దమొత్తములును, ఉద్యోగానంతరము బహుమానరూపముగా వారి కొసఁగఁబడు గొప్ప పెన్షనులును హైందవు లిచ్చు పన్నులనుండియే సంగ్రహింపఁబడినవైనను, ఆ యుద్యోగు లవియన్నియుఁ బట్టుకొని స్వదేశమునకుఁబోయి యచటఁ జక్కఁగా వ్యయించుకొని సుఖపడుచున్నారు. ఆ వ్యయములాభమైనను మనదేశపు వారికి దక్కక యన్యదేశీయులకుఁ బోవుచున్నది. ఇది కడుపులో కత్తుల్లిన్నట్లున్నది.

గు:—సత్యమే వచించితివి.

శి:—ఇఁక సేనావ్యయ ఋణవ్యయములనుగూర్చి సెలవిండు.

గు:—ఆ సంబంధమైన ఖర్చుమొత్తము వివిధదేశములలో 1922 వ సంవత్సరమున కెట్లుండెనో చూపుచు షా పండితుఁడుగా రొక పత్రిక వ్రాసిపెట్టినారు. అది పరికించినయెడల నొకరు చెప్ప నక్కఱలేకుండఁగనే, యీ రెండు విషయములందును మనదేశస్థితి యెట్లున్నదో స్పష్టముగా గోచరింపఁగలదు.

1922-వ సం॥ సైన్యఋణ సంబంధవ్యయ పట్టిక

| దేశము | నూఱుపాళ్ల వ్యయములో నెన్నిపాళ్లు? |
|---|---|
| ఇండియా | 63.8 |
| గ్రేట్ బ్రిటన్ అండ్ ఐర్లండు | 53.7 |
| ఆస్ట్రేలియా | 48.3 |
| కెనడా | 24.2 |
| దక్షిణాఫ్రికా | 5.2 |
| స్పెయిన్ | 17.6 |
| ఫ్రాన్సు | 20 |
| ఇటలీ | 17.3 |
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | 38.2 |
| జపాను | 49 |

శి:—మీర లిట్లు శ్రమపడి చెప్పనక్కఱలేదు. అద్దములోవలె సత్యము స్పష్టముగాఁ గన్పట్టుచున్నది. భాగ్యములోఁ గాకున్నను వ్యయములోనైనను మనదేశ మగ్రస్థానమాక్రమించినది. సంతోషము. సేననుగూర్చి ప్రత్యేకముగా షాపండితుఁ డేమైనఁ జెప్పినాఁడా?

గు:—ఆ, యిట్లు చెప్పినాఁడు:—"హిందూదేశపు సేన యెంతవ్యయాత్మకమో అంత నిరుపయోగము. ఉన్నదని చెప్పు నుపయోగముండెనె దానికగు వెచ్చమెంతో హెచ్చుగానున్నది."

దీనిఁగూర్చియే, ప్రస్తుతపు మంత్రిగారగు రాంజే మెగ్డానల్డుగారు చెప్పిన మాటలివి:—"ఈవిషయమున ఇండియా యెడల మనము న్యాయ్యముగాఁ బ్రవర్తింపలేదనుట నిస్సందేహము. ఇండియాలో నిలకొల్పిన సేనలో విశేషభాగము (అర్ధభాగమని చెప్పుటకెంతమాత్రము సంశయింపఁబనిలేదు.) కేవల హిందూదేశమునకుఁ గాక యితరప్రయోజనములకు—అనఁగా బ్రిటిష్ సామ్రాజ్య ప్రయోజనములకు—మనకుఁ గావలసియున్నది. కనుక దానికగు వ్యయము బ్రిటిష్ సామ్రాజ్యము భరింపవలెనుగాని, ఒక్క హిందూదేశము భరించుట ధర్మముగాదు."

శి:—అప్పులనుగూర్చి చెప్పవలసిన దేమియు లేదా?

గు:—లేకేమి? అదియొక యగాధమైన గాథ:—ఇంగ్లండువర్తకులు కొందఱు సంఘీభవించి "ఈస్టిండియా కంపెనీ" యను పేర హిందూదేశములోఁ దొలుత వణిగ్వ్యాపారములకై ప్రవేశించి, అప్పటి హైందవప్రభువుల నాశ్రయించి యచ్చటచ్చట నిష్కృవి యిరువులు సంపాదించుకొని, తమ యదృష్టబలమునను, దేశీయప్రభువులయైకమత్యాభావముచేఁ గలిగిన యంతఃకలహములవలనను చివరకు మనదేశమునకుఁ బ్రభువులైరన్న మాట నీకు జ్ఞప్తిలో నున్నదికదా!

శి:—ఆ, ఉన్నది. విక్టోరియా మహారాజ్ఞిగారి పరిపాలనలో నింగ్లండు ప్రభువులే ఆ యిండియా రాజ్యమును కంపెనీవారినుండి బదలాయించుకొని తాము పుచ్చు

కొన్నారు. కాని కంపెనీ పరిపాలనలో ఇండియానుండి ఆంగ్లప్రభువుల కేమియు లాభమే ముట్టలేదా?

గు:—ముట్టకేమి? కంపెనీవారికి ఫర్మానా యిచ్చినది ఆంగ్లప్రభువులే. పార్లమెంటువారు, పరిపాలనలోని న్యాయాన్యాయవిమర్శనమంతగాఁ జేసియుండలేదుగాని, కంపెనీ వారెట్లు ఏలుబడి సాగించుకొన్నను, తమ యాంగ్లరాష్ట్రకోశములో సాలునకు 4 లక్షల పౌన్లు చొప్పునఁ బడవేయుచుండవలెనని వారితో షరతు గావించుకొన్నారు. ఇది "హిందూప్రభువర్గ ప్రజావర్గమును దోఁచుకొనుటకు కంపెనీ వారికిఁ గామచారానుజ్ఞ యిచ్చుట" యని రాబర్టుసెట్టుగారు తమపుస్తకములో వ్రాసినారు.

శి:—సరియేకాని, రాజ్యపరివర్తనకాలమున అప్పాస్తులెట్లు పంచుకొనినారు.

గు:— ఆస్తియంతయుఁ బాలనా ప్రణేతల Directors) కు సంక్రమింపఁ జేసినారు. అప్పు మన హిందూదేశమున కంటఁ గట్టినారు.

శి:—అంతడబ్బు మన దేశమునుండి లాగుకొనిన వారికి అప్పు లేల చేయవలసివచ్చెను?

గు:—ఇండియా వశపఱుచుకొనుటకును, స్వప్రయోజనములకొఱకు చీనా, బర్మా, ఆఫ్ఘనిస్తాన్, పర్షియా, మాల్టా, మున్నగు ఏషియా ఆఫ్రికాలలోని స్థలములందుఁ గావించిన యుద్ధములకును, అప్పులు చేయవలసి వచ్చినది. ఇవేమియు ఇండియాకు ప్రతిఫలరూపముగా లాభములు తెచ్చు ఋణములు గావు. 1858వ సంవత్సరమున జరిగిన పెద్దపితూరీకైన 4 కోట్ల ఖర్చును ఆఋణములలోనే చేర్చినారు.

శి:—అం దాశ్చర్యమేమున్నది? హైందవసేనలు తిరుగఁబడినవి గనుక, దానికి శిక్షగా ఆ యప్పంతయు హిందూదేశముపై వేసినారు.

గు:—నీకాశ్చర్యము లేదుగాని, జగత్ప్రసిద్ధిఁ గాంచినజాన్‌బ్రైటుగారికి మాత్ర మాశ్చర్యమే వేసినది.

శి:—ఆయన యేమిచెప్పినారు?

గు:—"పితూరీకి కారణము పార్లమెంటుయొక్కయు, ఆంగ్లప్రజలయొక్కయు దుష్పరిపాలనమే కనుక ఆంగ్లదేశప్రజనుండియే పన్నులరూపముగా వసూలుచేసి యా 4 కోట్ల పౌండ్ల ఋణమును దీర్చుట న్యాయ్యము" అని.

ఇట్టి వ్యర్థఋణముల మొత్తము 1874 సం॥లో 100 కోట్లుండెనఁట. క్షామబాధానివారణార్థము ప్రతి సంవత్సరము మిగులుబడి వేఱుగా నుంపఁబడవలయు 1 కోటి 50 లక్షలనుండియును, ప్రజలపన్నుల బరువును తగ్గించుట కుపయోగింపఁబడవలయు ఆయపుపెచ్చు మొత్తములనుండియును, ఏపాట్లోపడి చెల్లుపెట్టి, ఆ యప్పులను 1915వ సంవత్సరములో 30 లక్షల పౌండ్లుమాత్రమే యుండునట్లు చేసికొనినారఁట.

కాని, మొన్న జరిగిన ప్రపంచఘోర సంగ్రామములో—షా పండితుఁడుగారి గణనముప్రకారము ఇండియాకు 180 కోట్ల నష్టము గలిగినకాలమందు—1917వ సంవత్సరమున మనదేశమునకు సంరక్షకులుగాను, దాని యోగక్షేమములకు పూఁటకాపులుగాను ఉన్నామని చెప్పుకొను మనపరిపాలకులు, గ్రేటుబ్రిటన్ దేశమునకు 10 కోట్ల పౌండ్లు దానముచేసినారఁట!

సాలుసాలునఁ జెల్లించు పెద్దపెద్ద వడ్డీమొత్తములుగాక, యీ నిరర్థకఋణములు నేఁడు 20 కోట్లకుఁ బైగా నున్నవఁట.

శి:—అందుచేతనే కాఁబోలు—ఇండియాకొఱకని చేసిన పరదేశపుటప్పులు దుష్కరముగా నున్నవనియు, స్వాతంత్ర్యసంపాదనము తరువాత, తత్పరిశీలనార్థము కూర్పఁబడు నిష్పక్షపాతసభవారు, అన్యాయములని తీర్పుచెప్పు ఋణములు, స్వతంత్రహిందూదేశము నిరాకరించివేయుననియు, అట్టి ఋణములకు బాధ్యులయిన యింగ్లీషువారి దేశమే వానిని దీర్చుకొనవలసి యుండుననియు—1929వ సంవత్సరపు కాంగ్రెసులో, భారతీయులు నిశ్చయముచేసికొన్నారు.

గు:—ఔను. చాలసేపయినది! నేఁటి ప్రసంగ పర్యవసానము సంక్షేపముగాఁ జెప్పు, చూతము!

శి:—చిత్తము. మొదటిమూఁడు బాపతులలోఁ జేరిన 93.9% వ్యయమును మనదేశసారమును బీల్చివేయుచున్నది; కాని, దేశపుష్టికి వినియోగపడుటలేదు. అందు విశేషభాగము మనదేశములో వ్యయింపఁబడక పరదేశములో వెచ్చింపఁబడి, యచటివారి కుపయోగించుచున్నది గాని మన కుపయోగపడుటలేదు. ఈపరిపాలనపద్ధతి మాఱక యిట్లే సాగుచున్నచోఁ గొలఁది కాలములో భారతదేశము పరమదరిద్రదేశము గాకమానదు.

గు:—శ్రద్ధతోనే వినినావు; సంతోషించినాను. ఇప్పటి కింతటితోఁ జాలింతము.

శి:—నమస్కారము! సెలవు!

గు:—శుభమస్తు!

---

## రాట్నము

వడ్డాది సీతారామాంజనేయులుగారు అష్టావధాని, (కవితాసమితి)

పాడఁగవలంతి జిలిబిలిపాట లెన్నొ
సుధ లొలుక, లేగులాబి నాజూకు చిలుక;
సారె సారెకు నొనరు ఝుంకార సరణి
'సకల మానవసౌభ్రాత్ర' మని నడించి.

తప్పులెన్నని సవరింపఁ దాల్మిఁ గొంచుఁ,
బరులు తన్నీసడించిన సరకుఁ గొనక;
ఘోరదారిద్ర్యము నడంపఁ బోరు లందు
వ్యూహము లభేద్యముగ నెన్నియో రచించి.

కులుకు తులకింప, మేనులు పులకరింప,
సంతకంతకు నులివు సొంపగ్గలింపఁ
బాడుచుండును గీతప్రబంధ వితతి
'నభ్యుదయ, మభ్యుదయ'మంచు నమృత శక్తి.

ఒప్పు లన్నింటి నొకచోటఁ గుప్ప వోయు,
నట్టి వ్యామోహములనైన నిట్టనెట్టు,
నాశ్రయించిన ప్రజకెల్ల నంది యిచ్చు
నిజహృదూర్జిత స్వాతంత్ర్య విజయలక్ష్మి.

వరసుదర్శనోజ్జ్వలితారిహరణగుణము,
సురభిసురభిళవితరణ స్ఫురణ నిరతి
గీతికలఁ బాడురాట్నమే కేలొనర్చె
నదిర! ధన్యము ధన్య మయ్యాదియె గదర!

'చరకాసేవిక'. 'మణిద్వీపము'.

---

# సంగీత త్రిమూర్తులు

పండిత వింజమూరి వరాహనరసింహాచార్యులుగారు

దక్షిణదేశమందలి కర్ణాటకగానచరిత్రయందు పదునెనిమిది పందొమ్మిదవ శతాబ్దములు వన్నెగాంచినవి. సంగీతమునకీకాలము బంగారుయుగముగా నెన్నబడుచున్నది. మేటిగాయకులై—కవులై—భక్తులై వెలసిన వాగ్గేయకారులు శ్రీ త్యాగరాజు, దీక్షితులు, శ్యామశాస్త్రి, తమ నూతనసంకేతములను వెలయింపజేసికొనిన దీకాలమే. వీరివలననే ఈకాలము ధన్యతను జెందినది. వీరివలననే సంగీతము సంస్మరణీయమైనది; భక్తిపంతమైనది; భావపూరితమైనది; ఆధ్యాత్మికతత్త్వనివేదనసమర్థంబైనది. వీరివలననే భక్తిసంగీతముల యవినాభావము బాగుగ వెల్లడియైనది. పూర్వము జయదేవుడు, చైతన్యుడు మున్నగువారు తమ భక్తిప్రబోధమునకు సంగీతము మిగుల నుపకరించుచున్నదని యెంచి తమ జీవితమందు చూపినట్లు వీరును "సంగీతజ్ఞానవిహీనులకు మోక్షము లే"దని చెప్పుచు తమ జీవితమందు చూపినారు. కావుననే వీరు సంగీతలోకమునకు సంస్మరణీయులగుచున్నారు. వీరు మువ్వురును వింతగా నొక్కకాలమున అనగా పదునెనిమిదవ శతాబ్దాంతమందును, పందొమ్మిదవ శతాబ్దాదిని వెలసియుండుటచేతను ఒక్క ఊరితిరువారూరునందుద్భవించుటచేతను, సంగీతమున నొకరినొకరు అతిశయించుటచేతను వీరిని సంగీతలోకము త్రిమూర్తులుగ భావించుట భావ్యమే.

ఈమువ్వురు ఒక్కమతము—నారదమతము—ననుసరించినట్లు విదితము. కాని వీరి పద్ధతులయందు కొంత వ్యత్యాసము చూపట్టకపోదు. వీరిమువ్వురి సంగీతఫక్కియు, పోకడలును, ఆశయములును ఒక్కటిగా నుంటలేదు. సంగీతకల్పనాశక్తియందు వీరు ఒకరికొకరు తీసిపోక తమ నైసర్గికభావపూరితమగు ధోరణితో సంగీతలోకము నఱికట్టి తమ ప్రత్యేకవ్యక్తుల ననుభవింపజేయుట యాశ్చర్యమే. తాము సంగీతలోకము నుద్ధరించుటకు వలయు సాధనములను ఒకరికొకరు సంప్రదించుకొనకయే యట్లు గావించుట ఈశ్వరతత్త్వము వీరియందు జొచ్చుటవలననే. తాము నడచిన నడతలు వివిధములయ్యె, పాడినపాటలు పెక్కుభంగులయ్యె, ఇవెల్ల సంగీతభాగ్యోదయమునకే - దేశకల్యాణమునకే - యనక తప్పదు వీరిమార్గములు వ్యత్యాసములయ్యె, సమస్తనదులు సముద్రమునకే దారితీయునట్లు, అవి ఒక్కయాశయమునే-భగవంతుని జేరుటకే సంగీతమే సులభసాధనము అను అంశమునకే చేరవచ్చుచున్నవి. ఈ మేటి యాశయము దేశమున సుస్థిరమగుటకే వారు ఏకోన్ముఖులగుట జాతము. మహత్తరమగు వీరికార్యము వీరిని సంస్మరణీయులుగా జేయుచున్నది.

## (1) త్యాగరాజు

పైసంగీతకోవిదులలో త్యాగరాజే తొలిరా జగుచున్నాడు. ఇతని సంగీతగరిమ యెట్లున్నను భగవంతునియందాత్మార్పణమొనరించి, భక్తుడై, మైమఱచి, సోహంత్వము జెందియుండుటయే ఈతనికీ యపూర్వస్థానము జేకూర్చినది. "సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గము" లేదనియు, "స్వరరాగసుధారసయుతభక్తి స్వర్గాపవర్గము" అనియు పెక్కుమాటలు పాడి, అనుభవించి తన జీవితమందు ధ్రువపఱచెను. కావుననే ఇతడు ఆచార్యపదవి నలంకరించుచున్నాడు. తాను భక్తుడై యందఱట్లగుటకు హెచ్చరించుచుండెను. కావున ఇతడు మనకు మిత్రుడగుచున్నాడు. ఎవరికిని సాధ్యముకానంతటి యూర్ధ్వమార్గమున సంచరించుచు, జనమును నిర్లక్ష్యము గాజూడక దానితో కలసిమెలసి సర్వసులభుడైయుండి తనయున్నతాశయములను వారికి బోధసేయుటయే తనపనిగ నితడు భావించుకొనియెను. తనబోధనలు పెక్కుమందికిష్టము కాకపోయినంతమాత్రమున వెనుదీయువాడు కాడు. వారిగూర్చియు, వారి ప్రపంచమగ్నతను గూర్చియు మిగుల జాలిపడువాడు. అంతేకాదు. వారిని దిద్దుటకు

గూడ యత్నించువాడు. తనపై నసూయతతో మెలఁగువారిని సహితము కఠినముగా బలుకక తన సహజ శాంతిమానసమున వారి గూర్చి చెప్పుచుండువాఁడు. ప్రజలందఱు ఒక్కపెట్టున భక్తులగుదురను నమ్మిక మీ తనికి కాని అట్లయిన ఈతని కెంతటి యానందము గలుగునో చెప్పజాలము. తనకాలమందలి ప్రజలను గూర్చియు, సన్యాసులను గూర్చియు, భూసురులను గూర్చియు, రాజులనుగూర్చియు, అపుడపుడీతడు చెప్పుచుండుటచే నప్పటి యాయా చరిత్రాత్మకాంశములు కొంతవఱకు తెలిసికొనగలము. ఇవి ఇతని భక్తిప్రబోధమునకు తోడగుచు, ఈతనిని మరింత భక్తిమంతునిగ జేయజాలుచున్నవి. దుర్విషయలోలురై కామక్రోధాది అరిషడ్వర్గములను జయింపజాలక, తుచ్ఛసుఖముల కియ్యకొని, నియతిధర్మములనైతము యనువర్తింప లేకుండిన సామాన్య ప్రజలనుగాంచినపుడెల్ల యీతనిమనస్సు సంక్షోభము చెందుచుండెను. జగములను మోసపుచ్చుటకు, వేకువనే లేచి, విభూతిబూసి, జటలుధరించి, పంచాగ్నులనడుమ పరితపించు కపటసన్యాసులు భక్తిమార్గమును తెలియలేరని యితనిమతము. భూపాలురు తమ కలిమిలేములు కావిడికుండలని భావింపక తమ రాజ్యాధిపత్యమును గోల్పోయి పాశ్చాత్యుల యాదరణకు పాత్రులయ్యు, డాంబికవృత్తులతో మెలగుచు, కవులు, సంగీతవేత్తలు-ఇత్యాదులచే నుతింపబడుటకుకోరుట ప్రపంచతత్త్వమును గ్రహించిన యీతనికిష్టము లేకుండెను. ఇక భూసురులు అప్పటికే చెడుమార్గముల నవలంబించిరట. వేదములను జక్కగ చదివి, సమస్త శాస్త్రములందును పాండిత్యము సంపాదించియు, భక్తిమంతులుగ మెలగక పోవుటయు యీత డిష్టపడువాడు కాడు. ఇట్లు తనప్రపంచము మనస్సంక్షోభమునకు కారణమై ఒక్క నిముసమైనను, భగవంతుని వీడనంతటి దుర్బలమనస్కునిగ జేసెనందుము.

త్యాగరాజుభక్తి కితనిసంగీతము మిగుల తోడగుచుండెననక తప్పదు. తనకాలమునందు తనయూరి సంగీతవిద్వాంసుడు శొంఠి వెంకటరమణయ్యవద్ద నొక్కవత్సరము మాత్రము సంగీత మభ్యసించెనని చెప్పుదురు. కాని యంత యల్పకాలములోనే యీత డింతటి కోవిదుడాయెనని యెంచుటకు వీలులేనందున ఈతని సంగీతము సహజమైనదని చెప్పవలసియున్నది. తన "స్వరరాగ సుధారస" మనుకీర్తనయందు చెప్పుకొనినట్లు నారదునివలన తనకు లభ్యమైన "స్వరార్ణవగ్రంథ" మే యీతనికి తోడగుచుండెనని నమ్ముటకు తావుకలదు. ఇతడు నారదుని తన గురువుగ భావించెననుటకు ఈతని కీర్తనములే నిదర్శనము. ఇందుచే నతని సంగీతము తాత్కాలికమందలి దానికి భిన్నముగ నుండవచ్చుననుటకు హేతువుకలదు. ఈతని సంగీతము వెంకటమఖిమత మనుటకు కొందరితని గురువు వెంకటమఖి ప్రపౌత్రుని శిష్యుడుగ జెప్పుదురు. కాని పైసంగతివలన ఇతని సంగీతము "స్వరార్ణవ" గ్రంథానుసరణీయమని యెంచవలసియుండుటచే నితడు వెంకటమఖిమతము నవలంబింపలేదని స్పష్టమగుచున్నది. కొందఱు త్యాగరాజు కీర్తనముల నచ్చొత్తించినపుడు వానిని వెంకటమఖి మేళకర్తల పేర్లతోను, మరి జన్యరాగములతోను చెప్పకపోవుటయు నిర్ణయించుటకు తోడగుచున్నది.

ఇట్లితని సంగీతపద్ధతి ఏదైనను నితనిధోరణి ఇతని భక్తి ప్రబోధమునకు తగియున్నదంటిమి. అనగా నితని సంగీతసౌష్ఠవము సంగీతలోకమున నీతని సంస్తవనీయునిగ జేయుచున్నది. పూర్వపు అష్టపదులు తరంగముల వలెగాక ఈతని కీర్తనలు క్రొత్తదారిని చూపుటచే నవి యనుసరణీయములుగ గూడ నున్నవి. భావమునకు దగిన పదములు రసపోషణ వీనియందు కందుము. హృదయము భావపూరితమగుతఱి ఈతని నోటనుండి వెడలిన యీకీర్తనముల రసము అనుభవవేద్యమే కాని వ్రాయవలనుపడదు. కీర్తనభావ మూహ్యమగుకొలది ఆ సంగతినే మరల పదేపదే చెప్పు భాగ్య మీకీర్తనములందే చూతుము. ఇట్లు చెప్పుటయే 'సంగతులు' పాడుట యందురు. ఈనూతనఫక్కి తదితరములందు కానము. తాను భక్తుడై రోమరోమమునకును అనుభవించిన యాధ్యాత్మికమునంతను అంత సులభముగ కన్నులగట్టినట్లు చిత్రలేఖవలె చెప్పజాలుట ఇతనికే చెల్లు. ఇట్లితని కీర్తనములు రసపూరితములై, అందుకు తగిన రాగపోషణతో భావపూరితములై అలరారకపోవుటలేదు.

త్యాగరాజు అనుసరించిన పై నూతనపద్ధతి గాయకుని కల్పనచాతుర్యమును గోరుచున్నది. కొందరు తెలంచునట్లు పల్లవిపాడుట, స్వరకల్పనచేయుట, గాయకుని మేధాశక్తి, కల్పనాచాతుర్యము, సమర్థత వెల్లడి చేయుచున్నవనుటకన్న నీతని కీర్తనములే యందుకు అనువగుచున్నవని చెప్పుటయే చెల్లు. ఇందుచేతనే ఇతని కీర్తనములు పాడగలుగువారు సంగీతమును పూర్తిగ నెఱిగి యుండవలయునని యందురు. భావప్రకటన సమర్థంబులగు ఈతని కీర్తనంబుల యర్థము, రసము, రాగము, అనుభవించి పాడగల్గు సామర్థ్యము, ప్రతిగాయకుడు సంపాదించిన, ఇక పల్లవి, సులకరాళ్లనబోలు అర్థవిహీనపు స్వరపొకడలు ఏలనో బోధపడకున్నది.

త్యాగరాజుకీర్తనములందు యతని లోకైకభక్తిరసమే తెలియును కాబోలు నన్నట్లు భక్తిరసముతప్ప నితరములుకావు. ఇతనికి నవరసములతో నొప్పించుట తెలియదనుటకన్న యితని కట్లుసేయుట కిష్టములేకుండె ననుటయే చెల్లు. ఇతని సమకాలీనుడు ముద్దుస్వామి దీక్షితులు మున్నగువారివలె యంత పండితుడు కాడని యందురు. కాని విద్యాగరిమ యెట్లున్నను ప్రహ్లాదునివలె సర్వకాలములందు భగవంతుని చూడక, యనుభవింపక, ఆనందింపక, సోహంత్వము చెందక యుండలేకపోయెను. కావున నితడుందరిలో నగ్రస్థాన మలంకరించినాడు. ఇతని సహజభక్తిరసమే యిందుకుగూడ కారణమాయెను. తాను యెచటజూచినను భగవంతునే, తాను ఏమివినినను భగవంతునిగూర్చియే. ఇందుకు ఇతని "నిను వినా నామదెందు"; "సొగసుచూడతరమా"; "రామా నీపై తనకు ప్రేమబోదు"; "లావణ్యరామ కన్నులారజూడరే" మున్నగు కీర్తనములే నిదర్శనములు. ప్రతిభక్తునివలె, ప్రపన్నునివలె, భగవంతుని దివ్యమంగళవిగ్రహమునుజూడవలయునను కుతూహలము, ఆర్తి, యాతురత, యెడబాటువలన కలిగిన సంతాపము, మనోదైన్యము మరల సేవింప నిచ్చగించియుండుట, ఆచార్యునియెడ భక్తి విధేయత, భగవంతుని విషయమున డంబము లేకుండుట, యెల్లప్పుడు భగవంతుని స్మరించుట! నాల్గువేదములు చదివినవాడైనను భక్తిలేనియెడ నట్టివానిని గౌరవింపకుంట, సంసారులనుజూచి, సర్పములనుజూచినట్లుగ భావించుట, ప్రకృతితో జేరిన వస్తువులు భోగ్యములనెడి తలంపులేక పోవుట, సర్వేశ్వరుడు ప్రీతితో వేంచేసియున్నట్టి దివ్యస్థలముల విషయమున ప్రీతియు, మంగళాశాసనమును-మున్నగు అనేకగుణములు ఈతనియందు చూతుము. ఈ యాసంగతులు అతనికీర్తనములందు గ్రహింతుము. ఇంతియేగాదు. సమస్త వేదవేదాంగార్థములు, పురాణాదుల సంగతులుగూడ యతనికీర్తనములు చెప్పుచుంటచే వీనిని "త్యాగోపనిషత్తులు" అని చెప్పుటయుకలదు.

## (2) ముత్తుస్వామి దీక్షితులు

సంగీతసంప్రదాయపారీణుడగు ఈతడు రామస్వామిదీక్షితులకు జ్యేష్ఠకుమారుడై, క్రీ. శ. 1775 మన్మథసంవత్సరమున త్యాగరాజువలె తిరువారూరునందుదయించెను. ఇందుచే త్యాగరాజు (1770 క్రీ. శ.)కన్న నీతడు మిగుల చిన్న కాడని గ్రహింతుము. వీరిరువురు ఇంచుమించు సమవయస్కులు. ఇతడు త్యాగరాజుకన్న (1847 క్రీ. శ.) ముందే, అనగా తన యరువదవయేట (క్రీ. శ. 1835) మన్మథసంవత్సరమున కాలధర్మము నొందెను. ఇతనితల్లి సుబ్బమ్మ. ఇతనికి చిన్నస్వామిదీక్షితులు అను వేంకటవైద్యనాథశర్మ యనియు, బాలస్వామిదీక్షితులనియు నిరువురు తమ్ములుగలరు. తన పదునారవయేటనే ఈతడు వేదాధ్యయనసంపన్నుడై కావ్యనాటకాలంకారాది షట్శాస్త్రములందు పాండిత్యము సంపాదించి జ్ఞానాధిక్యమునందు తోడివారిని మించియుండెను. జ్యోతిషమందును, సంగీతమందును ఈతనికి ప్రీతిమెండు. తనకుటుంబమునెడ నాదరణకలిగి మిగుల భక్తితో మెలగు ధనాఢ్యుడు చిన్నయ మొదలియారు నొద్ద మణలి యనుగ్రామమున తల్లితండ్రుల వద్దనుండగా నొక యోగి "చిదంబరనాథు" డను నతడీతనికి గొన్నివత్సరములు మహామంత్రము లుపదేశించి సిద్ధిబొందించి యుండెను. ఈగురువువలన నీతడు వేదాంతశాస్త్రములందమితప్రజ్ఞను సంపాదించి అణిమాదిసిద్ధులవడసి ప్రజలవలన శ్లాఘ్యతను బొందియుండెను. ఇతడు పాండ్యచోళదేశములందలి దైవములపై పెక్కు కీర్తనములు

రచించి, పాడి, యానందించువాడు. సూలాదిసప్త తాళములందును, నవగ్రహకీర్తనములు మున్నగునవి గాయకకల్పవలు విలసిల్లునట్లు పాడి కీర్తిసుధ ముక్తాసౌధము నలంకరించెను.

ముద్దుస్వామిదీక్షితులకృతములు పండితప్రాగల్భ్య యుతములు వాక్పటిమచొప్పున నలరారుచున్నవి ఇతని అసాధారణధోరణి విచిత్రచాతుర్యకల్పనాశక్తి మంతమగు పదలాలిత్యము వీనియందు మాత్రము. అపారమగు వేదాంతరహస్యములు, సంగతులు, అంశములు, ప్రౌఢ వాక్పటిమతో నతడెట్లు చెప్పగల్గెనా యను సందియము కలుగుచునేయున్నది. ఇతనికీర్తనములకు ఇతనిసంస్కృత భాషాపాండిత్యము వన్నె దెచ్చుచున్నది. దుస్సాధ్యము నితనిశయ్యా సంస్కృతమునకే మెరుగు పెట్టుచున్నదనుట అతిశయోక్తికాదు. ఇట్టినేత, ఇట్టి పండితప్రాగల్భ్యము త్యాగరాజుకడ కీర్తనపటిమ సంగ్రామూడలేము. ఇతనికవిత మెదడునకు పనికలిగించుతరి త్యాగరాజు కీర్తనలు హృదయమునకు ఆవేదన కలిగించుచున్నవి. దీక్షితులకృతులు నిర్దుష్టముగ నుండునట్లు త్యాగరాజకృతులు కానరావు. కాని త్యాగరాజు కీర్తనలే ప్రపంచము నతికట్టుటకు కారణము అవి స్వకపోలకల్పితములై, అనుభవవేద్యములై వెలయుటే. ఇందుచే దీక్షిత కీర్తనములు అద్భుతమును కలుగజేయుతరి త్యాగరాజు కీర్తనములురసవంతములై యానంద మొనగూర్చుచున్నవి.

ఇకదీక్షితుల సంగీతపటిమ యాతనికే చెల్లు. ఇతడు వెంకటముఖిసంప్రదాయము ననుసరించె ననుటకు ఈతని కీర్తనములే నిదర్శనము. ఈతనితండ్రి రామస్వామి దీక్షితులు వెంకటముఖిమాతులపౌత్రుడైన వేంకట వైద్యనాథ దీక్షితుల వద్ద సంగీతము నభ్యసించి వేంకటముఖి రాగాంగోపాంగభాషాంగసంప్రదాయము నెఱిగియుండుటయు నిందుకు నిదర్శనము. "కనకాంబరికారుణ్యామృతలహరీ" అని కనకాంబరి రాగమందును "బృహదీశ్వరో రక్షతు మాం హరి" అని ఘనసామవరాళియందును ఇట్లు వేంకటముఖిచే చెప్పబడిన రాగాంగరాగముల పేర్ల చొప్పున సంగీతమును నిర్మించెను.

ముద్దుస్వామి దీక్షితులు తన యపారసంస్కృత పాండిత్యమెట్లు కీర్తనలయందు సృష్టింపగల్గెనో యట్లే తన యసమానసంగీతకౌశల్యము గూడ వానియం దిమిడ్చి పాడగల్గుట యాశ్చర్యమే. త్యాగరాజు సంగీతమువలె ఇతనిధోరణి గానప్రియుల కల్పనచాతుర్యము గోరక పోయినను ఇది యలవడుట, పాడుట కష్టసాధ్యముగనే యున్నది. కొంతవఱకు ప్రథమకాలమునుండి వెంటనే మధ్యమకాలమునకు మఱలునట్టి యీతని కీర్తనములు విద్వాంసులకే యభేద్యములు. ఇతడు చెప్పిన కీర్తనములందలి తాళములు, గమకములు, మూర్ఛనలు మున్నగునవి ప్రజ్ఞావంతులగు పండితులను సైతము నోడింపజాలుచున్నవనుట సత్యముకావుననే కొందఱితని కీర్తనముల నంటనొల్లకున్నారు. ఇది శోచనీయము. ఇప్పటి కచేరీలందువలె పల్లవి యనంతముగ పాడుటకు బదులు గాయకులు దీక్షితులకీర్తనములు కొన్ని వినిపించిన సమంజసమని తలంపబడుచున్నది

## (3) శ్యామశాస్త్రి

సంగీతత్రిమూర్తులలో మూడవవాడైన శ్యామశాస్త్రులు పైయిరువురువలె తిరువారూరునందు తన తల్లిదండ్రుల నోముఫలముగ క్రీ. శ. ౧౭౬౨కు చిత్రభాను సంవత్సరమున జనించెను. ఇతడును బాల్యమునందే సంస్కృతాంధ్రములందు అపారపాండిత్యము గడించెను. కొంతకాలమునకు ఈతని తల్లిదండ్రులు సమీపముననున్న తంజావూరునకు పోయి తమ ఇష్టదైవము శ్రీ కంచి కామాక్షీదేవి బంగారు ప్రతిమా విగ్రహము ను గొలుచుకొనుచు నుండు సమయమున నీతడాయూర నొకానొక సంగీతజ్ఞునివలన సంగీతము నభ్యసించి కృతకృత్యుడాయెను. ఇంతలో అదృష్టవశమున 'సంగీత స్వాముల"ను ఉత్తరాహ సంగీతవిద్వాంసుడిటకువచ్చి, ఇతనింగాంచి తన శిష్యునిగా జేసికొనుటకు ఇతడు తగియుంటగని, సంగీతశాస్త్రమునెల్ల మూడుసంవత్సరములు ఇతనిచే పఠింపించి సంగీతకోవిదునిగాజేసెను. అనంతరము శ్రీకామాక్షీ యనుగ్రహమువలన సాహిత్యచమత్కారములు, గేయకల్పనలు, తాళగ్రహములు వెలయునట్లు బహు

కీర్తనములు, స్వరజతులు, తానవర్ణములు రచించి సంగీతవాఙ్మయనిర్మాతయయ్యెను. ఇతని రచనములు శ్యామకృష్ణయను మకుటముతో నున్నవి. ఇట్లితడు పైవారివలె పందొమ్మిదవ శతాబ్దాదియందు అనగా ౧౮౨౭ వత్సరమువఱకు జీవించి యశఃకాయుఁడై వ్యయసంవత్సరమున పరలోకగతుఁడాయెను.

శ్యామశాస్త్రుల కృతులు ఈతని యపూర్వ సంగీతప్రతిభను వెల్లడిచేయుచున్నవి. నారికేళపాకరీతి గానుండుటచే నీతని సంగీతము కొందఱికనువుగాకున్నను నది ప్రతిభావిశేషముచే నొప్పించియుండుటవలన పండితాళికి అభిమాన మొనఁగూర్చుచునే యున్నది.

ఈతని తాళపాకడలు అతీతానాగతాదుల యెడల గలుగు కాలమునందలి సమర్థతవ్యక్తమై, నిర్మలమై ప్రవహించు సెలయేటిప్రవాహమును బోలు రాగవిన్యాసము, ఇతనికీర్తనములకు ఘనత దెచ్చుచున్నవి. కావుననే ఈతని కృతులు కొందఱు లక్షణముగా పరిగ్రహించుచున్నారు. మాటయఱుగులేకయు, మొగమోటమి లేకయు గొంతి మోటుగ గన్పట్టు ఇతనిభక్తియు వీనియందు జాడ చూపుచునేయున్నది. ఇతని "తల్లి నిను," "త్రిలోకమాత నిను" మొదలగు కీర్తనములు చూడనగును. నాగరకతాప్రపంచ మెఱుఁగనేయు నెఱుఁగని పల్లెటూరి పడుచు విరహమువలె నీతని భక్తిహృదయపూర్వకమై, భావపూరితమయ్యు, మోటుగ నుండిననేమి? భక్తికి, ప్రేమకు-భావము, లేక అనురాగము ప్రధానము గాని యందుకు సాధనవిధుల నేర్పుకూర్పు ముఖ్యము కాదు. ఇతని కీర్తనములందలి ఇతనిభక్తి యెట్లున్నను లాక్షణికు లంగీకరింపదగు సంప్రదాయముతో నీతని సంగీతము వీనియందు వెలయుచుండుటచే నివి మార్గదర్శకములగుచున్నవి.

---

## జీవప్రబోధనము

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

బ్రహ్మమీవు నీవ బ్రహ్మంబు సత్య మీ
తత్త్వ మెఱుఁగలేక దారితప్పి
తిరిగితిరిగి డస్సి తెలిఁగి తప్పితివయ్య!
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

తల్లి దండ్రు లన్నదమ్ములు బిడ్డలు
నిల్లు భార్య ధనము నెల్లకల్ల
మమత మధువు గోలుపు మైకానఁ జెడెదేల?
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

తెలియకుండఁ బుట్టి తెలిసి కర్మ మొనర్చి
దానిఫలము కుడువఁ దనువుదాల్చి
జననమరణదుఃఖజలధి మున్గెదవేల?
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

పుట్టినప్పు డొంటిఁ బుట్టినయట్టులే
చచ్చునప్పు డొంటిఁ జత్తువుగద!
నీకు నెవ్వరైరి? నీ వెవరికైతివి?
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

ఒకరికొఱకు నొక్కఁ డుర్విపైఁ బుట్టరు
చావ రొక్కరొకరి చావు కొఱకు
పతికళత్రపుత్రపరమార్థ మిది సుమ్మి
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

ధనము కలిగినన్ని దినములు కూర్మితోఁ
జూచినట్టి దారసుతులు నిన్ను
ధనములేనినాఁడు దరిఁ జేరనీయరు
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

కండపుష్టి కలిగి కాలాడి గడియించి
తెచ్చునాఁడు నిన్ను మెచ్చు నాలి
గడన యుడిగినంతఁ గసరును దయమాలి
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

మాయకాండ్రు క్రోధ మాత్సర్య మదలోభ
కామమోహు లనెడి కన్నగాండ్రు
కొంపదూఱి రింక గుట్టుపట్టెద వేల?
మేలుకొనుము జీవ! మేలుకొనుము

ప్రతిదినంబు నీదు ప్రజ్ఞానధనమును
దోఁచఁజూచు నింటి దొంగవాఁడు
నిదురపోతివేని యది నీకు దక్కదు
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

ఐదుపాళ్ల కొంప నద్దెకుంటివి మేను
నీది గాదు మేను నీవు గావు,
దహనయోగ్యమైన తనువేడ నీవేడ?
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

పూర్వపుణ్యపాపమూల మీ జన్మంబు
సుఖము దుఃఖమోఁలి జూచుననెడి
శాస్త్ర ముండెఁగాని సౌఖ్యంబు సున్న రా!
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

కాంచనంబునందు కాంతలయందును
భ్రాంతిగొల్పి నిన్నుఁ బాడుచేసి
కన్నుగాననీఁడు కాముండు చెలరేఁగి
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

కాలుసేతులల్లి గజగజలాడంగఁ
గుంది మొగము కందగడ్డ గాఁగఁ
బెదవు లదర నిన్నుఁ బీడించుఁ గ్రోధుండు
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

పిల్లికైన నింత బిచ్చంబు నిడనీక
నిన్నుఁ గుడువనీక నీతివిడిచి
పరులధనము లాగఁ బురికొల్పు లోభుండు
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

ఎవఁడు లోకమెల్ల నేడ్తెఱ దిగ్రమింగు
నట్టిమోహుపొత్తు నాశ్రయించి
యొడలు తెలియకుండఁ బడియుంటివే యిట్లు?
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

చెప్పరానియట్టి చేయఁగూడనియట్టి
పనులు చేయ నిన్నుఁ బాలుపఱచి
యొళ్లుమఱవఁ జేయుచున్నాఁడు మదపాపి
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

మంచిచెడ్డలనెడి మాట యక్కఱలేని
మచ్చరంబు నీదు మనసు చొచ్చి
తెలివియెల్ల నల్ల దిగ్రమింగు చుండెరా!
మేలుకొనుముజీవ! మేలుకొనుము.

పాడుపొట్టకొఱకుఁ బడరాని పాట్లెల్లఁ
బడుచుఁ గుడువరాని కుడుపుగుడిచి,
ఆత్మవంచకుండ వయ్యెద వేలరా!
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

నిన్ను నీవు తెలిసికొన్నయంతనె నీకుఁ
గానఁబడునదెల్ల కల్లయగును
కలనుగన్న దంత కల్లయౌనట్టులు
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

బోధకుఁడవు నీవ బోధ్యుఁడవును నీవ
బోధ నీవ, యిరుగుపొరుగు లేదు
మోహనిద్రవిడిచి సోఽహమ్మటంచును
మేలుకొనుము జీవ! మేలుకొనుము.






## చిత్రములు, చిత్రఖండము

తలిశెట్టి రామారావు గారు, బి. ఎ., బి.యల్.

మనకు కానవచ్చునటులు మనుష్యులు, చెట్లు, పర్వతములు, రాళ్లు, ఇండ్లు, జంతువులు మొదలగు వాటిని సహజమైన రంగులతో చిత్రింపరాదా? రూపము స్ఫుటముగ కనబడునటుల జేయజాలు ఛాయను విడనాడి రేఖారచనకు గడంగుటేల? మన జాతీయచిత్రములను జూచువారిలో నధికసంఖ్యాకు లిట్టిప్రశ్నల నడుగుట సామాన్యము. "మాటలాడుచున్నటులు వ్రాయక వ్యాకరణ మేల? గణయతు లేల? వృత్తభేద మేల?" అని కవులను, "మాటలాడుచున్నటుల పలుకక రాగ మేల? తాళ మేల? ఆ మెడవిరుపు లేల?" అని గాయకులను అడుగుట యెంతభావ్యమో యీ ప్రశ్నలు చిత్రకారు నడుగుటయు నంతభావ్యముగనే యుండును. మరల మన కండ్లయెదుట బెట్టినవరకు అజంత, బాఘ్, సింహగిరి చిత్రములు హిందూదేశమున రచింపబడినవని యెరుగము. రాజపుత్రచిత్రములు బాగులేవనియు, రవివర్మచిత్రములే యాదర్శకము లనియు తలచితిమి. పట్టణమునం దేవీథికిపోయినను అంగడులవద్ద కానవచ్చు చిత్రములు రవివర్మశైలిని మరువనీయవు. ధనికుల యిండ్లయందు (ఎచ్చోటనో తప్ప) రవివర్మచిత్రములో, ఐరోపాచిత్రములో కానవచ్చును. పాశ్చాత్యరచన కిటుల నలవాటుపడుటచే విమర్శనచేసి చూడక, మనకు కనబడునటుల చిత్రించుటయే యుక్తమనియు, ఈనియమములను పాటింపక వ్రాయబడిన చిత్రములు మంచివికావనియు తలచుట పరిపాటియయ్యెను. మన జాతీయగానము, సాహిత్యము ఏదోవిధమున ననుదినమును స్మరణకు వచ్చుచుండుటచే సంగీతసాహిత్యముల కిట్టి దురదృష్టము పట్టలేకపోయెను. కనబడునటుల చిత్రించుట, మాటలాడునటుల వ్రాయుట, పాడుట అను సిద్ధాంతము సర్వజనామోదమును బడసిన యెడల లలితకళలకు తావే లేకపోవును. చిత్రములు ప్రకృతిదృశ్యములవలె వ్యత్యాసములేక యుండవలెనన్న ప్రపంచమున నిష్పాడామోదమును బడయుచున్న ఈజిప్టు, తురుష్క—పర్షియా, హైందవ, చైనా—జపాను దేశముల శైలిని వ్రాయబడిన చిత్రముల నన్నిటిని సముద్రములనైన గలుపుటకు తగినవగును; లేక ఐరోపాదేశీయులు అనాగరకుల చిత్రము లిటుల నుండునని పరిహాసముచేయుటకును, చిత్రరచన శైశవదశయం దిట్టి చిత్రములను వ్రాయుట కలదని చెప్పుటకును నిదర్శనములుగ పనికివచ్చును. అప్పుడు ఠాకురుసింహు గారి చిత్రములు అవనీంద్రుని చిత్రములకంటె మంచివిగ బరిగణింపబడును.

ప్రాగ్దేశముల చిత్రము లన్నియు మంచివా యని యడుగవచ్చును. మనకు కనబడునటుల వ్రాయక అన్యముగ వ్రాయుటకు స్వేచ్ఛ యున్నంతమాత్రమున ఇష్టము వచ్చినటుల వ్రాయుటయందు మంచి ప్రావీణ్యము కలిగిననేకాని వాస్తవమును మరుగుపరచి భావమున కనుగుణముగ దృశ్యమును మార్చి వ్రాయుట కష్టము; ధైర్యమును కావలెను. కాని బాగుగ వ్రాయునప్పు డిట్టిశైలి కొందరికి శరణ్యమగుట విచారకరము. భావప్రదర్శనమునకు ప్రకృతినియమము లడ్డువచ్చినయెడల వాటిని కొంత మార్చవచ్చును. వాస్తవమును వ్రాయుటకంటె వాస్తవమును తప్పించి వ్రాయుటయం దెక్కువ ప్రమాదము

కలదు. కనబడునటుల వ్రాయుట రానప్పుడు చెడుచిత్రము లెటుల పాశ్చాత్యరచనయందు పుట్టుచున్నవో యటులనే వాస్తవమునుమార్చి సబబుతప్పక వ్రాయుట రానప్పుడు చెడుచిత్రములు ప్రాగ్దేశపు రచనయందు పుట్టుచున్నవి.

చిత్రనిర్మాణ మనేకవిధము. ఏదోయొకదానినుద్దేశించి చిత్రరూపముగ వ్రాసినంతమాత్రమున నది చిత్రముకాగలదు. మంచిచెడ్డలనువిమర్శనకు లోబడి ఒక యుదాహరణమును తీసుకొందము. ఎట్టిపాటనైనను బాగుగ పాడినయెడల నది సంగీతము కావచ్చును; శ్రావ్యముగనుండి యానందదాయకము కావచ్చును. శ్రీ త్యాగరాజు కళాబ్రహ్మయొక్క కృతినైనను పాడి పరిహాసమునకు తావీయవచ్చును. పాడేపాటయందు కొంత శక్తి యున్నను గాయకుని ప్రావీణ్యము ముఖ్యము. పాటలేకనే రాగమాలాపించి శ్లాఘాపాత్రులగుట మనమెరుగుదుము. పద్యములనుకాని, కథనుకాని బాగుగవ్రాసి కీర్తిమంతులు కావచ్చును. పెద్దగ్రంథమును చెడుగావ్రాసి చీవాట్లపాలు కావచ్చును. వ్రాయుటయందు కలదుకాని గ్రంథబాహుళ్యమునం దేమియులేదు. కాళిదాసు మహాకవియొక్క శాకుంతలనాటకము చాలదా! పని పనికిమాలిన పెద్దపుస్తకముల వేల? వ్రాయుచాకచక్యమున్నప్పుడు పద్యములు వ్రాసిననేమి? వచనము వ్రాసిననేమి? "గంగిగోవుపాలు గంటెడైననుచాలు, కడవడైనను నేమి ఖరముపాలు?"

చిత్రములను పెన్సిలుతోను, కలముతోను, కుంచెలతోను వ్రాయవచ్చును. పెన్సిలుతోను, కలముతోను సాధారణముగ రేఖారచన సులభసాధ్యము. కుంచెలతోను రేఖలను వ్రాయుట కలదు. ఇట్టిరచనయందు ఈజిప్టు, తురుష్కస్థానము, పర్షియా, హిందూదేశము, చైనా, జపాను చిత్రకారులు—ముఖ్యముగ హిందూదేశపు చిత్రకారులు—ఎట్టిరచనను చేసిరో, ప్రపంచమున నన్నిదేశములందుగల చిత్రకళావిమర్శకుల పొగడ్తకెటులు అర్హులైరో, హైందవచిత్రకళాచరిత్రముతో నేపాటి పరిచయమున్నవారికైనను తెలియును. ఇప్పుడు ఐరోపా, అమెరికా మొదలగుదేశములందును రేఖలతో అద్భుతముగ చిత్రములను నిర్మించు సుప్రసిద్ధచిత్రకారులనేకులు కలరు. కాని వీరి చిత్రరచనయందు రేఖాప్రయోగమునకును మన చిత్రరచనయందు రేఖాప్రయోగమునకును విశేషభేదముకలదు. ఉద్దేశమును వేరు. చిత్రమునుబట్టియు, చిత్తరువును వ్రాయుటకు కలిగిన యవసరమునుబట్టియు రేఖ వినియోగపడును; తక్కిన విధానములందు చిత్రములను వ్రాయుట చేతకాక కాదు. ఒక్కరేఖాచిత్రరచనను మాత్రము అభ్యాసముచేసి జగద్విఖ్యాతి నార్జించినవారనేకులు కలరు.

తీవ్రమైన వెలుతురుగాను మనకును మధ్యను మధ్యను కొంతదూరమున నేదైనయున్నయెడల నది నీడవలె కనబడును. రంగులు, ఆకారవివరములు సాధారణపరిస్థితులందు మనకు కానవచ్చునంత స్పష్టముగ కానరావు. ఇటుల నల్లముగ కానవచ్చువివరము లవసరములేక విడచిపెట్టినయెడల నీడమాత్రము నల్లగ నావ్యక్తి కాని, చెట్టుకాని కనబడునటు లూహించుట సులభము. ఈ తరగతి చిత్తరువు లనేకులు చక్కనివి కలవు. * ఈచిత్రమునందు (మా. పు ౯౭౨) కొమ్మలు విరిగినచెట్లు, నాశనమైన యిల్లు, యుద్ధచిహ్నములను వ్యక్తపరచుచున్నవి. ఒకప్రక్క నున్న శిలువ (Cross) తనదేశముకొరకై జీవనమునువీడిన వీరుని మరణస్థలమును తెలియజేయుచున్నది. ఒకప్రక్క నాస్థలమును కాపాడుచు వినమ్రుడై తుపాకిని తలక్రిం బట్టుకు నిలువబడిన సైనికుడు, మోక్షచిహ్నమగు పవిత్రమైన శిలువ, వీరు లెట్టి గౌరవమున కర్హులో చక్కగ తెలియబరచుచున్నవి. దుఃఖరసమున కనుగుణముగ నుండునటుల నిందు వివరములు లేక నలుపువర్ణము ప్రధానస్థానమును వహించుటవలన చిత్రము మనోహరముగ నున్నది. వివరములు లేవనియు, ప్రకృతియందు కానవచ్చు వర్ణభేద మిందులేదనియు, నీ చిత్రము మంచిదికాదని చెప్పజాలము.

* From 'Sunday Pictorial' dated 10-11-1929.

ఫోటోగ్రాఫు నందువలె ఏకవర్ణముతో అన్ని వివరములను చూపు బొమ్మలందరికిని పరిచితములు. ఈ బొమ్మలందు రంగులు లేక పోయినంతమాత్రమున వీటి యుపయోగము, ఉద్దేశము చెడెనా? ఇట్టి చిత్రములలో పేరు గాంచిన వెన్ని లేవు?

ప్రకృతియందు కనబడునటులు ఎట్టి మార్పులును లేక రంగులతో చిత్రింపబడిన చిత్రము లనేకములు ప్రసిద్ధి కెక్కినవి కలవు. వస్తుభావ ప్రదర్శనకౌశలము లేక ఎంత చక్కగ వర్ణములను వ్రాసినను చిత్రములకు వన్నె తెచ్చిపెట్టజాలము. వర్ణములను చక్కగ వ్రాయుట మంచిదే కాని యాకుశలత చిత్రకారుని కుండవలసిన యితర సుగుణములను మరుగుపరుపరాదు.



రంగులను మోటుగ వ్రాసినంతమాత్రమున బొమ్మయొక్క విలువతగ్గునని తలంపరాదు; చిత్రకారుడు ప్రదర్శింపదలచిన మనశ్చిత్రము కాగితము పైననో, వస్త్రముపైననో నిర్మింపబడిన చాలును. తాను చూపరుల మనస్సునందు కలుగజేయదలచు భావము నాచిత్రము పుట్టించుచున్నదాయను సమస్యయే యాతనికి ముఖ్యము. వర్ణములు నునుపుగ, చక్కగ లేకపోయినను ఈ కార్యము నెరవేరినయెడల వర్ణలేపనమునందు కాలమును వ్యర్థపుచ్చనేల? ఆలోచన, భావము వీటివలన ఉన్నత జీవనమును గడపు కళాకోవిదుడు అవసరము లేకపోయినను వేసినరంగునే వేయుచు, దిద్దుచు మార్చనగలడా? ప్రతిభావంతుడు కాన ఇట్టి కష్టము లేకయే వర్ణికాభంగమువలన కలుగు హాయి చిత్రమునందు తాండవమాడునటుల చేయగలడు.

"పోస్టర్సు" అని పిలువబడు బొమ్మలు ఏవిషయమును గూర్చియైన ప్రజలకు చాటు నుపయోగపడుటకు చిత్రింపబడి, గోడలపైననో యితర బహిరంగప్రదేశములందో ప్రదర్శింపబడుటచే వీటిని దూరమునుండి చూచుట సాధారణముగ కలుగును. కాన దూరమునుండి చూచిన బాగుగ కనబడునటుల వీటిని వ్రాసిన చాలును. వివరములు విశేషముగకాని, రంగులు మృదువుగ కాని, యిట్టిచిత్తరవులందు వ్రాయుట నిష్ప్రయోజనము. ఈ పోస్టరులను సాధారణముగ వాణిజ్యమునందు ఉపయోగపరచెదరు. యుద్ధసమయమునందు జర్మనుల దుండగములను ప్రజలకు బొమ్మలద్వారా తెలియజేసి ప్రజాసామాన్యముయొక్క సానుభూతిని పొందుటకు ఆంగ్ల ప్రభుత్వము వారేర్పాటు చేసిరి.* ఉదాహరణముగ నీచిత్రమును చూడండి. లూయీరేమేకర్సు (Louis RaeMaekers) అను హాలండుదేశపు సుప్రసిద్ధ వ్యంగ్య-హాస్యచిత్రకారుని సుప్రసిద్ధచిత్రములలో నిదియొకటి. బెల్జియమునందు జర్మనులాచరించిన దురాచారముల కితఁ డేవగించుకొని, అప్పటి ప్రజల దుస్థితిని యీయొక్క చిత్రమువలన గుండెలు నీరై పోవునటుల లోకమునకు తెలియజేసెను. కుప్పకూలి యున్న తల్లియొక్క ముఖము, చేయి యామెయొక్క క్షుద్బాధను చాటుచున్నవి. ముఖమున అంతులేని విచారము, అసహాయత, కన్నకొమరితయెడల ప్రేమ, ఆమె నాదరించువారులేని నిరాశ, ముందెటుల నుండునో యను భయము స్పష్టముగ కానవచ్చును. శిశువుయొక్క ముఖమున ఆకలి, చావునందైనను తల్లియే శరణ్యమనుట, ఆమెకష్టమునందు సానుభూతి, విచారము, నిరాశ, భయము తాండవమాడుచున్నవి. ఆకొంగిలింత, ఆకన్నీటి చుక్కలు ఎట్టి మనస్సునైనను కరగింపజాలగలవు.



ఈ చిత్రమునందు రంగులు లేకనియు, ప్రకృతియందు కానవచ్చునటుల ఛాయ మృదువుగ లేదనియు నిరాదరణ చూపినయెడల చిత్రరచన అధోగతిపాలు కావలసినదే! చిత్రకారుడు చూపదలచిన భావమంతయు నిండుండ, రచనయందు తప్పులులేక యుండ నిక కావలసినదేమి? కాని యిట్టి చిత్రమును తెనుగుపత్రికల యధిపతులు, ఆంధ్రులలో అధికాంశమువారు తృణీకరించెద రనుటయందు సాహసము లేదు. దూరమునుండి చూచినయెడల నీచిత్తరువునందు వీరు చూపబోవు "లోపము" లేవైన కానవచ్చునా? చిత్రముయొక్క యుద్దేశము, భావము ముఖ్యములా, లేక వర్ణలేపనము ముఖ్యమా? రెండు సంవత్సరముల క్రిందట చెన్నపట్టణమున జరిగిన చిత్రకళాప్రదర్శనమునందు వర్ణలేపన మిటుల మోటుగ గలచిత్రమే ప్రథమబహుమతిని పొందగలిగెను. తీవ్రమగు ఎండ, మార్గమధ్యమున విప్పినబండ్లు, బండ్లనీడను వంటలుచేయుట, అప్పుట దొరకుగింజల నేరుకొనుటకు

* Published by the National Committee for Relief in Belgium, Trafalgar Square, London.

వచ్చిన కోళ్లమంద, ఇవి చిత్రమున గలవు. "ఈచిత్రమునకేల బహుమతి?" అను ప్రశ్నను నేను చాలామారులచ్చట వింటిని.

వర్ణలేపనమే చిత్రమున అన్నిటికిని మించిన హంగైనయెడల హైందవవర్ణలేపనము లోపభూయిష్ఠమని చెప్పకతప్పదు. అజంతశైలిచిత్రములందు విశేషముగ రంగులు కానరావు. కానవచ్చినంతమట్టుకు ఛాయాప్రదర్శనము తక్కువ-లేదనియే చెప్పవచ్చును. కాని యీకాలపు హైందవచిత్రములు చిత్రకళావిమర్శకులను సూదంటురాయివలె నాకర్షించుచున్నది. ఛాయలేని వస్తువు మనకండ్లకు కానరాదు. ఛాయలేనిది వస్తువుయొక్క నిజమైన యాకృతి మనకు బాగుగ తెలియనే తెలియదు. నిజమిటు లున్నను చిత్తరువునందు ఛాయ విశేషముగ నుండుట యంతగా వాంఛనీయముకాదని వారు తలచిరి. ఏమి సాహసము! ఇంత ముఖ్యస్థానము నాక్రమించు ఛాయను విశేషముగ సరకుచేయకయే తమ చిత్రములనంత చక్కగ వ్రాయగలిగిరి! వర్ణలేపనమే ముఖ్యమను తలచెడివారు దీని కేమందురో?

స్త్రీయొకతె విచారమున కూర్చొనియున్న యెడల వెనుకనున్న నీలియాకాశము, చుట్టునున్న పచ్చని చెట్లు, ఆమెయొక్క సహజదేహచ్ఛాయ, ధరించియున్న వస్త్రముయొక్క రంగు మనకు కానవచ్చును. కాని దృశ్యము చిత్రకారుని హస్తములందు మారగలదు. విచారమును జూపుటకు నలుపువాడుట సామాన్యమయ్యెను. ఆమె హృదయ మంధకారమయము కాదా? ముందురానున్న కష్టములను జూపుటకు ఆకాశము మేఘావృతమై యున్నటులను చూపవచ్చును. ఆమెయెడల సానుభూతిని చూపుచున్నవనుటకును, ఆకాశపురంగున కనుగుణముగ నున్నటులను చెట్లనుకూడ నలుపుతో కలసిన పచ్చనిరంగుతో చిత్రింపవచ్చును. ఆమెయొక్క సహజచ్ఛాయ, వస్త్రముల వర్ణములు ఈనలుపున మరుగుపడరాదా? ఈయొకే వర్ణమునకు ప్రధానస్థాన మిచ్చినందువలన చిత్రముయొక్క విలువ యధికమగునే కాని తగ్గదు. కోపమును జూపుట కెరుపు, ఈర్ష్యను జూపుట కాకుపచ్చ, ప్రేమను జూపుటకు గులాబి, శుభమును జూపుటకు పసుపుపచ్చ అమాయకత్వమునను జూపుటకు తెలుపు ఆయాచిత్రములం దెక్కువగ వాడుటవలన నష్టమేమి? ఇట్టివిషయములను దృక్పథమున నుంచుకొనక ప్రకృతియందు కనబడునటులు వర్ణములు లేవని యాచిత్రములను తృణీకరింపరాదు.

ప్రకృతినియమములను మరికొన్ని విషయములందును నిర్లక్ష్యపెట్టుట కలదు. హిందూచిత్రకారు లీవిషయమున నెట్టిస్వేచ్ఛాపరులై యుండిరో పాఠకులకు తెలియును. వ్యంగ్య-హాస్యచిత్రములం దిట్టి స్వేచ్ఛ యుండుట సామాన్య మయ్యెను. నవ్వునుబుట్టించి, చూపరుల దృష్టి నాకర్షించి తరువాత నీతిని నేర్పుట యీతరగతి చిత్రకారుల ముఖ్యమైన యుద్దేశము. నీతి యొక్కొక్కప్పుడు లేకపోయినను హాస్యము వీరికి ప్రధానము. ఈయుద్దేశ్యము సులభముగ నెరవేరినయెడల ఛాయయేల? వర్ణలేపనమేల? నవ్వునుబుట్టించుటకు వికారరూపములను వ్రాయుట, తలలు పెద్దవిగ, తక్కినభాగములు చిన్నవిగ వ్రాయుట, రేఖలద్వారా ఆకారమును సూచనామాత్రముగ వ్రాయుట వీరి కలవాటు. వేరువేరు స్థితులందును, వృత్తులందును నుండు ప్రజలను స్పష్టముగ తెలియజేయుట కేదోయొక చిహ్నము చాలును. ఈచిత్రమునందు(మూ. పు ౯౭౮) కుక్క మొరుగుటనుజూచి యొకడు కంపించి పోవునటులగలదు. కంపించుటను తెలియజేయుటకు రచనయెటులున్నదో చూడుడు. ప్రకృతియందిటుల కానరాదు. వణకుట కొంచెము కానవచ్చినను కోపము, ఆనందము, గర్వము, ప్రేమ మొదలగు చిత్తవృత్తులను తెలియజేయుట కిట్టి చిహ్నములు వ్రాయుటయందు హాస్యవ్యంగ్య చిత్రకారులు ప్రవీణులు. వస్తుప్రచారమునందు వణిజులు, హాస్యరసప్రధానమైన కథలను చిత్రించుటకు పత్రికాధిపతులు, తదితరులు ఇప్పు డిట్టి శైలినే యామోదించుచున్నారని ఆంగ్లపత్రికలతో పరిచయమున్న వారందరికిని తెలియును. ప్రకృతియందు కానవచ్చునటుల ఈచిత్రములు లేవుకాన మంచివి కావని నిరసించుటయందు వివేకము లేదు.




ఏదైన విషయమును పూర్తిగ వర్ణించక సూచన గావ్రాసి కవులు విడచుట లోకవిదితము. చిత్రకారులును తమచిత్రములందిట్టి సూచనలను జేయుటలో తృప్తి పొందుట కలదు: ఇట్టిబొమ్మలందు చిత్రము పూర్తిగ నుండ నవసరము లేదు. ఉదాహరణముగ మెరుపును గూర్చి చిత్రమును విమర్శింతము. హిందూపురాణములందు కానవచ్చు విషయములు చిత్రకారుల కనేకరీతుల తోడ్పడును. ఈలోకమునందు గల ప్రజల నడవడిక యెటులున్నదో దేవుడు చూచుచుండును. కొందరని సంహరింపవలెనన్న ఆ లోకరక్షకునకు పిడుగొక ఆయుధము. అంధకారమున మునిగియున్న లోకమును జూచుటకు మెరుపొతని వెలుతురు. ఈ మెరపునే యొక దూతిగా ఊహింప వచ్చును. ఆమె చూచి మేఘముల వెనుకనున్న లోకనాథునకు సంజ్ఞ చేసిన పిమ్మట పిడుగునాతడు విసరును. ఈ మనశ్చిత్రమునందు దేవుని, పిడుగును విడచిపెట్టి మెరుపును, ఆమధ్యనున్న కన్యనుమాత్రము చిత్రింపవచ్చును. ఆమె యొక్క స్వభావమును చిత్రింపవచ్చును. ఆమెయొక్క స్వభావమును తెలియజేయు టకు దేహచ్ఛాయను నీలముగను, వస్త్రమును ఆకుపచ్చగను చూపవచ్చును. తక్కిన విషయములను చూపుటకు చేతులుచాలును. ఇవన్నియు నీబొమ్మ (ముఖచిత్రము)యందు కానరాక సూచనామాత్రముగ నుండినంత మాత్రమున చిత్రముయొక్క విలువ చెడ లేదు. విషయము బీభత్సము కనుకను, చిత్రమున నిది ఖండము కనుకను, భావము సూచనామాత్రము కనుకను వర్ణలేపనము మోటుగనుండిన చాలును — మోటుగ నుండుటయే మంచిదేమో?

కనుక చిత్రమును చూచినవెంటనే ప్రకృతి ననుసరించ లేదని నిరాకరించుట కంటె విమర్శించి చూచుట భావ్యము.

చిత్రముయొక్క ఉద్దేశమేమి?

శైలి యెటులున్నను రచన సబబు తప్పకయున్నదా?

భావము ఉత్తమమైనదా?

భావప్రదర్శనము బాగుగనున్నదా?

భావమున కనుగుణముగ చూపరుల మనస్సునందు సంచలనము కలుగుచున్నదా?

చూపదలచిన ముఖ్యమైన వ్యక్తులు, వస్తువులు తక్కిన హంగులందు మరుగు పడక చూచిన వెంటనే దృష్టికి మొదట పట్టుపడుచున్నవా?

వ్యక్తుల యొక్కయు, వస్తువుల యొక్కయు యేర్పాటు బాగుగ నున్నదా?

వర్ణలేపనమున్నయెడల ఎటులున్నది?

వర్ణముల యేర్పాటు చక్కగ నున్నదా?

ఈ ప్రశ్నలకు సరియైన జవాబు చిత్రమునందు కానవచ్చినయెడల మంచిచిత్రమని యెంచవచ్చును. చిత్రవిమర్శమున కితరవిషయము లున్నవి. కాని వాటి నన్నిటి

నిచ్చట చర్చించుటకు తావులేదు. హైందవశైలి, జపానుశైలి, ఐరోపాశైలి అని వేరుగ చూపుటకును, వాటి నీ వ్యాసమున నిముడ్చుటకును అవకాశములేదు. ఏ శైలియందు చిత్రమున్నను పైప్రశ్నలు విమర్శనకు కొంతత్రోవ జూపగలవు.

ప్రకృతియే ప్రధానముని పెనగులాడిన వారికి భవిష్యత్తులేదు. రంగులతో ఫొటోగ్రాఫులను తీయజాలిన యెడల (వీరి విమర్శనము ననుసరించి) చిత్రకారులకు తావే లేకపోవును. నాటకమునందువలె వ్యక్తులనేర్పరచి దాని ఫొటోగ్రాఫును తీసిన చాలదా వీరికి? మనుష్యుని అద్భుతభావప్రచలనమునకును, చిత్రకారుడగు ఆచార్యుని హితబోధకును అవకాశ మక్కర లేదా? స్వేచ్ఛాపరుడగు కళోపాసకుని చిత్తవృత్తులను బంధింపవలసినదేనా?

---

## దూతికోపాలంభము

బెల్లంకొండ రాఘవరావు గారు



విరహాగ్నికీలలు దహించు విధమ్మిది యెంతతీవ్రబా
ధావిలమైననేమి, నిఖిలాంగము లింతకు ప్రాణయుక్తిమై
నీవిధి నిల్చియున్నయవి నీ విదె వత్తును తోడితెత్తునం
చోవరణీయశీల! చని యుంటివిగా, దయయెంతో నాపయిన్!
"అదె చంద్రోదయవేళయయ్యె, దెసలం దాచంద్రికల్ పర్వెలో
మదనానేక సహస్రమోహనుని అస్మన్నాథునిం దెత్తునం
చు" దయశాలిని వేగివచ్చితివి తోచుం జూడు పూర్వాశయం
దుదయార్కుం, డికనేల చెప్పవలె నీయుద్యోగతాత్పర్యముల్.
ఏలానిన్నన? నేనపెట్టితినికాదే దౌత్యభారమ్ము నీ
పై, లజ్జావతివౌదు! పాప మట నిర్బంధమ్ము మైనుంటి కా
బోలున్ పోలునె వానిచెంతకు నిను‌న్ పూబోణి బంపంగ-త
చ్ఛీలం బిట్టిదటం చెఱింగి, విగతౌచిత్యమ్ము నాబుద్ధిసూ!
వచ్చితివాయటం చెదురువచ్చెనొ, మచ్చికమీర రేపు పో
వచ్చును లేయటంచు బలవంత మొనర్చెనొ, నీవు పాపమా
యిచ్చకపుం గబుర్ల కెదురేమన నేరకపోతివో బళీ!
మెచ్చగవచ్చు నీమనసు మెత్తన, నీదౌకలోప ముండునే!
కనులకాటుక రేకలను తీర్చిదిద్దితి వేలనో చెదరిపోయినవి చెలియ!
రేయెల్లయును నిద్దురే లేదు కావలె రక్తిమ గ్రమ్మె నేత్రాంతములను
సడలిన నీముక్రొమ్ముడిలోని పువులంత వసివాడిరాలు నీవచ్చుదారి
గాలిసోకని క్రొత్తగావిచ్చినవిరినా కై నేసికొన్న సింగార మేలో
నలిగినది యింతగా చెలి! నానుడువులు - వినబడవో-మాటుపలుకవు, కనులకేను
కనబడుటలేదో-యింతమై కమ్మ దేల, - ఘంతవిని సంతసింతు వచింతువొక్కొ!

---

# శ్రీ అహోబిల చరిత్రము

పాలపర్తి సూర్యనారాయణగారు

## క్షేత్రమాహాత్మ్యము

అహోబిలము శేషాచలమునకు మధ్య నున్నది. తిరుమల తల యనియు, శ్రీగిరి తోక యనియు, నహోబిలము నడుము మనియు చెప్పుట వాడుక.

అహోబిలము కర్నూలుమండలమున సిరువెళ్ల తాలూకాలో నున్నది. ఈ యహోబిలమునకు గరుడాచలమనికూడ పేరు కలదు.

పూర్వము నృసింహుడు హిరణ్యకశిపుని సంహరించిన పిదప చెంచెతను పరిణయ మయ్యె నను గాథ కలదు.

గరుడాచలమునుగూర్చి పురాణ మిట్లు పేర్కొనుచున్నది:

గరుత్మంతుడు తల్లిదాస్యము నుడిపి తండ్రి యగు కశ్యపుపాలికిం జని తరించు నుపాయం బెఱింగింపవే యని ప్రార్థించెను. అందుల కతడు విష్ణువునుగూర్చి తపం బాచరించుటకన్న వేఱొం డుపాయము లేదని యెఱింగించెను.

వైనతేయు డందుల కియ్యకొని తపంబు సల్పుటకు తగు క్షేత్రంబునకై వెదకుచుండెను. ఈ కొండపై వచ్చినంత నాకాశవాణి "ఇది నృసింహక్షేత్రము. ఇక్కడ తపం బాచరింపు" మనియెను.



మొదటి ప్రాకారముయొక్క ద్వారము

గరుడుడు ఇక్కడ తప మాచరించగా విష్ణువు ప్రత్యక్షమయి యతని తనకు వాహనముగా జేసికొందునని వరమిచ్చెను.

దానంజేసి యీ పర్వతమునకు గరుడాద్రి యని పేరు కలదు. గరుత్మంతునకు వేదాత్ముడనికూడ నామాంతర ముండుటంజేసి వేదాద్రియనికూడ నామాంతరము కలదు.

## స్వరూపము

ఎగువ అహోబిలము, దిగువ అహోబిలము అని రెండు కలవు. ఈ రెంటికిని మధ్య ఏడుమైళ్ల దూరము



విశ్వరూపదర్శనము (ద్వారమువద్ద)
(ఉత్సవ విగ్రహము)

కలదు. ఎగువ అహోబిలము కొండపై నున్నది. ఎగువ అహోబిలమునందు నృసింహాలయ ప్రాంగణమున నొక బిలము కలదు. ఆ బిలమార్గమున లోనికి జనిన నందొక దేవాలయము కలదనియు, నిప్పుడుండు నృసింహస్వామికి సరిగా క్రిందిభాగమున మఱొక నృసింహవిగ్రహము కలదనియు, నది గరుత్మంతునిచే బ్రతిష్ఠింపబడె ననియు జనశ్రుతి కలదు. కొంతకాలమునకు ముం దొక జియ్యంగారు దానిలోనికి జని యొక నృసింహవిగ్రహము దెచ్చె నని చెప్పుదురు. అది యెంతవఱకు నిజమో తెలియదు.



శ్రీ లక్ష్మీనృసింహస్వామి మంటపమునందలి యొకానొక స్తంభముపయినున్న శిల్పచిత్రము
(దిగువ అహోబిల దేవాలయమునగల విగ్రహ మిట్టిదే)

మఱియు నొక విగ్రహము ఉత్తర హిందూస్థానమందలి యొకరాజున కిచ్చిరనికూడ కింవదంతి కలదు. నిజమని చెప్పజాలము.

ఇప్పుడు పై యహోబిలమునందును క్రింది యహోబిలమునందునుగూడ జనమేజయుడు ప్రతిష్ఠచేసెనని చెప్పుదురు. ఇతడే జనమేజయుడో!

ఎగువ అహోబిలమునకు త్తరముగ భవనాశిని (భవనాసి) కలదు. అది యొక చిన్న నదియే యైనను భవహరమైనదగుట భవనాశిని యని నామంబున నొప్పుచున్నది.

అది ౨౦ మైళ్ల దూరముపై ప్రవహించి మరియొక చిన్న యేటిలో బడుచున్నది.

ఇదివఱలో నృసింహవిగ్రహము నెదురుగా బోయి చూచుటకు భయంకరముగానుండె ననియు నందుచే ప్రక్కగా దాని పూజించెడివారనియు జెప్పుదురు. కాని యిప్పుడు పైన పూజాదులు సరిగా జరుగకపోవుటచే నట్టి కళాకాంతులు తగ్గెను.

## చారిత్రక విషయములు

పురాణవిషయమైన గరుడప్రతిష్ఠను విడిచివేసిన నిక ప్రస్తుత మగపడుచున్న నృసింహాలయములు రెండు నెవరిచే బ్రతిష్ఠింపబడినవో యొకింత విచారింతము.

జనమేజయ ప్రతిష్ఠయని జనశ్రుతి కలదు.

పరీక్షిన్మహారాజు కుమారుడు జనమేజయుడు కలడు. అతనివల్లనే ప్రతిష్ఠింపబడి యుండినయెడల కలియుగాదినైన యుండును. ౫,౦౦౦ సంవత్సరములక్రింద బ్రతిష్ఠింపబడి యుండును.

౭,౮ శతాబ్దములలో నొక జనమేజయు డున్నట్లు తెలియుచున్నది. అతడు ప్రతిష్ఠించెనో? కొందఱు ప్రతాపరుద్రచక్రవర్తిచే బ్రతిష్ఠింపబడిన దని చెప్పుదురు కాని యది యెంతమాత్రము విశ్వసనీయము కాదు.

మొదట నొకరాజ్యమై యొప్పి యిప్పుడు క్షేత్రమని, ప్రసిద్ధి గాంచి, "శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" యని నుతికన్న శ్రీశైలమల్లికార్జునుని నెలవగు శ్రీగిరిని, ౬ శతాబ్దములలో తంజావూరిజిల్లా ఉరయూరు రాజధానిగా గల కరికాలచోళుని కాలమున నుత్తర హిందూస్థానమునుండి యాతనిచే గొనిరాబడిన జనముచే నిండెనని చెప్పబడి యున్నది. మల్లికార్జునస్వామిని కూడ నాతడే ప్రతిష్ఠించెనని కలదు.

గుంటూరుజిల్లాలో దొరకిన శాసనములో నీ విషయము లన్నియు వ్రాయబడి యున్నవి.

అహోబిలముకూడ శ్రీగిరి యనంతరము ౭,౮ శతాబ్దములలో నున్న జనమేజయునిచే బ్రతిష్ఠింపబడి యుండెనని యూహించుచున్నాను.

౧౧-వ శతాబ్దమునందు (క్రీ.శ. ౧౦౭౬-౧౧౨౬) పరిపాలనము చేసిన విక్రమాదిత్యుడను చోళరాజు కలడు. ఇత డాహవమల్లుని ద్వితీయపుత్రుడు. ఇతనికి త్రిభువనమల్లుడని పేరు కలదు. ఇతడు కాంచీపురమును కొల్లగొట్టి కులోత్తుంగచోళు నోడించెను. గండికోటను (కడపజిల్లాలోనిది) వృద్ధిజేసెను.

ఇతడు అహోబిలము, బేతంచర్లలోని దేవాలయములకు భూదాన మొసంగెను.

కాన అహోబిలము ౭-౮ శతాబ్దములలో ప్రతిష్ఠింపబడె నని యూహించుట కనుకూలముగా నున్నది. ఇతనిశాసన మహోబిలమున గలదని వ్రాయబడియున్నది.

మఱియు నీ త్రిభువనమల్లుని యన్న యగు సోమేశ్వర భువనేశ్వరమల్లుడు కూడ నహోబిలమునకు భూదాన మొసంగెను.

పిదప (౧౨౯౫-౧౩౨౧) పరిపాలించిన ప్రతాపరుద్రుడు క్షేత్రమును వృద్ధికి దెచ్చెను.



నృసింహస్వామి అవతారము
(ఇది మంటప స్తంభముల నొకట నున్నది)

ప్రతాపరుద్రుడు శివభక్తుడు. ఇతడు నిత్య మొక సువర్ణలింగము నర్చించి దానిని బ్రాహ్మణునకు దాన మొనరించి పిదప భుజించువాడు.

ఆ మహాత్ముడు శ్రీశైలాదిక్షేత్రముల దర్శించి త్రిపురాంతకమును జయించి యహోబిలక్షేత్రమున కరుదెంచెను.

వాడుకప్రకారము శివలింగమును పోతబోయనది నృసింహాకారాళం బయ్యెను. దానికి కార్మికులు భయమొంది మరల పోతబోయ మరల నట్లే యయ్యెను.

చక్రవర్తి యాచర్యను బరీక్షించి తనయాస్థాన పండితునిచే నృసింహక్షేత్రమాహాత్మ్యంబున నట్లయ్యెనని వినెను. ఇంతలో నెదుట నందు నొకగుహలో నొక మహాత్ముడు తపంబాచరించుటగాంచి యాతని సమీపించి నాడు జరిగిన విపరీతము నెఱింగింప నాతడు నా క్షేత్రమాహాత్మ్యంబని యెఱిగించెను.

అందులకు దాను శివపూజ చేయక భుజింప నొప నని యెఱింగింప నీతపస్వి శివకేశవులకు భేదంబు లేదని తెలుపుచు కొంచెము ప్రక్కకు తొలగినంత నొకలింగ మగపడియెను. చక్రవర్తియు సంతోషమున నా లింగము నర్చించెను. లింగముపై వైచిన పుష్పము లా తపస్వి శిరస్సుపై నుంట గాంచి యాద్భుతం బంది యాతని మహిమను కొనియాడి పోతబోయుగా నైన సువర్ణకరాశిమును వైష్ణవయోగికి దాన మొసగి పూజామలకయి భూదాన మిచ్చెను. ఇతడు అహోబిలమున గుహలు నిర్మించెనని స్థానికచరిత్ర తెలుపుచున్నది. ఏ గుహలు నిర్మించెనో తెలియదు. ఇతడే యుద్యానమును నిర్మించి పైకి సోపానములు కట్టించెను.

ఆ తపస్వి ప్రతాపరుద్రచక్రవర్తిచే నొసగబడిన సువర్ణకరాశిమును బూజించుకొనుచు నందే యుండెను.

ఇదియే యాహోబిలమఠము నిర్మింపబడిన విధము. అహోబిల నృసింహస్వామి దేవాలయమునకు మఠము సంబంధించినదని దీనివల్ల తేటపడుచున్నది.

నాడు మొదలుకొని దేవాలయముల యాజమాన్య మాతని (జియ్యర్ గారి) యాధీనమున నుంచబడెను.

కాన దేవాలయమునకు సంబంధించిన సంపద, భూములు వగైరా లన్నియు నాతని (జియ్యరు గారి) స్వాధీనము చేయబడెను. ఆ జియ్యర్ బ్రహ్మచారి యగుటచే అహోబిలమఠ మను పేరుపెట్టి దేవాలయముల పూజగావించు నేర్పాట్లు చేసి, తా నా సువర్ణకరాశింబును పూజ జేసికొనుచు అహోబిలక్షేత్ర, అహోబిలమఠముల కధిపతియై యుండెను.

ఇప్పుడు నృసింహస్వామి ప్రక్క నొక శివలింగ మున్నది. ఆ లింగము ప్రతాపరుద్రుడు పూజించిన లింగమే యై యుండును.

శివకేశవులకు భేదము లేదని తెలుపుటకే యాలింగ మందు బ్రతిష్ఠింపబడెనని యూహించుచున్నాను.

పిదప నచ్చి క్షేత్రమును వృద్ధిచేసినవాడు కృష్ణదేవమహారాయలు. ఇతని శాసన మందు కలదు. ఈయన శిరువెళ్ల తాలూకా చాగలమఱ్ఱి ఫిర్కాలోని మద్దూరను గ్రామము నిచ్చి మిక్కిలి వెలగల నగల నొసంగెను.




హిరణ్యకశిపు వధ
(ఎగువ అహోబిలమున ప్రతిష్ఠితమయిన విగ్రహ మిట్టిదే)

దిగువ యహోబిల గ్రామమును గట్టించెనని స్థానిక చరిత్ర తెలుపుచున్నది. వెయ్యికాళ్ల మంటపమును నిర్మించెను. ఇందు వేయి స్తంభములు లేవు. దాదా యెనుబది మాత్రమే కలవు. వానిపై చెక్కబడిన చిన్న స్తంభములతో గలసి వేయి కావచ్చును. మంటపమునకు పైకప్పు లేదు. స్తంభములపై హృద్యములగు రామాయణ చిత్రములు చెక్కబడి యున్నవి. ఇప్పుడు పూర్తియయిన మండపమొకటి కలదు. అక్కడనే కళ్యాణోత్సవము జరుగుచుండును.

దేవాలయమున కొంత మిక్కిలి శిల్పి పనితనముగల గొప్ప స్తంభములు మాత్రము నిలుపబడియున్నవి.

ఒక కళ్యాణమంటపమును మాచెర్ల పురం రెడ్డిరాజులు కట్టించినట్లు చెప్పుదురు. ఇప్పుడుండు రెంటిలో కృష్ణరాయలు కట్టించిన దేదో తెలియదు. దేవాలయ ప్రాకారము చుట్టను లోభాగమున మంటపములు కలవు. చిన్నచిన్న దేవాలయములు, ఆళ్వారులు, మొదలైనవి కలవు.

శిల్పిపనితనమునుకలిగి పైకప్పు పూర్తి గాక నిలిచిపోయిన మంటపమే కృష్ణదేవరాయలచే నిర్మించుట కారంభింపబడి యుండునవనియు, ఏకారణముననో యది పూర్తియై యుండకపోవచ్చుననియు నూహింపవలసి యున్నది; లేనిచో రెండు మంటపములు నీ మహారాజులవల్లనే నిర్మింపబడి యుండవచ్చును. ఒక చిన్న కళ్యాణమంటపమొకటి కలదు. అది రెడ్డిరాజులచే నిర్మింపబడియుండవచ్చును.

కృష్ణరాయలతో అహోబిలక్షేత్రౌన్నత్యము కూడ తగ్గెనని చెప్పవచ్చును.

పిదప సదాశివరాయలు ఇచ్చిభూదానమొసగినట్లు శాసనము తెలుపుచున్నది.

పిదప తురకలు అహోబిలక్షేత్రమును దోచుకొనిరి.

అప్పుడు శఠగోపజియ్యరుగారు గండికోటకు రాజైన గంగరాజుతో మొరలిడ నాతడు ససైన్యముగా వచ్చి తురక్కల బారద్రోలి క్రీ. శ. ౧౫౭౮ సంవత్సరమున జయస్తంభమును నాటించెను. ఆ స్తంభమిప్పటికిని ౩, ౪ ద్వారములమధ్య నిలువబడి యున్నది.

దిగువ అహోబిలమున ఇప్పుడు వరుసగా ౪ ద్వారములు కలవు. పూర్వము ఏడుద్వారము లుండి, ఏడు ద్వారములలోపల గ్రామ మిమిడియుండెనని చెప్పుటకవకాశము కలదు.



ప్రహ్లాదుడు
(మంటప స్తంభముపై నున్న శిల్పచిత్రము)

## నవనారసింహులు

ఎగువ, దిగువ నున్న నరసింహు లిద్దరు, ప్రహ్లాదుని బండవద్ద నున్న గుహాలో నృసింహస్వామి, వరాహనృసింహస్వామి, ఉక్కుస్తంభ నృసింహస్వామి, జ్వాలా నృసింహస్వామి, పామిలేటినృసింహస్వామి, భార్గవనృసింహస్వామి, రామతీర్థనృసింహస్వామి యని నవనారసింహులు కలరు.



నృసింహస్వామి-చెంచెత
(వేయిస్తంభముల మంటపమునందలి యొకానొక స్తంభముపయి జెక్కబడియున్నది)

ప్రహ్లాదునిబండ, వరాహ, జ్వాలా, పామిలేటి, భార్గవ-నృసింహస్వాము లున్న గుహలే ప్రతాపరుద్రునిచే నిర్మింపబడి యుండును.

ఎగువ అహోబిలములోనుండి కొండ కెడమువైపున కెక్కిన ముందు లక్ష్మక్కపేట యని కలదు. విష్ణువు చెంచెతనువివాహమాడ లక్ష్మియలిగిపోయెనని చెప్పుదురు. అందుండి యొక్క కొండపేటుపై ప్రహ్లాదుని బండయు, నక్కడొకనృసింహవిగ్రహమును కలవు. అక్కడ నుండి కొండపైకి ఎక్కిన ఒక శిఖరముపై ఉక్కుస్తంభముకలదు. అక్కడ ఇప్పుడు నృసింహవిగ్రహము లేదు ఆశిఖరము క్రింద నాధారములేక కోసువలె నిలిచియున్నది. అంతకష్టమైన చోటయినను యాత్రికులు వెళ్ళి చూతురు. ప్రాణాపాయము లెవ్వరికి ఇంతవఱకు కలుగలేదు. ఇదినృసింహస్వామి మహిమయని భక్తుల విశ్వాసము. అందుండి మరియొక దిక్కునకు నూటిగా నుండు కొండనుదిగిన జ్వాలకలదు. అక్కడ నెప్పుడు నీరు ధారగా పడుచుండును. అందుండి భవనాశితీరమున వచ్చినయెడల నృసింహాలయమును జేరుదుము. అక్కడనుండి కుడివైపుగా నెక్కిన పామిలేటికి చేరుదుము.

దిగువ నృసింహస్వామి దేవాలయమున కొక మైలుదూరమున భార్గవమను కోనేరు కలదు. అదియే మంచినీళ్ల కాధారము.

కోనేరులు ఇకను రెండున్నను తిరునాళ్లలో నీరుచాలదు. అక్కడ భార్గవనృసింహుడు కలడు.

దిగువ అహోబిలమునకు ౭ మైళ్ల దూరమున రామతీర్థ నృసింహుడు కలడు. అక్కడ పుట్టాలమ్మ కలదు. ప్రతి ఆది, మంగళ, గురువారములయందు జనులు వచ్చుచుందురు.

పామిలేరు అహోబిలముల కింకను పైన నున్నను ప్రతి శనివారము భక్తులు వెళ్లుదురు.

రానురాను క్షేత్రౌన్నత్యము తగ్గుచున్నది. ౧౬వ శతాబ్దమున నంద్యాలరాజయిన హండే దేవప్ప

నాయుడు శైవుఁడగుట అహోబిల నృసింహస్వామి నగలను దోఁపుడుచేయించెను. అప్పుడు జియ్యంగారు పెనుగొండ రాజయిన వెంకటపతిరాజుగారి సహాయమును బడసెను. పిదప నేలనో అహోబిలమఠము కుంభకోణమును జేరుకొనియెను.

అప్పటినుండియు క్షేత్రము నామమాత్రమేయయి ప్రతిఫాల్గుణ శు ౧౫ వఱకు తిరునాళ్ల ౧౦ రోజులు మాత్రమె జరుగుచున్నది.

ఇప్పు డర్చకులును దాక్షిణాత్యులు ఇక్కడ నుండుట మానుకొనిరి. అందుచే నెవరినో నియమించిన వారు దిగువను పూజచేసినను, పైనపూజ సరిగాజరుగుట లేదనియే నమ్మవలసియున్నది. పై దేవాలయమునందు వర్షాకాలమున నుండుటకైన వీలు లేక కురియుచున్నదని వినుటకు చింత కలుగుచున్నది.

మలేరియాప్రాంత మగుటచే నిక్కడ నుండుటకు భయావహ మగుటయు నిందులకు కారణముగా నున్నది. ఇదివర కెట్లుండిరో తెలియదు. దీనివల్లనే అహోబిల మఠమును, గ్రామమునుకూడ నిక్కడనుండి పోయినవని చెప్పుదురు.

ఇప్పుడు మఠాధిపతులు యావదాస్తియు (లక్షల కొలది) మఠమునకు సంబంధించిన దనియు, దేవాలయమునకే ౮౦౦, ౫౦౦-లో ఉన్నదనియు చెప్పుట ఆశ్చర్యముగా నున్నది. ఇంతకుముందే దేవాలయమును బట్టి మఠముకాని మఠమునుబట్టి దేవాలయముకాదని వ్రాసియున్నాను. నృసింహదేవాలయ మున్నదని రాజులు భూము లిచ్చిరిగాని, మఠమునకు గాదు. ఏకాలమునాఁడో దేవాలయము లు నిర్మింపబడియుండ మఠము ప్రతాపరుద్రుని కాలమున నేర్పడినది. న్యాయముగా నాయాస్తి యంతయు దేవాలయముదే యనుటకు సంశయము లేదు. కావున వారు తగిన మరమ్మతులు గావింతురు గాక!

జియ్యంగారి ఏజెంటు దాక్షిణాత్యు లొకరు ౨౦ వేల రూపాయలవఱకు ఖర్చుపెట్టుటకు మఠము సిద్ధముగా నున్నదనియు, నిలువబడి చేయువారు లేరనియు జెప్పియున్నారు.

కాని యిప్పు డాయేజెంటు పదవికూడా డోను తాలూకాలోని యొక బ్రాహ్మణునకీయబడినది.

క్షేత్ర మిప్పు డీస్థితిలో నుండుటచే దీని నెట్లయిన వృద్ధికి తేవలయునని ౧౯౧౭ లో తాలూకావారు జియ్యంగారికి రాయబార మంపిరి. వారొక కమిటీ నేర్పాటు చేసిరి కాని యదియును నామరూపములు లేకుండనే పోయినది.



నృసింహుడు చెంచెతను వేడుకొనుట
(మంటపమున నొక స్తంభముపై నున్నది)

నీటిసదుపాయములు బొత్తిగా లేకుండుటచే జిల్లాబోర్డువారు భార్గవమునుండి పంపులద్వారా నీరు



ఆదివరాహమూర్తి
(మంటప స్తంభములలో నొకదానిపై చెక్కబడియున్నది)

తెచ్చుట కేర్పాటు చేయుటకు నిశ్చయించిరని తెలియుచున్నది. జియ్యంగారును సగము ఖర్చు భరించుటకు వాగ్దాన మొసంగిరని తెలియుట సంతోషదాయకము.

అనంతపురం బళ్లారిజిల్లాలలో అన్నసత్రస్థాపనలు, దేవాలయపునరుద్ధారణలు, శ్రీరామసప్తాహము గావించి, బిక్కవోలు దాక్షారామములయందు కోటిపత్రిపూజలు గావించి దాక్షారామమును పునరుద్ధరించిన శ్రీ పోలంగి లింగమూర్తి దాసుగారు ఈ సంవత్సరం మాఖ శు 2 లు మొదలు సప్తాహము సంకల్పించి యున్నారు. ఫాల్గుణమాసములో తిరునాళ్లు జరుగును గాన మాఖమాసములో సప్తాహము జరిగిన తిరునాళ్లకభ్యంతర మగునని యును, నీరు దొరకదనియును, సప్తాహము జరుప వీలులేదని యీ విషయమున శ్రద్ధవహించియున్న హరిపురం జి. వెంకటరెడ్డిగారికి జియ్యంగారి యేజెంటుగారు తెలిపినారని తెలియుచున్నది. శ్రీ లింగమూర్తి దాసుగారు సప్తాహమే కాక క్షేత్రపునరుద్ధారము గావించుటకుగూడ నిశ్చయించియున్నారు. కాన జియ్యరుగారన్నివిధముల సహకారము నలుపుట సముంజసము.

కడపస్టేషనులో రైలు దిగి మోటరులో చాగలమర్రికి వచ్చిన అహోబిలమునకు బండ్లు, మోటారులుండును. నంద్యాలలో రైలు దిగి, మోటారులో నాళ్లగడ్డకువచ్చిన అక్కడనుండి పదిమైళ్లదూరముండును. ఈ రెండుమార్గముల నెవరికి వీలైనమార్గమున వారు వచ్చి సత్కార్యమున పాల్గొని తరింతురని నమ్ముచున్నాము.

## పురూరవోవిలాపము

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

చెలియరో! నీపయిన్ వలపుఁ జెందినవాఁడను మంచిమాటలన్
పలికెడువాఁడఁ ద్వత్ప్రియభంగపరాఙ్ముఖమానసుండ నా
వలనను నీవు దోసపులవమ్మును దేనిని జూచి లోన శం
కిలితివో? మానినీ! యిటులు కింకరున్ విడనాడఁ బాడియే?

సుకముగ నున్ననామనసుఁ జూచుచు నుండఁగ మోహవార్ధిలో
నకట! మునుంగఁ జేసెఁ గుసుమాస్త్రుఁడు పంతముఁబట్టి తేలనీఁ
డు కటకటా! అగాధ మ దెటుల్ దరిఁ జేరఁగ నేర్తు నీదు కు
ల్కుకుచయుగమ్ము నాఁ బరఁగు కుంభము లీయక యున్న సుందరీ!

జాలిఁ దలంపవంటె, ననుఁ జంపఁ దలంచితివంటె; కామచం
డాలుని పూవుటమ్ములఁ గటా! నను నేటికిఁ జంపఁజేసె దు
ద్వేలదయారసప్లుతిపవిత్రములౌ త్వదపాంగతీక్ష్ణబా
ణాళిని జంపరాదఁటె కృతార్థుఁడ నయ్యెద సుందరీమణీ!

మారానల మార సుధా - ధారాధార మగుపల్కు దయచేయఁగదే
ఓరమణీ! హీరమణీ - భారమణీయ మగుదంతపంక్తి వెలుంగన్.

పలుపలుకు లేల నాపై - నలుగక దయ యుంచి మొగము నయినను జూపం
దలఁపఁగ రాదఁటె నే నీ - చెలువుఁడఁ. గానఁటవె యుర్వశివి గావఁటవే?

మొగముం జూపనియంతమాత్రమున నేమో నష్టమా? నాకు నీ
సిగయున్ వెన్ను పిఱుందు లాది యగుబల్ సింగారముం గారు మే
నగులే! కన్పడు నద్ది సంతసము నీయం జాలు నే మైన నీ
వి గదా! కోరుచు నుంటిఁ జిత్తమున నువ్విళ్లూరుచున్ సుందరీ!

కనులు నీముద్దుజవ్వన మొల్కునంగకమ్ములను జూచుటకు నై మొగమువాఁచె
చెవులు నీతేనియల్ చిల్కుచున్ ముద్దొల్కు ముద్దుపల్కులకు నై మొగమువాఁచె
నాల్క నీయమృతముం జుల్కఁ జేయఁగఁ జాలు నుద్దుకెమ్మోవికై మొగమువాఁచె
ఒడలు నిన్ దొడలపై నిడి ముద్దుచెక్కిళుల్ ముద్దు లాడుటకు నై మొగమువాఁచె

కడమయింద్రియములమాట నుడువ నేల? - నేఁటి కెన్నియొ యుగములు దాఁటిపోయె
దక్కిపోయితి నింక నీవె దిక్కు సుమ్ము! - యేమి చేసిన నింక నీయిచ్ఛ కొమ్మ!

తగునా? నీవు దయాపయోధివి గదా! తన్వంగి! యీలాగు నన్
దిగులొందించుట, నిన్నుఁ బాయుట మొదల్ దిక్కెవ్వరున్ లేరు హా!
తొగరాజున్ దిగఁద్రొక్కఁ బర్విడెడు ముద్దుల్లుల్కు మో మైనఁ జూ
పఁగదే నేఁ బగవాఁడ నైతినఁటె! నన్ బాయంగ న్యాయంబఁటే?

కథలే వ్రాయఁగ వచ్చు నాచరిత మేఁకల్ వోవుటే యాదిగా
వృథగా మారుఁడు నన్నుఁ బీల్చుకొని పిప్పిన్ జేయుచుండెన్ యథా
యథలైపోతిని నన్నుఁ జూడ విది న్యాయంబంటవే? చిత్రభూ
రథచక్రప్రతిమానమానజఘనా! రాకేందుబింబాననా!

నీకు నేను ప్రియుండను గాకయున్న - నాకుఁ బ్రియురాల వీ వని నమ్మికొంటి
నేమి చేసిన నింక నీయిష్ట మంటి - మనసు నీ కిచ్చుకొంటి నో మచ్చెకంటి!

నడియాకాశపుఁజందమామ, అది యందన్ రాని దద్దానికై
యడియాసం బడి యందుకో నెగుర నేలా? అంద దం చాపయిన్
పొడిదుఃఖమ్మును పొంద నేల? యని యెప్డున్ నేను నాచిత్తమున్
కడు శాసింపుచు నుందు నైన నది లొంగంబోదు ప్రాణేశ్వరీ!

పగ లెట్టెట్టులొ ప్రొద్దు పుత్తు నింక నబ్బా! రాత్రులం జెందునా
దిగులింతింతని మొఱ్ఱ వెట్టుకొన నేదీ దిక్కు? నీవల్ల ని
ట్టిగతిం జెందుదు నం చొకప్పుడును నే డెందంబునం డెంచ నై
తిఁగదే! మాలవిధాత కింత పగ నైతిం జూడవా నాగతిన్.

ముద్దియ! యేమి సెప్పుదును మూఁడుయుగమ్ములు దాఁటిపోయె నీ
ముద్దులమాట లైన చనుముక్కులకున్ మఱి దొండపండుతో
నుద్దికి వచ్చువాతెరకు నుబ్బుచు నుండెడిగుబ్బదోయికిన్
దద్దయు మోముమాఁచితిని తాపము నాఁపఁగ నోప నీపయిన్.

కంతునితేళిలో నలఁతఁ గాంచి సుమంబులపాన్పుపైన నే
నెంతయు నిద్రఁ బోవునపు డెక్కడి కేఁగెనొకో? యటంచు బల్

వంతను జెందు చుందు వబలా! మును నాపయియూసఁ జేసి యో
యింతిరో! యెట్లు సైఁచితివె? యిన్నియుగమ్ములు నావియోగముఁ.

మనసున నించుకైన ననుమాన మెఱుంగక యొక్కప్రక్కనే
పెనఁగుచు నన్నియుఁ మఱచి పేరిమి మీఱ మెలంగుచుందు మో
వనితరో! అట్టినన్నె నెడఁబాసి చనం దగుపాటినేర మే
మొనరిచినాఁడఁ? దెల్పు మయయో! అయయోజితుఁ జేయవా యిఁకఁ?

పుత్తడిబొమ్మ! నీనగవుమోము గనుంగొన స్వాతివానకై
ముత్తెఁపుఁజిప్పలట్లు కడు మోహమునఁ గనుదోయి యెంతయుఁ
దత్తఱ మొందుచుండెఁ బరితాపము నాఁపఁగఁజాలఁ జాలు నో
మత్తమరాళయాన! యొకమా అయినఁ నగుమోముఁ జూపవా?

నావంటి నమ్మఁ గొలిచెడి-సేవకుఁ డేలోకమందుఁ జిక్కఁడ టంచుఁ
నే విన్నవింప వలయునె?-నావిధ మంతయు నెఱుంగు నాతికి నీకుఁ.

సరసిరుహాక్షి! నీవలపు శాశ్వత మంచును నమ్మికొన్న నఁ
విరహపయోధి ముంచి యిటు వే చనుచుండుట న్యాయ మౌనె? నీ
చరణసరోజముల్ గొలువఁజాలిన దాసునిపైన నింత కో
పరసముఁ జూపఁగాఁ దగినపాపము నే మొనరించితిం జెలీ!

పిలిచినఁ బల్క వేమి? నను బిగ్గఁ గవుఁగిటఁ జేర్ప వేమి? నీ
వలపును జూప వేమి? ననుఁ బాసి చనం దగునేర మేమి? నీ
తలఁపువిధ మ్మదేమి? పదతామరసమ్ములు కందువాఱన
ట్టులు పరువెత్తె దేటికిఁ గడుంగడు వేగము నూని మానినీ!

రమణిరో! నిన్నువంటియనురాగవతుల్ మఱి లే ర టంచు నే
బ్రమసితి నీకు దక్కితిని రాజ్యముసైతము వీడుకొంటిఁ బ్రా
ణములనుగూడ నీకయి తృణమ్ముగ నెంచుచునుంటి నీ పదా
బ్జములకు మ్రొక్కుచుంటి నిటువంటిననుఁ విడనాడఁ బాడియే?

నెలఁతరో నీపయిఁ గల నా-వలపుఁ బరీక్షింప నింతవఱకును దుఃఖ
మ్ములపాలు చేసితివి నీ-విలాస మిఁకఁ జాలుఁ జాలు వేగము రమ్మా!

నిన్నుం గా దని యన్యకామినులఁ గానీ స్వప్నమం దేని నే
నెన్నండేనిఁ దలంచినాఁడనఁటె? నాహృత్పద్మమం దున్న నీ
కు న్నాచిత్తము గోప్య మౌ నఁటె? వృథా కోపించి నీదాసు నా
పన్నుం జూడక పాఱిపోఁ దగునఁటే? పంతమ్ము ధర్మమ్ముఁటే?

కానీ నీవల వంతయుం దెలిసె నింకం జాలు నీమాటలన్
పోనీ! నీయెడఁ దప్పు లేదు విధి నన్నుం జూడఁ డొక్కింత య
య్యో! నాయందలి యట్టిప్రేమ యిటులై యుండంగ నాదగ్ధ మా
ప్రాణం బూడిన నూడనీ మనసులో రవ్వంతయుం జింతిలన్.

నెపమున కయినను నీయెడ-నపరాధముఁ జేసి యెఱుఁగ నటువంటినన్
కృపఁ జూడ కిటులు దుఃఖము-లపాలు సేయు టిది తగునె? లలనరో! నీకున్.

జాణలలోఁ దగుజాణవు-గాణలలోఁ బేరుపడినగాణవు నీ వి
న్నాణము తెలిసెను లే! ని-ర్వాణద వని నమ్మికొంటి స్వాంతమునందున్.

ఓనారీమణి! నిన్ దలంచుకొన నెంతో వింతగాఁ గన్నులం
దానందాశ్రులు జాలువాఱు మెయి రోమాంకూరముల్ నిండు నా
పై నిశ్చేష్టత నొంది చిత్త మమృతాస్వాదమ్ముఁ గావించిన
ల్లే నిర్లిప్తత నొందుచుండు నవులే యీ వేమి మంత్రించితో ?

కటకట! యేమి వాకొనుదుఁ గామిని! నామది పొందువంత? నీ
పటమును చూచుచుం గనుల బాష్పము నింపనివేళ లేదు నీ
చటులవిలోచనమ్ముల పసందు దలంచుచు జీవితాశ దు
ర్ఘట మని యెంచనట్టి త్రుటికాలము లేదుతు జూ! సుమాంగిరో!

అన్నిటి కేమి కాని చెలియా! వచియించెద దైవసాక్షిగా
నిన్నటిరేయి వేగతుల నిన్నుఁ దలంచుచు నేడ్చు నేడుపున్
విన్నను నల్లఱాయియు ద్రవింపక యుండునె? వజ్రమేనియున్
భిన్నము గాకయున్నె? మఱి విద్విషు లైనను జాలి నొందరే?

తరుణీ! నిన్ గల నైనఁ గాంచుటకు నిద్రాదేవి నీకంటె ముం
దరనే నన్ విడనాడె; నీసొగసు చిత్రమ్మందు వీక్షించి సం
బరముం జెందుద మన్నఁ గన్నుఁగవ దా బాష్పంబుతో నిండు నె
క్కరణిన్ నిన్ గనుఁగొందునో తెలుపుమా కాంతాశిరోరత్నమా!

ఏదేనిం బొరపాటు నావలన లేనేలే దొక ప్డేను మ
ర్యాదం దప్పి పొనర్చియున్నను 'గతార్థా న్నానుశోచన్తి' యన్
వేదాంతోక్తి మదిం దలంచి దయతో వీక్షించి నన్నింక స
మ్మోద మ్మొందఁగఁ జేయు మంచు నిదిగో ముమ్మాటికిన్ మ్రొక్కెదన్.

అచ్చపుబంగరుంబ్రతిమయచ్చుప ముద్దులరాజహంసి నా
వచ్చి బిరాన నాదుతొడపైఁ గడు ముద్దుగఁ గూరుచుండి నా
ముచ్చట దీర నెమ్మొగము మున్దు లొసంగుచుఁ బ్రేమఁ జూపుచున్
జెచ్చెర నన్ గృతార్థునిఁగఁ జేయఁగదే! జగదేకసుందరీ!

కనుఁగవ చెంగలింపఁగ మొగమ్మునఁ జెమ్మట గ్రమ్మ బింకపున్
జరుగవ త్రెకఁ జింపుకొనఁ జక్కఁగ మేన్ పులకింప మోవిపై
ని నగవు తాండవింప జిగినీలపుముంగురు లూఁగులాడఁ గ్ర
క్కున నను నక్కుఁ జేర్చు మిదిగో! నిను నక్కఱ మ్రొక్కెదం జుమం!

కుసుమరు నిండినగుబ్బ లెద నిండఁ గదియించి మించువేడ్కను గౌఁగిలించనిమ్ము
గోర గీరనఁ బాలుగారు ముద్దులచెక్కుటద్దమ్ములను ముద్దులాడనిమ్ము
మదనసంతాపమ్ముఁ దుద ముట్టఁజేయు నీయమృత మొల్కెడిమోవి యాననిమ్ము
కళల నీనుచు ముద్దు లొలుకుచుండెడియంగకములఁ గన్నారఁగఁ గాంచనిమ్ము
ఎందుచే నైన నేమి నాయెడల నంత - వలపు గలదాన వయ్యు నావల పెఱుంగు
వలఁతి వయ్యును నను మోహవార్ధిఁ ద్రోసి-తిరిగి చూడవు నా కేది తెరువు తెలుప!

ఇదివఱకు మదనదశ లెని-మిది తీఱినయట్లె యింక మిఁదివి రెండున్
గదియకముందఱనే నీ-హృదయమ్మున దయఁ దలంచు ప్రేయసి నాపైన్.

సుదతీ! నాయెడఁ దప్పు లే దని యిటుల్ శోకించుచున్ నేఁ బదిం
బదిగా నిన్ బతిమాలుచుంటిని నన్ మన్నించు తప్పుండినన్
పదిలోనన్ పదొకం డటంచు మదిలో భావించి యింకైన రాఁ
గదవే తాపము సైఁప నోప దివిషద్గాణిక్యమాణిక్యమా!

ఇఁక నిను నేమి వాకొనుదు నెల్లకుఁ బ్రాణము పోవుచుండఁ బి
ల్లికిఁ జెలగాట మన్నటులు లెక్కకు మిక్కిలి మాఱుఁ డేయుపు
వ్వుకఱుకుటమ్ములన్ మది రవుల్కొని మండుచు నుండ హా! మొగ
మ్మొకపరి త్రిప్పి చూడవయొ! ఉర్వశి! ఊర్వశి!! ఊర్వశీ!!! చెలీ!

అన్నృపుఁ డిట్లు వేల్పుజవరాలికి నై మతి పోయి యేడ్చుచున్
సూనశరాగ్నితప్తుఁ డగుచున్ వివశుం డయి దిక్కుమాలి యెం
తేనియుఁ బిచ్చివాఁ డయి మహీస్థలిఁ గ్రుమ్మరుచుండెనంట! అ
ట్లైను గదా! మనం బొరుల కప్పన సేసినవారిసంగతుల్.

# అశోకుడు చక్రవర్తియా లేక భిక్షువా?

సామవేదం జానకిరామశర్మగారు (రామకృష్ణసమితి)

అశోకచక్రవర్తి జీవితచర్యలయందాతని బౌద్ధ ధర్మావలంబనము మహత్తరమై యున్నది. ఆతడు బౌద్ధధర్మావలంబి యని సమ్మతించనివారు కొలది మందియు, సమ్మతించినవారధిక సంఖ్యాకులుగను కలరు. ఏ ప్రమాణములచే అశోకుడు బౌద్ధధర్మావలంబి యని స్థిరీకరించిరో వాటి నిచట వివరించుట యనావశ్యకము. ఇచ్చట ఆతనికి బౌద్ధధర్మముతో గల సంబంధమును, ఈ విషయమై పలువురకు గల యభిప్రాయభేదములను వివరింపబడును.

అశోకచక్రవర్తి బౌద్ధభిక్షువుల జీవితవిధానము ననుసరించెనని ఇతిహాసకారుల యభిప్రాయము. అశోకుని ప్రథమశిలాలేఖనమందు తన బౌద్ధమతస్వీకారమును గూర్చి వ్రాసిన యంశములకు బాగుగ నర్థము చేసుకొని ఆతడు భిక్షుజీవనము ననుసరించెనని సిద్ధాంతీకరించి యున్నారు. శిలాలేఖనమందశోకుడీ విధముగ వ్రాసియున్నాడు: "నేను బౌద్ధధర్మోపాసకుడనైన వెంటనే యెక్కుడుగ ప్రయత్నమును చేయలేదు గాని, సంవత్సరమైన పిదప సంఘస్వీకార మొనర్చిన నాట నుండియు విరివిగ ప్రయత్నమును చేసితిని" "సంఘఉపగతే, సంఘఉపేతే, సంఘ ఉపయాతే" యను పదములకు పండితులు భిన్నభిన్నార్థములను కల్పించి యున్నారు. బ్యూలర్ కెరన్ మహాశయులు అశోకుడు రాజధర్మము వీడి భిక్షువువలె సంఘమందు సంచరించెనను అర్థమును కల్పించిరి. చక్రవర్తి జీవితమును, భిక్షుజీవితమును కలసి యుండుట యసంభవమని వీరిమతము. స్మిత్ మహాశయుడు అశోకుడు చక్రవర్తిగనుండి కూడ భిక్షుజీవితమున కాలము వెళ్లబుచ్చెనని చెప్పియుండిరి. వీరు తమ వాదమును బలపఱచుకొనుటకు, క్రీ. శ. ౭ వ శతాబ్దమున చీనాయాత్రికుడగు ఇత్సింగ్ భారతదేశయాత్రయందు తాను అశోకుని భిక్షువేషమున గాంచితినని చెప్పిన వాక్యములను ప్రమాణముగ నిచ్చియున్నారు. ఇది గాక చీనాదేశమున గూడ క్రీ. శ. ౫౦౧-౪౯ వరకు పరిపాలించిన యొకానొక చక్రవర్తి సామ్రాజ్యపాలన మొనర్చుచుండియు సన్యాసిజీవితమున కాలము వెళ్లబుచ్చియుండెననికూడ పలికి యుండిరి. ౧౨ వ శతాబ్దమున గుజరాతుదేశమందలి జైన చక్రవర్తియగు కుమారపాలునికూడ ఈవిషయమై దృష్టాంతపఱచుచున్నారు. డాక్టర్ డి. ఆర్. భండార్కరు లీయభిప్రాయమున కనుకూలురు గాక యీవిధముగ చెప్పియుండిరి: "అశోకుడు భిక్షువు కాడు గాని, భిక్షువులనుసరింపదగిన ధర్మములను వారికి బోధించుచుండెడివాడు. భిక్షుల కుపదేశించుటకై బౌద్ధధర్మముల నాతడుపాసించెను గాన ఈతని బౌద్ధధర్మోపాసకుడని మాత్రము చెప్పవచ్చును. ఈవిధముగ అశోకుడు చక్రవర్తియై యుండియు, బౌద్ధధర్మప్రచార మొనర్చెను." దీనికి సరియగు ప్రమాణము లేకుండుటచే నూహమాత్రమే యని తలపబడుచున్నది. వీరు 'సంఘ ఉపగతే' అను పదమునకు 'నేను సంఘముతో కలసియుందును' అని యర్థము చెప్పియున్నారు. సెనార్టు అను నాతడీ పదమునకే 'నేను సంఘమందలి సభ్యులకడ నుందును' అని యర్థమును తీసియున్నాడు. జెనీ మాధవులు అశోకుడు భిక్షువును, భిక్షువేషధారియు గూడ కాదనియు, కేవలమాత్రము గృహస్థాశ్రమమందుండియే రాజ్యమును పాలించియుండెననియు, అట్లుగాక ఆతడు భిక్షువే యైనచో నాతడా విషయమును స్పష్టమగు శబ్దములలో తెలిపియే యుండెడివాడనియు చెప్పుచున్నారు. 'సంఘ ఉపయాతే' యను పదమునకు అశోకుడు భిక్షువేషమును ధరించి సంఘప్రవేశ మొనర్చెనను నర్థము లేదు. భిక్షువేషమును ధరించియుండెనని చెప్పుట గూడ సమంజసముగ లేదు.

ఏలయన సంసారమును వీడి నిర్వాణసిద్ధికొరకు ప్రయత్నము చేయు సన్న్యాసులే అట్లు చేయుదురు.

'సంఘే ఉపగతే' అనుపదమునకు తఱుచుపండితులు 'సంఘమందు ప్రవేశించెను', 'సంఘముతో నైక్యమాయెను' అని నుడివియున్నారు. సంఘప్రవేశ మొనరించె నన్నను, ఐక్యమయ్యె నన్నను, గృహాదికమును త్యజించి, సన్న్యాసాశ్రమము స్వీకరించి భిక్షువేషమున నుండెనని యర్థము తోచుచున్నది. ఈకారణముచే అశోకచక్రవర్తిగూడ గృహస్థాశ్రమమును వీడి భిక్షు వాయెనని చెప్పవలసి వచ్చుచున్నది.

పండితు లిట్టి వివాదము నొందుటకు కారణము ఉపగతశబ్దమునకు భిన్నభిన్నార్థముల కల్పించుటచే నేర్పడినది. అమరకోశము తృతీయకాండమందు ఉపగతశబ్దమునకు అంగీకారమని వ్రాయబడియున్నది:

శ్లో. "ఊరీకృత మురరీకృత మంగీకృత మాశ్రుతం ప్రతిజ్ఞాతమ్, సంగీర్ణ విదిత సంశ్రుత సమాహితోపశ్రుతోపగతమ్."

మనము 'ఉపగతం' అనుపదమును అంగీకారార్థముచే జూచిన అశోకని వాస్తవాభిప్రాయము బొత్తిగా భ్రమపలోను గాదు. సంఘము నాతడు అంగీకరించె ననగా, సంఘనియమముల నాతడు తనకొరకై స్వీకరించి తదాచరణకు గడంగెననియు, లేదా పూర్ణముగ నాతడు బౌద్ధధర్మానుయాయి ఆయెననియు చెప్పవచ్చును. అటులనే అశోకుడు గూడ ప్రథమమున బౌద్ధధర్మోపాసకుడనై యుంటినని వచించియుండెను. ఇట్లు నుడువుటచే నాతనికి బౌద్ధమతమునెడ ప్రేమయు, శ్రద్ధయు, గౌరవమును ఉండెనని తెలియుచున్నది. కాని బాహ్యముగ మాత్రమాతడు సంఘమునందు నియమానుసార ముండియుండలేదు. పిమ్మట సంవత్సరమునకు పైబడిన తరువాత బౌద్ధధర్మమునం దాతనికి విశ్వాసము మెండగుటచే బౌద్ధమతధారణ మొనర్చి తనపురాతనమగు బ్రాహ్మణ మతమును వీడెను. ఈవిధముగ అశోకుడు బౌద్ధమతమును స్వీకరించుటయందు రెండవస్థ లేర్పడినవి. ప్రథమావస్థయందాతడు బౌద్ధధర్మోపాసకుడు మాత్రమాయెను. కళింగ యుద్ధమందలి ఘోరమగు జననాశనమే అశోకుని చిత్తమందు సంచలనము కలిగించెను. వెంటనే యాతని మనోవృత్తి అహింసారూపముగ బరివర్తిత మాయెను. ఆసమయమందే దేశమున నహింసాసిద్ధాంతము మిగుల వ్యాప్తి నొందుచుండెను. అప్పటినుండియే అశోకునకు బౌద్ధధర్మములన్న ప్రబలతమమగు అనురాగము జనించెను. ఇదియే యాతడు తన్ను ఉపాసకునిగా జెప్పుకొనినయవస్థ. బాహ్యముగ నాతడు పూర్ణముగ సంఘస్వీకరణ మొనర్చుటయే రెండవయవస్థ. జను లందరును ధర్మతత్పరులు గావలెనని నిశ్చయముగా అప్పటినుండియే యాతడు తత్ప్రచారమునకై ప్రయత్నము చేయసాగెను. భారతదేశచరిత్రయందు, విశాలభారత నిర్మాణ మొనర్చుటకు బీజోత్పత్తి బుద్ధభగవానునిచే నైనది గాని, దానిని విస్తరింపజేసినది అశోకుడే. ఈ విధముగ నాతని ధర్మపరివర్తనమందు గలిగిన యవస్థాద్వయమునుగూర్చి నాతని ధర్మలేఖలయందే కాక, పాలీ, సంస్కృతభాషా సంబంధములగు దన్తకథలయందు గూడ కలవు. బౌద్ధభిక్షువు అశోకుని న్యగ్రోధముక్రింద కలుసుకొని, ఆతనికి "అప్పమాదవగ్గ" బోధించిన పిమ్మటనే, బౌద్ధధర్మములం దాసక్తియు, బుద్ధభగవానునియం దనురాగమును జనించెనని పాలీకథల వలన తెలియవచ్చుచున్నది. అటుపిమ్మట రాజ మహాలునకు భిక్షుసంఘమును రావించి వారికి యథోచితస్వాగత మొసగి, వారివలన బౌద్ధమతావలంబకు డాయెను. ఈరీతిగా అశోకుని బౌద్ధధర్మావలంబనమందలి రెండవస్థల విషయమై, దన్తకథలును, శిలాలేఖనమును ఒకటిగ నున్నవి. కాని శిలాలేఖనమందుమాత్రము, సంఘసభ్యులతో అశోకుడు కలసుకొన్నట్లు లేదు. ఇట్లుండ, దీనికి విపరీతముగ అశోకుని ధర్మలేఖలయం దాతడు ఎన్నడును సన్న్యాసస్వీకరణ మొనర్చియుండ లేదని యనేక ప్రమాణము లున్నవి. విశేషించి ధర్మలేఖలయందు తాను "రాజా" శబ్దమును పలుసారు లుపయోగించుకొనెను. "దేవానం పియో పియదసి రాజా" యని యిట్లు తన రాజ్యమును గూర్చియు, రాజ్యమందలి యుద్యోగస్థులను గూర్చియు విపులముగ వ్రాసెను. కాని గ్రంథమం దొకచోటనైనను తననుగూర్చి భిక్షుపదమును గాని, ఆయర్థమిచ్చు మరియొక పదమును గాని వాడియుండలేదు. భాబ్రూ శిలాలేఖనమందు, అశోకుడు భిక్షువే యైనచో



౧. హేంజీ హేంరక్ - ఉమరఖ్కుల ద్వంద్వయుద్ధము
'స్ఫియరు' నుండి.



* ౩. హేంజీ ఓటమి

'స్ఫియరు' నుంచి.

కొంచెమగనో గొప్పగనో ఆవిషయమును వివరించియే యుండును.

అశోకుడు గృహస్థాశ్రమమునందే యుండెనని యాతని ధర్మసిద్ధాంతములవలన తెలియుచున్నది. ఆగ్రంథమం దాతడు ధర్మోపదేశముల గృహస్థు లాచరణకు దేగలిగినచో స్వర్గఫలమును జూరగొందురని పలుసారులు వ్రాసియుండెను. అనగా ధర్మోపదేశముల నాచరణకు దెచ్చుట స్వర్గఫలము నభిలషించియే యని తోచుచున్నది. బౌద్ధధర్మానుసారము స్వర్గఫలము గృహస్థులకొరకే నిర్దేశింపబడియుండెను. భిక్షుజీవితము నాచరణమం దుంచుటచే అన్నిటికంటెను గొప్పదగు నిర్వాణపదము ప్రాప్తింపగలదు. అశోకు డీనిర్వాణపదమును గూర్చి కొద్దిగ కూడ వ్రాసియుండలేదు గాన, యాతడు గృహస్థ జీవనము నాదర్శమం దుంచుకొని తత్సాఫల్యమునకై ప్రయత్నించెనని తేలుచున్నది. అష్టాంగమార్గమును గూర్చి యాతడు ప్రసంగింపకుండుటచే కేవలము గృహస్థజీవనముతోడనే కాలము వెళ్లబుచ్చెనని తేలుచున్నది. మాతాపితరుల సేవించుట, గురు శుశ్రూష యొనర్చుట, మిత్రులను, వృద్ధులను ఆదరించుట, బ్రాహ్మణులకు దానమిచ్చుట, సేవకుల నుచితరీతిని గాంచుట నను నివి అశోకుని ధర్మ సిద్ధాంతములందు ముఖ్యతమములుగ నుండెను. గృహస్థోపయుక్తములగు గ్రంథములలో "సిగలోవాదసుత్త" మను గ్రంథము ముఖ్యమైనది. ఇది గృహస్థుల కత్యంతోపకారి యగుటచే "గిహివినయ" మనికూడ నామాంతరముతో నున్నది. అశోకుని పై ధర్మసిద్ధాంతము లీగ్రంథమందలివే.

ఇట్లుగాక అశోకుడు ధర్మప్రచారమందు స్వదేశ విదేశములలో బొందిన యద్భుత సాఫల్యము కేవల మాతడు భిక్షువై చేయగోరిన, నసంభవమై యుండెడిది. ఆతనికి వ్యక్తిత్వముతో రాజకీయ శక్తిగూడ యుండుట ఆవశ్యకమై యుండెను. ఇది యాతని రాష్ట్రాంతర సంబంధముల వలన తేలుచున్నది. విదేశములం దంత గౌరవాదరముల బొందుట కాసమయమున ప్రబలమగు రాజ్యశక్తి యత్యావశ్యకమై యుండెను. భిక్షురాజైన ఆశక్తి యెంతవరకు పనిచేయగలదు! ఇది గాక విదేశీయుల నడ్డగించుట కూడ భిక్షురాజున కసంభవమగు కార్యములలో నొకటి.

ఈవిషయము లన్నిటివలనను అశోకు డెల్లపుడును రాజై యుండెననియు, ఒకప్పుడుగూడ భిక్షుజీవనమున సంసారమును త్యజించియుండలేదనియు స్పష్టముగ తేలుచున్నది.

---

# కీర్తిశేషులైన ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు

దర్భా యజ్ఞన్న గారు, B. A. L. T.

"ఆకుండి వంశదుగ్ధాబ్ధి సంభూతరా
కాసుధాకరకీర్తి గనియె నెవఁడు
వ్యాసర్షి కృతమహాభారతామ్నాయంబు
దెలుఁగునఁ గ్రొత్తగా నిలిపె నెవఁడు
సరస రాజమహేంద్రవర కళాశాలఁ బ్ర
ధాన పండితుఁడు నాఁ దనరె నెవఁడు
బుధజనాహ్లాదమై పొగ డొందిన యనర్ఘ
రాఘవాదుల నెన్నొ వ్రాసె నెవఁడు
శాస్త్రిగారని మేటియొజ్జలును జాల
భక్తి నిడుదండములఁ గొను ప్రభు వెవండు
అట్టి వ్యాసునిచారిత్ర మాంధ్ర భూమిఁ
దనరుఁ గావుత మాచంద్ర తారకముగ."



కీ. శే. ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు

దక్షిణ గంగనాఁ దగ్గయు నొప్పిన గోదావరి యొక్క తీరదేశంబులు జగదాదినుండియుఁ బవిత్రవంతంబులై పుణ్యజనాకీర్ణంబులై, పంటపొలంతి కాకరంబులై లక్ష్మీవాణీసతుల కాటపట్టులై యేపుమీఱి యున్నవి.

గోదావరి పాయ లేడింట నొక్కటియగు వశిష్ఠకుఁ బశ్చిమతీరంబునఁ దొల్లి బ్రహ్మ మహేంద్రమహిమతో నపూర్వంబగు యజ్ఞం బొండు చేసెను. అప్పటినుండియు నత్తావు బ్రహ్మకుండంబను పవిత్రతీర్థంబై యలరుచున్నది. ఇమ్మహాపుణ్య తీర్థంబు చెంతఁ గాఁకరపఱ్ఱు గ్రామంబు గలదు. ఇది ప్రస్తుతము పశ్చిమగోదావరీ మండలములోని తణుకున కాఱు మైళ్ల దూరమున నున్నది. ఇది చిరకాలమునుండియుఁ ద్రిలింగ దేశంబునం గల గొప్ప విద్యాపీఠంబులలో నొక్కటియని ప్రఖ్యాతి గాంచినది. ఇది గీర్వాణాంధ్ర భాషాయోషామణులకు నివాసంబులై, సారవంతమైన విద్వాంసుల పంట భూమియై, పరిఢవిల్లుచున్నది. ఇయ్యది 'అపార శబ్ద శాస్త్రపారగులగు వైయాకరణులకును, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులకును, మృదుమధురరసభావభాసురనవార్థ వచనరచనా విశారదులగు మహాకవులకును, వివిధతర్కవిగాహిత సమస్తశాస్త్ర సాగరగరీయః ప్రతిభులైన తార్కికులకును,' చతుర్వేదాధ్యాత్రధ్యాపక సంఘంబులకును, నధీతిబోధాచరణ ప్రచారణంబుల విద్యలకుఁ జతుర్దశత్వ కల్పనచేయు పండితులకును దావలంబై యొప్పుచుండు.

ఆగ్రామంబున నారామద్రావిడకులతల్లజులగు కాఁకరపర్తి వేంకటశాస్త్రిగారుండు కాఁపురము చేయుచుండు. వీరికి రామాంబికయను ధర్మపత్నియుందు వేంకమాంబయను బాలామణి యుద్భవించె. వేంకమాంబను నాయమ తల్లిదండ్రులు ఖండవల్లి గ్రామవాసియగు నాకుండి వేంకటశాస్త్రిగారి కిచ్చి వివాహము చేసిరి. వేంకటశాస్త్రి వేంకమాంబ లిద్దఱు ననుకూల దంపతులై సుఖంబుగఁ దనుయాత్ర సాగించుచుండిరి. కొంతవడికి వేంకమాంబ గర్భిణియై పురిటికిఁ బుట్టినింటికిఁ గొంపో

పంబడియె. కాఁకరపర్తి గ్రామంబున సౌమ్యసంవత్సరము నందు (క్రీ. శ. ౧౮౬౦ ప్రాంతమున) ఒక శుభదినంబున వేంకమాంబ విబుధాధినాథుఁడగు వ్యాసమూర్తిశాస్త్రిం గనెను. కుమారసంభవంబునకుఁ జాల సంతసించుచు జాతకర్మాదిక్రియాకలాపంబులనెల్ల నాకుండి వేంకటశాస్త్రిగారు కడుముచ్చటగ నిర్వర్తించిరి. ఆ బాలుఁడు శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుఁడగుచు, సకల కళాపరిపూర్ణుఁడై, తనవీక్షణ చంద్రికలచేఁ గవికులంబు నలరించుచు, ఛాత్రచకోరకంబుల వికాసభాసమానములం గావించుచుండె.

వీరికిఁ దండ్రిగారు సకాలంబున విద్యాబుద్ధులు గఱపి తగిన కట్టుబాట్లలో నుంచి పెంచిరి. ఇంట నున్నపుడే వ్యాసమూర్తిశాస్త్రిగా రమరమును, నాంధ్రనామ సంగ్రహమును, రఘువంశమును, భట్టి కావ్యమును, వరద రాజలఘుకౌముది మున్నగు గ్రంథములను దండ్రిగారి యొద్దఁ జదివిరి. వీరికిఁ బ్రధానగురువగు వేదుల సోమనాథ శాస్త్రిగారితో వీరు నాటకాలంకార సాహిత్యగ్రంథములం జదివిరి. ఆణివిళ్ల శంభుశాస్త్రిగారికడ కారికావళీ, ముక్తావళులను; నిడుమూరి సోమనాథశాస్త్రిగారి సాన్నిధ్యంబున సిద్ధాంత కౌముదీ, తత్త్వబోధినులను; ఆకుభట్ల రామమూర్తి శాస్త్రిగారి యొద్ద నుపనిషద్భాష్యమును, బ్రహ్మసూత్రభాష్యమును, నానందగిరిని, రామానందరత్నప్రభా బ్రహ్మవిద్యాభరణాదులను సంప్రదాయానుసారంబుగఁ జదివిరి. వీనికిఁ దోడుగా ఆణివిళ్ల వేంకటశాస్త్రిగారి సముఖంబునం గూర్చుండి పారాశరి, తాజకనీలకంఠి, నుమామహేశ్వర సంవాదము మున్నగు జ్యోతిష గ్రంథముల నభ్యసించిరి. దీనం దనియక వీరు పురాణపండ భద్రయ్యశాస్త్రిగారి యొద్దఁ దెనుఁగులక్షణములు నేర్చికొని, గోవిందవఝ్ఝల రాజన్నశాస్త్రిగారి సాహాయ్యంబున నాంధ్రశబ్ద చింతామణిని, వృత్తరత్నాకరాది గ్రంథములను జదివిరి. దీనికిఁ దోడుగ వీరు ధృత్యున్నతోత్సాహులై, బహుళ గ్రంథావలోకనదీక్షితులై, గీర్వాణ వైకృతంబులం దసమాన పాండిత్యంబు గడించిరి. వీ రుపకారవేతనము గొనుదినముల శొకకొంచెము పూర్వ మాంగ్లభాషాభ్యసనము చేయు నుత్సాహముతో నక్షరములను నేర్చికొనుటయే వీరి విజ్ఞాన గ్రహణాసక్తిని వేనోళ్లఁ జాటుచున్నది.

వ్యాసమూర్తి శాస్త్రులు గారు (క్రీ. శ. ౧౮౭౭ మొదలు క్రీ. శ. ౧౮౭౮ వఱకు) రెండు సంవత్సరములు తమ స్వగ్రామమగు ఖండవల్లియం దాంధ్రోపాధ్యాయులుగ నుండి, యంత నాలుగేండ్లు (క్రీ. శ. ౧౮౭౮-౧౮౮౦) కొత్తపేటలోఁ దెలుఁగుపండితులుగఁ బని చేసిరి. అంతనుండి వారు క్రీ. శ. ౧౮౮౦ రాజమహేంద్రనగరము చేరి యందలి ప్రాథమిక పాఠశాలయందు సంస్కృతభాషాపండిత పదవిని సంపాదించి పనిచేయుచుఁ, బిమ్మట దొరతనమువారి బోధనాభ్యసన కళాశాలా సంస్కృతోపాధ్యాయ పదవి నంది, కొంతవడికి వారి కెంతయుఁ దగియున్న శాస్త్రకళాశాలా గీర్వాణభాషాపండితులై వన్నెకెక్కిరి. కడదాఁక నీపదవియందే యుండి యందఱు పండితుల మన్ననలకుం బాత్రులైరి.

వీరికి ఇరువదియేండ్ల ప్రాయముననే వీరి తండ్రిగారు పరలోకగతులైరి. అప్పటినుండియు సంసారము మోయు బాధ్యతయంతయు జ్యేష్ఠుఁడగు నీయనమీఁదనే పడెను. వీరు మువ్వురు సోదరులు. ఇందొక్క రిరువదినాల్గవయేఁటనే కాలధర్మము నొందిరి. గాంభీర్యవారాశియు, విశేషానుకంపాయత్తచిత్తులును, సదా సన్మార్గవర్తులును నగు వ్యాసమూర్తిశాస్త్రిగారు తమ సోదరులను గంటికి ఱెప్పవలెఁ గాచుచు, వారి కెట్టి లోపంబేని గల్గునేమో యని తమ కోర్కెలనేని బోకార్చికొని వారి వాంఛితంబులం దీర్చువారు. వీరు స్వార్జిత విత్తంబుతో సోదరులకుఁ జదువు చెప్పించి వారి కుటుంబములను బోషించుచు, వారివారికే వలయు గృహోపకరణంబులను, ఆవాసంబులను నేర్పఱచి, వారి కెట్టిలోపంబును రాకుండ వేయి విధంబులం జూచి కాపాడువారు. వీరిభార్యకూడ వీరి యట్టి యుదారస్వాంతయే. చుట్టాల సురభియై సౌబగునొందిన యీయమ తనభర్తకంటె వేయిమడుంగుల యాదరముతో మఱందులకు వలయు భోజ్యాదుల నిడి, యభ్యంగనాద్యుపచారంబులఁ సకాలంబునఁ జేయుచు నబ్బాలకులను రెండవతల్లివలెఁ జూచుచుండెడిది.

మనదేశమునందలి పండితులలో శాంతమూర్తులును, సౌశీల్యవంతులును, సౌజన్యవిస్తారులును నగువారు పెక్కండ్రు గానరారు. ఇట్టి మహనీయగుణంబులు గల వీరికి వీరేసాటి. "నిండుకుండ తొణకదు" అను నుడికి లక్ష్యముగఁ జేర్కొన ననువైన శాంతస్వాంతులు వీరే. చాల మంది పండితులు వీరికి మిత్రులే. ఒకవేళ వీరి విద్యావైదుష్యము నెవ్వఁడేని ద్వేషించి వీరిమీఁదికి వాదునకు వచ్చినచో, వాని యా రాకడను మిత్రత్వంబునన పోకార్చువారు. అనవసరంబుగఁ బండితుల వాదంబులం బ్రవేశించి కయ్యమునకుఁ గాలు ద్రవ్వువారు మాత్రము గారు. తమకంటెఁ జిన్నపండితులు వీరిని దర్శింప వచ్చినను వారిని బహుభంగుల బహూకరించువారే కాని మాత్సర్యముతోఁ గొడిమెలు కట్టువారు మాత్రము కారు.

విద్య నేర్చికొన నభిలషించు శిష్యవర్గమునెడఁ బుత్రవాత్సల్యంబు గల్గి వారేది కోరిన దానిని వారికి సుబోధమగురీతిని జెప్పువారు. అంతేవాసులందఱు వీరి నమితగౌరవముతోఁ జూచుట కొనర్చునవి వీరి సాధువర్తన, సౌమనస్య, బోధనకౌశల్యంబులె. ఇంతియ కాక వీరు, వివేకానందస్వాముల వారివలె, బ్రహ్మజ్ఞానము నన్నిజాతులవారికి నుపదేశింప నగు నను నాశయము గల మహాత్ములు. వీరియొద్ద భగవద్గీతఁ జదువ నభిలాషపడిన యొక్క యంఘ్రిభవునితో, "వేదములను వినఁగూడని స్త్రీ శూద్ర బ్రహ్మబంధువుల కొఱకు వేదవ్యాసుఁడు భారతమును రచించెను. సనత్సుజాతీయము, విదురనీతి, భగవద్గీత, ఉత్తరగీత మున్నగునవి భారతమున నున్నవి. వీనినిగూడ శూద్రులు చదువవలెననియే వ్యాసులవారి యభిప్రాయము. ఇంతియ కాక సూతుఁడు వ్యాసమహర్షి వలన బ్రహ్మజ్ఞానమును సంపాదించి శౌనకాది మహర్షులకు బోధించె"ననుచు నాతనికి భగవద్గీతను జెప్పిరి.

వీరికి ధనమునందును, నైహికానందములందును వైముఖ్యము మెండు. వీరి యిరుగుపొరుగుల నున్న యన్నదానమువారి కోడలు గోదావరిలో బట్టలు నుతికికొనుచుండఁగా నాయమ మెడలోని నాను నీటం బడి కాన్పింపలేదు. మఱునాటి యుదయమున నారాతి కడనే బట్టలు నుదికికొనుచుండఁగా శాస్త్రిగారి భార్యకానాను దొరకెను. ఆమె యద్దానిని శాస్త్రిగారికీయ, వారు దాని నాతరుణమునకే తీసుకొనిపోయి వారికిచ్చిరి. తత్త్వజ్ఞులగు వీరికి బ్రహ్మానందమే యానందము. వీరు వేఱొండానందంబుల గోరువారు. చిన్నతనంబున వీరికి వీధినాటకములం జూచుటయం దభిలాష మెండుగ నుండెడిది. మిత్రుల ప్రోత్సాహంబు కారణంబుగ నొక్కనాఁడు నాటకమును జూడఁబోయి, నాటకశాలవఱకు వెళ్ళి, విపులవైముఖ్యము నొంది, దానిఁ జూడ నేవగించికొనుచు నింటికి మగిడి వచ్చిరి.

వీరికంటె నెన్నియో యంతలు తక్కువ పాండిత్యము గలవారు చాలమంది దొరతనమువారి మన్ననకుఁ బాత్రులై వారివలన బిరుదములను బొందిరి. వీరి కిబిరుదులు లభింపమికి వీరే కారణభూతులు. కావుననే నిరాడంబరులును, సర్వతోముఖపాండిత్యాభిశోభితులును నగు వీరికి "మహామహోపాధ్యాయ" బిరుదము లభింపలేదు.

ఆపద్బాంధవుండగు నిమ్మహనీయునికి గురుభక్తి మెండు. వీరి వ్యాకరణగురువుగారు రవసానదశయం దున్నవార్త విని, వారి సమక్షంబున కేఁగి, కొంతవడి యచ్చో నుండి, వారి కుత్తరక్రియలు చేయించి వారి కుటుంబమునకు సాధ్యమయినంత సాయము చేసి యింటికిఁ దిరిగి వచ్చిరి.

వీరు బహుళాంధ్ర గ్రంథరచనాదక్షులు. వీరు (౧) మయూరసూర్యశతకము, (౨) భామినీవిలాసము, (౩) గంగాలహరి, (౪) అనర్ఘరాఘవము, (౫) ప్రబోధచంద్రోదయము, (౬) పరాశరస్మృతి- యను మిశ్రాంధ్ర గ్రంథములను రచించిరి. (౭) కాళిదాసకృత ఋతుసంహారమును శుద్ధాంధ్ర గ్రంథంబుగఁ బరివర్తించిరి. (౮) భారతఫక్కి- యను చిన్నగ్రంథమును గూడ వ్రాసిరి. ఇంతియ కాక వీరు (౯) భారతము నాంధ్రీకరింప మొదలిడి పదునూఁడు పర్వంబులఁ దెలిఁగించిరి. వీరు (౧౦) నైషధమును గూడ నాంధ్రభాషలో రచియింప దొరఁకొనిరి. కాని, యది పూర్తి కాకుండఁగనే వీరు పరమపదించిరి. వీరిశైలి నిర్దుష్టమై, కఠినముగ నుండి నారికేళపాకమే యనిపించికొనుచున్నది. వీరి కవనమునకుఁ బాకశుద్ధియు, ధారాశుద్ధియుఁ దక్కువ. ఇందుచేతనే

యొకరు "శాస్త్రులుగారి పాకము స్వయంపాకమువలె శుచిగా నుండునే కాని రుచిగా నుండ"దని భళోక్తిగా ననిరట.

ఇమ్మహామహుఁడు సూత్రభాష్యాదులు చదివి బ్రహ్మజ్ఞానమును గూడ నార్జించిరి. ఆర్జించుటయే కాక దానిని చరమావస్థలో ననుభవమునకుఁగూడఁ దెచ్చికొనిరి. వీరు రోగపీడితులై బాధపడుచున్నపుడు వైద్యులు వచ్చి మీ కెట్లున్నదని యడిగిన "నేను హాయిగ నున్నాను, నాకు బాధలే"దనియు, బంధువు లడిగిన వారితో "నా శరీరము బాధపడుచున్నది గాని నేను బాధపడుటలేదు, విచార మన్నమాట తలపెట్టవల"దనియుఁ బలుమారు పల్కుచుండిరి. "ఎట్టి పండితులకైనను నిట్టి యద్వైత సిద్ధి గలుగుట యసాధారణ"మని యొక రాంధ్రపత్రికకు వ్రాసియున్నారు.

వ్యాసమూర్తిశాస్త్రిగారు క్రీ. శ. ౧౯౧౬ ఫిబ్రవరి రెండవ తేదీ పగలు పదిగంటలకు స్వర్గస్థులైరి. కర్ణకఠోరంబగు నీవిబుధమిత్రశిరోమణిలోకాంతరగతి విని, వాఙ్మయధురంధరులును, యశోనిలయులును నగు బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామ శాస్త్రులుగా రేక శ్లోకిని వ్రాసి తమమనోవైకల్యానుభూతి నిట్లు ప్రకటించిరి: "ఏవిబుధాగ్రేసరునకు గీర్వాణాంధ్రవాణీ దృఢాలింగన సంపత్తి బలాత్కారంబునం గాక స్వయంబుగా సంభవిల్లినందున స్వయంభూ (బ్రహ్మ) భావంబు సమకూరెనో, యేశాంతసద్గుణగణ్యుని నా గోపాలంబును శమదమాది సంపత్తి గల ధీరశాంత పురుషరత్నంబని పేర్కొందురో, శాస్త్రంబున 'యోగ్యులకు నేడడుగులు కూడ నడచుటచేతం గాని, యేడుమాటలాడుటచేతం గాని సిద్ధించు'నని ప్రసిద్ధిఁజెందిన నిరుపమాన 'సాప్తపదీనంబు' (సఖ్యంబు) మాకు నేకత్రనివాసంబున నేను హృద్యవేణ్యాతో సంవత్సరసప్తకం బవిచ్ఛిన్నంబై యలరారెనో యట్టి యాకుండి వ్యాసమూర్తి పండితబ్రహ్మవరుండు స్వర్గస్థుఁడైనందున నెంతయుఁ జింతాక్రాంతుఁడ నగుచున్నాఁడను." ఇట్టిమహామహుని కీర్తి యాచంద్రార్కమాంధ్రావని నెలకొని యుండుఁగాత.

" చ. అభినవభట్టబాణుఁ డన
నర్మిలి నొక్కఁడు వన్నె కెక్కెఁ దా
నభినవదండి నాఁ బరఁగి
యద్భుతకీర్తిని గాంచె వేఱొకం
డభినవగాధిసూనుఁ డను
నంకము దాల్చె నొకండు, నీవునున్
అభినవవ్యాసనామ బిరు
దాంకము దాల్పఁగదయ్య యింతటన్."

# శతకమంజరి (భక్తిసంపుటము)

ఈపుస్తకంలో వృషాధిపశతకము, సర్వేశ్వరశతకము, దేవకీనందనశతకము, ఒంటిమిట్ట రఘువీరశతకము, నారాయణశతకము, కాళహస్తీశ్వరశతకము, దాశరథిశతకము, రంగశాయి శతకము, రామతారకశతకము, రామచంద్రశతకము అనే పదిశతకాలు ఉన్నవి. ఒక్కొకశతకానికి దానిని విమర్శిస్తూ ప్రకాశకులు వ్రాసిన మంచిపీఠిక ఉంది. చాలా వ్రాతప్రతులతో సరిచూచి వాటిల్లోనుంచి తీసిన పాఠాంతరాలున్ను ఎక్కింపబడినవి.

మేనేజరు: ఆంధ్రగ్రంథమాల, 6-7, తంబుశెట్టివీథి, జార్జిటవున్, చెన్నపురి.

# కవి—కర్షకుఁడు

బొడ్డు బాపిరాజుగారు

కవి—

"తూరుపున వేగుఁజుక్క యుదయించె; నదిగొ
కూయుచున్నది తొలికోడి; గొడ్లపాక
అంకె వేసెడిఁ గత్తెద్దు; రామిగాఁడు
వచ్చె నిందాఁక నే; ఇంక పక్క దిగుఁడు
చాలు నిదు"రని యిల్లాలు మేలుకొలుప,
నాఁగలి బుజానఁ బెట్టి గానమ్ము సేయు
చున్న పులుఁగులఁ గనుచుఁ బ్రత్యూషపావ
నానిలమ్ముల నెంతేని హాయి గదుర
నరుగుదు వసుంధరాదేవి నర్చనమ్ము
సేయఁ బూజారి వగుచు;-విశేషసౌఖ్య
వంతుఁడవు కర్షకవరేణ్య!......

కర్షకుఁడు—

.....................వదలనట్టి
నిదురమంపునఁ బంతాని కెదురు వీచు
చల్లగాడ్పుల నోడ లెల్ల జలదరింపఁ
బొలమునకు నేఁగు నాపొందఁగల సుఖమ్ము
పొగడుదువు నీ వొకండవే పో కవీంద్ర!

కవి—

ఒకరి యధికారమున లొంగి యుండ; వనవ
రతము సంతృప్తి నుండుదు; వితరుల సుఖ
జీవనంబుల కడ్డు రాఁబోవు; నిన్ను
మీఱు స్వేచ్ఛావిహారి యేఁడీ?.........

కర్షకుఁడు—

.....................రయితుల
మష్టకష్టములఁ బడి, ఆయాస మొంది,
ఎండఁ జెమటోడ్చి ఏదొ పండించుకొనిన
సిస్తులని చెప్పి యొకకొంత, చెఱువునకు మ-
రమ్మతులపేర నొకకొంతసొమ్ము లాగి
కట్టుబడి ధాన్యమున కెంతొ కఱవు గలుగ
సాలుసరి కింతయప్పు మా పాలు సేసి
ఏడిపింపఁగ నధికారు లెందఱేని
కలరు;-మా జీవితమ్ములఁ గాంచఁబోము
స్వేచ్ఛ యనునది కవి వోట సృష్టిఁ జేతు
వెదొ యభూత కల్పనలను.........

కవి—

....................మృదు మనోజ్ఞ
శ్యామలాకృతిఁ దనరు సస్యముల నడుమ
నిరుపమానందరాజ్య నిర్ణేత వగుచు
ప్రకృతిమాత నుపాసించు భాగ్యశాలి
వవని నీ వొక్కఁడవె సుమ్ము హాలికప్ర
కాండ!..................

కర్షకుఁడు—

... కడుపులోఁ గల చల్ల కదలకుండ
నెచ్చటో గూరుచుండి యూహించి యిటు ర-
చించుటలు భావ్యమా? ఒక్కయెడను లీల
గా నరుగుదెంచి మాదుమోఁకాలిబంటి
బురదకయ్యల భాగ్యమ్ము, ముండ్లడొంక
లున్న సుఖము, పురుగుఁబుట్టఁ గన్న పిదప
ప్రాయుము కవీంద్ర! చిత్తము వచ్చినట్లు.

# కన్నడిగలు—తెలుగలు

విద్వాన్ కూరిగనూరు నరసింగరావు గారు,
B. A. L. T.,

## 3

'ప్రౌఢి పరికింప సంస్కృతభాష యంద్రు
పలుకునుడికారమున నాంధ్రభాష యంద్రు
ఎవ్వరేమన్న నంద్రు నా కేమి కొఱత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష.'

—శ్రీనాథుడు.

దేవత లనుకొను ఆర్యులు శీతమండలములో నుండి, హిమప్రళయముల నమసి, స్వర్గతుల్యమైన జన్మభూమినైన త్యజించి, జీవనార్థమై హిందూదేశమును జేరిరి. తరువాత ఆర్యుల నోటినుండియే పూర్వదేవతలని పిలువబడిన ఆర్యేతరజనములు అందు నివసించుచుండెడివారు. ఇట్లు కాలదృష్టిని, హిందూదేశపు ఆర్యేతరసంఘమువారు చాల ప్రాచీనులని చెప్పనయ్యె. ఉత్తరధ్రువమండలమును బాసి యుష్ణమండలమునకు సాగి, ఆర్యులు అందు ఉత్తర హిందూస్థానమున నివాసస్థానమును ఏర్పరుచుకొనిరి. దానికి ఆర్యావర్తమని నామకరణము జేసిరి. అందుకు ముందు అద్యాది ఆర్యేతరసంఘమువారి జన్మస్థానముగా నుండెను. ఇట్లు దేశదృష్టిని, హిందూదేశము ఆర్యేతరులదని నిర్ధరింపబడియె. శ్వేతద్వీపవాసులు శ్వేతవర్ణము గలవారై యుండిరి. వారి శీలములకును, హిందూదేశీయుల శీలములకును చాల భేదము లుండినవి. ఇట్లు పాత్రదృష్టిని, వన్నెను బట్టియు, వాడుకలను బట్టియు ఆర్యేతరులు ఆర్యసంఘమువారు కారని తెలిసె. క్రతుకర్మాసక్తు లార్యులు; వ్రతధర్మాసక్తు లార్యేతరులు. సూర్యేంద్రోపేంద్రులు ఆర్యులదైవములు; బ్రహ్మ, శక్తి, పశుపతి, గణపతి, జనపతులు హిందూదేశపు ఆర్యేతరుల యుపాసనాదేవతలు. ఆర్యులమతము వైదికము; ఆర్యేతరులమతము శాస్త్రసమ్మతము. ఇట్లు దైవమతదృష్టిని, ఆర్యులమతముకంటె ఆర్యేతరుల మత మన్యమని కనుగొనబడె. వేదపాఠకు లార్యులు, శాస్త్రాభ్యాసకులు ఆర్యేతరులు. ఇట్లు శ్రుతి శాస్త్రదృష్టిని, ఆర్యుల నిగమాధ్యయనమునకును ఆర్యేతరుల విద్యానైపుణ్యమునకు నుండు భేదము పరికింపనయ్యె. ఆర్యులకు ముందే ఆర్యేతరసంఘమువారు వ్యవసాయమును, వర్తకమును చేయుచుండిరనియు, తినుటకు బెట్టుటకు చాలినంతధనధాన్యములు గలవారై వెలయుచుండిరనియు నెఱుకకు వచ్చె. సంగ్రహముగా, కాలదేశపాత్రదైవమత విద్యాభ్యాస స్థితిగతుల నవలోకించి ఆర్యేతరు లార్యులు గారని సిద్ధాంతము చేయబడియె.

ఆ ఆర్యేతరసంఘమునకు ముఖ్యస్థానము దక్షిణహిందూ జనపదమనియు, వారు తొలుత ఏకసంఘముగా నుండి, పిదప రెండుపాయలైరనియు, ఒకజనము తమిళులనియు మఱొకజనము కన్నడిగలనియు, ద్రావిడజనాంగము మలెయాళులనియు దెలిసితిమి. కర్ణాట జనము తొలుత అవిభక్తముగనే కాలము గడపెననియు, ప్రాచ్యచాళుక్యరాజ్యస్థాపనముతో తెలుగలు తొలగిపోయి, రాజరాజనరేంద్రునికాలమునాటికి, వైదికమతావలంబకులగు నారాయణ నన్నయభట్టుల ప్రయత్నముల దేశ్యభాషను సంస్కరింపుకొని, ప్రత్యేక వ్యక్తిత్వమును బడసిరనియు, తత్పూర్వము వారు కర్ణాటక జనాంగమనియు, సుందరు లగుట తెలుగువారనియు, అందులకే వెలనాడు=వెళనాడు=బెళనాడు = తెలుగునాడని పిలువబడుచున్నదనియు సత్యసారాంశము సహేతుకముగా సాధింపబడియె. తేమ గల సముద్రతీరవాసు లగుట తమిళుల కా పేరు వచ్చెననియు, పర్వతప్రదేశముల నుండుట బట్టి మలెయాళుల కామాట కలిగెననియు, ఎత్తయి సుగంధవృక్షసంపత్తిగల నల్లనిగట్టునేల నుండుటం బట్టి కర్ణాటకు లానామమును బడసిరనియు, వారిలో ధనుర్ధారులయి మృగయావృత్తి నున్నవారు తుళువారనియు,

తోడ నుండువారు తోడలనియు, తమిళులకు నుత్తరమున నుండువారు బడగలనియు పిలువబడిరని నిర్వచింపబడియె. అందు నిపుణులును, సంగీతప్రియులు నైన కన్నడిగలు కర్ణాటక సంగీతశాస్త్రము నొకదానిం కూర్చి వృద్ధి జేసి, నాగస్వరమును, సంగీతమునకు వలసిన వీణా మృదంగాది వాద్యసాధనములను కల్పించి వాసికెక్కిరనియు, వారు వీరులును, శూరులును, ఔదార్యపరులు నై బుద్ధిశక్తిని, మనోవృత్తిని మాన్యులైరనియు పలికితిని. తమిళ, మలెయాళ, కన్నడిగ, తెలుగలు ఒక్క సంఘమునకే చేరినవారనియు, అందును తెలుగలు కర్ణాట జనాంగమనియు దెలియవచ్చుటబట్టి పై పేర్కొనబడిన జనముల, జనాంగముల బాయులై పోయిన ప్రత్యేక జీవనప్రవాహములు మరల ప్రేమసాగరము చెంత నేకమై చేరి, పారి, ఐకమత్యప్రేమముతో ఐహికాముష్మిక సుఖములకు పాటుపడవలయు నను ఆదర్శముతో, ముందు సూచించినట్లు తెలుగలకన్నడిగల నడుమ నుండు అంగాంగి సంబంధమును ఇంకింత సమర్థించి చాటు పరమసాధనమైన భాష నింత పరీక్షింతము.

కర్ణాటభాష ద్రావిడభాష లనబడు వానికెల్ల మూలమని కనబడుచున్నది. దక్షిణ హిందూస్థానపు ఆర్యేతర భాషలను విమర్శించి వానియందలి అల్పభేదములను అధికసామ్యములను తనవ్యాకరణమున వివరించిన కాల్డ్ వెల్ అను పాశ్చాత్యపండితుడు ద్రావిడభాషలలో నెల్ల తుళుభాష విశేషముగా వృద్ధియయిన భాష (developed) అని పలికెను. విశేషముగా వృద్ధియైన భాష యనుటకంటె మూలభాష (original) అననొప్పు. దానియందు ఇప్పటికిని అన్నిభాషల పోలికలును, పలుకులును కనబడుచున్నవి. అట్లు చెప్పుటకంటె, తుళుభాష ప్రవృద్ధకర్ణాటభాషకు శైశవావస్థ నుండినది యనదగు. తుళువారు కర్ణాటజనులలోని యొక తెగ. విల్లును బట్టి జీవనమునకై వేటల విహరించుచున్న తుళువారు భాషను వృద్ధిజేయుటకు పూనుకొనలేదు. కర్ణాటజనములో కన్నడిగలని పిలువబడువారు మాత్రము స్వరములను సాధించి వానిని శాస్త్రముగను, శబ్దములను సంస్కరించి భాషాశాస్త్రమును వృద్ధిజేసిరి. సారవంతమైన, మరియు ఫలవంతమైన వారిభూమి వారినిరాయాస జీవనమునకు తోడ్పడి వారి వాఙ్మయతపస్సునకు వలసిన కాలమును, ప్రతిభను కలిగించినది. అట్టి తపఃఫలమె కర్ణానందమగు కర్ణాటభాష. మూలరూపము తుళుభాషగా నిలిచినది. తేజోరూపము కన్నడమున, కన్నడము ననుసరించిన తెలుగున, నిలిచినది. అదెట్లనుట పిదప వ్రాయబడును. తుళుభాష మూలము; కన్నడభాష ఫలము.

కర్ణాటవర్గ భాషలు నికటసంబంధము గలవి యని ప్రకటించుటకై స్థాలీపులాకన్యాయముగా ముఖ్యమైన సంజ్ఞా ప్రకరణమును, శబ్దప్రకరణమును అవలోకింతము. తమిళమునకును కన్నడమునకును గల భాషాసంబంధమును కాల్డ్ వెల్ మున్నగు పాశ్చాత్యపండితులు వలసినంత వ్రాసియున్నారు. కన్నడమునకును తెలుగునకును గల సంబంధము నంతగా లక్షించలేదు. మన మావైపున నింత దృష్టి యుంచి చూతము. కర్ణాటవ్యాకరణకర్తలు సంస్కృతమున నుండు సమస్తవర్ణమాల లోని అక్షరముల నెల్ల శుద్ధాక్షరము లనినారు. ఇది సత్యవాక్యము. సంస్కృతమున నుండు అక్షరములు కన్నడమున లేవనుటయు, కన్నడము వేరే, సంస్కృతము వేరే యనుటయు భ్రాంతి వాక్యములు. ప్రథమమున పురుషుడు, ప్రకృతి యని రెండువస్తువు లుండినవి. అందు పురుషుడు 'అ' యను స్వరవాచ్యుడు. ప్రకృతి 'క్' అను వ్యంజనవాచ్యము. పురుషప్రకృతులు చేరి లేక జీవదేహములు చేరి అక్షరపదమును బొందినవి. జీవదేహములతో తొలుత దక్షిణ హిందూస్థానమున బ్రదికిన మానవప్రాణి కన్నడిగడు. కన్నడిగ డనుపదము క్ + అ=క అయినది. 'అ' నిచ్చి పలుకునది కాదు (కౌముదిని జూచుడు). దానిపై అనుస్వార మొకటి పలుకబడుచున్నది. కనుక, క్ + అ= క + ం=కం. దీనిమీద కన్నడిగపదము కలుగనయ్యె. బ్రహ్మ అజవాచ్యుడు. దీనినుండియే 'అహంకారము,' 'అహం బ్రహ్మాస్మి' యను వాక్యములు, తత్త్వము లుద్భవించినవి. బ్రహ్మను క, కంజ + జ, కంజజయని పిలుచుటయు దీని ననుసరించియే. ఈ కర్ణాటబ్రహ్మయే అక్షరముల సృష్టించి బ్రాహ్మికి బోధించినది. దీనింబట్టియే నాగవర్మాది జైనకవులు స్త్రీకి గ్రంథములను బోధిం

చుట; బ్రహ్మపుత్రుడగు రుద్రుడు ఉమకు మంత్రాక్షరములను ఉపదేశించుట. అట్టి స్వరవ్యంజనములే అ+క్ (కన్నడము) అక్కరము లనిపించుకొన్నవి. అవియే పంస్కరణకాలమున, బ్రహ్మసంతతియగు రుద్రుని నోరు అను డమరుగమునుండి పుట్టినవి అక్షరములని పాణిని మొదలగువారు వ్రాసియుండినది.

" అనుకూలపవననిం జీ
వనిష్టదిం నాభిమూలదొళ్ కహళెయపాం
గినవోల్ శబ్దద్రవ్యం
జనియిసుగుం శ్వేతమదరకార్యంశబ్దం." కేశిరాజ.

" తనువాద్యం నాలగెవా
దనదండం కర్తృవాత్మనవనమనోవృ
త్తినిమిత్తమాగి శబ్దం
జనియిసుగుంధ్వనివర్ణ మక్షరరూపం." కేశిరాజ.

తరువాత నిట్టియక్షరములను నంది, కందమున్నగువారు అభ్యసించి లోకముల నెగడజేసిరి. అక్కరము లనుమాట వేఱొకజాతివారి సంస్కృతమనుభాషనుండి సంభవించినదియని ప్రమాదము చేయబడుచున్నది. సత్యమది కాదు. తొలిభాష యొకటియుండినది. అదియే ప్రకృతి. నానాదేశముల జనులయుచ్చారణనుబట్టి యది కొంత భిన్నముగా నుండినది. వానినెల్ల సవరించి చేసినదే సంస్కృతభాష. కన్నడము ప్రకృతి యని చెప్పితిని. దానిసంస్కృతియే అక్కరములను అక్షరములని మార్చినది. దీనిని బ్రహ్మమతమువారే అనగా కన్నడిగలే కనిపెట్టి చక్కగా జేసినది. పాణిని మొదలగు శైవులు దానికి శివకర్తృత్వమును దగిలించినారు. రుద్రుడును బ్రహ్మఫాలమున బుట్టినవాడే కదా? ఇందున సత్యభంగ మంతగా నుండదు గాని ప్రాచీనతకును, కర్తృత్వమునకును భంగము కలుగుచున్నది. కనుక నింత వచించితిని. ఈసందర్భమున నొకసూక్ష్మ శముసుగురించి యొకమాట జెప్పవలసియున్నది. ఆర్యులు, ఆర్యేతరు లనువారు నొక్కసంఘమువారే. వారి వీరి భాష ఒకటియే. వారి వీరి దేశము నొకటియే. వారు ఉత్తర హిందూస్థానమున నుండిరి. వీరు దక్షిణ హిందూస్థానమున నుండిరి. వారు పైకి బోయిన వారు. వీరు స్వస్థానముననే యున్నవారు. వారు అట్లనే పైకి ఆసియాఖండమును దాటి యరోపా మొదలగు ఖండములలో జొచ్చిరి వీరిప్రక్కన వ్యాపించి యుండిరి. వారు ఆర్యజులు. వీరు ఆర్య. వీరికి వారికి కారణాంతరములచేత అంతః కలహములు ప్రాప్తించినవి. అయ్యవి దశావతారముల యందును, తదితరగాథలందును కన్పట్టుచున్నవి. అయ్యవి వేఱొకచోట విన్నవించెదను. నాతొలినుడుల ఆర్యులు, ఆర్యేతరులని వాడినది పృకృతమునందు వాడుకలో నుండు నర్థమునను. ఇట్లు స్వాభిప్రాయములను బెట్టుకొని పరప్రయోగవాక్యముల నింతవఱకు నుపయోగించిన పరస్పరవిరుద్ధముగా దోచవచ్చును; అయ్యది విశదముగా వేఱొండెడ వ్రాయనగును. దానినట్లుంచి ప్రకృతము ననుసరింతము. అక్షరములను కర్ణాటకులు సృష్టించిరి. వానిలో నెల్ల యుచ్చారణలు గలవు. తొలుత అ, ఉ అను స్వరము లుండినవి. తరువాత ఇ అనునది మధ్య వచ్చినది. అట్లు అ, ఇ, ఉ ల మీద ఆ, ఈ, ఊ లు వచ్చినవి. వానిమీద ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ లు వచ్చినవి. ఋ, ఌ మీద ౠ, ౡ వచ్చినవి. స్వరముల మీద ఁ, ం, ః వచ్చినవి. వానిలో మొదటి రెండు అను స్వారములు, అను నాసికములు; మూడవది అరపలుకు. వ్యంజనములలో తొలుత క్ వచ్చినది. తరువాత దానిలో చ, ట, త లు పుట్టినవి. క్ కు తుద ప. ఇట్లు ఆది క్, మధ్య త్, తుద ప్ లు మూడు ముఖ్యాక్షరములై (స్వరముతో) కతప లనిపించుకొనినవి. వానిపై వచ్చు అనుస్వారములతో గదబలైనవి. అటు ప్రకృతి కచటతపలకు 'గజడదబ'లు వచ్చి అంత్యమున సంస్కృతములో 'గసడదవ'లైనవి. స్వరములకు ఆదేశముగా వచ్చినవియే యరలవలు అయినవి. 'చ'కు వచ్చినవియే 'శష స'లు. 'ప'కు వచ్చినవియే 'హ', 'మ'. ఒత్తక్షరమే మహాప్రాణ మనిపించుకొనుచున్నది. స్వరములమీద 'ఁ, ం' లే వ్యంజనయోగమున ఐదు అను నాసికాక్షరములై పరిణమించినవి. 'ఋ, ఌ'లు క్రావడి, వట్రసుడి, శిథిలద్విత్వములుగా మాఱినవి. 'ర, డ' ల అతిపీడనమువలన 'ఱ, ఴ' పుట్టినవి.

ఇట్లు, అక్షరములను సృజించినవారే దాని పేరు పెట్టినారు. అక్కరము లనుపదము దేశ్యము. 'అ' మొద

లగు స్వరములు, మఱియు 'క' మొదలగు వ్యంజనముల సముదాయమునకు అక్కరము సంకేతపదముగా నుండును. ఈ అక్కరములందు హ్రస్వాక్షరములగు 'అ, ఇ, ఉ' యనునవియే తొలినుడుల పలుకబడియుండును. వానిదీర్ఘాక్షరములును, సంయుక్తాక్షరములును తరువాత నుడువబడియుండును. వావిమాటలగు అమ్మ, అప్ప, అణ్ణ, అక్క, అత్తె మొదలగు నామియంవును, అవను, ఇవను, ఉవను, అవళు, ఇవళు, అదు, ఇదు మొదలగు సర్వనామవాచకములందును నియ్యవియే కనబడుచున్నవి. ఆతను, ఈతను, ఆవళ్, అవును మొదలగు దీర్ఘాక్షరములు మొదట గల పదములు తరువాత వచ్చియుండును. తెలుగునందును కన్నడమాటల బోలు అమ్మ, అక్క, అన్న, అత్త, అది, ఇది యను పదముల తరువాత వాడు, వీడు, ఏవాడు మొదలగునవి ప్రయోగింపబడి యుండును. అవును, అయిన, రూపములపైన ఔను, ఐన యను సంయుక్తాక్షరములు గల రూపములు పొడమియుండును. ఇయ్యది శిశువుల యవస్థను బోలు మానవ శైశవావస్థయందు సహజము. కర్ణాటభాషాప్రకృతి పరిపక్వరూపమే సంస్కృతమని యొకదృష్టిని, సంస్కృతమను వికృతికి అపభ్రంశరూపమే కర్ణాటభాషాప్రకృతి యని మఱియొక దృష్టిని బలుకవచ్చును. తుద మొదళ్ల కుండు సంబంధము స్పష్టము. ఈ కర్ణాటభాషల ప్రకృతివృద్ధిని కన్పట్టు భేదములే సంస్కృత స్వరవ్యంజన సంధులందు సార్థకముగా తెలుపబడినవి.

కావున కర్ణాటభాష హిందూదేశజనుల మనోభావమునకు ప్రాణముగను, వాఙ్మయశరీరమునకు వెన్నెముకగా నున్నది. ఒకప్రక్క తమిళుభాషతో సంబంధమును, మఱొకప్రక్క తెలుగుభాషతో సంబంధమును కలిగియున్నది. కన్నడ తమిళునుడుల నికటసంబంధము కాల్డ్వెల్ మొదలగు భాషాతత్త్వజ్ఞులు వలసినంత తెలిపినారు. కర్ణాటజాతి జ్ఞానాభివృద్ధి క్రమమున భాషాభివృద్ధి గలిగినది. అవస్థాంతరముల జనించిన వ్యాకరణ వ్యత్యాసములు పరీక్షింపతగినవి. కన్నడము నందలి కొన్ని శబ్దరూపములకును తెలుగునందలి కొన్ని శబ్దరూపములకును ఆకారమునందు మార్పు గలిగినది. అవి దెలిసికొనిన, కన్నడ తమిళముల కెంత సామ్యము కనబడుచున్నదో కన్నడ తెలుగుల నడుమ నున్న సామ్యసంబంధము లంతకంటె నేమియుం దక్కువ గాక కనబడుచున్నవి. జాతిజీవనకాలమును సహితము పురుష జీవనకాలమును విభజించినట్లు అవస్థలనుబట్టి చతుర్వ్యూహములుగా జేయవచ్చును.

| | | |
|---|---|---|
| బాల్యావస్థ | అజ్ఞానము | అభేదభావము |
| కౌమారావస్థ | అల్పజ్ఞానము | స్వల్పభేదనిర్ణయము |
| యౌవనావస్థ | అధికజ్ఞానము | సంస్కరణము |
| వృద్ధావస్థ | అవధిజ్ఞానము | సంగ్రహము |

బాలభాషయందు లింగములు, వచనములు, వావివరుసలు పురుషులచే అభేదభావమున పలుకబడుచుండెడివి. బాల్యమున తన్ను తా నెఱుగడు. ఎదిరి నెఱుగు. అందుకే రెండవవానితో పురుషలు ప్రారంభమైనవి. తన, తన ఎదిరి నడుమ మఱొకడు రాగా నా రెండవపురుష తరువాత మూడవ పురుషగా మారినది. తాను తొలుత దానికే చూచినందున నయ్యది ప్రథమపురుష యని పిలువబడుచున్నది. జాతిప్రబుద్ధావస్థయందది జ్ఞానదృష్టిని మార్పు జెందినది. కావుననే మన మిప్పుడు దానిని ప్రథమపురుష యనుచున్నాము. బాల్యమున అజ్ఞానావస్థను తన్ను తా నెఱుగుట దుర్లభము. ఎదుట నుండు వస్తువును, దాని క్రియను కనుగొనును. ఇందువల్లనే ప్రథమపురుష సర్వనామవాచకములును, ప్రథమపురుష క్రియావాచకములును తొలుత పలుకబడినవి. మధ్యమపురుష మధ్య వచ్చినది. వస్తువు ఉండినది. దానిగుణములు అంతగా నరునకు దెలియవు. పేరిడ జాలడు. ఊరక పిలువగలడు. కనుక సర్వనామములు గలిగినవి. తరువాత నామవాచకములు సంభవించినవి. నామస్థానమున ప్రతినిధిగా నిలుచునది సర్వనామ మనుటకంటెను సర్వనామస్థానమున ప్రతినిధిగా నిలుచునది నామమనిన శాస్త్రోక్తముగ నుండును. ఆంగ్లేయభాషయందు నట్లె First person, Second person, Third person అనిపురుషలు పిలువబడుచున్నవి. ఉత్తమపురుషయని పేరేల వచ్చెను? తానుత్తము డనియా? రెండవవాడు మధ్యము డనియా? అట్లయిన మూడవవానిని ప్రథము డని యర్థము చేసిన పరస్పర

విరోధము గలుగగలదు గదా? పై జెప్పినరీతిన అయ్యది ఇట్లుండదు. కారణ మిది. జ్ఞానావస్థ స్థానపల్లటము వాటిల్లుచున్నది. 'బందోం'=ఒం=ఉం. ఇది 'ఉ' తోను, అనుస్వారముతో నుండు అక్షరము. అందుకే అనుస్వారముతోడి ఉదంతమునకు ఉత్తమపురుషయని పేరిడబడినది. తెలుగున నట్లయె. వాడు వచ్చెను. నీను సేవిసిదయ్=నీవు సేవించితి=నీవు సేవించితివి. ఇది మధ్యసంకట నట్లే నిలిచినది. అందొహిత్ర నెం—ప్రథమపురుష ప్రత్యయము ఉత్తమపురుష ప్రత్యయ మైనది. తెలుగునందు 'వాడు' తొలుత 'ఊడు'గా నుండినది. తరువాత '[illegible]డు', ఆమీద 'వాడు' అయినది. లింగభేదములు తొలుత నుండలేదనుటకు: కన్నడమున—కణ్ + అ=కణ్ణ; కోణ్ + అ=కోణ; మర్ + అ=మర. తెలుగున—అడి=అది. ఇది స్త్రీలింగమునకును, నపుంసకలింగమునకు నుపయోగింపబడుచున్నది. కన్నడ తెలుగునుడులకు గల సంబంధము నింకింత పరీక్షింతము. కర్ణాటభాషాభాగమగు తుళునుడి కన్నడమునకు తొలినాటిదని తెలిపితిని. తుళుపలుకుల అమ్మయన్న తండ్రి. అప్పయన్న తల్లి. కన్నడమున తొలుత అమ్మయనునదియే తండ్రికి పర్యాయపదముగా పొన్నరన్న, నాగచంద్రాదికవులు వాడిరి. ఆయప్పశబ్దమే ఇప్పుడును తెలుగున స్త్రీలింగపదముగా నిలిచినది. కన్నడపు అప్పశబ్దము తెలుగున అబ్బ యైనది. అటియని కన్నడమునను, అడియని తమిళునను ఉండు పదమే తెలుగున అదియని స్త్రీవాచకముగా నున్నది. నపుంసకలింగమున నుండు అది యను పదముతో పొరపాటు కలిగించు స్త్రీవాచకమగు అదిశబ్దమున కిదియు స్వరూపము. ఆన్, ఇన్ అను కన్నడనుడులును, నాను, నీను, నేను, నీవు, స్థానపల్లటన్యాయమున వీనికి పూర్వరూపములు. తదితరశబ్దరూపాంతరము లిట్లె యూహ్యములు. ఆడియనునది వెన్నెలాడి మొదలగు పదముల నున్నది. ఇవి కన్నడమున 'ఓదాళి' మొదలగు పదముల నున్నది. ఇందు డ ళగా మారినది. ఇదియు కన్నడిగల తెలుగల పూర్వసంబంధమును నిరూపించుచున్నది. కన్నడమున నుండు ళకారమునకు తెలుగున డకారమును, కన్నడమున నుండు ళవలకు తెలుగున శదలును తాలుమాలుగా కనబడుచున్నవి. ఇందు లక్షింపతగిన ముఖ్యాంశ మేమనిన: తెలుగలు, కర్ణాటకుల కుటుంబమును విడిచి వేఱైరి. విప్రశబ్దానుశాసను డనబడు నన్నయ ప్రకృతి సౌందర్యముగల కర్ణాటభాషాజనిత తెలుగు కన్నియ ఆకృతిని వికృతిగా జేసి రూపుమాపినాడు. కన్నడిగలు అన్న పూర్వమన్న, తెలుగు-తమ్ముడు పశ్చిమమును లౌకిక వ్యతిరేకభావమును, ప్రత్యేక వ్యక్తిత్వమును సాధించుకొను ఆశయు, లౌకికాచారానుసారముగ కన్నడిగల తెలుగల విభాగకాలమునందు వెలువడి నన్నయభాషా సంస్కరణమున ప్రతిఫలించినవి. తెలుగును వికృతియని పిలుచుట, నన్నయయొక్క సంస్కృత భాషాభిమానమును, దాని సౌందర్యశ్లాఘనమును, తెలుగు నుడి నిరసనమును దెలుపుచున్నది. మనుష్యుల వదలి మాటలకు వెళ్ళుదము. మొదట ఏకవచనముమాత్ర ముండినది. ఒకటి + ఒకటి + ఒకటి= 1 + 1 + 1= బహువచనము. (Many a one) -Plural. అందుకే కర్ణాటభాషల ద్వివచనము లేదు. ఒందు, ఒందు, ఒకటి మొదలగు పదములు ప్రథమావిభక్తి ప్రత్యయముల మూలసంజ్ఞలనుండియే పుట్టినవి. బహువచనము లట్లయినవి. తె. ఒందు=వాండు=వాఱు; వాండ్ + ఉ (డు)=వాండ్రు=వాళ్లు=వారు. క. అవ=అవ + ళ్=అవళ్. వాండ్రు, వాళ్లు అను పదములందు శకటరేఫమునకు లఘురేఫమును, ళకారమునకు లకారమును బెట్టుట లక్షింపవలసిన యంశము. ఇది తెలుగలు కన్నడిగలనుండి వేఱైపోయిన కాలమును నిర్ణయించుటకు చాల సహాయ్య సాధనముగా నున్నది. నన్నయకాలమున తెలుగునుడి సంస్కరింపబడెనని ముందుచెప్పనయ్యె. అయ్యది పదునొకండవ శతాబ్దము. అందుకు ముందే పశ్చిమచాళుక్యుల నుండి యొకశాఖ పూర్వమునకు పోయియుండినది. అందొక రాజ్యస్థాపనము చేసినది. అట్లే భాషా భేదమును సాధించినది. దానికి ముందుండిన తెలుగునుడి దేశ్యముగా కన్నడము నుండి కొంత రూపాంతరము కలిగియున్నను కన్నడనుడులనే కలిగియున్నది. కీర్తిశేషులైన లక్ష్మణరావు గారికి విశేషములుగా, విచిత్రములుగా తోచు శాసనభాషా రూపము లన్నియు తుళుకన్నడరూపములు. వాని కథనములు చక్కగా

చేయనగును. దానిని గుఱించి ప్రత్యేకముగా ముచ్చటింపవలసి యున్నది. బ్రహ్మశ్రీ సోమశేఖర శర్మగారు రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికను ప్రకటించిన శాసనములందలి క్లిష్టపదములకు నర్థము నాకు కర్ణాట భాషాదృష్టి నందందు తోఁచినవి. కావున విభాగకాలము నాటికి—ప్రత్యేక దేశ్యమును వాడ పూనుకొనిన కాలము నాటికి అటుల ప్రయోగమే మార్పు జెందినది. కన్నడమున గిరిజాకల్యాణమును వ్రాసిన హరీశ్వరకవి అఱభేదమును ప్రాసమున పాటింప నన్నాడు.

" నోడుకొడొందక్కరమదు
మాడువోడుచ్చరణె గరిదుమూరు తెరనం
కూడె కవితెతి విచారిప
బేడదరిం ఱబుఱళక్కుళంగళనిదఱోళ్."

తరువాతివారు అరల కళ్లే చేసినారు. దానివలన అటులు ఇప్పటికి చాలుపట్టులు రాలిపోయినవి. కేశిరాజు సహితము తన వ్యాకరణమున అఱాంతశబ్దములకును, రళాంతశబ్దములకును గల అర్థభేదముల నిచ్చి అర, అళ భేదమునర్యాము పాటింపదగిన దని ప్రయోగ ప్రకరణము నొక్కటి పరికింప నిచ్చి పాటుపడినాడు. అయ్యాని పంద్రెండవశతాబ్దప్రాంతము. అప్పుడే తెలుగల నుడి కన్నడిగలనుండి వేఱైపోయినది. జాతియు వేఱు వ్యక్తిని గాంచినది. మఱియు దంత తాలవ్య భేదము కర్ణాటప్రకృతిసిద్ధము. స్వరములపై నుచ్చరింపబడు అనునాసికోచ్చారణము అదియే చజలమీదిజుట్టుగా వ్రాయబడుచున్నది. ఇది అనావశ్యకము. చా యను దాన — తిరిగి వ్రాయబడియున్నది. దానిపై త్రిప్పి — ఏల వ్రాయవలయు? 'చే' లో నున్నది. 'చీ' లో నున్నది 'చూ' లో కొమ్ములో నున్నది. 'చో' లో నున్నది. ఇది కన్నడమున స్పష్టముగా 'చా, చీ, చూ, చో' (కన్నడలిపి) మొదలగు వానియందు పైననో ప్రక్కనో వ్రాయబడుచున్నది. తెలుగున నివి మాఱిపోవు,జారిపోవు ద్రుతప్రకృతికముగా, జుట్టుగా, అరసున్నగా, అకారములమీద, ఈకారముల ప్రక్క నిలుచుచున్నది. కావున నీ భేదభ్రాంతి నిష్కారణమైనది. వేఱు యను శబ్దమునందలి అరసున్న నిండుసున్న ఏల చేయరాదు? అయ్యది బేంటె యను కర్ణాటపద రూపాంతరము. మఱియు 'వాండ్రు' లో 'వాఁడు' నడుమ నుండు అరసున్నకు నిండుసున్న చుట్టిన వేటకు సున్న జుట్టు వేసిన మేల? అటువంటి ప్రయోగములనే వాడుటను శ్రీనాథుడు తనభావను కర్ణాట మనియె. అతడెట్లో లాక్షణికకవులలో గణింపబడియె. ఆమార్గముననే కొన్ని సంధిశబ్దప్రయోగములు చేసిన పోతనాదులు కొందఱికి విలక్షణ కవులైరి. ఇట్టి యభిప్రాయములతో ప్రౌఢకవులను నిరసించుట భాషాతత్త్వము తెలియమి వలననె. వాళ్లు అనుపదము ఇప్పటికిని లోకులచే వాడబడుచున్నది. అయ్యది వ్యవహారసిద్ధము, సాధ్యము, సాధువు. అతఁడు అనుదానిలోని అరసున్న నిండుసున్న యయినట్లు వాఁడు అనుదానిలోని అరసున్న నిండుసున్న యేల కాదు? బహువచనమున నది కావచ్చునా? ఏమి భ్రమ! సర్వచాక్షుషస్వాక్షరములమీద అనుస్వారమే అరసున్న సున్నలైనది. అయ్యాని అక్షరములమీద ముందు చూపినట్లు పలుత్రిప్పులు పడి కనబడుచున్నవి. అవి పూర్వకాలమున పరస్పర పదవులకు బదులుచేసికొన జాలెవి. శాసనకాలముల వాని కట్టిభాగ్య ముండె. 'వాణ్డు=వాండు' అని శాసనములలో కన్పట్టుచున్నది. ఈ నూతనశాసనములతో నిండు కలిమి నిలుపకపోయినది. 'వాండ్రు' వలె ఆండ్రు శబ్దము నట్టిదియు. ఆడు + డు. ఆడుశబ్దము కర్ణాట భాషలో ఆళ్ గా నున్నది. విరళమై అవల్ గా నున్నది. యవలలు అను నాసికములును, నిరనునాసికములను నగు—అను శబ్దమణిదర్పణసూత్రమును బట్టి 'వ' స్థానమున అనునాసికోచ్చారణమున ద్రుతచిహ్నముగు అరసున్న వచ్చు; అయ్యాని ఆడు, ఆండు అయినది. ఆండు + డు లేక లు=ఆంద్రు. కన్నడములోని ఆడు=ఆళు తెలుగులో ఆలు అయినది. అందుకే అది భార్యార్థకము గాక సామాన్య స్త్రీవాచకముగా నున్నది. ధన్య + ఆలు=ధన్యురాలు. వెలయాలు అనుచోట ఆలు శబ్దము పత్నీశబ్దముగా నెన్నరాదని శాసింపబడియె. దానికి నిదియె కారణము. వెలయాలు=బెలెయాళ్=బెలెవెణ్=బెలెవెణ్. ఇది స్పష్టము. తెలుఁగు తెనుఁగుశబ్దముల నరసున్న వచ్చుటకు నిట్టిదియె కారణము. అందు లింగనగ

ములకు సంబంధమే లేదు. తొలుత 'త్ర' ఉండినది. అది 'తఁ' గా పలుకబడెడిని. అది 'తెఁ' అయినది. తే ప్రక్క నుండు అనుస్వారము 'ల' అయినది. తెల్ + అగు = తెలఁగు. అగు కన్నడములోని అగుమాటకు రూపాంతరము. ఆమీద అనుస్వారోచ్చారణవలన 'గు' ముందర అరసున్న కల్గినది. అనుస్వారము లను నాసికములు. తెలఁగు=తెనగు. శ్రుతిపోషణకై తెనుగు, తెలుగు అను పదరూపములు ప్రాప్తించినవి. కన్నడమువలెనే. క= కఁ=కల్ + అడ=కల్లడ లేక కన్ + అడ=కన్నడ. 'కఁ' పర్వత ప్రదేశముతోను, నలుపుతోను, వాసనతోను, ఎత్తుతోను సంబంధించినది. కనుక కర్ణాడనుదానికి తొలుత నీగుణములన్నిటి గూర్చి నిర్వచన మొనరించితిని. 'క' బ్రహ్మార్థము నిచ్చు అక్షరము. త క్షత్రియార్థమునిచ్చు సంకేతాక్షరము. అయ్యది తెలుపునకు నుపయోగింపబడుచున్నది. తదితర సూక్ష్మసంకేతార్థముల నొసగుట కిది చోటు గాదు. సుందరులను, వీరులు నగుట తెలఁగల కా పేరు కలిగెనన్న చాలు. దానినిబట్టియె ముందు నే నట్లు నుడివితి. ఇది ఇట్లుంచి పూర్వసూత్రము ననుసరింతము. ఆడు, ఆళుశబ్దములు స్త్రీపున్నపుంసకలింగములకు భేదము లేక తొలుత వాడుచుండిరి. మగశబ్దము ఆడుబిడ్డకు, మగబిడ్డకు నన్వయించుచుండె. కన్నడము-మగు=బిడ్డ. తరువాత మగ + వాడు. మగు + అ=మగవ. మహచ్ఛబ్దములకు, నమహచ్ఛబ్దములకు నట్లె, పిల్ల:—ఆడుపిల్ల, మగపిల్ల. జింకపిల్ల. కన్నడము మరి, మరిమక్కళ్, జింకెమరి. అందుకే తొలికావ్యకారుడు ఆడు, మగశబ్దములకు పుల్లింగస్త్రీలింగార్థముల నిచ్చినాడట. అయ్యది పూర్వసంప్రదాయమును, తొలికావ్య మాయవస్థయందు వ్రాయబడియుండుటను దెలుపుచున్నది. తొలికావ్యము కాలమిది యని నిర్ధరింప రాకున్నను ఇట్టియవస్థయందు బుట్టెనని మనమూహింపవచ్చు. శబ్దప్రయోగములందు కన్నడిగలకు తెలుగలకు అధిక సాదృశ్యమును, అల్పవ్యత్యాసము నున్నదని వీనింబట్టి తెలియనగు.

| | | | | |
|---|---|---|---|---|
| కన్నడ | ఎ కారము | తెలుగు | అకారము | తలె=తల |
| ,, | ణ ,, | ,, | న ,, | కణ్ణు=కన్ను |
| ,, | గ ,, | ,, | క ,, | మూగు=ముక్కు |
| కన్నడ | కకారము | తెలుగు | చకారము | కెయ్యి=చెయ్యి |
| ,, | బ | ,, | వ | బెరలు=వ్రేలు |

ప్రథమముమీది కచటతపలు గసడదవ లగు ననుటయు, కన్నడ గసడదవలు తెలుగునకచటతప లగునదియు శ్రీనాథాదియోగ మొదలగు కవిప్రయోగములవలనను, వ్యాకరణసూత్రములవలనను గనుచున్నాము. ఇక, తొలుత వావి వరుసల భేదజ్ఞానము ఉండలేదనుటకు అప్ప=అమ్మ=అవ్వ యగుటయు, తాయి=తల్లి=తందె=తండ్రి యగుటయు, తాత=తండె యగుటయు నిదర్శనములు. ఈశబ్దసాగర పదజాలజలము నింత తెచ్చి ఛందోంబుధి నుండు వృత్తరత్నమాల నింత ఎత్తి పరీక్షింతము.

ఇందు గురులఘుగణ నిరూపణమును, వడియతి ప్రాసవృత్త నియమములును విమర్శనార్హములు. ఛందస్సులు రెండు గలవు: పింగళఛందస్సు, నందిఛందస్సు. నాగవర్మని ఛందస్సునకు ముందు కర్ణాటమున ననేక లక్ష్యలక్షణగ్రంథము లుండినవి. పురాతన గద్య పద్య గ్రంథ కర్తలను నృపతుంగుడు తనకు దెలిసినంత పేర్కొన్నాడు. అది యటుండనిండు. వెనుక జెప్పినట్లు నంది మొదలగు శైవులు ఛందస్సును వృద్ధిజేసిరి. పింగళ ఛందస్సు ననుసరించి కన్నడమున ఛందస్సును తాను వ్రాసెనని నాగవర్మ ఛందోంబుధిని నుడివినాడు. నంది ఛందస్సు నందికృత ఛందస్సు ననుసరించియుండును. ఛందస్సు తాళలయ సమన్వితము. సంగీత శాస్త్రజ్ఞులే దానిం గూర్చియుందురు. ఆశాస్త్ర విశారదులు కర్ణాటకులగుట వారే దానిని బుట్టించియుందురు. సంగీత సాహిత్య కళ లెల్ల కర్ణాటక కర్తృకములని చెప్పుట తదితర జాతివారికి అసూయను బుట్టింపవచ్చును. మరియు జాత్యభిమానము నట్లనుచున్నా రనవచ్చును. అయిన సత్యాంశమును సకారణముగా నన్వేషించి చెప్పిన తప్పేమి? తమిళు లధికసంఖ్యాకులై యున్నను, వారు వర్తకులై నానా దూరదేశములతో వ్యాపారము చేయు వృత్తిని జీవనకాలమును గడపిరి. కర్ణాటకు లన్ననో, వారియంత అధిక సంఖ్యాకులు కాకున్నను, ప్రకృతి సౌందర్యమును అనుభవించుచు లలితకళలను వృద్ధికి దెచ్చిరి. ఇట్టిసిద్ధాంతమునకు గ్రీసుదేశమందలి స్పార్టనులను, అథీనియనులను,

గురిగా గొనవచ్చును. ఒకరు దేహబలమును పెంచిన మరి యొకరు బుద్ధిబలమును పెంచుటయు, ఒకరు వ్యాపారవృత్తి నున్న మఱొకరు కావ్యవ్యవసాయవృత్తి నుండుటయు, ఒకరు శస్త్రాభ్యాస మొనర్చిన మఱొకరు శాస్త్రాభ్యాస మొనర్చుటయు ప్రపంచ చరిత్రానుభవవేద్యము.

ఇక గురులఘు విషయము నింత చూతము. శబ్ద శాస్త్రానుసారముగ 'అ' యను స్వరమె తొలుత బుట్టె నను సంగీతముగల సాహిత్యశాస్త్రములోని ఛందస్సునకు దీర్ఘమే ముఖ్యాంశముగా నున్నది. అందుకే శివుని మూడు కండ్ల నుండి మూడుగురువు లుద్భవించె నను వాక్య మున, ప్రస్తరించునపుడు గురువును తొలుత నుంచుకొను విధియు దానికి నిదర్శనములుగా నున్నవి. గద్యము పిదప పద్యము. బ్రహ్మకాలమున 'అ' యను గద్యరూప ముద్భ వించి బ్రహ్మతనుజు డగు రుద్రుని తరమున పద్యరూప మును గాంచు టెంతయు క్రమముగా నున్నది. "హ్రస్వ దేకమాత్రకం, దీర్ఘ ముభయమాత్రకం, త్రిమాత్రకం ప్లుతముచ్యతం" అనియు, "ఎరడు వ్యంజ మనుచ్చరిసువనితు కాలంమాత్ర గొంబుదు, అదు హ్రస్వ మెనిపుదు, లఘువె నిపుదు" అనియు, "స్వరవ్యంజనదినేకమాత్ర మాదొడె హ్రస్వం, ద్విమాత్ర మాదొడెదీర్ఘం, త్రిమాత్ర మాదొడె ప్లుతం" అనియు నిర్వచన మీబడియున్నది. వ్యంజనము పొల్లు. అయ్యది ప్రత్యేకముగా పలుకరాదు. స్వరబంధము ననే యుచ్చరింపనగు. అందుకే దానిని Consonant అనుచున్నారు. స్వరవ్యంజనములకు ప్రాణదేహన్యాయము. ప్రాణము లేక దేహము తిరుగజాలదు. అందుకే స్వరము నకు ప్రాణమనియు, వ్యంజనమునకు ప్రాణియనియు పేరు. అరసున్న సున్నలబోలె ప్రాణవాహనమె గాని స్వతంత్రము గాదు. అట్లుండ వ్యంజనమునకు మాత్రా నిర్ణయ మెట్లు చెల్లు? భావమున చెల్లి నను 'అ' యను అక్షరము హ్రస్వమని సంజ్ఞాప్రకరణమున జెప్పబడినది. అది లఘువు. 'అన్' అను శబ్దమున నొకటిన్నరమాత్ర లుండవలయును గదా! అట్లున్నను గురువుగానే పరిగ ణింపబడుచున్న దనియు, 'ఆన్' అనుచోట $2\frac{1}{2}$ మాత్ర లగుచున్నవి, అప్పుడును గురువుగా నెన్న బడుచున్న దనియు సంశయింపవచ్చును. 'స్వరవ్యంజ నమున నేకమాత్రయయిన' అన్నాడు. ఇందు ఉచ్చారణ కాలమును బట్టి గణింపవలయు. వర్ణగణితమును బట్టి కాల ము నెన్నరాదు. న్ + అ = న. దీనికి ఉచ్చారణము అధి ష్ఠించిన 'అ' వలన కలిగినను మాత్రాగౌరవము కలుగ లేదు. ఇందుకు స్వరవ్యంజనము లేక దేశాశ్రయము గలవి యగుట కారణము. 'అన్' అనినయెడల పొల్లునకు ఆ ప్రక్క నుండు యోగబలమున తన ఆశ్రితభారమును దానిపై మోపినది. దానికి దీర్ఘగురుత్వము లభ్యమవి. 'ఆన్' అనుచోట పూర్వ దీర్ఘస్వరారోహణ భాగ్య మున నుచ్చారణ సంభవించినది గాని పూర్వ దీర్ఘస్వరము నకు పొల్లు బరువు లేదు. ఒకమాత్ర లఘువనియు, ఒకటి న్నరమాత్ర నుండి రెండున్నరమాత్రలవఱకు గురువనియు, మూడుమాత్రలు, దానిపై ప్లుతమనియు సమాధానము జెప్పనగు. ప్లుతముపై సంధి కాదను సందర్భమున ప్లుతము కర్ణాట వ్యాకరణమున జొచ్చినది. ఛందస్సున లేదు. తెలుగున దానివిచారము రెంటను లేదు. కర్ణాటమున శిథిల ద్విత్వములని కొన్ని గలవు. వాని ముందుండు లఘ్వక్షర ములు గురువులు గావు. కర్ణాటభాషలో విజాతీయ సం యుక్తాక్షర సమన్వితంబులగు శబ్దంబు లరుదు. సజాతీయ సంయుక్తాక్షరములు గల పదములే మెండు. ఉ. అమ్మ, అణ్ణ, అత్త, అక్క. అట్టియెడల పూర్వాక్షరము గురు వగు. తదితరస్థలములందు పూర్వాక్షరములమీద భారము వేయక లఘువుగా నుచ్చరించి విఱిచి పరాక్షరమును పలుకుటయే అట్టిస్థితి' కారణము. ఇది తెలుగున క్రావడి ముందుండు అక్షరమును గురువుగా గణింపని విధిని బోలి యున్నది. (గొనములప్రోక, ఇందు 'ల' ను ఒత్తి పలు కము. తరువాత నత్యల్పముగా నాగి 'ప్రో'ను పలుకుచున్నా ము.) కన్నడమున "బిందువిసర్గవ్యంజన మొందిదదడ్డక్కరం పదాంత్యం దీర్ఘం"— ఇవి యన్నియు గురువు లగునవి. కర్ణాటకులు సంగీతప్రీతిని పదాంత్యాక్షరము నీడ్చి పలుకుటవలన నయ్యది యట్లు గురువు కాగలదు. అయిన నిది యనుభవమున ప్రతిపాదము తుద నుపయోగింపరాదు. షట్పదులమూడవపాదము తుదను, ఆరవపాదము తుదను ఇట్టిస్వాతంత్ర్యము ననుభవింపవచ్చును గాని కందపద్యార్ధ భాగముతుదను ప్రయోగింపరాదు. అక్షరగణవృత్తముల

నిదియన్వయము కాదు శిథిలద్విత్వములయందును, పదాం
త్యములయందును గురునిర్ణయము ప్రసిద్ధకవి ప్రయోగ
శరణ్యము. మాత్రలగుంపులకుగాని, అక్షరములగుంపులకుగా
నిగణమని పిలుచుచున్నాము. అక్షరగణములు సంస్కృత
వృత్తముల నుపయోగింపబడుచున్నవి. మఱియు నవి
"ఒగెదవు మ, య, ర, స, త, జ, భ, న, ల, గా
క్షరం కౌస్తుభాని నానావిధవస్తుగళుం పయోంబుధియొ
ళొగెసంతిరె" అని చెప్పబడి "మగణంభూమియె సక్కం
యగణంజలరగణమగ్ని సగణంవాతం తగణాంబర జగణా
ర్కం భగణం శశి నగణనాక మంబుజవదనే" గణము
యాధిపత్యము పంచభూతములు మొదలగువానికి పంచి
పెట్టబడినది. ఇది భాషాసంస్కరణకాలము నాటిది."వర
ణంగళ్గెల్లం లోకం, పరికిసెక్తంగెళవిగెలేఖకనప్పం,
గిరదక్కుసుపాయంగళ్, నరణాంత్యన్ శోధువంగె దు
షక్కరమక్కుం"అని, కొన్ని పదాక్షరములను పాదముల
నుపయోగింపరాదను సంవర్ణమున చెప్పబడినది. ఇందు
అవ్యాప్తి, అతివ్యాప్తి దోషము లగపడుచున్నవి. ఇది
జాతివృత్తముల కన్వయింపదు. ఎందుకన,షట్పది,త్రిపది,
ద్విపదులయందు నాల్గుపాదములకంటె ఎక్కువ పాద
ములును, నాల్గుపాదములకంటె తక్కువ పాదములును
ఉన్నవి. ఇవియన్నియు జూడ కన్నడ తెలుగు ప్రాకృత
కబ్బముల అక్షరగణములనుబట్టి పద్యముల నల్లలేదనియు,
మాత్రాగణముచే భాష సంస్కరింపబడుటకు ముందు
వ్రాయబడు జాతీయవృత్తముల నుండెననియు దెలియు
చున్నది. నృపతుంగని కవిరాజమార్గమునందును, అతనికి
ముందున్న కవుల గ్రంథములందును జాతివృత్తములే
చాలగా వాడబడియున్నవి. కర్ణాటమున, గురు ఘు
విన్యాసముల బట్టియు, మాత్రలనుబట్టియు గణనియమము
చేయబడుచున్నది. అట్టి మాత్రాగణములకు బ్రహ్మ
రుద్ర విష్ణు గణములని నామకరణము శంకరమతాచార
సంప్రదాయములుగల కర్ణాట జైనగ్రంథకర్తలచే చేయ
బడియుండు. దానిని కర్ణాట వాఙ్మయవైభవమను
వర్ణించు వ్యాసమున విస్తరింతుము. తెలుగు కబ్బమున
జాతివృత్తములందుపయోగింపబడు గణము లింద్ర,చంద్ర,
సూర్యగణము లనిపించుకొనుచున్నవి. రెండు మూడు
నాలుగు గురువుల నుంచికొని ప్రస్తరింపగలిగిన గణముల
నెల్ల కర్ణాటకులు గణించినారు. వానిలో తెలుగులు తొలి
రెండుగణముల నెల్ల త్రోసివేసి మిగతగణముల సూర్య,
ఇంద్ర, చంద్రగణములని వాడుచున్నారు. ఈత్రోపు
డుకు కారణమును, వేఱుపేరుల బెట్టుకొనుటకు కారణ
మును వంగూరు సుబ్బరావు గారు వ్రాసినట్లు గణముల
ప్రాజదువులనాటి ప్రాతదనము గలిమి గాదు. కర్ణాటకుల
విడిచి మధ్యయుగమున వేఱైపోయినపుడు చేసికొన్న
తెలుగుల అర్వాచీనపుచేతయే. పదోకొండవ శతాబ్దమున
నారాయణభట్టు, నన్నయభట్టు తెలుగునుడిని చక్క
జేయునపుడు ఛందస్సును సహితము, కర్ణాటఛందస్సును
కొంత మార్పుజేసి కొనియుందురు. త్రిమూర్తుల నామ
ములను కర్ణాటకు లప్పుడే వాడియుండుటం బట్టి
వైదికాభిమానము గల జంటకవులు సూర్య, ఇంద్ర,
చంద్రశబ్దముల వాడియుందురు. అక్కరముల పుట్టుకను
కొంత మార్పుటయే గాక పేరిడుటయందును తాఱుమాఱు
చేసి నడుమనక్కరమును నట్టక్కరమని నామ మిడక
మధ్యాక్కరయని అరిసమాసోక్తి ననౌచిత్యముగా
వాడినాడు. నన్నయ ఒకవ్యాకరణమును, ఒక ఛందశ్శా
స్త్ర గ్రంథమును వ్రాసియున్నాడను వాదము ఈతర్క
మునకు సాహాయ్యము చేయుచున్నది. తెలుగులు, కన్నడి
గలు నొక్క కుటుంబముగానే యుండిరనుటకిది యొక
నిదర్శనము.

ఇక యతి నియమమును గూర్చి యింత విచారిం
తము. "విశ్చేదో యతిసంజ్ఞకః"; "శ్లోకేషు నియమస్థానం
పదచ్ఛేదం యతిర్విదుః" అని యతి సంస్కృతమున నిర్వ
చింపబడినది. దానిని కర్ణాటకులు జాతి ప్రకృతిరీతి
ననుసరించి ఇట్లు చెప్పినారు:

"యతియెంబుదు గణనియతం
ప్రతీతమసిద్ధాంత మంతదం దా ఱల్కా
యతి కెడుగుందాంటిదొడా
యతికెడె కవితాభిమానమే సెసెదపుదె."

"క్లైర్ శ్రుతిసుభగర్ స్వచ్ఛందం
యతి యెందర్ కశిళపింగళాదిగ ళెల్లర్,"

కర్ణాటసంగీత శాస్త్రకర్తలగు కర్ణాటకులు శ్రుతిసుభగులగుటచే వారు యతిని పాటింపలేదు. పలుచోట్ల పదవిభాగమును జేసికొన్నారు. చోళపాలక చరితాది గ్రంథకర్తయు, శబ్దమణి దర్పణ మను వ్యాకరణ గ్రంథకర్తయునగు కేశిరాజు "యతివిలంఘనదిందరిదత్తె కన్నడం" అనినాడు. ఇయ్యది కపిళపింగళాది శాస్త్రజ్ఞుల శాసనము. ఇది కర్ణాటకుల స్వాతంత్ర్యబుద్ధిని చాటుచున్నది. సంస్కృతమునను ఇట్లే యుండుట సంస్కృతము కర్ణాటజాతి ప్రాకృత పరరూపమని నిరూపించుచున్నది. బ్రహ్మ విష్ణు రుద్రగణములలో అక్షరములు రెండునుండి ఐదువఱకు నున్నవి. మూడుమాత్రలనుండి ఎనిమిదిమాత్రలవఱకు నున్నవి. వీని నొక్కయూపిరిని బలుకవచ్చు. అనేక జాతివృత్తముల నుపయోగింపబడు మాత్రలు మూటినుండి ఐదువఱకు నున్నవి. అవియు నాయాసము లేక నొక్కసారియే పలుకనగు. కొంచెము పొడుపుగా నుండు పాదములందు భావగమకములు చెడకుండ పాఠకుడు స్వశక్త్యనుసారముగ నాయాయెడల నూపిరి విడిచి మరల చదువుచుండు. అందుకే అయ్యది ఉసిర్దాణం=ఊపిరిగొనుచోటు అనిరి. ఒక రూపిరి బట్టుట నింకొకరు నిర్ణయింపజాలరు. సామాన్యధర్మమున బట్టి నిర్ణయించినను అయ్యది కవిభావధోరణుల కాతంకమును కలుగజేయును. కనుకనే తెలుగ లింతవఱకు నానుడుల ప్రాసాక్షరమును బట్టి విరమమును అక్షరమైత్రిగా గొని, వాడి, అది భావశైలి ప్రతిబంధక మని బాగుగా దెలిసి, కావ్యసుందరిసంసారమున యతిమైత్రిని సడలించి ఇప్పుడు దానిని సౌఖ్యప్రదముగా నొనరించినారు.

వడిప్రాసనియమము నింత పరీక్షింతము. వడి= (పడికట్టు) వడి=వళి = దారి. దారిని జూపునది వడి. శైలికి దారిని జూపునది. జ్ఞాపకమునకు దారిని జూపునది. పద్య ప్రారంభాక్షరముగాని, పదముగాని సులభోచ్చారణ గలిగి శ్రుతిసహ్యముగా నుండుటకునై వడిని వాడినది. ప్రాసాక్షరమునకు ముందు లఘ్వక్షర ముండిన తరువాత వచ్చుపాదముల నెల్ల నట్లె యుండవలయుననియు, గుర్వక్షర ముండిన తదితరపాదములయం దట్లె యుండవలయుననియు నియమించినది పైకారణమును బట్టియే. అట్టి ప్రయోగమే చెడనివడి. ప్రాసముయొక్క ప్రాభవము నానుడుల పొడమూపుచున్నది.

ఉ."ఉన్నది ఉన్నట్లన్న ఉండూగచ్చిగాదంబుగదా!
ఉండిన మాట నంటె నుండి పడుతారు.
అడక కద్దను ఆనెకదితానె.
మాడదెనునెకెట్టితు నోడదెహాలకెట్టితు.
మండెబోళాదరె మనసుబోళాద్రె."

వీనియందు వడి, అక్షరయతి, ప్రాసయతి, ప్రాసములు స్పష్టముగా కనుగొనవగు. ఇయ్యవి స్మృతిశ్రుతికృతులకు సాహిత్యసంగీతశృంగారములను గూర్చి కావ్యమును సుభగమును సుఖదాయకమును జేయుచున్నవి. ఆదిమధ్యాంత్యము లని ప్రాసములు మూడు విధములు. మధ్యప్రాసమే అక్షరయతి యన నొప్పు. యతిప్రాసములందు స్థానభేదము గాని స్వరూపభేదము లేదు. రెంటను అక్షరము లొక్కతీరుననె యుండవలయు. అంతేల? ప్రాసయతియని యొకటి యున్నది గదా? ప్రాసము కన్నడిగలందు, తెలుగులందు, తమిళులందు తదితరజాతులందు విశేషముగా వాడబడుచున్నది. తెలుగున నయ్యది యతిప్రాసస్థానముల రెంట నుపయోగింపబడుచున్నది. అందువలన సాహిత్యము సంగీతమయమై శ్రావ్యమైనను, ప్రతిభాప్రచారమునకును, భావపోషణమునకును, హృదయంగమత్వమునకును కొదవను కొంత ఒదవించుచున్నది. అందుకే భావ లక్ష్యముగల కొందఱు తెలుగులు యతిప్రాసముల వలదనుచున్నారు. కర్ణాటకులు "నుతశబ్దాలంకారదొళ్ శయమదు కన్నడక్కె సతతం ప్రాసం కృతకృత్యమస్పొల్లర మకెదెందదుత్తప్పె కావ్యమేం శోభిపుదో" అని పట్టుదలతో ప్రాసమును వాడిరి. అర్వాచీనకర్ణాటకులు వర్గప్రాసమును, సమీపప్రాసమును శరణ్యముగా గొని వర్ణనియమమును, వర్ణక్రమమును వదలి భావమునకు గౌరవము నిచ్చి పద్యములను హృద్యముగా నల్లిరి. డకార ఱటలు తమలో ప్రాసమునకు రామిని, కన్నడ 'ళ' కు లకారమునకు తమలో ప్రాసమునకు రామిని, వర్ణజననస్థానముల నిరూపించు మిషను కేశిరాజు ఛందస్సున చెప్పవలసిన విషయమును గురించి వ్యాకరణమున జెప్పినాడు. ఱాంత పదములను

శాంతపదములుగా వాడఁదగు దను శబ్దస్వరూప నిరూప
ణము చేయు నెపముననే పై పేర్కొన్న అక్షరములు నియ
మమునకు రావని సంకలించినాడు. ఱాంతపదముల నిచ్చి
వానికి నానార్థముల వ్రాసినాడు. అప్పటికే యా భేదము
వదలను మొదలిడి యుండవచ్చు. తరువాతి కవుల స్వచ్ఛంద
వృత్తిని వ్యాకరణసిద్ధం బగు శబ్దజాత వార్థపరణిని, ఎంత
యు నాపు పరిణామ మేమియు దానం గలుగలేదు.
ప్రాసములందు అఱకుళ భేదములను, రేఫ ఱకార భేదము
లను, లళకార భేదములను మూలద్రోసి, ఒక్క రకారమును,
ఒక్క ళకారమును ఉంచికొని ఉద్దండకవులు ఉద్గ్రంథ
ములను వ్రాసినారు. పద్యము పాదనియమము గలది. పాద
ము మాత్రానియమము గలది. మాత్ర కాలమానమును దెలు
పునది. ఒకపాదమునందు ద్విరేఫమును ప్రాసమునందు
బెట్టి ఆ యక్షరమును ఒత్తి పలుకుటచే కాలమానమున
కలుగు లయమును, రెండవపాదమున లఘురేఫము నిడి తేలి
కగ బలికి నడకను నాశనము జేసి లయమునకు విలయము
కలిగించిన, ఛందోభంగము ఒనవుట సత్యము. ద్విరేఫము నే
లఘురేఫోచ్చారణమునకు దించినపుడు, దానిని ప్రాసము
లందు బెట్టి వ్రాయునపుడు ఛందోదోష మేమియు
వాటిల్లదు. చాక్షుషాక్షరము శ్రావణాక్షర రూపమే
గదా? ద్విరేఫములనే వ్రాయకున్న అనర్థము
వాటిల్లు ననుట అన్వయింపదు. ఏకరూపమున నందు
సంస్కృతశబ్దములకు నానార్థములు కల్పింపబడుచునే
యున్నవి గదా? (ఈ నానార్థములకు ప్రాకృతశబ్దములే
మూలములు.) ద్విరేఫయుక్త శబ్దములను ఉన్నట్లే వ్రాసిన
వానిస్వరూపములు భాషాజాతిని దెలుప సమర్థము లగు
ననువాదమునందు ఒకింత సత్యాంశ మున్నది. పాదనియ
మమును, ప్రాస నియమమును బొత్తిగా వల దనువారి
వాదము కావ్యజీవనమును కలిమినుండి లేమికి దెచ్చిన
ట్లగు. మితప్రవర్తన మెప్పుడును హితదాయకముగదా?

వృత్తముల నింత విచారింతము. నాగవర్మ ఇట్లు
వ్రాసినాడు: "సంస్కృత, ప్రాకృత, అపభ్రంశ, పైశా
చిక మెంబ మూరువరె భాషెగళొళ్ పుట్టువువెల్లం సర్వ
విషయభాషా జాతిగళక్కుం. అల్లి సమం, అర్ధసమం,
విషమమెందు, వృత్తం మూరు తెరనక్కుం." సంస్కృత
దృష్టిని బలికినవాక్యము. ప్రాకృతదృష్టిని 'అ' తో
ప్రారంభమైన భాషయే మొదటిది. దానియంత్యమే సం
స్కృతము. ఆమూలతాకృతికి ముందు వచ్చినది సంస్కృతి.
అక్కరముల నిర్వచన మొనర్చినపుడు దీనిం గురించి సూక్ష్మ
ముగ జెప్పినాడను. అరెయే అరె యనియు, (అరభాషె
మాతానాడు తిద్దానె—కన్నడమునాను కి), అరవమనియు
అయినది. దానికి అర్ధ మను అర్థమును, రసహీనమను అర్థ
మును తరువాతివారు తెలియక పలికినారు. అట్టిభాషను
మాటలాడుచుండినవారు అరవలు. కర్ణాటకులు తొలుత
నా భాషను మాటలాడుచుండిరి. వారు కాలానుసార
ముగ ప్రకృతిని అర్థము వదలి సంస్కృతిని అర్థము గొని
వాడుచున్నారు. "సగ సంస్కృతోక్తియింద అరివత్తె
కన్నడం." కర్ణాటకులలో నొకరగు తమిళులప్ప
టికిని ప్రాకృతము నే వాడుటం బట్టి వారికీ పేరు నిలిచినది,
వాడబడుచున్నది బ్రహ్మసంతతిని బుట్టిన రుద్రునకు పసు
పతి, భూతపతి యని పేళ్లు గలవు. భూతములనిన సమస్త
ప్రాణులు. అవ్యాది వాక్శక్తి గల మానవులకు నిం దుప
యోగింపబడినది. భూతములభాషను పైశాచిక మని
సంస్కృతికర్తలు కొంత నిరసనభావమున బలికినారు.
ఎట్లున్నను వాస్తవాంశము వదలలేదు. అంతియు చాలు.
తమిళుభాషయందు మహాప్రాణములు స్వచ్ఛముగా,
త్వరగా జొరలేదు. కన్నడిగులు దానిని సంస్కృతరూప
మున చాలకాలముక్రిందనే పలుక గలిగినారు. అందుకే
కేశిరాజు మహాప్రాణములు కన్నడమున నున్నవి యని వా
దించి, 'ఎణ్ఛాసిరము' మొదలగు ప్రయోగముల జూపినాడు.
ఇది తొలుత ప్రాకృతమున ఒత్తక్షరము గల పదమే.
ఎణ్ + సాసర = ఎణ్ఛాసర. ఒత్తి పలుకుట కాలాంతర
మున నూది పలుకుట యైనది. మహాప్రాణాక్షర ముద్భవించి
నది. తమిళులు పూర్వసంప్రదాయోచ్చారణము బట్టి
దానిని బలుకకుండిరి. అగస్త్యునికాలమునుండి కాంబోలు,
ఉత్తరహిందూస్థానపు కర్ణాటకులు=అరవులు=ఆర్యులు
వచ్చి అట్టి యుచ్చారణము వాడుకకు దెచ్చి గ్రంథాక్ష
రములలో వానికి తావిచ్చినారు. "ఎందిప్పత్తారు (ఉక్త
మొదలగునవి) ఛందంగళక్కుం అవతరిసాదగె మాత్రా
వృత్త దండకంగళ్ మాత్రా నియమక్కంధకాది జాతిగ
ళెంబి వక్కుం. మత్తం కర్ణాటాంధ్ర ద్రావిడ వరాట

లాట మాళవ గౌళ ఘూర్జర కళింగ రింగ వంగ కేరళ బాహ్లీక మగధ చేదివాచాల పాంచాల వెంగి తౌళవాదిదేశ భాషెగళొళ్ పుట్టువు వెల్లం సర్వవిషయభాషాజాతిగళక్కం అవావు వెందొడే:—

"మదనపతియక్కరంబొ
వది గీతికెయే ళెతి యదియుత్సాహంవ
ట్పదియక్కరికె కరంచె
ల్వొదవిన ఛందోవతంస మబ్జదళాక్షీ."

ఇందు కొన్ని విషయముల చర్చింపవలసియున్నది. అరవలు=కర్ణాటకులు = ఆర్యులు భూమధ్య భాగమున దక్షిణహిందూస్థానమున తాపకభూమిని సూర్యుడు మింట తలపై నుండు పర్వతములపై నివసించియుండిరి. తరువాత పచ్చిక బయళ్ల వ్యవసాయమును, సముద్రతీరముల నావికులై వ్యాపారమును చేయబూని పూర్వ పశ్చిమ దిశల బహుదూరము వ్యాపించిరి. మూలకర్ణాటకులు కాలచక్రము క్రింద మేరుపర్వతభూమినే బ్రాహ్మణ క్షత్రియవృత్తిని శిక్షణరక్షణకార్యముల చెలగుచుండిరి. జలమార్గమున పూర్వపశ్చిమములకు కొందఱు పోయిన భూమార్గమున ఉత్తర దక్షిణములకు కొందఱు పోయిరి. ఇట్లు వారు ఉత్తరశీతమండలమువఱకును, దక్షిణశీతమండలమువఱకును బోయి హిమప్రళయములకు తాళక తిరుగవచ్చిరి. కొందరు సమశీతోష్ణమండలముల నందందు నిలిచిరి. తొలివారికిని వెలిబోయి వచ్చినవారికిని గలిగిన కలహములే శ్రుతిస్మృతిశాస్త్రేతిహాసముల స్పష్టముగ కనబడుచున్నవి. దానింగురించి వేఱొకెడ వ్రాయుచున్నాడను. హిందూదేశమననే అట్లుఉత్తరమనకుబోయినవారేపంచగౌడులు. వారికి పంచద్రావిడులు (కర్ణాటకులు) అనువారికి మత భేదములు, (దండికవి కావ్యాదర్శము కావ్యమార్గభేదములు కనుగొనుడు) కలిగినవి. కలహములును కలిగినవి. వింధ్య దక్షిణదేశవాసుల ప్రాకృతభాషయు, వింధ్యోత్తరదేశ ప్రాకృతభాషయు ఏకమూలము గలవి. అందుకే ఇప్పుడు తద్భవము లనబడు మనభాషలకు ప్రాకృతము లనబడుమాగధి మొదలగు భాషలకు సంజ్ఞలందును, శబ్దములందును సామ్యము కనబడుచున్నది. ఇవి యన్నియు చక్కచేయ బడగా సంస్కృత మైనది. క్రాలక్రమమున, క చ ట త ప లు గ జ డ ద బలై, తరువాత సంస్కృతకాలమునకు గ స డ ద వలై మారినవి. అందుకే ఇయ్యెడ నాగవర్మ ఛందస్సునందు ఉత్తరహిందూస్థానపు విషయ జాతి భాషా వృత్తములు పేర్కొనబడినవి. మానవజాతికి నట్టిల్లుగా నుండిన ప్రదేశమే కర్ణా డనిపించుకొనుచున్నది. నాడుశబ్దము నడు (Centre) శబ్దమునుండి వచ్చినది. తిలకుగారి Arctic Home అను కలను సంబంధించినది. అది Radius. తాపకభూమి (The Tropic Home) కర్ణాటకులకు మూలస్థానము. ఇది Centre శీతోష్ణస్థితుల ననుసరించియు, నిమ్నోన్నతస్థానముల ననుసరించియు వర్ణ, వేష, భాషా, వృత్తి, వ్యాపారములు కొన్ని మారినవి. ప్రపంచము వా రందరు మనవారే. ముందు నేను ఆర్యులని, ఆర్యేతరులని, గౌడులని, ద్రావిడులని, ప్రాకృతమని సంస్కృతమని భేదాభిప్రాయమున జెప్పినది ఆర్యులు వేఱు, ద్రావిడులు వేఱు అను ఇప్పటి తిలకువంటివారి వర్గమువారి కర్థము కలుగజేయుటకే గాని అయ్యది నాయభిప్రాయము గాదు. నాయభిప్రాయ మిందు సంక్షేపముగా దెలిపినాను. జాతిని గుఱించి, భాషను గుఱించి ఏకత్వమును సాధించు వేఱు గ్రంథములందు విపులముగా వ్రాయుచున్నాడను. దీని నింతతో వదలి ప్రకృతము ననుసరింతము. మాత్రావృత్తములను ప్రాకృతపద్ధతి ననుసరించినవి తొలుత వ్రాయవలసియున్నను సంస్కృతభాషాభిమానమున గ్రంథకర్తలు వానిని ప్రథమమున వ్రాసినారు. తరువాత పద్యమున వేరొన్న జాతివృత్తముల లక్షణముల నుడివినారు. ఇప్పుడు ఆర్యులని పిలువబడువారికి, ఇప్పుడు ద్రావిడులని పిలువబడువారికి వంశమూల మొక్కటే యగుటను ఒకరి మార్గము నింకొకరు అందంగు ద్రొక్కినారు. ఆర్యులనబడువారి సంస్కృత మనబడు భాషయందు మాత్రాగణములు గల పద్యములును, ద్రావిడు లనబడువారి ప్రాకృతమనబడు భాషయందు అక్షరగణములు గల పద్యములును ప్రయోగించియుండుట కనబడుచున్నది. సంస్కృతమున ప్రధానముగ నక్షరగణమును వాడుటకు, ప్రాకృతమున ప్రధానముగ మాత్రాగణమును వాడుటకు కారణము కర్ణాటకులు మొదలగువారు పూర్వమునిన ఆర్యులని పిలువబడువారు పశ్చిమ మనుటయందును, కర్ణాటకులు

మొదలగువారు దక్షిణమనిన ఆర్యు లనబడువారు ఉత్తర మనుటయందును కనబడుచున్నది. ఈభావము పరస్పర అహంకారముల కలిగిన అంతఃకలహముల ఫలము. సంస్కృత మున అక్షరగణముల వృత్తములు విశేషముగా వాడినారు. కర్ణాటక భాషలందు మాత్రాగణవృత్తములు మెండుగ నుపయోగించినారు. సంస్కృతమున అక్షరనియమము పెట్టుకొనబడియె. ప్రాకృతములందు మాత్రాసంఖ్య యుండిన చాలును. అక్షరముల క్రమ మెట్లయిన నుండ వచ్చును. సంస్కృతవృత్తములలో గురులఘ్వక్షరములు క్రమముగా నుండవలయును. యతి యొకరీతిని ఉండ వలయునని చెప్పబడినది. కర్ణాటభాష నది వలదన్నారు. ప్రాసమును ముఖ్యముగా పరిగణించినారు. అయిన అల్పముగానో అధికముగానో ఒకరిఛందస్సురీతి నింకొకరు వాడజొచ్చిరి. ఇరువది యారక్షరముల పై నుండు ఛందములన్నియు సంస్కృతమున కర్ణాటక జాతివృత్తముల ననుసరించినవియు. శార్దూలాది వృత్తము లక్షరగణనియతము లైనను ఛందశ్శాస్త్రజ్ఞులు దాక్షిణాత్యుల వృత్తసరణిని జేసికొన్నవియే. శార్దూలవిక్రీడితము, మత్తేభము, హరిణీప్లుతము, హంసపదము, భుజంగప్రయాతము, ఉత్పలమాల, చంపకమాల మొదలగునవి ఉష్ణమండలమునందుండు వన్యపశుపక్షితిర్యగ్జంతు పుష్పనామములను జ్ఞప్తికి తెచ్చుచున్నవి. దండకము దండకారణ్యము పేర బెట్టినదియో, దండకారణ్య నివాసులు వాడు ఛందస్సనియో, దండపాణిదండమున పేర్కొనబడినదియో? కథను జెప్పు తందానపాట దీనిరీతిని బోలుచున్నది. ఆర్య గౌరి పేరున బిలువబడుచున్నది. కందము స్కందుని పేర పిలువబడుచున్నది. నిర్విఘ్నార్థము పలుకు తొలుపలుకు నంది పేరున నాంది యని పిలువబడు చున్నది. ఇవియెల్ల సంగీత సాహిత్య ఛందశ్శాస్త్రముల విషయమున శైవసంబంధమును, కర్ణాటకాది దక్షిణ హిందూస్థానపు వారి కర్తృత్వమును చాటుచున్నవి. నాగవర్మ కర్ణాటకు లుపయోగించు ముఖ్యమైన జాతివృత్తములను మాత్రము స్థూలముగా పేర్కొన్నాడు. కన్నడము కందమునకు ప్రసిద్ధము. అది కం+దము—కన్నడిగలది గదా? రన్న కందములు మొదలగునవి బంధమున నతిసుందరమైనవి. హరీశ్వరకందములు మనోహరమైనవి.

"కందంగళ్ అమృతలతికా
కందంగళ్ అనూనవాక్య ఫలవిలసన్మా
కందంగళ్ తనిరసదు
క్కందంగళ్ సొగయిసిపువు వీనుతకృతియొళ్."

తిక్కనాదులు తెలుగునందు వీనిననుసరించి మనోహరముగా వ్రాసినారు. కన్నడగీతములు, తెలుగు గీతములు చిన్నవియు, సొబగైనవియు నై యున్నవి. అక్కరముల చక్కని నడకను గనియే నన్నయ తన గ్రంథమున వానిని వ్రాసినాడు. యతిస్థానములను, గణప్రయోగమునను, వృత్తముల పేరులను కన్నడ, తెలుగు అక్కరములకు అల్పభేదము కనబడుచుండినను, జననీజన్యభావము లు చక్కగా చూపట్టుచున్నవి. రెండు గురువుల ప్రస్తారమున బుట్టిన కర్ణాటక బ్రహ్మగణములు నాలుగు. అందలి కడపటి రెండు తెలుగున రెండు సూర్యగణములు. మొదటి రెండు గగ, లలగ లేవు. మూడు గురువుల ప్రస్తారమున బుట్టు కర్ణాటక విష్ణుగణము లెనిమిది. అందలి మొదటి రెండుగణములు మగణము, సగము తెలుగున లేవు. మిగిలిన ఆరుగణములు తెలుగున ఇంద్రగణములు. నాలుగు గురువుల ప్రస్తారమున బుట్టు కర్ణాట రుద్రగణములు పదునారు. మొదటి రెండు గణములు మగ, సగగ అనునవి తెలుగున లేవు. నన్నయ దొరె యక్కరను మధ్యాక్కర నామమున వాడినాడు. మహాక్కరను పిరియక్కర నామముననే వాడినాడు. నన్నయ అక్కరల లక్షణమునకును కన్నడపు అక్కరల లక్షణమునకు నుండు అధికసామ్యమును, అల్పభేదమును మ॥ రా॥ గిడుగు వేంకట సీతాపతిగారు అనంతుని ఛందస్సునకు వ్రాసిన ఉపోద్ఘాతమునందు చక్కగా విమర్శించినారు. ఇందు కన్నడ తెలుగు అక్కరల లక్షణములను మాత్రము సూచించెదను:—

| | | | | |
|---|---|---|---|---|
| సూ ౧ + ఇం ౫ + చం ౧ | = ౭ | మహా | = పిరి | బ్ర ౧ + వి ౫ + రు ౧ = ౭ |
| ఇం ౨ + సూ ౧ + ఇం ౨ + సూ ౧ | = ౬ | మధ్య | = దొరె | వి ౨ + బ్ర ౧ + వి ౧ = ౬ |
| సూ ౧ + ఇం ౩ + చం ౧ | = ౫ | మధుర | = నడు | బ్ర ౧ + వి ౩ + రు ౧ = ౫ |
| సూ ౧ + ఇం ౨ + చం ౧ | = ౪ | అంతర్ధ | = ఎడె | బ్ర ౧ + వి ౨ + రు ౧ = ౪ |
| ఇం ౨ + చం ౧ | = ౩ | అల్ప | = కిరి | వి ౨ + రు ౧ = ౩ |

ఇందు ఊర్ధ్వగతికలిగియుండి మధ్యలేని దీర్ఘాక్షరలను నన్నయ మధ్యాక్షరయని సార్థకముగాని అతిపమాసోక్తి నేల పిలిచెనో ఎరుగరాకున్నది. నడుమణక్షరను మధురాక్షరయని వేరు పేరున బిలిచినాడు. స్థానములతో పాటు పేరులను సరిగా మార్చరాదా? తెలుగునుడుల సమాసము చేయరాదా? సంస్కృతపదములను వాడినంతనే కన్నడపు అక్షరలు సంస్కృతాక్షరములనిగాని, తెలుగక్షరలనిగాని భ్రమను కలిగింపజాలవుగదా? గణసంఖ్యను కదలింపజాలవుగదా? నూత్నగ్రహణమున గౌరవహాని ఏమియు లేదు. కర్ణాటమున షట్పదికావ్యము లనేకము లున్నవి. బ్రాహ్మణ, రామాయణ, భారత, భాగవతము లన్నియు షట్పదినే వ్రాయబడినవి. షట్పది ఎట్టిశైలికైనను, ఎట్టివర్ణనలకైనను, ఎట్టిభావమునకైనను అనుకూల్యమును గలిగించునదిగా నున్నది. తెలుగున సీసపద్య మున్నట్లు. సీసము వార్ధికషట్పది రూపాంతర మనవచ్చు. శర, కుసుమ, భోగ, భామిని, పరివర్ధిని, వార్ధకములని షట్పదులారు తెరగులు. నాగవర్మని ఛందస్సులో శరషట్పది మాత్రము చెప్పబడినదనియు, ఇతర షట్పదుల లక్ష్యలక్షణముల నిచ్చు పద్యములు ప్రక్షిప్తము లనియు జెప్పి ఛందశ్శాస్త్ర సంపాదకులొకరు పన్నెండవ శతమానమున నుండిన రాఘవాంకకవికాలమునందు అది యొక్కటియే యుండెనని వ్రాసినారు. ఆయభిప్రాయ మంత సమర్థకముగా లేదు. ఇరువదియారు ఛందస్సులనుండి పుట్టు వృత్తముల కెల్ల నాగవర్మ లక్ష్యలక్షణముల జెప్పినాడా? అంతమాత్రమున నట్టి వృత్తములు లేకుండెనని చెప్పనొప్పునా? కాలమున నాగవర్మకు సమీపమున నున్నరన్నని గదాయుద్ధమున షట్పదులుగా రెండువృత్తములు కనబడుచున్నవి. నాగవర్మకు రాఘవాంకునకు మధ్యనున్న చంద్రరాజు తన చక్రబంధమున దానిని మాత్రమే వాడియున్నాడనిన, ఎక్కువమాత్రలు గల షట్పదులలో నొక్కదానిని బంధమున జిక్కింప సులభ మగునా? తనకేది సుభమో దానిని జొన్పినాడు. నాలుగడుగులు గల వృత్తమున ఆరడుగులు గల వేఱు షట్పదిని జొప్పించినను ప్రాసమున కెంతయో ప్రయాసము గాదా? బీజవృక్షన్యాయమున, కొన్నిమాత్రలుగల షట్పదినుండియే క్రమముగా నెక్కువమాత్రలుగల షట్పదులు కల్పింపబడి వాడబడుచుండును. రాఘవాంకుని హరిశ్చంద్రకావ్యము వార్ధకషట్పదిని వ్రాయబడినది. ఒక్కసారియే ఎనిమిదిమాత్రల పాదమునుండి ఇరువది మాత్రల పాదమునకు దుముకనగునా? అతడా షట్పదిని తానే నిర్మించి వ్రాయనగునా? పదునాఱవ శతాబ్దమున నున్న కుమదేందు రామాయణమునందు అన్నిషట్పదులు నగపడుచున్నవి. అంతలో పై రెండువిధముల షట్పదులు తప్ప వేఱు వ్రాయబడినట్లు కానరాదు. అంతమాత్రముననే కుముదేందు తనగ్రంథమున శరవార్ధకేతరషట్పదులను తానే ప్రారంభముచేసి అంతప్రౌఢముగా వాడనగునా? కనుక, నాగవర్మనాటికి కూడ ఆరుషట్పదు లుండియుండును. ప్రక్షిప్తపద్యము లతనివేయై యుండును. ఆపద్యము లతనివి కాకున్నను దిక్ప్రదర్శనార్థము శరషట్పది నొక్కటినే చెప్పియుండవచ్చును. తెలుగునారెండుకో కన్నడ షట్పదులను వ్రాయలేదు. కర్ణాటకులు సీసపద్యమును వ్రాయలేదు. వార్ధకముతక్క సీస ముండుటంబట్టియు, సీసరీతి వార్ధకముండుటంబట్టియు వానికి సంబంధ ముండవచ్చును. కొందఱు కన్నడిగలు తెలుగు సీసమును, ఒకరిద్దఱు తెలుగులు కన్నడషట్పదిని ఇటీవల వ్రాసినారు. సీసలక్షణమును నాగవర్మ దెలిపినట్లు కనబడదు. అయిన నొక ఛందశ్శాస్త్ర ముద్రాపకు లొకరు దానిని గుఱించి నాగవర్మ చెప్పినాడనినారు. వారొకరు

“ పురుహూతగణంగళారుం
సరసిజగణగళెరడు సంధిసి బరుకుం”

అనుపద్యమునందు జెప్పబడిన పురుహూతాదిగణములు, అవతలి అధికారమున నిరూపితములై యుండుటవలన అయ్యది ప్రక్షిప్త మనినారు. ప్రక్షిప్తపద్య మనుటేమో సత్యము. వారిచ్చిన కారణముకంటె పురుహూతగణములనియు, సరసిజగణములనియు కన్నడమున లేవనియు, వానికి సమనగు గణములు బ్రహ్మవిష్ణుగణము లని పిలువబడువానిలోనివి యనియు, అయ్యవి యా నామముననే పిలువబడుచున్నవి యనియు, ‘పురుహూత’, ‘సరసిజ’ సఖ యను నామములు కన్నడిగ లెఱుగకుండిరనియు వ్రాసియుండిన బాగుగా నుండియుండును. ఇవి గాక

ఇంకను రగడలు, సాంగత్యము మున్నగు వివిధజాతివృత్త
ము లున్నవి. అవి యున్నియు కేవలతాళలయాశ్రితములైన
'పాటగబ్బము'లోనివి యనుకొనుచున్నారు. కన్నడమున
'పాడుంగబ్బగు' అని యొకవిధము గలదు. అట్టి కబ్బపు
వృత్తములు తెలుగున నెన్నియో కన్నులకగపడుచున్నవి.
ఇంతతో ఛందోవిచారము నింత చాలించి అలంకారముల
నింత అరయుదము.

అలంకారములు ద్వివిధములు: అర్థాలంకారములు,
శబ్దాలంకారములు. పండితులు కావ్యమును కాంతను బో
ల్చుచున్నారు. వానిని కాంతాసమ్మితము లనుచున్నారు.
అయ్యవి కాంతలవలె నరులకు మనోహరములు. కాంత
దేహములో బుట్టుచున్నది. దేహము దానికి సహజాలంకా
రము. తరువాత చేసి పెట్టుకొన్న అలంకారములు పెక్కులు
కలుగుచున్నవి. "Beauty unadorned is adorned
most"–సాలంకృయము గాని సహజసౌందర్యమే సంపూ
ర్ణాలంకృతమైనది. కావ్యమునకు సహజాలంకార మట్టిదియ.
కవిబ్రహ్మ సృష్టించిన కావ్యకాంత ఈసహజోక్త్యలంకార
ముతో సుందరముగా నుండవలెను. కన్నడ తెలుగు
గబ్బములం దీసహజోక్తి చాల కనబడుచున్నది. ఉపమా
లంకారము, రూపకము మొదలగు తదితరార్థాలంకారములు
ను విశేషముగా కనబడుచున్నవి. అయ్యవి లోకప్రసిద్ధ
ములు. శబ్దాలంకారములు ఒంటికి నగలవంటివి. వానివలెనే
కృతకములు శబ్దకృతములు. సార్థకంబులగు శబ్దాలంకార
ములను కన్నడిగలును, తెలుగలును తమ తమ కావ్యము
లందు సమాదరముతో చేర్చినారు. అచ్చగన్నడమున నే
శ్లేషాలంకారములను, అచ్చతెనుగున నే శ్లేషాలంకారములను
జేసి కావ్యకాంతను భూషించినారు: ఉ. "కొడెయెంబ
రాతపత్రిదను, etc", "ఏఒంగని, etc". వనపర్వత ప్రదేశ
ముల నుండుటంబట్టి ఈ జనజనాంగముల కవులు మనో
హరములైన ప్రకృతి వస్తువులనే, పశుపక్షులనే అలం
కారములం దుపమానములకు వాడినారు.

" వెసతుమ్మెదల దెచ్చి విదియచందురు దెచ్చి
విలువిల్లునుగనుని విండ్లు దెచ్చి
కలువపువ్వుల దెచ్చి ఘనచంపకము దెచ్చి
దాడిమీ బీజ సంతతుల దెచ్చి
సరవి కెంపులు దెచ్చి చక్కిలములు దెచ్చి
తెలికాంతి తమ్మిపాకులను దెచ్చి
శంఖంబు దెచ్చి స్వచ్ఛములైన తామర
తూండ్లును బంగారు గిండ్లు దెచ్చి
తే. యాకసము దెచ్చి వెన్కనాయలల దెచ్చి
యిసుకదిబ్బల నరటుల సెల్ల జేర్చి
చిగురులను దెచ్చి యైన సృజింపరాదు
కమలజునకైన నాహంస గామినులను."

"మాణికదుటి యు, మధురకోకిలనిభ
వాణియు, వదరుగాపదనద, నసుబెన
దేణనయన, దెళెదంగళనోసల నవీనకుసుమశరన.
తూణీరోపమ జంఘెయ మధుప
శ్రేణియ సంతళ, దంగభవోరగ
వేణి యువతితా రత్నదరూపదదేవం బణ్ణిసెను."

కొలములలో నున్న కలువలను, కన్నడిగలు, తెలుగలు
మొదలగు వారు వర్ణించిన, నదులలోనయ్యవి తేరున్నను సం
స్కృతకవులు అందు వర్ణించినారు. విరుద్ధవిషయము
లను వ్రాసి ప్రసిద్ధకవిసమయము నొకదానిని పన్నినారు.
కవిసమయమున, పరాక్రమమును సూర్యుని ప్రతాపము
నకు బోల్చుటయు, యశస్సును చంద్రికకు బోల్చుటయు,
కరచరణములను, ముఖనేత్రహృదయములను కమలమునకు
బోల్చుటయు, ముక్కును చంపకమునకు బోల్చుటయు
వృక్షసంపత్తితో ప్రకృతిసౌందర్యము గలిగిన ఉష్ణమండల
నివాసుల ప్రకృతి ప్రీతిని దెల్పుచున్నది. గజ
గమన, హంసగమన, నాగవేణి, చక్రస్తని
బింబాధర, రంభోరు, కమలముఖి, కమలనేత్రి, అళినీ
లాలక, కుంభకుచ మొదలగు బహువ్రీహి సమాసవాక్య
గర్భితాలంకారము లన్నియు ఎక్కువగా దక్షిణహిందూ
స్థాన నైసర్గికసంపత్తినుండి వైకొన్నవియ. సంస్కృత
వు లుపయోగింపని కవిసమయములు కన్నడగబ్బమున,
గలవు. ఇట్లు, ప్రాకృత (కర్ణాటభాషలు), సంస్కృత
భాషలందు ఆదర్శకావలంబకన్యాయము కన్పట్టుచున్నది.
ప్రాకృతభాషలలో, కన్నడ తెలుగునుడుల గబ్బములలో,
తెల్లులు చాల దగ్గఱ. వానిని విచ్చువ్యాసమున వ్రాసెదను.
ఈరీతిని ప్రాకృతిసంస్కృతభాషావ్యాకరణఛందోలంకార

ములందుండు భేద మల్పము. ప్రాకృతభాషలగు కన్నడ
తెలుగులం దుండుసామ్యమధికము. మూలసంఘభావమును
బట్టి ఐకమత్యము గలిగి పరస్పర భ్రాతృప్రేమభావము
గలిగియుండుట విశ్వకల్యాణమునకావశ్యకముగా నున్నది.

ఇక లిపిజననము నింతవిచారింతము. దక్షిణహిం
దూస్థాన భాషలకు లిపిని కలిగించినవారు కర్ణాటకులే.
శాసనకర్ణాట లిపికిని తమిళు లిపికిని అత్యధిక సంబంధము
గలదని శ్రీయుత ఆర్. నరసింహాచార్యులు గారు నుడి
వినారు. కన్నడ వ్రాయికిని తెలుగు వ్రాయికిని సమ
సంబంధ ముండుట కరతలామలకము. తొలుత లిపి సృష్టి
క్రమము నింత పర్యాలోచింతము. సంగీతసాహిత్యములు
సరస్వతీ స్తనద్వయ మని జ్ఞానులు వర్ణించినారు. అదెం
తయు సహజముగను, సత్యసూచకముగను, కృతజ్ఞతాప్రేర
కముగను ఉన్నది. మానవశిశువు మాతయైన వాగ్దేవీ స్తన్య
రసమును త్రాగియే మనోబలమునను, బుద్ధి బలమునను
వర్ధిల్లి ఐహికసుఖముల మునిగి ఆముష్మికానందమున తేలి
నది. సంగీతసాహిత్యములు వక్షోజములవలె ఏకకాలజనిత
ములు. సంగీతమున కరగి దయాగుణమున ప్రబలు మన
స్సును, సాహిత్యమున పెరిగి జ్ఞానశక్తికి లోబడు
బుద్ధియు హృదయసంజాతములే. ఎయ్యది ముందు పుట్టె
నో నిర్ణయింపజాలము. స్తనములు సమకాల జన్య
ములు. అట్లనే సంగీతసాహిత్యములు సహజాతములు.
రెండును సమ్మిశ్రితములు. ఒకటి నుచ్చరించి మఱొకటి
నుచ్చరింపకుండజాలము. 'అ' యనిన శబ్దాక్షరములు కలసి
వచ్చుచున్నవి. రాగము దీసినపుడు దానితో స్వరము నాదా
నినో చేర్చియుండుము (దానింబట్టియే 'సంగీతము', 'సాహి
త్యము' అనుపదముల నిర్వచనము పరస్పరగుణములను సంగ్ర
హించినది.) రెండును రసభరితములే. రెండును ఆనందదాయ
కములే. అయిననొక్కటి సమస్తప్రాణులకు నర్థమగునది;
మఱొకటి వాక్శక్తిగల మనుజులకు మాత్రము దెలియు
నది. అందునను వివిధభాష లుండుటంబట్టి, అర్థముచేసి
కొనువారి సంఖ్య అధికమో అల్పమో అగుచుండును.
ఇందువలననే సంగీతసాహిత్యములు అను సమాసవాక్య
మున సంగీతమునకు ప్రథమస్థానగౌరవము సంపాదిత
మయ్యె. పై సద్వర్ణనమును కొందఱు అనుచితవర్ణన మని
అజ్ఞానులతో జేరి అపహాస్యము చేయుచున్నారు. వారు
పరమార్థము నెఱుగరు. పోనిండు. శబ్దములయొక్క
శ్రావణరూపములో సంగీతముయొక్క ధ్వని యున్నది.
సూక్ష్మమగు కర్ణాటసంగీతసాధన సాధనముల జేసిన కర్ణా
టకులకు భాషా శాసనలేఖనసాధనముల నిర్మించుటయం
దేమియు నసాధ్య ముండియుండదు. సులభసాధ్యముగనే
యుండును. గాంధర్వము, కళలు మొదలగు సంగీతసాహిత్య
సంబంధపదము లన్నియు కన్నడిగల కర్తృత్వమును
బట్టియే కలిగినవి. దానిని విస్తరింప నిది తఱి గాదు.

అంతరంగభావము బహిరంగమున భాషారూప
ము బడయుచున్నది. శబ్దాత్మకమైన భాషను శబ్దమణి
దర్పణకర్తయగు కేశిరాజు ఎట్లు వర్ణించియుంచినది
పుమక వ్రాసినాను. మానవజాతి శైశవమునందుండినపుడు
వాక్శక్తి వృద్ధిగాని శిశువుబోలె మనోభావములను మొగ
ములనను, సైగలనను, చిత్రములనను జూపెడిది. జ్ఞా
నము, వాక్శక్తి ప్రౌఢమినంతనే స్థూలముగా వస్తునిర్ణయము
జేసి పలుకజొచ్చినది. జ్ఞానార్జనముతో సూక్ష్మదృష్టిని
వస్తుస్వరూపములకు వలయు మాటలతో మార్పులు చేసి
కొన్నది. అయ్యది జ్ఞానావధిని జేరినంతనె వ్యవహార
శరణమగు భాషను వ్యాకరణమునకు లోబఱచి, వాఙ్మయ
వైభవమున గ్రంథశబ్దాలంకారముల సంతసించినది. ఈ
యభివృద్ధినిగురించి ముందు దెలిసితిమి. ఇప్పుడు చెవికి
విషయమై సామీప్యసంబంధమైన శ్రావణాక్షరము
కన్నుకు విషయమై దూరసంబంధమైన చాక్షుష మెప్పుడు
వెట్టెనని వెదకుదము. ఈలిపి జననకాలమును గుర్తించు
టకు ముందు ఆర్యావర్తము యొక్కయు, దక్షిణపథ
భూమియొక్కయు మతసమాచారముల నింత సంగ్రహ
ముగా స్మరింపవలసి యున్నది. విష్ణు దశావతారములు
ఆర్యద్రావిడ భ్రాతృసంబంధములను, అంతఃకలహములను
దెలుపునవిగా నున్నవి. సురలే ఆర్యులనియు, అసురులే
ద్రావిడులనియు, మతయుద్ధమును జూపునదియే మీనా
వతారకథయనియు, ఐశ్వర్యమునకై వారు పోరినదే క్షీర
సాగర మథనకథయనియు, విష్ణువు సురల బ్రోవ కూర్మ
రూపమును కూర్మిం దాల్చెననియు, భూమ్యాక్రమణము
నకై పోరినదే వరాహావతారకథయనియు, శ్రుతిపురాణ

ప్రసిద్ధశోధకులు పలికియున్నారు. ఇతరావతారములను ఉత్తర దక్షిణ దేశములవారి అంతః కలహముల గాథలు. వేదములు ఆర్యులనోట శ్రావణాక్షరరూపమున పఠింపబడి ఆర్యావర్తమున నాశ్రమముల వాసము జేయు నపుడు వారిచేత నయ్యవి లిఖింపబడియుండునని లోకమాన్య తిలకుల యభిప్రాయమై యున్నది. అప్పటికి ద్రావిడులకు లిపి యుండెనా లేదా? యని దెలుపుటకు పైవిషయ మాలోచింపవలసి యున్నది. దేవదానవులు జ్ఞాతులు. దానవగురువగు శుక్రాచార్యుల రాజనీతి యున్నది. ఆయసురగురువు చెంత సురలు సహితము శిష్యులై యుండిరని భారతమునుండి తెలియుచున్నది. శుక్రాచార్యులు కులగురులై నరసింహావతార కాలమున ప్రహ్లాదునకు విద్యాభ్యాసము చేయించినారు. పఠన మొక్కటియే గాక లేఖనము సహితము నేర్పి రనుటకు సందేహము లేదు. పరశురామావతారమునకు శివుడు గురువని చెప్పబడినది. తన గురువగు శివుని ధనుస్సును రాముడు విరిచెననునది పరశురాముడు రఘురామునితో పోరుట కొక కారణమని వ్రాయబడినది. వామనావతార కాలమున అసురులనబడు ద్రావిడులను ఆర్యుల పాదాక్రాంతులుగా జేసి, పరశురామావతారము నాటికి శైవస్నేహము జేసికొని, రామావతారము నాటికి శివరాము సమస్తపదధారులై, కృష్ణావతార కాలమున కెల్ల సుధన్వచంద్రహాసాది విష్ణుభక్తులను బడసి, వ్యాసావతార సమయమునకు భారతవర్షమును వైష్ణవభాగవతదేశముగా జేసినట్లు రామాయణ భారత భాగవతాది పురాణములనుండి కానవచ్చుచున్నది. పరశురామావతార కాలమున ప్రారంభమైన ఆర్యద్రావిడ సామరస్యము కాలక్రమమున దేవతల పూర్వదేవతల చాల చెలిమిని పరిణమించెనని ఎఱుగనగు. మహానటుడు సంగీతసాహిత్య కళాప్రపూర్ణుడగుటచే దక్షిణహిందూ దేశమువారు అక్షరాభ్యాసమునకు ముందు "ఓం నమశ్శివాయ సిద్ధం నమః" యను నాందివాక్యముతో నమస్కారము జేయుచున్నారు. కర్ణాటకులు మొదలగువారు వర్ణమాలను "ఓనమాలు" అనుచున్నారు. పాణిని సహితము సంస్కృతవర్ణములు శివునిడమరుగమునుండి యుద్భవించినవియని మహేశ్వరసూత్రమున సూచించినాడు. ఇందువలన వర్ణలిపి దక్షిణహిందూస్థానమున నుండిన అనార్యులనియు, అసురులనియు పిలువబడు దక్షిణహిందూస్థానపు జనుల దైవమగు శివునిచేత ప్రచారితమయ్యెనని చెప్పనగు. దీనినే మానవవాక్యముల జెప్పవలసిన కర్ణాటకులు లిపిని కనిపెట్టిరని చెప్పనగు. ఇంకొకదృష్టి నిది సమర్థింపబడుచున్నది. మూలసంఘమునందు పలుతెగలు ప్రబలె. అందు ముఖ్యమైనవి సముద్రయానము జేయువారు, క్షాత్రవృత్తి నుండువారు, వ్యవసాయమున నుండువారు, వ్యాపారమున బోవువారు. కొందఱు జన్మభూమి నుండినారు; కొందఱు దూరదేశముల కరిగినారు; కొందఱు స్వదేశమున నుండినవారు. వీరివీరి స్థలవృత్తుల ననుసరించి కలహములును, కులదైవములును కలిగినవి. కర్ణాటకులు ఇంట నుండిరి; బయటికి పోయిరి. కర్ణ మను పదము నావకు పేరు. Canoe అను పదము నావకు పేరు. ఇవి కర్ణాటకుల సంబంధముగలవి. కత్తి, కణజము, మొదలగునవి కర్ణాటకుల స్వదేశనివాసవృత్తుల బొడమిన పదజాలములు. 'కేశవ' యను పదమున 'క' వర్ణమునకు 'బ్రహ్మ' యను అర్థ మొసగబడియున్నది. బ్రహ్మ సముద్రవ్యాపకుల కులదైవమగు విష్ణుపుత్రుడు. ఇతని భార్య వాగ్దేవి. ఆమె స్తనద్వయము సంగీత సాహిత్యములు. విష్ణుపాదవర్తియగు వాయువు శబ్దప్రేరకుడు. బ్రహ్మపుత్రుడు రుద్రుడు. రుద్రుడు మహానటుడు; సంగీత శాస్త్రకళాప్రపూర్ణుడు. అతని గణపతులు సంగీత సాహిత్య శాస్త్రప్రచారకులు. మీనావతార కాలమున వేదముల నొక దైత్యు డపహరించినట్లు వ్రాయబడినది. సామగానలోలుడు విష్ణువని చెప్పబడినది. ఇటు మూలసంఘములోని హిందూదేశపు వెలుపలి, లోపలి కర్ణాటకులును, హిందూదేశములోని ఉత్తరపు, దక్షిణపు కర్ణాటకులు లిపికి మూలకర్తలని, వైష్ణవకాలమున వెలువడిన సంగీతసాహిత్యము శైవకాలమున సంపూర్ణత నొందెననియు నుడువనగును. యుగముల సంజ్ఞాసంఖ్యలను చేర్చిన 4, 3, 2, 1=10 యగుచున్నది. ఒకొక్క సంఖ్య ఒక వేయని పండితతిలకులు సూచించినట్లు తీసికొనిన 10వే లగుచున్నది. అందు సంధికాలముననే ధర్మస్థాపనమునకై విష్ణు వవతారముల నెత్తుననుటంబట్టి శివునిచెంత పరశురాముడు శిష్యుడైన పరశురామావతార కాలమగు కృతయుగ

మునుబట్టి చూచిన 10-4=6=6,000 సం.లకు ముందే లిపి యుండియుండవలెను. నరసింహావతారము నాటి ప్రహ్లాదుని విద్యాభ్యాసకాలమునకు బోయిన నింకను వెనుకకు బోవును. మీనావతార మింకను వెనుకకు దీసికొనిపోవును. యుగచక్రము లెన్నియో తిరిగినవి. బ్రహ్మ అజవాచ్యుడు. అతడు 'అ'యను అక్షరవాచ్యుడగు విష్ణుపుత్రుడు బ్రహ్మనుబట్టి, బ్రహ్మ జనకునిబట్టి పర్యాలోచించిన లిపి యనాదికాలము నాటిది యగుచున్నది. స్థూలముగా జెప్పవలయునన్న పై పేర్కొన్న కాల మొకవిధమైన అభిప్రాయము నిచ్చుచున్నది. ఈలిపి బాణముల పోలియున్నది. మూలసంఘమున ధనుర్ధారులై యున్న కర్ణాటజనాంగమగు తుళుజనులయమ్ముల నిది జ్ఞప్తికి దెచ్చుచున్నది. సంఘము ప్రతిమలను వ్రాసి భాషను దెలుపుచుండెనని పలికితిని. పలుకునపుడు మననోరు, నాలుక కొన్ని ఆకారముల జెందుచు స్థానముల దాకుచునుండు. వానిని జూచి బాణరేఖల చిత్రముల వ్రాసి, లిపిని కర్ణాటకులు కల్పించియుందురు. ఈ కారణముననే అక్షరములు అమ్ముల, అంపమొనల, ఏండ్లపంటికొప్పుల యాకారములతో నగపడుచున్నవి. మనకు వ్యక్తమగు కాలమునందు వీనిని ప్రచారమునకు దెచ్చినవారు పై జెప్పినట్లు, నంది మున్నగువారు. నాటకమునకు ముందు నిర్విఘ్నార్థము నాంది చెప్పబడుచున్నది. అక్షరముల నభ్యసింపక ముందును నాంది నడుపబడినది. అందు శివనామమును (పైన జెప్పినట్లు వైష్ణవులు నారాయణనామమును), అణిమాదివిద్యాసిద్ధుల బడసిన సిద్ధనామము నుచ్చరింపబడినవి. అయ్యాదివారి సంబంధమును దెలుపుచున్నది. కర్ణాటదేశము సమస్తమతములకు పుట్టినిల్లని ముందె నుడివినాను. అందునను, తుళుజనులలో బుట్టిన వైష్ణవ మధ్వాచార్యులకును, ఆరాధ్యులలో జనించిన బసవారాధ్యులకును బుట్టినిల్లు. ఇదియ జైనులజన్మభూమి. ఈమూడు తెగలవారి మతగ్రంథములు కర్ణాటభాషనే, కర్ణాటలిపినే వ్రాయబడియున్నవి. పాశ్చాత్యులు కర్ణాటభాషలను ద్రావిడభాషలనుట, కర్ణాటలిపిని ద్రావిడలిపి యనుట, ఉత్తరదేశీయులు నట్లె పలుకుట ప్రమాదజనితము. ద్రావిడులు జీవనార్జనమునకై పట్టుదలతో దేశములోపలను, వెలుపలను మూలసంఘమువారి యొకభాగముతో బోరినవారు ద్రావిడులు. అట్లు వారు ప్రతిపక్షముగా నైనందులకై వారి పేరులనే అయ్యాది పేర్కొనబడియె. సత్యాంశ మిట్లున్నది. కన్నడము తమిళు తెలుగులకు వెన్నెముకగా నున్నదంటిని. ఒకప్రక్క తమిళులిపి కన్నడమునకు సంబంధించినది, సామ్యము కలది. మఱొకప్రక్క తెలుగులిపి కన్నడమునకు సంబంధించినది, సామ్యము కలది. కర్ణాటప్రాకృతలిపి దక్షిణహిందూస్థానజనేతర ఆర్యసంస్కృతలిపి మూలమున నొక్కటియె. మానవసృష్టి ఒక్క మూలసంఘముగా నుండి స్వదేశములోననో, వెలుపలనో పాయలై పోయినందున భాషాలిపులు, మతసంప్రదాయములు వన్నెవాడుకలు చిరకాల అన్యదేశవాసమునను, శీతోష్ణస్థితులను తారుమారైపోయినవి. గాఢముగ నందు గురుతులను గాఢముగా పరీక్షించి వెదకిన ఏకత్వము వెల్లడియగును.

ఆర్యద్రావిడ భాషల కుండు భేదములని నుడువబడిన వివి:—

"లింగ మర్థము ననుసరించియున్నది.
సంధిక్రమము వేఱుగా నున్నది
నామపదముల ఏక బహువచనములు రెంటియందును నొకేవిధమగు విభక్తి ప్రత్యయములు చేరుచున్నవి.
భావగుణవాచకములకు తరతమభావము లేదు.
సంబంధార్థక సర్వనామము లేదు.
కర్మణిప్రయోగము విశేషముగా లేదు.
క్రియలకు నిషేధరూప మున్నది.
కృత్తద్ధితప్రత్యయములు వేఱుగా నున్నవి."

ఇట్లు వక్కాణింపబడిన భేదములలో కొన్ని పైకిమాత్రము కన్పట్టునవియు, కొన్ని తారుమారగుట వలన కనపడక స్థానభ్రష్టతను, భ్రాంతిని కలిగించునవియు, కొన్ని ఉచ్చారణనుబట్టి మాఱినవియు నై యున్నవి. వానిని వేఱొండెడ వ్రాయబూనినాను. ఇందు విస్తరింప చోటు లేదు.

"గమకసమాసదిం ఱఴకుళక్షళదిం శ్రుతిసహ్యసంధియిం। సముచితమాగిబర్పసతిసప్తమియిం సంస్కృతోక్తియిం। వ, మ, హ, ప, భేదదిం। విరహితాన్వయ

సంస్కృతలింగదిం పదోల్_త్తశిథిలత్వదిం యతివిలంఘనదిం దరిదత్తె కన్నడం”—కేశిరాజు. ఈ భేదములును సహజములు గావు. స్థూలదృష్టిని జెప్పినవి గాని సూక్ష్మదృష్టిని జెప్పినవి గావు. దీనిని గుఱించియు వేఱొండెడ వ్రాయబూనినాను.

వచ్చువ్యాసమున కన్నడిగల తెలుగల వాఙ్మయ వైభవమును సింహావలోకనన్యాయమున వీక్షించి సాదృశ్యమును మఱింత సాధించి వ్రాతను చాలింతును. ముందు, ఇందు, ఇకమీద వ్రాసిన, వ్రాయఁదలచిన దేశ కాల భాషా తత్త్వ ప్రపంచవిషయముల గుఱించి స్థూలముగా నిర్వచనములు, నిదర్శనములు ఇయ్యబడినవి. దైవానుగ్రహమును నమ్మి, సూక్ష్మాంశముల విస్తర వివరణలు, నా శక్తి కొలది ఆంగ్లేయభాషను వ్రాయబూనిన “కర్ణాటక తాపకభూమి” (“The Tropic Home of the Karnatakas”) అను గ్రంథమునందును, కర్ణాటభాషను వ్రాయబూనిన “కర్ణాటభాషా వ్యాకరణరహస్యములు” (“The Grammatical Secrets of the Karnataka Language”) అను గ్రంథమునందును సకారణముగా నిరూపింపబడును. వానిని సకలవాచక మండలికి నమస్కారపూర్వకముగా సమర్పింప నెంచినాఁడను. వాఙ్మయప్రపంచమున నే జేసిన తపస్సిద్ధి, వివిధదేశజాతిభాషాతత్త్వజ్ఞుల సమ్మతి ఫలరూపమున ప్రాప్తించెనేని, నా జన్మశ్రమలు సార్థకమయ్యెనని యానందింతును. లోకమాన్య తిలకు గారు “ఆర్యుల ఆదిమ నివాసము” (“Arctic Home of the Aryans”) అని వ్రాసినారు. అందు మానవవిహగము ఏకపక్షముతో ప్రతిపక్ష విహీనముగా నున్నది. దానికి పరపక్షమును గూర్చి పక్షద్వయము గల ఏకపక్షిగా వ్రాసి సృష్టి చిత్రమును సంపూర్ణము చేయవలెనని నా సాహసము. విమర్శక తిలకుడైన కాల్డ్‌వెల్ పండితుని వ్యాకరణమునందు అసమ్మతములును, భ్రామకములు నగు పథములు వ్రాయబడినవి. వానిని సమ్మతములును, వాస్తవములును నగు మార్గములుగా మార్చి కర్ణాటభాష రాజధాని గద్దె స్థానమును చేయవలయునని నా మనోరథము.

---

శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు

వెన్నెలచీరఁ గట్టి నెఱి విచ్చిన తెల్లతురాయి వెట్టి మే
లెన్నిన సన్నజాజిపువు లెత్తులఁ గ్రొమ్ముడిఁ జుట్టి యేటివాల్
తిన్నెల నెచ్చెలుల్ వెదకి తీయఁగ వెన్నెలవత్తు లాడుచున్
బున్నమ రేయిఁ దోఁచు విరిబోణి విహంగిని యెట్లు లయ్యెనో?

కొలఁకుల విచ్చుచెంగలువ కోవల వెన్నెలతేట నించి చు
క్కల నిశి రంగరించి, తమకంబున నెత్తి చకోరశాబకం
బుల నోడిఁ జేర్చి యుగ్గు లిడి పువ్వులతోఁటల నుంచి యంచ తో
య్యాలలను నూఁపఁబంపు జవరాలికి నేలొకో పక్షపాతముల్?

ఘనతరు లెల్ల ఱిచ్చవడి కన్గొనఁ గంచెల నున్న కేతకీ
వనముల సౌమనస్యమును వర్ధిలఁ జేయుచు, నెండి బీట లె
త్తిన నడగట్లు బంగరువు తీఁగలఁ గూర్చి, ఘనుల్ భ్రమింప బ
ల్మి నిటు మెఱుంగుఁదీఁగ వెడలించుట యొప్పనె మోహనాంగికిన్?

తేటవన్నియమోము తెరవంకకన్నెలఁ గలనిస్వనములతోఁ బలుకరించి
పలుకవారిన పాలపండ్ల గుత్తులు గూర్చి చిలుకబోదలకు విందుల నమర్చి
ననదేనెఁ గ్రొల్లలాడిన గండుఁ దేంట్లను జెందమ్మిలోఁగిండ్లఁ జెఱలువట్టి
చెదరి తాఱాడుచుఁ జెట్లనీడలఁ జేరుచీఁకటికంటిలోఁ జిచ్చు వెట్టి
ప్రకృతి లాలించి పాలించు బాల యయ్యు-జగతి రక్షించి శిక్షించు శక్తిఁ గాంచి
విశ్వవిస్మయలీల నివ్వెలఁది యెట్లు-పరమపురుషప్రభావంబుఁ బడసినదియొ?

అర్థప్రధాన మోహన సస్యలక్ష్మికిఁ గొలఁదలంపనితలకోఁత వెట్టి
కామానురూప విక్రమ రాజ్యలక్ష్మికి నండ గూర్పని కలగుండు వెట్టి
అఖిలైహికార్థ భవ్యతమాలక్ష్మికిఁ బా టెఱుంగని గుండె బీట వెట్టి
పరమార్థవిభవశోభన విశ్వలక్ష్మికిఁ దగులు సూపని వెల్ల మొగము వెట్టి
ఇట్టె వచ్చి వర్షాలక్ష్మి కెసరు వెట్టి-విజయలక్ష్మి ప్రసంగంబు వీథిఁ బెట్టి
రచ్చ కెక్కించినట్టి శరత్కుమారి-శారదేందిర యని యెట్లు పేరు గనెనో?

---



## డాక్టరు పల్లెంపాటి గోపాలకృష్ణయ్యా చౌదరిగారు, B. Sc., Ph. D.

డాక్టరు గోపాలకృష్ణయ్యా చౌదరీగారు సికింద్రాబాదు నివాసులు. వీరు రష్యాదేశము పర్యటనము గావించి యీ వారములో తిరిగివచ్చిరి. అమెరికాయందున్న ఇతాకాపట్టణమున ఏడుసంవత్సరములు విద్య నభ్యసించి వ్యవసాయశాస్త్రమునందు బి. ఎస్-సి., పి-హెచ్. డి. డిగ్రీని పొందియున్నారు. రష్యాదేశమునకు ముఖ్యపట్టణమయిన మాస్కోనగరమున ఈ సంవత్సరము జూలై ఆగస్టు నెలలో జరిగిన ద్వితీయ అంతర్జాతీయ సాయిల్ సైన్సు కాంగ్రెసునకు ఇండియా దేశమునుండి ప్రతినిధిగా భారతీయులు వీరొక్కరు మాత్రమే వెళ్లియుండిరి. వీరా కాంగ్రెసుసందర్భమున నితర దేశముల ప్రతినిధులతో కలిసి యూరోపియన్ రష్యా ఆర్మీనియా దేశములందున్న ముఖ్యమయిన వ్యవసాయ కళాశాలలను, ప్రయోగశాలలను దర్శించిరి. మరియు రష్యాదేశపు వ్యవసాయ శాస్త్ర ప్రముఖుల ద్వారా పలువిధముల భూసారాంశజననము, ప్రయోజనాభివృద్ధులను గురించి తెలిసికొనగలిగిరి.

డాక్టరుగారు అమెరికా దేశములో 1927-సంవత్సరమున జరిగిన ప్రథమ అంతర్జాతీయ సాయిల్ సైన్సు కాంగ్రెసునందుకూడ పాల్గొనిన యిండియా దేశపు ఏకమాత్ర ప్రతినిధి. అమెరికాదేశములోను, కనడాదేశములోను ఉన్న వ్యవసాయశాస్త్రకళాశాలలను, ప్రయోగశాలలనుకూడ చూడగలిగిరి. మరియు ఉత్తరమెరికా భూసారాంశములను తెలిసికొనగలిగిరి. వీరు అమెరికానుండి స్వదేశమునకు వచ్చుచు యూరపులోకూడా ముఖ్యప్రదేశములను సందర్శించుచు ఒక సంవత్సరము గడపి వ్యవసాయశాస్త్రమున పాండిత్యము సంపాదింపగలిగిరి. [ఆం. ప.]



## శ్రీయుత సిరుగూరి జయరావుగారు, I. C. S

వీరు లండనునగరమున కేగి ఇండియా సివిలు సర్వీసు పరీక్షలో కృతార్థులై సెంట్రలు ప్రావిన్సెసులో అసిస్టెంటు కమీషనరుగా నియమింపబడిరి.

జయరావుగారికి సంస్కృతాంధ్రభాషలలోను, ఇంగ్లీషుభాషలోనుకూడ మంచి పాండిత్యము కలదు. ఈ మూడు భాషలలోను శ్లోకములను, పద్యములను వ్రాసియున్నారు. వీరు మదరాసు విశ్వవిద్యాలయమునకు చేరిన నైజాము హైదరాబాదు కళాశాలలో నిదివరకు బి. ఎస్-సి. పట్టమును బడసిరి. వీరితండ్రిగారు శ్రీయుత సిరుగూరి లక్ష్మీనారాయణరావుపంతులుగారు సాల్టు ఆబ్కారీ అసిస్టెంటు కమీషనరుగా పనిచేసి పింఛెను పుచ్చుకొనిరి. వీరి అన్నగారు శ్రీయుత ప్రొఫెసరు సిరుగూరి హనుమంతరావు పంతులు ఎం. ఏ., ఎల్. టి. గారు నైజాము హైదరాబాదు కళాశాలలో హిస్టరీ ప్రొఫెసరుగా నున్నారు. [ఆం. ప.]







శ్రీమతి జె. పి. శ్రీవాస్తవగారు
సంయుక్తరాష్ట్ర శాసనసభాసభ్యులుగ నుండిన
శ్రీ వాస్తవగారి భార్య, కాన్పూరు నివాసిని.
ఈమె శాసనసభ్యురాలుగ నియమింపబడెను.
ఆరాష్ట్రీయుల శాసనసభ్యత్వము నుపొందిన
ప్రథమ స్త్రీ యీమె.



శ్రీమతి అలమేలు మంగ తాయారమ్మగారు
స్త్రీప్రతినిధిగా మదరాసు శాసనసభకు
ప్రభుత్వము నియమించిన సభ్యురాలు.



## అనర్థవాఙ్మయము

వర్తమాన ఆంధ్రవాఙ్మయము నవలోకించి విమర్శించు రసికాగ్రేసరులకు నాదొకమనవి. భావకవుల మనియు, నవలారచయితలమనియు, ప్రబంధనిర్మాతల మనియు నూహించు పండితమ్మన్యులకు గూడ మనవి జేయుచున్నాను. గుణమును కప్పిపుచ్చుటకు నేరికిని సాధ్యము గాదు. ఆ గుణములు మాత్రము వెంటనే బయల్పడను నున్నది. గుణావగుణముల తెలుసుకొనుచే గాక, ఆత్మసంతృప్తికొఱకు, స్వలాభాపేక్షకులై, సంఘము, నీతి ప్రయోజనము, సారస్య సిద్ధి నేమాత్రము లెక్కింపక కలముచేత నున్నది గదా యని వ్రాసి పెట్టున్నది గదా అని అచ్చొత్తించి వర్తమానగ్రంథకర్తలలో కొందరు ఆంధ్ర వాఙ్మయా నర్థపరులగు చున్నారని చెప్ప వచ్చినందులకు చింతిలుచున్నాను. ఇట్టి యనర్థము వాటిల్లకుండ జేయుట వాఙ్మయ ప్రగోభివృద్ధి పిపాసులగు విమర్శకుల కర్తవ్యమై యున్నది. రైళ్లలో తిరిగి పుస్తకముల నమ్ము వారలు అట్టి పండితమ్మన్యుల కెక్కుడు తోడ్పడుచున్నారు. ఇట్టి ప్రచురణకర్తలును, విక్రేతలును జేయు నవమానమును హర్షించి యూరకుండుట హితముగాదు.

ఇక్కాలమున ముఖ్యముగ ప్రచారములో నున్నవి భావకవిత్వము, నవలలు. ఈ రెంటియొక్క పరమాదర్శము ప్రణయగాథలను వర్ణించుటదప్ప వేరొండు గాన్పించుట లేదు. భావకవి తన్మయుడై తరుచు ఆత్మగాథలనే వివరించు నవలలు నవలారచయితలుగూడ చేయుచున్నారు ఏవర్ణనమునందు గాని, యేరసపోషణమునందు గాని, యేరచనయందు గాని ఆత్మానుభవమును మూలముగ జేసికొని వ్రాయుటను మించినది లేదు. అంతయు ఆత్మానుభవమే యగును. అప్పుడే ఆత్మసంతృప్తి గూడ కల్గును. కాని అట్టి ఆత్మసంతృప్తి లోకములోనున్నంతవరకు, లోకములో గూడ తానొకడ ననుభావమున్నంతవరకు లోకమును లెక్కచేయక తనమాటయే తనని వ్రాయు వ్రాతలు నిందార్హములగును. లోకము మెచ్చినప్పుడే ఆత్మసంతృప్తి గలుగగలదు. ఆత్మసంతృప్తి నిర్దుష్టమైనపుడే లోకము మెచ్చితీరును. లోకసంస్తుతియు, ఆత్మసంతృప్తియు అవినాభావసంబంధము గలవి. కాబట్టి కేవలము ఆత్మసంతృప్తికై వ్రాసితినని చెప్పుకబుర్లు పనికిరానివి. కవి, చిత్రకారుడు, గాయకుడు కళానిపుణుడెవ్వడైనను నిర్దుష్టమగు నాత్మసంతృప్తిని గాంచెనన్న దానివెంటనే లోకసంస్తుతిగూడ నుండును. ఇతరుల మెప్పు బడయుటకు వ్రాయలేదని చెప్పుమాటలు అర్థములేనివి. మానవుడు ఇతరుల మెప్పును కోరుట గాని, అట్టిభావమును గల్గియుండుట గాని సహజదుర్బలత్వమై యున్నది. అట్టిమెప్పును గోరనివాడైన ప్రచురణము చేయ నవసరమే యుండదు. తనకు దాను వ్రాసుకొని ఆనందింపవచ్చును. తన ఆనందమునే యితరులు గూడ పొల్గొనదలచియే ప్రచురణము జేయుట తటస్థించుచున్నది. ఆయానందము సర్వతోముఖమైననే నిర్దుష్ట మగును. లేనిచో నింద్య మగును.

'శారద' గ్రంథకర్త చిల్కా లక్ష్మీనారాయణ గారు తమగ్రంథమును రచించి పరమానందమును బొందిరే అట్టి యానందము నితరులు చూరగొనవలెనను పరమో

త్కృష్టభావముతోనే ప్రచురించియుండవచ్చును. నిజముగ కొందరు ఆనందించికూడ నుండవచ్చును. ఆనందించుటగూడ కంటిని. అందలి ఇతివృత్తమును ఈవ్యాసమున బయల్పరచుటకు చేయాడకున్నది. గ్రంథకర్త పీఠికలో 'లోకమునం బ్రవర్తిల్లు బాల్యవివాహములవలన కలుగు నష్టపరంపర లోకానుభవంబున నెరింగి తదనిష్టంబుల కొంత జనంబున కెరుకపరుప కుతూహలంబు పొడమి యిట్టి కల్పితగ్రంథరచనకై గడంగితి'నని వ్రాసిరి. ఈ మహోత్కృష్ట గ్రంథమును పరిశీలించిన మిత్రులుగూడ ప్రథమమున ముద్రింపుతలంపు తమకు లేకపోయినను ప్రోత్సాహము జేయుటచే ఇట్టి ప్రచురణమునకు గడంగితి మనుచున్నారు. ఆశయము గొప్పది. గ్రంథకర్త సంఘము నుద్ధరించుటకు నడుముకట్టినారు. బాల్యవివాహముల వలన జరుగు ననర్థములు నిత్యమును కన్నులార జూచుచున్నాము. ఇందులకు గ్రంథరచనకు గడంగ నవసరము లేదు. కేవల కల్పనాకథ లవసరము లేదు. కన్నులయెదుటనే గ్రంథకర్తకు గాన్పించియుండవచ్చును. ఈరచనయందు కవితగాని, కల్పన గాని గాన్పించవు. పురాణములు, ఇతిహాసములు, నీతిగ్రంథము లన్నియు స్త్రీకి పాతివ్రత్యమే యుత్తమధర్మమని బోధించియుండ బాల్యవివాహములవలన యనర్థము లను పేరుతో నీగ్రంథకర్త నూత్న ధర్మములను బోధించెను. స్త్రీ యిష్టము వచ్చినవానితో సంసారము చేయవలెననియే యీగ్రంథకర్తయొక్క ఆదర్శము గాని వేరొండు కాదు. ఈకథయందు బాల్యమున వివాహము జరిగిన 'శారద'ను, ఆమెభర్త సుందరరావును, వారి దాంపత్యము కథలో వర్ణించినవిధమునే చూచినను, మదనకుడును, రాధాకృష్ణుడును లేకున్నయెడల ఆదంపతుల కట్టిస్థితి గల్గునని తలంప వీలు గాకుండును. సుందరరావు గుణగణములను గ్రంథకర్త వర్ణించెను. రాధాకృష్ణుని వర్ణించెను. ఉభయులకును తార్కాణ ముండవచ్చును. కాని అగ్నిసాక్షిగ వివాహమాడిన సుందరరావును వీడి రాధాకృష్ణుని వలచుటకు తగినంత గుణగణంబు లేమియును ఈకల్పితకథయందు గాన్పించవు. సుందరరావు వృద్ధుడుగాడు. శారదకు తగినభర్తయే. చిన్నవాడు. కురూపి గాడు. ఏవగించుటకు కారణములు తగినవి గాన్పించవు. శారద కాతనిపై ఇష్టము లేదన్న సుందరరావుపై ఇష్టము లేదని కాదు గాని రాధాకృష్ణునిపై అంతకన్న ఎక్కువ మక్కువ. అట్టిమక్కువ యేర్పడుటకుగూడ రాధాకృష్ణుడే కారణమని కాన్పించును. బాల్యవివాహములవలన నిట్టి వైపరీత్యము గల్గునని గ్రంథకర్త భావించునెడల శారద చిన్నతనములో గాక పెద్దదైన పిదప రాధాకృష్ణునే మోహించి పెండ్లాడినను అంతకన్న సుందరపురుషుడు గాన్పించునెడల రాధాకృష్ణుని విడనాడదా? బాల్యవివాహములవలన భర్తను భార్య విడనాడుచున్నదనుట కల్ల. నీతిబాహ్యములగు పనులను స్త్రీలు చేయుచున్నారన్న అందులకు పురుషులే కారకులగుచున్నారు. పురుషుడు శాసకుడగుచున్నాడు. అట్టితరి స్త్రీలోకమును నిందించి లాభము లేదు. పురుషులే బుద్ధిగల్గి మార్గదర్శకులు గావలెను. బాల్యవివాహములను పేరుబెట్టి సంఘసంస్కరణమునకు గడంగిన ప్రయోజనము గలుగజాలదు.

కథావస్తువు నటులుంచి సారస్వతముగ నీగ్రంథమేమైన ప్రాముఖ్యము బడయగలదా యనిన అదియు వ్యర్థముగనే గాన్పించును. వర్ణనలు విపరీతములు. పాత్రములు కొన్ని కొంతటితోనే అంతరించును. ఇతర నవలలను చదివి వ్రాసినపాండిత్యము మాత్రమిందు గాన్పించును గాని సహజపాండిత్యము గానరాదు. ఇట్టి గ్రంథమును రచించినందువలన సారస్వతముగ గాని, సామాజికముగ గాని మేలు లేకపోగా నష్టము మాత్రము గలుగునని చెప్పక తప్పదు. విమర్శకులును, దేశగ్రహణపారీణులును, లోకక్షేమమును గోరువారును ఇట్టి యనర్థవాఙ్మయమున కెట్టి ప్రోత్సాహము గలుగజేయకుందురుగాత అని నా మనవి.

చల్లా జగన్నాథం, (యం. ఏ., బి. యల్.)

---

## ప్రాచ్యకళావైభవము

### 'హేమ్జా చిత్రములు'

పర్షియను ఇతిహాసములలో నొకటి సుప్రసిద్ధ నాయకుడగు హేమ్జాచరిత్ర, మొగలాయి చిత్రలేఖన

కాలముచే నతికక్కినది, యిటీవల నయన్యూనగరమున అమూర్తియా ముద్రణముగా ప్రచురింపబడినది. హేమ్జా ఇతిహాసపువ్రాతప్రతి క్రీ శ.1550-1575 సంవత్సరములలో ఢిల్లీ మొగలాయి దర్బారునం దుండెను. ప్రాచ్యకళాశేఖరు లీకథను తను-చిత్రములం దద్భుతముగా సృష్టించి సఫలీకృతు లైరి. ఆప్రతియంతయును అపూర్వమైనది. కాని, 1575 వ సం. నకు తరువాత ఈ ఢిల్లీవ్రాతప్రతి పలు దేశములకు చెదరిపోయెను. దాని భాగముల నిపుడు వేర్వేరు దేశములనుండి సేకరించి, సమగ్రముద్రణమును సమకూర్చవలసివచ్చెను. నయన్యూలోని కళాప్రదర్శనము (Art Museum), లండనులోని విక్టోరియా ఆల్బర్టు మ్యూజియము, బెర్లినులోని ఫ్రెడరిక్ చక్రవర్తి మ్యూజియము, లీప్‌జిగ్‌లోని చిత్రకళల, చేతిపనుల ప్రదర్శనము, న్యూయార్కు నందలి కేంద్రకళా ప్రదర్శనము (Metropolitan Museum of Art), బోస్టనులోని చిత్రకళా ప్రదర్శనములు గాక, పలువురు వ్యక్తుల చిత్రసంచయములను ఈ హేమ్జాకథా ముద్రణమునకు భాగముల నను్గ్రహించి, సమగ్రతకు బాధ్యము లైనవి. వేర్వేరుకాగితములను వీటినెల్ల ననుసంధించి చిత్రములను కథతో కూర్చుట సాధ్యమయ్యెను. హేమ్జాకథ అనువదింపబడినది. నష్టమైన భాగములు ఇతరవ్రాతప్రతుల సహాయమువలన పూరింపబడినవి.

మతప్రవర్తకుడగు మహమ్మదునకు బంధువైన హేమ్జాయొక్క చిత్రవిచిత్ర కార్య కథనము ఈ ఇతిహాసము. ఈనశ్విర్వాను అనువరుడు నసనీదు దేశమునకు ప్రభువు. అతులితసౌందర్యవతి మిహార్నిగర్ అతని కుమార్తె. హేమ్జా యీబాలను ఉత్కటముగా ప్రేమించెను. మిహార్నిగర్ కరగ్రహణమునకై, యాతరుణి తండ్రి హేమ్జాని అగ్భుత, భయోత్పాదక, సమర, సాహసిక కార్యములందు నియోగించెను. ఇందులకే హేమ్జా హిందూస్థానము, బైజాంటియము, స్పెయిను, ఆఫ్రికా మున్నగు దేశములను సంచరించి, దైత్య, మాంత్రిక భూత పిశాచాదులతో నద్భుతసంఘటనలందు తగుల్కొని, చివరకు ఆహాద్ శిఖరసమరరంగమున నిహతు డయ్యెను. ఇంతటితో కథ సమాప్త మగుచున్నది.

ఈకథకు చిత్రముల రచించినవారిలో తబ్రీజునకు జెందిన మీర్ సయ్యదు అలీ, షురాజ్‌నకు చెందిన అబ్దుల్‌అస్‌సమాద్ గారలు సుప్రసిద్ధులు. వీరిచిత్రములు నిక్కమైన ఉత్కృష్టకల్పన లనుటకు సందియము లేదు. చిత్రకళాచారిత్రమున వీటిప్రాముఖ్యము గమనింపదగినది. ఇవి మొదటిసారి యేకసంపుటముగా సృష్టింపబడుటచేత, మొగలాయి చిత్రకారులకూటము అప్పటికే యుండెనను టకు ప్రత్యక్షనిదర్శన మగుచున్నవి. వీటి అపూర్వకళావైభవము ఆకాలముననే చిత్రకళ యెంత అభివృద్ధి గాంచి యుండెనో విశదము సేయుచున్నది.

(స్పీయరు 8-11-30 నుండి)

---

## నోబెలు బహుమానము

పదార్థ విజ్ఞానశాస్త్రము (ఫిజిక్సు)నందు 'నోబెలు ప్రైజు'



సర్ సి. వి. రామను (చంద్రశేఖర వేంకటరామను) గారికి ఇచ్చిరి.

వీరు కలకత్తా విశ్వవిద్యాలయము ప్రొఫెసరు. భారతీయులలో ఈ బహుమానమును బడయుటకు వీరు రెండవవారు. మొదటివారు శ్రీ రవీంద్రనాథ టాగూరుగారు.

## గ్రంథాలయములు

పెదపాడు శ్రీజితేంద్రసహకార గ్రంథాలయముయొక్క ప్రథమవార్షికోత్సవమునకు అధ్యక్షతవహించిన శ్రీయుతులు శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు, తమ అధ్యక్షోపన్యాసమున గ్రంథాలయములనుగూర్చి యీ క్రింది యుపదేశములను గావించిరి.

### గ్రంథాలయోద్యమము

పూర్వకాలంలో గురువే ఉండేవాడు. పుస్తకాలకు బ్రహ్మిష్ఠ బ్రహ్మ అయేది. అందుకనే కోశవాన్ ఆచార్యః అనే మాట పుట్టింది. ఈకాలంలో గురువు లేడు. గ్రంథాలు ఉన్నాయి గుట్టలుగా పడి. ఇప్పుడు కోశవాన్ డంబాచార్యః గా తిరిగిపోయింది.

కాబట్టి గ్రంథాలయోద్యమంలో ఈ రెండు లోపాలను సరిచేయ్యాలి. అటు గురువూ ఉండాలి; ఇటు గ్రంథాలూ ఉండాలి. అనగా గ్రంథాలగుకాణం పెట్టినంతమాత్రం చాలదు. గ్రంథాలు తెలుసుకోనేశక్తికి ప్రతినిధి ఒకడు ఉండాలి. 'పుస్తకం హస్తభూషణమా?'

### గ్రంథము - బోధ

పూర్వకాలంలో గ్రంథాలు కొలది. బోధ యెక్కువ. ఈకాలంలో గ్రంథాలు కోటానకోటులు. బోధ అల్పము. పూర్వకాలంలో హృదయాలే పుస్తకభాండాగారాలు. బిల్హణుడు-'భాండాగార మఖండ మేవ హృదయే జాగర్తి సారస్వతం' అన్నాడు. ఎప్పుడు? రాజుగారికి కోపం వచ్చి తనయిల్లు లూటీచేయించడానికి పంపినప్పుడు.

### తుక్కు

నేటికాలంలో హృదయాలు అలాయిదా, పుస్తకభాండారాలు అలాయిదా. ప్రతిదీ 'రిఫెరెన్సు నోట్సు' ఈతారతమ్యం ఎందుకువచ్చిందంటే 'తుక్కు' ఎక్కువయింది. అది మనచదువులోనూ ఉంది; ఇంగ్లీషు చదువులోనూ ఉంది. మనచదువులో సూత్రం, దానికి భాష్యం, దానికి వ్యాఖ్యానం, దానికి వివరణం, దానికి టీక, దానికి లఘుటీక. ఇహ ఇంగ్లీషులో చూడండి టెక్స్టు. దానికి తెల్లవాళ్లు వ్రాసిన నోట్సు, నల్లవాళ్లు వ్రాసిననోట్సు, క్రిటిసిజమ్, ప్రోజీకరణం, అబ్రిడ్జీకరణం, మోడీకీఇవన్నీ కలిసి గిరీశం చెప్పినట్లు మేడ్ డిఫికల్టు అయిపోతుంది. ఒకపుస్తకానికే ఇవన్నీ డ్రెస్. ఇంతఎందుకు పెరగాలిసివచ్చిందంటే గుణత్వం తక్కువ. బోధతక్కువ. వ్యాసంగం తక్కువలో తక్కువ. శైష్యోపాధ్యాయిక ఉల్టా

### స్కాలర్లు

పూర్వకాలములో పేరప్రతిష్ఠలు సంపాదించుకున్నవాళ్లందరూ మనం చదివినగ్రంథాలలో ఎన్నోవంతూ చదివిఉండరు. ఈకాలములో 'స్కాలరు' అనిపించుకొన్న ప్రతివాడూ ఏ పదివేలగ్రంథాలో చుంగ్గా చదివి ఉంటాడు. కాళిదాసు గాని షేక్స్పియరు గాని ఇన్నిగ్రంథాలు చదివి ఉంటారని మీరు నమ్మతారా? నాగురువుగారికి మేము చదువుకున్న గ్రంథాల పేరులు కూడా రావంటే వారూఆనందిస్తారు, మీరున్నూ కోపాశ్చర్యాలు పడతారు. మేముచదువుకున్నదానికన్న వారెక్కువ గరు. వారికెంతకావాలో అంతవరకూ బాగా జీర్ణంచేసుకున్నారు. ఈస్కాలర్లందరూ ఏమిచేస్తారా అంటే మాట్లాడితే పుస్తకాలలోంచి 'కోట్' చేస్తారు. మరి జీర్ణం చేసుకున్నవారో ఒక క్రొత్త ఒరిజినాలిటీకి దారి చేస్తారు. అటువంటివానిని ఒక్కణ్ణి తయారు చేస్తే గ్రంథాలయం చరితార్థమవుతుంది.

### గ్రంథాలయం పెట్టడం ఎందుకు?

గ్రంథాలయోద్యమం అన్ని ఉద్యమాలతోటిదీ కాదు గ్రంథాలుచదువుకొనేవాళ్లు గ్రామంలో లేకపోతే గ్రంథాలయముతో పనియేముంది? చదువుకొనేవాళ్లు లేకపోతే ఇదికూడా ఒకఉద్యమంగదా అని ఉద్యమిస్తే 'గజభుక్తకపిత్థ' మవుతుంది. చదువుకొనేవాళ్లుగనక ఉంటే 'గ్రంథాలయం పెట్టడం ఎందుకు?' అనేశంకే లేదు.

సామాన్యజ్ఞానం కలిగాక గ్రామాలలో ఊరకే కూచోవలసి వచ్చేవాళ్లకు గ్రంథాలయ మనేది సరస్వతీ దేవి గుడి. గ్రంథాలయాలవల్ల ఏమీ ప్రయోజనం లేదని చెప్పేవాళ్లు చాలామంది ఉన్నారు. కాని చదువులో కూడా ఇకానమీ ఉండాలనే ప్రఫుల్లచంద్రరాయి గారికి సమేతం గ్రంథాలయోపయోగం ఆశ్చర్యంగా కనబడింది ఈ క్రిందిమాటలు వారివి.

## గ్రంథాలయ-పండితులు

విశ్వవిద్యాలయాలలోనూ తయారైనవాళ్లున్నారు గ్రంథాలయాలలోను తయారైనవాళ్లున్నారు. ఈరెండో దాంట్లో తయారయినవాళ్లు-కేశవచంద్రసేను, ప్రతాప చంద్రముజుందారు, విపినచంద్రపాలు, గిరీశచంద్రఘోషు, రవీంద్రులు ఇత్యాదులు. మెకాలే సీమనుండి హిందూ దేశానికి వచ్చేటప్పుడు స్టీమరులో చాలాపుస్తకాలు చదివిపారేశేవాడట. అప్పటికింకా సూయెజ్ కెనాలు లేదు. కేప్ ఆఫ్ గుడ్ హోప్ తిరిగి రావలసి ఉండేది. కాబట్టి ప్రయాణం అలస్యం అయేది. ఆకాలంలో చాలాపుస్తకాలు చదవడం అయేదట. గిబ్బన్ ఆక్స్ ఫర్డునుంచే తిరిగివచ్చేశాడు. అతడు ఏవిశ్వవిద్యాలయము లోను చదివింది లేదట. కాని అతనిని బోలినవారెందరు? అతడు గ్రంథాలయములో కూరుచుండే జ్ఞానోపార్జన చేశాడు. దీనికిఫలముగా అతడు మనకు "రోమకసామ్రాజ్యపతనము" అనే అపూర్వవస్తువును యిచ్చి పోయాడు. లోకం అంతా ఎరిగిన జాన్సన్ అతిదరిద్రుడు. ఒకపూట ఉంటే రెండోపూట తిండి ఉండేది కాదతనికి. తనపుస్తకాలు అచ్చువెయ్యడానికి గుత్తగొన్న సాహుకారు దగ్గిర డబ్బుకొంత అప్పు తెచ్చుకోవడానికి అతడు చీటి రాసి కింద 'తిండికి లేనివాడు' అని దస్కతు చేశాడు కాబట్టి ఇతను అంత కటిక దరిద్రుడు. ఇట్టి జాన్సన్ ఏవిశ్వవిద్యాలయంలోనూ ప్రెజెంటు వేయించుకోలేదు. ఇత డప్పసమూ గ్రంథాలయాలలోనే హాజరు.

మహాపండితుడు కార్లైలు ఇల్లు స్కాట్లండులో. తండ్రి మేస్త్రీ. వీళ్లందరూ చాలా దరిద్రులు. దైవకృప వల్ల నేను జమీందారుదాల ఇంట్లో పడలేదు కాబట్టి మనిషి నయినానని కార్లయిలు చెప్పేవాడట. చదువుకోసరం తండ్రి ఇతణ్ణి ఎడింబరో పంపాడు. అతడందులో ప్రవేశించాక అక్కడి మేష్టర్ల మూకలో లెక్కల మేష్టారొకడు, ప్రకృతిశాస్త్రాల మేష్టారొకడు తక్క ఇక మనుష్యులే లేరని అన్నాడు. ప్రకృతం అత డెడింబరోలో ఉంటానికి కారణం అక్కడ గొప్ప గ్రంథాలయం ఉంది అందులో ఇతను సొంతంగా ఇటాలియను ఫ్రెంచి జర్మను భాషలు నేర్చుకొన్నాడు. కాబట్టి గ్రంథాలయోపయోగం అంతులేనంత అని తెలుస్తూంది.

విశ్వవిద్యాలయాలలో తయారయిన ప్రతివాడికీ బి. ఏ అనో యమ్మే అనో బిరుదు లభిస్తుంది. గ్రంథాలయంలో తయారైనవాని పేరే బిరుదయిపోతుంది.

బిరుదులకోసం తంటాలు పడడం నౌకరీకి. కావలసింది జ్ఞానతృష్ణ. జ్ఞానతృష్ణఉంటే గురువు మనస్సుమీద ఆవరణం తీసివేసినాక గ్రంథాలయం సాక్షాత్సరస్వతీ దేవిగా ఆవిర్భావం అవుతుంది. పిదప చదవాలి, మననం చేయాలి.

## గ్రంథాలు

గ్రంథాలయములలో సరియగు గ్రంథాలు లేకపోతే అది ఆలయమో లయమో అవుతుంది. స్కూలు ఫైనలుదాకా ఉండే టెక్స్టుబుక్కులూ,— మళ్లా ఆపయినికావు—నోట్సులూ, జిల్లా గెజెట్లూ, కేటలాగులూ, అరెథ్మెటిక్కులూ, స్త్రీలనోములూ, హిస్టరీలూ, వోటర్ల లిస్టులూ, వగైరాలతో నిండిన గ్రంథాలయాలే మనకు కనిపించేవన్నీ. తప్పితే రంగు రంగుల నవలా సామ్రాజ్యం! పిదప నాటకసరకు. అమృతాంజనానికి అమృతాంజనేయం, అమరాంజనం, అమృతకంజనం అమృతరామాంజనం, దిల్ రంజనంలాటి అంజనాలు బయలుదేరినటులు, ఒకేనాటకానికి ప్రతిబింబనాటకాలు పుట్టకొక్కులు. గ్రంథాలు వ్యాపార సరళిలోకి దిగాయి. సరస్వతీదేవిని బేరసారాలతో లక్ష్మీదేవిలోకి మారుస్తున్నారు. ఇక్కడ ఈమధ్య జరిగిన ఒక ప్రసంగం చెపితే అప్రస్తుతం కాదు. ఒక గ్రంథాలయమువారు వావిళ్ల వారికి అప్పనాతనామనా అచ్చీపాటకమున్నా నల్

మోహనరంగా అనేపాటకున్నూ ఆర్దరిచ్చారు. వావిళ్లకూ వేలూరికీ 'వాపీవీవో వృషభం' అన్నట్లు ప కా ర సంబంధముతోటి ఆవుత్తరం దారితప్పి నావద్దకు వచ్చింది. ఇట్టి వుత్తరం మళ్లోటి వస్తే వావిళ్ల వారికి తిరగగొట్టించాను. ఇట్టి అపనాతనాలు కావలసిన గ్రంథాలయాలను వెంటనే ఎత్తేస్తే సరస్వతి కన్నీరు తుడుచుకుంటుంది. గ్రంథాలయము గ్రంథాలయ సభ్యుల చిత్తవృత్తికి అద్దమూ. తూకముగా అన్ని శాఖలలోను తగిన గ్రంథాలనుచేర్చి చదివించడం మహాపుణ్యం చేసుకుంటే నే గాని సమకూరదు.

## మంచి గ్రంథములు

మన హృదయములలో దాగిఉన్న రసాన్ని ఆకాంక్షనూ పయికి లేవనెత్తుకొని వచ్చేవే మంచి గ్రంథాలు. అవే మహాకావ్యాలూ, ఉపనిషత్తులున్నూ. కడమవి చాలాభాగం చాకిమూటలు. గ్రంథం మనస్సుకు భారం కాకూడదు. నిత్యమూ నిలవవుండే పరిమళం కావాలి. ఇట్టి గ్రంథాలే చదువదగినవి, వినిపింపదగినవి. ఇవే మన పూర్వు లందఱున్నూ మనకు సమానంగా పంచిపెట్టి పోయిన సార్వజనిక ధనం

## లైబ్రేరియన్

మంచి లైబ్రేరియన్ లేకపోతే గ్రంథాలయానికి తాళము పెట్టచ్చు. విపినచంద్రపాలుగారు గ్రంథాలయంలో ఓరంతప్రొద్దూ కూర్చుండి చదివి ప్రపంచకములో మహావ్యక్తిగా పేరుపొందాడు. ఆయనకు పెద్దడిగ్రీ లేదు కాళిదాసుకు మహామహోపాధ్యాయ డిగ్రీఇస్తేనూ షేక్స్పియరుకి డాక్టర్ డిగ్రీ ఇస్తేనూ ఏమయినా క్రొత్త గౌరవం వస్తే వీరికికూడా ఒక డిగ్రీ కట్టిపెట్టచ్చు. పాలుగారికి లైబ్రేరియన్ అనేదే మహాబిరుదు.

గ్రంథాలు చదివి ప్రతిగ్రంథముమీదా తన తన ఉద్దేశాలు వ్రాసి మిగతావాళ్లందరకూ దాన్ని ఉపయోగపఱచాలి. లైబ్రేరియన్ గ్రంథాలయానికి పురోహితుడు. పురోహితుడు లేకుండా ఏకార్యమూ తలపెట్టము కాబట్టి, ముందర అటువంటి పురోహితుణ్ణి తయారుచేయాలి.

సామాన్యంగా మంచి తెలుగు గ్రంథాలు వందలకున్నూ, సంస్కృత గ్రంథాలు వేలకున్నూ, ఇంగ్లీషు గ్రంథాలు లక్షలకున్నూ సమకూరుతవి గాని లైబ్రేరియన్?

## తె లు గు

దేశకాలపాత్రముల ననుసరించి జనసామాన్యానికి ఇంగ్లీషు బళ్లు తప్పవు. తెలుగుకుసంస్కరణం కావాలని వుంటే ముఖ్యంగా ఆంధ్ర-విశ్వవిద్యాలయముద్వారా రావాలిసిందే. విశ్వప్రయత్నాలు చేస్తే—సంస్కరణం సిద్ధించేమాట ఏళ్లమీద పని.

గ్రంథాలయాలకు సంబంధించిన ఏ కొలదిమందైనా తెలుగును బాగా అభ్యసించి స్పెషలైజ్ చేస్తే దానిద్వారా తెలుగు సంప్రదాయం నిలుస్తుంది. అది మనపైతృకధనం. ఇదివఱకే చాలా భాగం నశించింది. హతశేషాన్ని కాపాడుకొనే శక్తికూడా మనకు లేనట్లుంది. జనాభాలో హిందీవారితరువాత బంగాళీ వారు. వారితరువాత తెలుగువారు. వీరు రెండుమూడుకోట్ల మధ్య ఉంటారు. ఇందులో నూటికి పదుగురో పనముగ్గురో అక్షరాస్యులు. ఈ అక్షరాస్యులలో దస్కతుమాత్రం ఎఱిగినవాళ్లు చాలామంది ఉంటారు. ఇక భాష బాగావచ్చినవాళ్లు వేయికి ఒకడుంటే ఎక్కువ. సారస్వత వ్యాప్తి బంగాళీలలో ఎక్కువ. పిదప అరవముట! పిదప తెలుగుట. తెలుగువారికంటె అరవవారు జీవికకు పాటు పడవలసినవారు కాబట్టి అన్ని ఉపకరణాలతోపాటు భాషనుకూడా ఒక ఉపకరణం చేసుకొని దానిద్వారా జీవికను నెట్టుతున్నా రని నేనొకరివల్ల విన్నాను. తెలుగువారు సోమరు లట! కావున అరవప్రచారానికి తెలుగుప్రచారం తీసికట్టని అనుకోవలసి వస్తూంది.

తెలుగుకు కూడా వంగభాషవలె మహాభాష కాదగిన అనుకూల్యం ఉంది. కొలదిరోజులలో కాదగిన సూచనలు ఉన్నవి. తెలుగుభాష ఇప్పుడు కటాహంలో కాగుతూంది. కొంత అవిరిఅయిఉంది. ఈ అవ్యక్తస్థితిలోంచి ఇహవచ్చేది శుభ్రమయిన సృష్టి. ఆసృష్టి కోసం అందరూ ఎదురు చూస్తున్నారు.

రాగములు, సుప్రసిద్ధనటులు, పాత్రములు, విఖ్యాతిజెందిన కవుల కావ్యములు విమర్శింపబడియున్నవి.

ఇక గ్రంథరచనయందు వీరాదరించిన భాష: మొదటిభాగమున గ్రాంథికమును, ద్వితీయభాగమున వ్యావహారికమును. గ్రాంథికభాషయందును వీరి రచన అచుంబితమై పాఠకులను తబ్బిబ్బు చేయ గలుగునని తోచుచున్నది. ఎట్లున్నను గ్రంథప్రతిపాద్యమగు విషయము మాత్రము అందరును తెలుసుకొనదగినది.

ఇది సామాన్యవిమర్శము. విశేషవిమర్శము అవకాశముబడి మరొకసంచికయందు. గ్రంథము విశేషవిమర్శకు తావిచ్చియుండుటయు ప్రకృత మందులకు అవకాశము లేకుండుటయు కారణము.

'ఆచార్య'

---

## ఆత్మవిజయము

గ్రంథకర్త:—బౌద్ధవాఙ్మయబ్రహ్మ, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు, మానవాదర్శగ్రంథమండలి యొక్క ద్వితీయకుసుమం. ౨౮౫ పేజీలు, మెరుగు కాగితాలు, కాగితపు బైండు, క్రౌను సైజు, సం ౧౯౩౩ వెల రు. ౧-౦-౦.

ఇది జేమ్సు ఎలెన్ అను మహాకవి రాసిన Byways of the blessed అను మహాగ్రంథానికి 'స్వతంత్రానువాదం'. స్వతంత్రానువాదమంటే అనువాదకుడు మూలగ్రంథంలోని కొన్ని విషయాలను తీసివేసి, కొన్నిటిని పెంచి, స్వయంగా కొన్నిటిని చేర్చి రాసేదన్నమాట. మూలగ్రంథ మిది, మార్పులివి, చేర్పులివి (చేర్చినవివి) అనే విభజన గ్రంథంలో లేదు. ఎంతవఱకు ఏలను గారిదో, ఎంతవఱకు అనువాదకునిదో మనకు తెలియడం లేదు. ఈరకమైన గ్రంథాల్లో మంచిఘట్టాలను చదివేటప్పుడు మూలగ్రంథకర్తను మెచ్చుకోడమా, అనువాదకుణ్ణి మెచ్చుకోడమా అని సందేహం కలిగి రసాస్వాదన చెడుతుంది. అనువాదకుడు తాను కొన్ని మార్పులు, చేర్పులు చెయ్యదల్చుకొన్నప్పుడు అవి ప్రత్యేకంగా అనుబంధంలో గాని, లేక పుటయొక్క దిగువభాగంలో గాని ప్రకటిస్తే మంచిది. అలాగుగాక మూలగ్రంథంతో మిశ్రం చేస్తే పాఠకుణ్ణి తృప్తిపరచడ ముండదు.

ఈగ్రంథవిషయం ఆధ్యాత్మికం. ప్రతిమనుష్యుడు ఈదేహాన్నిగాక తానైనటువంటి ఆత్మను—పరమాత్మను తెలుసుకోడానికి అవలంబించవలసిన సుగుణాలను గురించి యీగ్రంథంలో వ్రాయబడింది. ఈసుగుణాలు లెక్కకు పదునాలుగున్నాయి. వీటిలో కొన్ని: ఉత్తమోద్యోగం, సహానుభూతి, సహనము, సుస్థిరానందము, ఏకాంతవాసము, స్వాలంబనము, సౌఖ్యమయపర్యవసానము, "ఈగ్రంథమునందు వచింపబడిన సత్పథముల దీర్ఘాలోచనచే బరిగ్రహించి, యనుసరించి, ఆత్మవిజయమును సంపాదించిన ప్రతివ్యక్తియు నమందానందకందము నందగలడు. వాని జీవితము సౌఖ్యమయి, పర్యవసానములచే బరిపూర్ణము కాగలడు."(౨౮౨ పేజీ) ప్రతిమనుష్యుడు తనజీవితంలో ఇలాంటి పరివర్తన యెంత త్వరలో కలుగజేసుకుంటే అంతమంచిది. అలాగు కాకుంటే తత్త్వజ్ఞులకు కంఠశోష కాకపోయినా మానవులకు మాత్రం ఈశ్వరానుగ్రహ విలంబ మవుతుంది.

"ఇందలి ప్రతివాక్యము మానవజీవితసామాన్యములగు దోషముల విమర్శింపుచు సంస్కరణకు దారితీయుచున్నది. ఈగ్రంథరాజము యొక్క నీతి మన ఋష్యాదుల నైతిక జ్ఞానముతో నేకీభవించియుండుట సంతోషదాయకము." (విన్నపము ౫వ పుట)

అనువాదకుని ప్రతిభను గూర్చి ప్రత్యేకంగా చెప్ప నవసరంలేదు. ఋషి అంటిని కదా. ఈదేశం యొక్క ఆధ్యాత్మికపతనాన్ని గురించి రచయితకుగల హృదయాందోళన గ్రంథంలో ప్రతివాక్యంలోను విస్పష్ట మవుతూంది.

శైలి:—గ్రాంథికం. సంస్కృతపదాలు హెచ్చు. సామాన్యజనులకు భాష అర్థంకాదు. విద్యార్థులకు మాత్రమే వుపయోగం, శైలి అతిధారాళం.

వలయువారు: టి. లక్ష్మీనారాయణ, మానవాదర్శగ్రంథమండలి కార్యస్థానము. అంగలూరు, కృష్ణాజిల్లా అని రాయాలి.

జే. కా.

---

## పానము

గ్రంథకర్త: వేది శ్రీరాములుగారు. రాయదుర్గము (బళ్లారి).

మద్యపానము, చౌర్యము, వేశ్యాలోలుపత, మాంసభక్షణము, జూదము మొదలగు దుర్వ్యసనము లందలి చెడుగులను వివరింపదలపెట్టి గ్రంథకర్తగారీ 'కల్పితసంభాషణ'రూపమైన చిన్నిపొత్తమును రచించిరని తెలియుచున్నది. సాధ్యమైనంతవరకు ఈ పుస్తకమునపై పేర్కొన్న దుర్వ్యసనముల గలుగు చెట్టలు సంగ్రహముగ వివరింపబడియున్నవి. తక్కిన దురాచారములన్నిటికి పానమే మూలకారణమగుటచే నీపుస్తకమునకీ పేరిడిరి. పుస్తకము వెల రు ౦-౧-౦. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాయవలెను.

## హరశతకము

క్రౌనుసైజున ౩౩ పుటలు, వెల తెలియదు.

గ్రంథకర్త: పెండ్యాల నారాయణశర్మగారు, బోర్డుబాలికాపాఠశాల ప్రధానోపాధ్యాయుడు, గవర్నమెంటు మేడపాడు.

'హరా' అను మకుటముగల యీశతకము సరళములగు కందపద్యముల రచింపబడినది. భక్తి, నీతి, తత్త్వబోధకములగునటుల రచియింపబడినదని గ్రంథకర్తగారే ముఖపత్రమున వ్రాసికొనియున్నారు. భగవద్భక్తులందరు చదువదగిన పుస్తకము.

## కృష్ణార్జునసంవాదము-(ద్విపద)

గ్రంథకర్త: నాదెండ్ల గోపామాత్యుడు. ప్రకాశకులు: సురవరము ప్రతాపరెడ్డి, గోలకొండ బుక్కుడిపో, త్రూపుబజారు, హైదరాబాదు (దక్కను), క్రౌను; పు. ౮౦.

గయోపాఖ్యానమను నామాంతరముగల ఈద్విపదకావ్యము శ్రీకృష్ణదేవరాయసార్వభౌముని ముఖ్యమంత్రి తిమ్మరుసునకు మేనల్లుడగు నాదెండ్ల గోపామాత్యుచే రచింపబడినది. అట్టి యీ 'యుత్తమకావ్య' వ్రాతప్రతిని ఎచ్చటనో సంపాదించి శ్రీ రెడ్డిగారాంధ్రలోకమున కర్పించిరి. దీనికి శతావధానులు శేషాద్రిరమణకవుల విపులమగు పీఠిక కలదు. అందు గోపామాత్యుని జీవితచారిత్రము సప్రమాణముగ నిరూపింపబడినది. ఇందలి కవిత ప్రౌఢమేయైనను ఎల్లరకును సుబోధమేయని చెప్పవచ్చును. గయుని విషయమై కృష్ణునకును, అర్జునునకును నడుమ జరిగిన సందేశము లిందు కలవు. అందరును చదువదగిన పుస్తకము. వెల ౦-౬-౦ మాత్రము. వలయువారు ప్రకాశకులకు వ్రాయదగును.

## శ్రీ స్తవరత్నముక్తావళి:

గ్రంథకర్త: తిరుమల గుదిమెళ్ల రంగాచార్యులు, వైయాకరణశిరోమణి, పండితుడు, బోర్డుహైస్కూలు, బాపట్ల.

ఇందు నాలుగు స్తోత్రములు కలవు: శ్రీ స్తవరత్నముక్తావళి యను పేర లక్ష్మీస్తోత్రము, వేంకటేశస్తోత్రము, శ్రీ రంగనాథస్తోత్రము, శ్రీ హయగ్రీవాష్టకమనునవి. అన్నియు గీర్వాణభాషయందు మత్తేభవృత్తములనున్నవి. గీర్వాణభాషయందున్నను తద్భాషానభిజ్ఞులకు గూడ తెలియుటకుగా ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యములు కూడ గ్రంథకర్తగారివే ఇందు పొందుపరుపబడియున్నవి. అందరును ప్రతిదినమును పఠింపదగిన స్తోత్రములు. వెల. ౦-౪-౦ మాత్రము.

## మానసోల్లాసినీ కథలు

(1 వ భాగము)

క్రౌనుసైజు, పుటలు. 33, వెల రు. ౦-౩-౦.

గ్రంథకర్త: శిష్ట్లా రాధాకృష్ణయ్య, టీచరు, గురజాల (గుంటూరు)

చిన్నకథల సంపుటము. నీతిబోధకము లగు నిరువదినాలుగు కథ లిందు గలవు. ఎలిమెంటరీస్కూళ్లయందలి బాలురు చదువదగిన పుస్తకము.

## నయప్రదీపము-విగ్రహము

(భా. ౧.)

ఇది గద్యగ్రంథము, దీనిని రచియించినవారు పందొమ్మిదవ శతాబ్ది నుండిన శ్రీ కోరాడ రామచంద్ర కవిగారు ఇందు 'విష్ణుశర్మవిరచితమగు విగ్రహకథ విశేషముగా పెంచి వ్రాయబడినది. నూతనముగా రాజ్యమునకు వచ్చిన రాజహంసునకు మంత్రి రాజనీతి నుపదేశించె ననునిషచే ననేక గాథలతో గూడిన......... స్వకల్పిత గ్రంథము'.........జేర్పబడినది.

గ్రంథము శైలికిమచ్చు: "కాన నీవిపుడు తల్లడంపుపాటు వీడి, యేమరిపాటు నొందక, మెచ్చగు నెచ్చరికఁ జూచుచుండు మని నాతనికిం దిట్టతనంబు గట్టి, యద్దిట్టకట్టాయితంబుగ నున్న నక్కొండలతిండిపోతు దండెత్తి తీండ్రం బగు వేండ్రంబునఁ గోండ్రింపుమఁ గడు బైడాలంబున మండిపడుచుఁ గడు నిడుదవెడదల మెండగు తన రొమ్ములియుబ్బున నల కత్తిగుబ్బలిగబ్బితనంబుల మబ్బులఁ బోలె గొబ్బునఁ దెగద్రొబ్బఁజాలి కక్కసంబు లగు డెక్కలఁ ద్రొక్కుటవలన నక్కడలివలుపఁ గొండలం బోలి బిండిసేయఁ గండుమీఱుచుఁ బరగోత్రమ్ములు వ్రక్కలింపఁదగు తెగువుబిగువున నూఱించులమించునడిదంబు బెడిదంపుపాటుకుఁ గంటగింపఁజాలు దంటతనంబు నంటి, గొంటువడక నొమ్ములగు కొమ్ములచేతఁ గణకణ లాడుచు, దట్టంబు లగు మిణుగురులతిట్టల దిట్టంబుగఁ బుట్టించుచు నల పిడుగల గుండ్ల గండ్రతనంబుఁ దమువేండ్రంబునఁ బెగడొందింపఁజాలి మండిపడిన చంద్రనిప్పులయొప్పులకు ముప్పు లుప్పతిల్లఁ జేయంజాలు కనుగ్రుడ్డుల జెట్టిదంబు లగు గంటుచూపులన రూపుమాపంజాలి, దండధరదండ సముద్దండ వేదండశుండాకాండ ప్రహతకుండలీంద్ర ప్రచండి మాడంబరకఠోరతాకుంఠీకరణాకుంఠపసముత్కంఠ జరఠకమఠ ఖర్పగ కఠోర పటుతరనిజాగ్రఘటీ ఘూషణభీషణం బగు నిజ..లధిదంభోళిచేత నతి నిష్ఠురగరిష్ఠ కృష్ణగ్రావతటి నిష్పేషణ దక్షరూక్షతర విశాల మస్తక ఫాలమ్ముచేతఁ గల్పక్షయసమయ సమాక్షిప్తరితిక్షాపక్షరూక్ష క్రమదక్షిణ దిక్క్షోణీశరక్తాక్షాన్యక్ష హర్యక్షుంబు నధిక్షేపించుచు నసురులబలిమికలిమిఁ గసి వేసరక, యంతయు నొక్కపెట్టునఁ గసిమసంగఁజేయసమకట్టి గోరగింత నెంతయుంబూనిన యొడల గండుమీఱి దండెత్తిన యాశాత్రవరసంబో యని యెన్నంజాలి, యవ్వాలిఁజూచిఁ నీవు బెట్టిదంపుపాటుబరివేసిఁ బోటాడ్గకొను మని దిగ్గునఁ గదిసిఁ వెగ్గలంబుగఁ దన్నెన్నుదుటఁ దాటింప నేతెంచె." పు. 45.

ఈ పేరాఅంతయు నొక్కటేవాక్యము. గ్రంథమంతయు నిట్టే యొక నిఘంటువువలె నుండును. ప్రకృతమిది ఇంటరుమీడియటు పరీక్షకు పాఠ్యగ్రంథము. పాఠ్యగ్రంథ నిర్ణయసంఘమువారు స్కూలుఫైనలులో కృతార్థులైన విద్యార్థులు తెలుగుపాండిత్యసౌధమున నెక్కిన మెట్టులను లెక్కపెట్టి గుర్తించి దానిపై మెట్టున కెక్కుటకు మాత్రమే చాలిన పుస్తకములను నిర్ణయించుట శ్రేయము కాని తత్సౌధోపరిభాగమున కొక్క యెగురున నిట్లు నెగిరింపబూనుట సాహసము.

---

## ఆంధ్రపదనిధానము

గ్రంథకర్త: తూము రామదాసకవి

క్రౌను; పు. ౫౧౧. వెల రు ౧-౮-౧.

వరంగల్లు నందలి కాకతీయ గ్రంథమాలయందు మొదటి అనుబంధ గ్రంథముగా నిది ప్రకటితమయినది. దీనికి పరిష్కర్తలయిన శ్రీ శేషాద్రిరమణకవులు వ్రాసిన 'తొలిపలుకు'లోని యీక్రింద భాగములను పరికించిన నీ గ్రంథకర్త చరిత్రాదికములు, గ్రంథస్వరూపస్వభావాదులు పాఠకులకు తెలియగలవు.

"తూము రామదాసకవి కాపుకులజుఁడు. పూర్వమునుండియు నివాసము ఒరంగల్లు. ప్రకృతము ఒరంగల్లులోని యొక భాగమగు బాలనగరమున వీరిగృహముకలదు. పసుపునూళ్లగోత్రము. ఈయన జననకాలము గడచిన నలసంవత్సర శ్రావణ బహుళ ద్వితీయ సోమవారము (క్రీ. శ. 18-8-1856) మరణకాలము క్రోధి సం. కార్తిక బహుళ సప్తమి (క్రీ. శ. 29-11-1904) జీవితకాలము

దాదాపు 49 సంవత్సరములు. ఇరువదియొకటవయేటఁ గవితారచనమున కారంభించినాడు. కవితారంభకాలము ధాతసంవత్సరము కానోపు. కవిపంచ సంస్కారములఁ బడసిన వైష్ణవమతస్థుఁడు."

"ఈ రామదాసకవి ఒరంగల్లు నివాసియు సరస కవితావిశారదుఁడు వైదుష్యభూషణుఁడునగు ప్రతాప పురము రంగాచార్యులగారివద్ద సంస్కృతాంధ్రముల నభ్యసించి ఈక్రింది గ్రంథరాజములను రచించెను.

1. రుక్మిణీకల్యాణము (గేయగ్రంథము), 2. గోపికావిలాసము (ప్రబంధము), 3. మిత్రవిందోద్వాహము (ప్రబంధము), 4. కాళిదాసునాటకము, 5. ఆంధ్రపదనిధానము (ప్రబంధము)" (వీనిలో కాళిదాసునాటకమును, మిత్రవిందోద్వాహమును ముద్రితములయ్యును నిపుడు లభింపవటు.)

"ఈగ్రంథమును కవి నలువదవయేట వ్రాయనారంభించి మరణకాలమునకుఁ గొంచె మించుమించుగఁ బూర్తి కావించెను. నిఘంటువునకు వలయు పదసముదాయమును శబ్దరత్నాకరమను అకారాది నిఘంటువు గైకొని వర్గీకరణమొనరించి పద్యములు గావించెను." "కవి శుద్ధప్రతి మరలఁ బరిశోధింపమిచేఁ బలుతావుల దోషములు గలవు. మూడవకాండమునందు దాదాపుగ మూడుభాగముల కర్థము వ్రాయలేదు. మాకులభించిన మాతృకలోఁ జివరభాగము చెదపుర్వులు దినివేసెను. అందుచే గొన్నిపద్యములకు మొదలు, కొన్నిపద్యముల కర్థము మేము సమకూర్చితిమి." (వీరు కావించిన సంస్కారణములేవో తెలియునట్లు ముద్రించియుండవలసినది) "ఇందు నామలింగానుశాసనమునలెఁ గాండములు, వర్గములు విభజింపఁబడినవి. లింగాది సంగ్రహవర్గము మాత్రము తెనుఁగున విడువఁబడినది..........వర్గము లన్నియు నామలింగానుసారముగా నున్నవి."

"ఆంధ్రపదనిధానము ౧౫౬౫ పద్యములు గల యుద్గ్రంథము. ..........నిజామురాష్ట్రమున వ్యవహరింపబడు దేశ్యపదములు సైత మిందు జేర్పబడినది." "అమరమునందులేని పనిముట్టుల పేరులు, జాతీయవాచకములు, వస్తునామములు, నీకవి స్వయముగఁబరిశోధించి సమకూర్చియుఁ గొన్ని తావుల సంస్కృతపదముల వ్యుత్పత్తిభావాదుల గమనించి యాంధ్రపదములను గల్పించియు, గ్రంథాంతరముల నున్న దేశ్యపదముల గూర్చియు నీ గ్రంథమున బదసముదాయమును బెంపొందించియున్నాడు. అందుచే నీ నిఘంటువు ఆంధ్రలోకమునకు బహూపకార మనియు, నాంధ్రవాఙ్మయ ప్రత్యేకస్వత్వమున కాదర్శప్రాయమనియు, విద్యార్థుల కవశ్య పఠనీయమనియు మాతలంపు."

ఇట్లీ గ్రంథ గుణములు పెక్కు తెఱఁగుల వర్ణితము లయినవి.

గ్రంథప్రామాణ్యమును గుర్తించుటకయి గ్రంథస్థభాగము లీక్రింద నొండురెం డుద్ధృతములు:.

"గీ. ఆవలావాలు సానువు లనఁగ సర్ష
కంబులగు; సెనగలు చణకంబు లగును
నూలు నువులన తిలలగును; వెలిగార
మనఁగ గవ్వచౌకమన టంకణంబు పేళ్లు.(?)"
(—పు. ౨౮౩. ప. ౭౨౨.

ఆవలు, ఆవాలు, సానువులు—అనఁగా సర్షకముల పేళ్లు. ఇత్యాదిగా నున్నది.

శబ్దరత్నాకరము ననుసరించి వ్రాసినదన్నారీ గ్రంథమును. శ. ర. లోని సర్షపములు, సాసువులు ఇందు 'సర్షకములు, సానువులు' అయినవి. శ. ర. లో నువులకు, 'నూవు, నువ్వు,' అను రూపములు గలవు.

అవి ఇందు అంతరించినవి. గ్రంథకర్తవలెనే పరిష్కర్తలును ఇట్లు ప్రమాదమునకు లోనయిరి.

"గీ.కందు బాణలి, బంగల కంచుకట్టు
మంగలంబన భాష్ట్రము;.........
కందు, బాణలి, బంగల, కంచుకట్టు, మంగలము, ఆనభాష్ట్రము పేళ్లు..."

ప. 427 పు. 246.

దీనికి మూలగ్రంథమగు శ.ర.లోని కందువు సం.ఈ.పుం. స్త్రీ. పెనము. అని ఉన్నది. ఇందది 'బాణలిపర్యాయ

పదాలలో చేరినది. 'పెనము'నకు 'బాణలి'కి గలభేదము 'దోసెలు, గారెలు' తిన నలవాటుకల ఆంధ్రలోకమునకు తెలియనిదికాదు. 'ఖాష్ట్రిము' అనుటతప్పు. 'భ్రాష్ట్రిము' అని ఉండవలెను. 'బంగళి=కుంపటి, అంగారధానిక' అని శ. ర. ఇక్కడ 'కుంపటి' 'బాణలి' అయింది. ఇది యొక విపరీతపరిణామము.

"క. పొట్టిరింగణా బుడుతయును
గిటక పొదరు పొట్టి గుజ్జు గిడ్డ బుడుగనన్
వటునకు నభిఖ్య; లవిటు కొ
నటి నా హరియు నంగహీనునకు నామంబుల్.
—ప. 202. పు. 173.

"పొట్టి, రింగణా, బుడుత, గిటక, పొదరు, పొట్టి, గుజ్జు, గిడ్డు, బుడుగు అనగా వటువునకు పేళ్లు. అవిటు కొనటి అన అంగహీనుని పేళ్లు."

"వటువు=బ్రహ్మచారి, బాలకుడు" అని శ. ర. ఇక్కడ పొట్టివాడు అను నర్థమున నున్నది. ఇది తప్పు.

"పొదరు=దే.వి. పొద...ఉదా. బెబ్బులియున్న పొదరు, చొచ్చులేడిచందంబున జొచ్చుటయును భార. విరా. ౩ ఆ" అని. శ. ర. ఈగ్రంథమున దానికి 'పొట్టి' అని అర్థము. 'అవిటి' అని శ. ర. 'అవిటు' అని ఈగ్రంథము. ఇట్టివి చాలగలవు. కావున నీగ్రంథమునకు సంపూర్ణ సంస్కరణ మావశ్యకము.

---

## మానవ జీవితము

గ్రంథకర్త: బౌద్ధవాఙ్మయబ్రహ్మ, దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారు. మానవాదర్శగ్రంథమండలియొక్క చతుర్థకుసుమము. ౨౧౪౧ పుటలు. సాదా కాగితాలు, క్రౌన్ సైజు, అట్టబైండు, మూడుసంపుటాలు. సంపుటం ఒక్కింటికి రు. ౩-౮-౦ వెల. సం. ౧౯౩౦.

ఇదొక స్థూలనీతిగ్రంథం. "ఇందు ప్రతిమనుష్యుడును అన్ని దశలయందును, అన్ని యవస్థలయందును, అన్ని పరిస్థితులయందును, ఎట్టి నడవడి నాశ్రయింపవలయునో యా ధర్మసూత్రము లన్నియూ నిదర్శనపూర్వకముగ నివేదింపబడియున్నవి...ఇది నిజముగా విశ్వనీతి. నీతిసర్వస్వము." (తొలిపలుకు).

గ్రంథకర్త ఆంధ్రాంగ్లసంస్కృతభాషల్లో పాండిత్యం గలవారు. అన్ని కళల్లోను శాస్త్రాల్లోను జ్ఞానం సంపాదించేరు. వీని అన్నిటికంటె హెచ్చయిన విషయం! వీరు ఆత్మజ్ఞానసంపన్నులు, ఋషివంటివారు.

కొంచెం ఆధ్యాత్మికజ్ఞానం కల యెవరైనా ఈ దేశంయొక్క ప్రస్తుతస్థితిని, ప్రాచీనస్థితిని గురించి యోచనచేస్తే, ఇప్పటి మనుష్యుడు తానైనటువంటి ఆత్మను మరచినాడనీ, దైవభక్తిశూన్యుడైనాడనీ, యింతేగాక తానుకానటువంటి శరీరాన్ని, ప్రాపంచిక విషయాలను అభివృద్ధిచేస్తున్నాడని, నైతికజ్ఞానరహితుడై వున్నాడని తెలియకపోదు. అప్పటికీ యెక్కడ చూచినా కొంచె మాలస్యమైతే యేమి ధర్మానికే జయం, అధర్మానికే అపజయం కలుగుతూంది. ఈలాగు జరుగుతూన్నా ప్రజలు దుర్మార్గాలచే నాకర్షింపబడి సన్మార్గాని విడిచివేస్తున్నారు. ఇట్టిస్థితిలో సంస్కరణ అవసరంకదా. గ్రంథకర్త తలపెట్టిన దిదే.

ఈగ్రంథోద్దేశాన్ని గ్రంథకర్త యీమోస్తరుగా వెల్లడిచేసేరు. "సృష్టికలంకారప్రాయుడగునట్టి మనుష్యుడేయేధర్మముల నాశ్రయించుటవలనను, ఏయేభావములను కలిగియుంటచేతను, సౌఖ్యానందమయుడయి, భగవత్ప్రీతి పాత్రుడయి దుఃఖభయతాపాదకములనుండి విచారించుటయే ప్రస్తుత కర్తవ్యము. (౮వ పుట) ఇంకా యేమిటంటే దైవసృష్టి యేర్పడినపిదప గతించియుండిన యుగములలోనికల్ల కలియుగమే విశేషముగ నాత్మబలము నపేక్షించుచున్నయది. కలియుగమునం దాత్మబలసంపాదనమే సర్వోత్తమంబగు ధర్మమని యువకులకు నేను ముఖ్యముగా నుద్బోధింపదలంచితిని" (౧౮౩వ పుట) మరిన్ని "ఈగ్రంథమున వ్రాయబడిన ప్రతివాక్యము విద్యార్థియొక్క నైతికజీవిత పురోభివృద్ధినే ధ్యానమునందిడికొనియున్నది. మానవజీవితోత్థానమున కావశ్యకమగు సామగ్రియంతయూ నీగ్రంథమున జేర్పబడియున్నది. ఇందలి ప్రతివాక్యము జీవితాభ్యుదయమునకు దారకమం

త్రిమయి రాణింపగలదని భావించుచున్నాడను" (౨౧౩౭ వ పుట) మన దేశస్థితి యేలాగవుందంటే "నేడు బుద్ధిజాడ్యముచే దేవునియొక్క ప్రతిశాసనము దూషిత మొనరించి వేయుపట్టి సత్యవిరుద్ధములగు దురాచార దుర్నీతు లన్నియు మానవసంఘముచే గడుప్రీతితో ననుష్ఠింపబడుచున్నవి. నేటి మన సమాజముయొక్క యాచారమందున్న ధర్మములకును, భగవన్నిర్ణీతములగు ధర్మములకును హస్తిమశకాంతరముకలదు. నేటి మానవజీవితమునకును సత్యమునకును బూర్ణ విరోధభావ ముండుటనుబట్టి మనుష్యజాతి తన విశాలమగు పరిష్కృత ధీశక్తిని చాలవఱకు గోల్పోయినదనియే నుడువవలసివచ్చుచున్నది." (౨౦౫౦ వ పుట) ఇప్పటికీ యువకులస్థితి "బాల్యమునుండియు మన యువకులు చరిత్రహీనులు, సద్విద్యాశూన్యులును అని నొక్కి వక్కాణించుట కెట్టి అభ్యంతరము లేదు" (౭౫వ పుట) ఈ యువకుల చదువుసంధ్యలు "నేటి యువకుల పూర్ణములును, నిరర్థకములును నగు ననేక శాస్త్రవిషయములజనువుట, హేయమగు శృంగారమున కధికనివాసము లగు భక్తి జ్ఞాన నీతి ధర్మశూన్యములును నగు నవలలు నాటకములును పఠించుచు నైతిక జీవితమందు పతితు లగుచున్నారు" (౧౭౫-వ పుట). "అధునాతనభారతీయవిద్యార్థి సంఘముయొక్క దుస్థితికి ముఖ్యహేతువు లనేకములు కలవు" (౫౫౦ వ పుట). అవేవంటే "రమారమి పదిశతాబ్దముల నుండియు మనజాతీయతను, వేదవిద్యలు, సంస్కృతవాఙ్మయమును, మన యాచారవ్యవహారమతసంఘవిద్యావిధానాదికములను లేశమును ప్రేమింపజాలనట్టియు, మిక్కిలి విద్వేషించునట్టియు, విదేశప్రభుత్వములకు భరతఖండము స్వాధీనమయిపోవుట మన దుస్థితికి ప్రథమ కారణము." (౫౫౧వ పుట). ...పరస్పరము కలహించుచు, విజాతీయప్రభువులచే బాధింపబడుచు, ఆత్మశక్తిభంజక మగు నవీననాగరికతను నేర్చి... వేదముల యందలి గౌరవము విడనాడి దాస్యజీవితమును హృదయపూర్వకముగ ప్రేమించుట ... ద్వితీయకారణము" (౫౫౧వ పుట). గ్రంథకర్త తనగ్రంథంలో "జ్ఞానవృద్ధ శోభానురము లగు సత్పండితులయొక్కయు, మహాత్ములయొక్కయు వాక్యరత్నములు మానవజాతి కాదర్శప్రాయములయి, అక్షయ దృష్టాంతస్వరూపములయి అనశ్వరగంభీరప్రభతో నాచంద్రార్కస్థాయిగ ప్రకాశించుచుండగలవు." (౭౫౭ వ పుట) కనుక చేర్చివున్నాడు. రచయిత దైవప్రార్థన వినిండి "జగదీశ్వరా! తిరిగి నీవు మా భారతవిద్యార్థి లోకమునకు బ్రహ్మచర్య వ్రతపాలనమున కావశ్యకములగు సౌమ్యభావములను, సౌజన్యమును, సాధువర్తనమును, శిష్టచారిత్రమును, ఉన్నతాశయములను, ఉత్తమ వివేకమును, సంయమశక్తిని, నిస్సంగత్వము ప్రసాదింపుము" (౧౫౧౬ వ పుట) పాఠకులకు చెప్పేన దేమనగా "కేవల మిందలి భావములను బారాయణ మొనరించి యాచరింపనిచో ఈ గ్రంథముచే నెట్టి ప్రయోజనమును కలుగనేరదు" (2137).

కనుక ఈగ్రంథం కేవలం చెదరివున్న నీతులను ధర్మాలను సంచయించుటకు వ్రాయబడలేదు. ఈనాటి మందలి యువకుల ప్రవర్తనను సంస్కరించడానికే వ్రాయబడింది. వయసుచెల్లినవారుకూడ ఈగ్రంథాన్ని చదివితే ఆత్మజ్ఞానవంతు లవుతారు.

గ్రంథకర్త సనాతనహిందూమతమం దెంతో ప్రేమకలవాడు. సనాతనవిద్య, ఆత్మవిద్య బ్రహ్మవిద్య రచయిత హిందూమతంయొక్క ఔన్నత్యాన్ని వ్యక్తపరచి నేటిసంఘంలోని దురాచారాలను ఖండించివేసేడు. నీతిరహితమైన నేటి ప్రపంచకాని కిలాంటి గ్రంథముంతో అవసరం. ఇందులో యెన్నో వున్న తాదర్శాలు ఎలుగెత్తి వక్కాణింపబడి వున్నాయి. గ్రంథకర్త వీటిని చెప్పడం మట్టుకేగాక తాను ఆచరిస్తూ వున్నాడు. కనుకే ఈయన్ని ఋషివంటివా రన్నాను. ఋషిఅనే అనవచ్చుకూడా. ఇప్పటి నైతికనాశనాన్ని గురించి గ్రంథకర్తకుగల వేదన ప్రతివాక్యంలోను స్పష్టమవుతూంది. ఎందరో విదేశీయు లీదేశాన్ని పరిపాలించి వున్నారు. ఈదేశంయొక్క దౌర్భాగ్యమది. కాని హూణప్రభుత్వంలో గమన మనుభవిస్తూన్న నైతికపతనం వెనుక నెప్పుడు అనుభవించివుండలేదు. ఇది మహాపకారం.

"శీలమును బోషించి వెంపొందించు గ్రంథముల లో దీనికి సమానమయినది నాకు తెలిసినమట్టుకు ఏభాష యందునులేదు" (తొలిపలుకు).

శైలి:—గ్రాంథికం. గ్రంథమంతా ఒక్కమోస్తరు శైలిలో వ్రాయబడలేదు. మొదటి సంపుటంలో ఆధ్యాత్మిక విషయాలను గురించి చర్చించుటచే గాబోలు సంస్కృతపదాలు, సంస్కృతసమాసాలు హెచ్చయిపోయేయి. రెండు మూడు సంపుటాల్లో శైలి సరళంగా వుంది. సామాన్య స్త్రీపురుషులు మొదటి సంపుటాన్ని చదివి అర్థంచేసుకోలేరు. శైలి సులభంగావుంటే అది సాధ్యమయేది. మొత్తంమీద శైలి రసవంతముగా వుంది. వరదలో పున్నదిలాగ తొట్రుపాటులేక ప్రవహిస్తూంది.

గ్రంథమంతా వుపన్యాసధోరణిలో రాయబడింది. పునరుక్తి హెచ్చు. అధికవిపులత్వం వుంది. అధికవిపులత్వంవల్ల చదువరులు ప్రధానాంశం మరచిపోవడమో లేక ప్రధానాంశం చదువరుల మనస్సుల్లో గట్టిగా నాటుకొనకపోవడమో జరుగుతుంది. ఇప్పుడున్న పరిమాణంలో మూడవవంతుకు విశేష ప్రమాదంలేకుండా గ్రంథాన్ని సంగ్రహపరచవచ్చు.

ఈగ్రంథంలో మానవజీవితానికవసరమైన అన్ని విషయాలు చాలా మట్టుకు రాయబడి వున్నాయి. దేశభక్తినిగురించి, ప్రపంచకజ్ఞానాన్ని గురించి కూడా ప్రకరణాలుంటే మంచిది. ఇవికూడా మానవున కత్యావసరమే.

ఒక్కొక్క ప్రకరణంలో అనేక వుపప్రకరణాలున్నాయి. వీటికికూడా శీర్షికలు వాటిప్రారంభంలోనే వుంటే బాగు. విషయసూచికలో మాత్రమేవుండి ప్రయోజనం లేదు. ప్రకరణాల్లోని కొన్ని ముఖ్యాంశాలు విషయసూచికలో వుంచబడ్డాయి. వాటనిక్కడ వుంచవవసరం లేదు. పుటయొక్క మార్జిన్ లో వుండవలసిన విషయాలవి.

ఈమూడు సంపుటాల్లో దేనికి దానికే వేరేవుపోద్ఘాతాలు ముద్రింపబడ్డాయి. ఇది నిష్కారణవ్యయం, ప్రయోజనశూన్యం.

గ్రంథకర్త తాను పొందుపరచిన ఆంగ్లవాక్యాలకు, సంస్కృత వాక్యాలకు తెలుగులో తర్జుమాచేసి చదువరులకు సౌకర్యం కలిగించి వున్నారు.

వలయువారు:—టి. లక్ష్మీనారాయణ, మానవాదర్శగ్రంథమండలీకార్యస్థానము, అంగలూరు, కృష్ణాజిల్లా అని రాయాలి. జే. కా.

---

## తిరుగుడు పెండ్లి

గ్రంథకర్తలు: శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు—

తెలుగున వెలువడిన సాంఘికనవలలలో 'తిరుగుడు పెండ్లి' గౌరవస్థానము నలంకరింపగల దనుట అతిశయము గానేరదు. ఏతద్రచయితలు శ్రీవేంకట పార్వతీశ్వరకవులు పాఠకలోకమునకు చిరపరిచితులు. వీరి బంగాళీ అను కరణములును, అపరాధపరిశోధక నవలలును సామాన్యపాఠకజనమున కెంతో ప్రీతిపాత్రములు. స్వతంత్రరచనగాగు 'తిరుగుడు పెండ్లి' సహృదయుల కెల్లరకును ఆదరణీయమైనది.

హిందూసంఘమున ఆచారము ముదిరిపోయి విచారము కొఱవడుటవలన, అభ్యుదయప్రతిబంధకముగా నిలిచియున్న దురాచారములు కొన్ని గలవు. అందును, సక్రమకారణ జన్యంబై యుండినను, విపరీత దుర్ణయముగా మిగిలిపోయి గడునువాటిన బాల్యవివాహము యిటీవలి 'శారదాశాసనము' వలన నిషేధింపబడినది. ఈమారుబాటుకాలమునకు చెందును 'తిరుగుడు పెండ్లి' కథ. భావసంఘర్షణము గల దగుటచేత సాంఘికనవలకు యెత్తినపట్టు. ఒకవంక పూర్వాచారపరాయణ శక్తి లోపించుచున్నది; మఱియొకవంక నవయువజన చిత్తారుణప్రభాసమన్వితాధునిక శకారంభమును దీప్తిగాంచుచున్నది. అందువలననే, నవలయందలి పాత్రముల నిఱుదెఱగులుగా విభజింపవచ్చును. బాలకృష్ణుడు, రుక్మిణి, సుభద్రలు నూతన శకమునకు చెందుచున్నారు. సోదెమ్మ సూరమ్మ, పేరిశాస్త్రి యిత్యాదులు ప్రాతకాలమునకు చెందుదురు. కాలానుసరణులగు పాత్రములు: నారాయణరావు; మహాలక్ష్మమ్మ, సాంబశివరావు మున్నగువారు,

పూర్వాచార పరాయణుల అవిచారత, అజ్ఞానమును అనాచారము, ధౌర్త్యము మొదలగునవి చిత్రితము లొక పక్షమున; నవీనుల సంకల్పశుద్ధి, సత్యాభిమానము, దేశభక్తి, త్యాగదీక్ష ఇత్యాదులు వేఱొకప్రక్కనే ప్రదర్శితములు. 'ఈచిత్రమును చూడుడు, ఆ చిత్రమునుగూడ చూడుడు' అని పోల్చికొను గ్రంథకర్తలు రెంటిని ప్రదర్శించిరా యనితోఁచును. ఐనను, గ్రంథకర్తలీపాత్రములను, యీలక్షణములను కావలెనని ఉత్కర్షాపకర్షలనుద్దేశ్యముగా గొని సృష్టించిరనితలంపరాదు. విమర్శకదృష్టితో పరికించిన, నవలయందలి వాస్తవిక అద్భుతమని అంగీకరింపకతప్పదు. ఆ యా పాత్రముల యభిప్రాయములు కేవలము గ్రంథకర్తలు వారినోటఁ బెట్టినవిగాక, ప్రకృతిసిద్ధములై జీవితరంగమునకెట్లో యట్లే కథారంగమునను వారినోట వెలువడుచుండును. తిలకింపుఁడు నారాయణరావు బ్రహ్మయ్యశాస్త్రిగారి సంభాషణలుగాని, సోదెమ్మవేదమ్మ సంభాషణలుగాని. ఇది, యది యని ఉదాహరింపకయే, నవలయందలి సంభాషణలన్నియును ప్రకృతికి అద్దమువలె నొప్పుచున్నవనుచో, గ్రంథకర్తలు తామెంత మఱుగుపడి కథాసంవిధానమును సాగించినారో తెలియఁగలదు.

నవలకు ప్రాణము పాత్రపోషణము. ఇందును వేంకటపార్వతీశ్వరకవులు విజయముగాంచిరనియే చెప్పనొప్పును. మనస్తత్వనిరూపణమే యుద్దేశ్యముగాగొన్నది గాదు 'తిరుగుడుపెండ్లి.' అందువలన భావపరిశీలనకును, చిత్తవికారప్రకారములకును అతిప్రాముఖ్యముగల్గకపోయి యుండవచ్చును. కాని పాత్రము లొకరివలెనొకరు లేకపోవుటయేగాక, వ్యక్తుల మనోవిభేదములును ప్రస్ఫుటములై యున్నవి. మహాలక్ష్మమ్మకును, అన్నపూర్ణమ్మకును గలవిభేదము నరయుడు. నారాయణరావునకును, సాంబశివరావుగారికినిగల యెడమునుగనుడు. పూర్వాచారపరాయణులే యైనను, మాతాసుతలేయైనను, వేదమ్మకును సోదెమ్మకును యెంత తారతమ్యము గలదో. సూరమ్మయెంత ప్రకృతిసిద్ధమైన పాత్రము! వేంకటావధాని జోగావధానిగార్లు అట్లే జీవితరంగమునుండి యిట్లు కథారంగమునం దవతరిల్లినారు. నాయకురాలగు రుక్మిణి జాగరూకతతో పరిశీలింపఁదగిన పాత్రము. పండ్రెండేండ్ల కన్యకే గ్రంథకర్తలారోపించినంత విశాలదృష్టి, ప్రేమతత్త్వజిజ్ఞాస, ఆత్మార్పణము అలవడునా యని నాక్షేపించుక సంశయము గలదు. నవల చివరకు, రుక్మిణి బాలకృష్ణుని ముందు పిలిచి ఖిన్నస్వరముతో "బ్రతుకు పరాధీనమై పోయినప్పుడంతకంటె నేనేమనుకొనఁగలను. బావా, యీస్థితిలో నీవు మరల నాకన్నులఁ బడియెదవని నేనను కొన్నానా? ఒకవేళ అకస్మాత్తుగా నగపడినను, ప్రాణము పులకించునట్లిఁకమీద నిన్ను బావాయనిపిలుచుటకు నాకేమైన అర్హతయుండునా?" అని పలుకునపుడు రుక్మిణి పండ్రెండేండ్ల బాలయైనట్లు నాకుతోఁచదు. ఈడుకుమించిన బుద్ధిగలకన్య యందుకేమో. ఇతరవిధముల, రుక్మిణి కాలోచితమైనపాత్ర. ఆధునిక సత్యాగ్రహి. సంఘదురాచారములకు తిరుగుబాటు చేయదు. స్వసుఖపరిత్యాగమువలన యితరుల మనోభావములను మార్పఁ జూచుచున్నది. ఆపాత్రములో అవ్యక్తముగా నెంతయోగలదు. వ్యక్తమైన యాశాంతి మహోదధితరంగములే వేంకటేశ్వరరావు హృదయమును తాఱుమాఱు చేసెను. గ్రంథకర్తలాపాత్రసృష్టియందలి యుద్దేశ్యమును ఆమెనోటనే పెట్టినారు. "నాకష్టజీవనము శిలాశాసనమై లోకకల్యాణముకొఱకేమాత్ర ముపయోగపడినను జాలును. నాకష్టకథ నాలకించి, జాలిపడి యిట్టి పెండ్లిండ్లెన్నడునుఁ జేయఁగూడదని, యేకొలఁదిమంది పిల్లల తల్లులకైనను వివేకము గలిగినఁ జాలదా?"

తిరుగుడుతోనే 'తిరుగుడు పెండ్లి' సమాప్తమగుచున్నది. పెండ్లినిగూర్చి తరువాయి గ్రంథము అపేక్షణీయము. కాని, అది యీనవలలో భాగము కాఁజాలదు. 'తిరుగుడు పెండ్లి' స్వతస్సంపూర్ణమనియే నా విశ్వాసము. అందువలన కథారచనయం దాక్షేపార్హముగా తోఁచుచున్నది, సుభద్రకథ నట్లు త్రుంచివైచుట. రెండవభాగమునకు రుక్మిణి నాయికగుచున్నది. కాని మొదటిభాగమున యిర్వురు బాలలకును సమానప్రతిపత్తియే గ్రంథకర్తలొసఁగియున్నారు. 'శారదా' వివాహవిమర్శనాసంకల్పులై వారు యిఠరము నించుక జాఱవిడచిరి.

గ్రంథము సులభమైన గ్రాంథికభాషలో వ్రాయఁబడినది. సంభాషణలు గ్రాంథికమునందే వ్రాయఁబడియున్నను, వాడుకభాష కొంతయో చేరుపుగా నున్నవి. శైలి ధారాళమైనది. పద్యమునను, గద్యమునను, పలికిన యక్షరమును పలికించుట వీరి సంప్రదాయము. విరళముగానిది రమ్యమైనను, నీరసమగును.

సు. వెం. సు.

# గ్రంథస్వీకారము

శారదాపద్యవాచకము(ఏడవవాచకము)

క్రౌనుసైజు. పుటలు ౭౮. వెల రు. ౦-౮-౦.
గ్రంథకర్త: తేకుమళ్ల రాజగోపాలరావు గారు, బి. ఏ., యల్. టి., ౧౨౮. వెల్లాలవీథి, పరశువాకము, వేపేరిపోస్టు, చెన్నపురి.

(౧) శుద్ధాంధ్ర నిర్వచన సత్యావివాహము

క్రౌను, పుటలు ౧౪౧. వెల క్యాలికోబైండు రు. ౦-౧౨-౦, కేపరుబైండు, రు. ౦-౮-౦.
గ్రంథకర్త: జంగా హనుమయ్య చౌదరిగారు.

(౨) జానకీపరిణయము(ఏడంకముల నాటకము)

డిమ్మీసైజున ౯౨ పుటలు, వెల రు. ౦-౧౦-౦.
గ్రంథకర్త: జంగా హనుమయ్య చౌదరి గారు, అష్టావధాని, పై రెండు గ్రంథములు కలయువారు: గ్రంథకర్తగారికి, వీరులపాడు గ్రామము, నందిగామ తాలూకా అను విలాసమునకు వ్రాయదగుదురు.

చరిత్ర కథామంజరి

క్రౌను. పుటలు ౭౨. వెల రు. ౧-౪-౦.
రచయిత: యస్. రాధాకృష్ణయ్యగారు, ప్రకాశకులు: యం. యస్. శర్మ అండు కో., ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు, తెనాలి.

పల్నాటి వీరులు

క్రౌను. పుటలు 68. వెల రు. 0-6-6.
రచయిత: శిష్టా రాధాకృష్ణయ్యగారు. టీచరు, గురిజాల, గుంటూరు.

శ్రీ కృష్ణవేణుగానామృతము

(వాస్వాని పండితుని Ancient Murli కనువాదము)
క్రౌనుసైజు, పుటలు ౫౬. వెల ౧-౪-౦. అనువాదకర్త: దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు, ప్రకాశకులు: మానవాదర్శగ్రంథమండలి అంగలూరు (కృష్ణా)

వేదాంత గీతాడిండిమము

క్రౌను, పుటలు 20. వెల తెలియదు. గ్రంథకర్త: పెండ్యాల నారాయణశర్మగారు, బోర్డు బాలికాపాఠశాలా ప్రధానోపాధ్యాయుడు, మేడపాడు.

లీలావతి (అపరాధపరిశోధక నవల)

డిమ్మీసైజు, ౨౩౨ పేజీలు, వెల ౧-౮-౦.
గ్రంథకర్త: నందివాడ కామేశ్వరరావు గారు, బి. ఏ. ప్రకాశకులు: శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము, పిఠాపురము.

భారతీయచిత్రకళ

క్రౌనుసైజున ౨౦౮ పుటలు. వెల రు. ౧-౦-౦.
ఆంధ్రగ్రంథమాలయందలి పదుమూడవగ్రంథము.
గ్రంథకర్త: తలిశెట్టి రామారావు గారు, బి. ఏ., బి. యల్. ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల, తపాలా పెట్టె ౨౧౨. మదరాసు.

సంస్కృత భారతము

(శ్రీ రాధాకుముద ముఖోపాధ్యాయుల యాంగ్లకృతి కనువాదము)
క్రౌను. పు. ౯౫. వెల రు. ౦-౧౨-౦.
అనువాదకుఁడు: కొలచలమ కృష్ణసోమయాజి, యం. ఏ., యల్. టి. గుంటూరు.

# పత్రికాస్వీకారము

శృంగారకంఠాభరణము.

(శృంగారగ్రంథమాల-శృంగారసంచిక)
సంపాదకులు: గంటి సూర్యనారాయణశాస్త్రిగారు. ప్రకాశకులు: జి. యస్. శాస్త్రి అండు కంపెనీ, మద్రాసు. చందాదారులకు రు. ౧-౮-౦. ఇతరులకు రు. ౨-౧-౦.

జ్యోతిషచంద్రిక

జ్యోతిషవిషయ కాంగ్లమాసపత్రిక
సంవత్సరము చందా రు. 2-12-0.
సంపాదకులు: పండిత జ్యోషి ఐ. వి. ఆర్. శర్మగారు. విలాసము: మేనేజరు, జ్యోతిషచంద్రిక, తిరువల్లికేణి, మదరాసు.

లాంగెవిటీ (ఆంగ్లమాసపత్రిక)

అక్టోబరు నవంబరు నెలల సంచికలు సంవత్సరపు చందా రు. 3-4-0; ప్రకాశకులు:—డా. జి. ఆర్. ఏ. ఆచార్యగారు 60. సుందరమూర్తి వినాయకర్ కోవిల్ వీథి, తిరువల్లికేణి, మదరాసు.

# సాభిప్రాయ విశేషములు

గతమాసము భారతజాతీయ స్వాతంత్ర్య సంరంభమునందు వర్తమానయుగమునందు దివ్యదృశ్యముగ నుండగలదు. ఏడువేల మైళ్ల దూరమందుగల లండనునందు, సెంటుజేమ్సు రాజభవనమందు 33 కోట్ల భారతీయుల భావి పరిణామము నిర్ణయింపబడుచున్నది. మహారాజులు, విద్యావంతులు, హిందువులు, మహమ్మదీయులు భారతీయాశయములను వ్యక్తము చేయుటకై యూరపు ప్రయాణ క్లేశమును సహించి లండనునగరమునకు వెడలియున్నారు. హిందూదేశము నుండియును గ్రేటుబ్రిటను నుండియును బ్రిటిషు రాజ్యప్రతినిధులును భారతీయుల యాశయములను పర్యాలోచన చేయుటకు కూడియున్నారు. అన్నిపక్షములవారును చేరి ౮౯ మంది ప్రతినిధులుగలరు. భారతీయ రాజ్యాంగసమస్యను నిర్ణయించుటకు కూడిన వారియందు ప్రజాశయములను నిర్భయముగ వ్యక్తముచేయుటకు తగిన సంస్కారులు లేరని అన్నిపక్షములవారును అంగీకరించుచున్నారు.

జార్జి సార్వభౌముడు నవంబరు ౧౨వ తేదీని రౌండుటేబిలుసమావేశమునకు రాజ్యచిహ్నముల కనురూపమైన అంకురార్పణను చేసినను సార్వభౌముని ప్రారంభోపన్యాసము భారతీయాశయములను ప్రకటింపదగిన ఉదారాశయములను కలిగియుండక సామాన్యాశయములనే గలిగియున్నది. సమావేశమైనవారివిషయమై "వీరి సేవవలన నాకు మిక్కిలి ప్రేమాస్పదులగు ప్రజలసౌఖ్యమును ఐశ్వర్యమును అభివృద్ధి నొందినవి అని, మీ పేరులు చరిత్రయందు స్థిరముగ లిఖింపబడుగాక!" అని సార్వభౌముడు తెలిపిన విషయము ఎంతవరకు సఫలము కాగలదో భావికాలము నిర్ణయింపవలసి యున్నది.

ప్రధానమంత్రి మాక్డొనాల్డుగారు చేసిన యుపన్యాసమును సద్భావములతో మాత్రమే నిండియున్నది. మాక్డొనాల్డుగారు శాసనోల్లంఘన విధానమును ఖండించుట సహజమైనను, మార్గాంతరమును నిర్ణయింపకుండుట ప్రధానమంత్రికి తగిన ప్రయోజనము గాదు. భరతవర్ష పక్షమున ప్రసంగించిన బరోడా, కాశ్మీరు మహారాజులు, శ్రీనివాస శాస్త్రి జిన్నా గార్లును, స్వామిభక్తిని, సద్భావములను వ్యక్తము చేసిరి. కాని భారతీయాశయములను నిర్భయముగను విస్పష్టము చేయలేదు. వీరి

...రము మంత్రిగారి ప్రతిపాద
... కార్యవిధానము నిర్ణయింపబడి
... 17-వ తేదిని రౌండుటేబిలు
... ప్రారంభమైనది. నాయకులును
... చేసిన గంభీరోపన్యాసము లాశా
...ను పరమార్థమును నిర్ణయించు
...యోగములు.

...డువారము లందును, భారత
...మునకు సంబంధించిన చర్చలు
...లు లండను నగరమునందు
... బ్రిటిషుప్రతినిధులు, భారత
...న గంభీరోపన్యాసములును,
...కటించిన వ్యాఖ్యానములును
...యినను పరమప్రయోజనమైన భార
తీయస్వపరిపాలనవిషయమును అప్రధానము చేసి
రాజ్యాంగవిధానమును మాత్రము ప్రధానము
చేసినవి. భరతవర్షమునంతయును నేకసామ్రా
జ్యమును జేయుటయందు భేదాభిప్రాయములు
లేవు. రౌండుటేబిలు సమావేశము నిర్ణయింప
వలసిన ప్రధాన విషయము స్వపరిపాలనము
గాని, స్వపరిపాలనమునందు గలుగవలసిన పం
పిడిగాదు. సంస్థానాధీశులు, బ్రిటీషు ప్రదేశ
వాసులు, హిందువులు, మహమ్మదీయులు,
స్వల్పసంఖ్యాకులు స్వరాజ్యమునందు వారి
వారి భాగములను నిర్ణయించుకొన వలసిన
యవసరము స్వరాజ్యమునందు గలుగగలదు.
పరాధీనస్థితియందు బ్రిటీషుప్రభుత్వము స్వాధి
కారము నెంతవరకు శిథిలము చేయునో నిర్ణ
యించుట మొదటివిషయము. బ్రిటీషురాజ్యాధి
కారులు ప్రధానాంశమును వెనుకబెట్టుటయును,
సామాన్యాంశమును ముందుంచుటయును సహ
జమైనను భారతీయులైనను నా విషయమును
గమనింపకుండుటయును డొమినియను స్టేటసు
నైనను ప్రధానాంశమును జేయకుండుటయును
ననుచితము. భరతవర్షమునకు వర్తమాన
కాలమునందు గావలసినది స్వాధికారముగాని
స్వాధికారవిధాన నామము గాదు. లండను
నందుగూడిన యన్ని పక్షములవారును గలిసి
భరతవర్షమున కవసరమైన రాజ్యాంగవిధాన
మును నిర్ణయించి నామకరణము చేయుటతో
మూడువారములు గడిచిపోయినవి.

* * * *

ఫెడరలు విధానము

సంస్థానాధీశులు, హిందువులు, మహమ్మ
దీయులు, బ్రిటిషు రాజ్యాధికారులు భరత
ఖండమునకు ఫెడరలు విధానము తగియున్న
దని నిర్ణయించిరి. సర్ జాను సైమను
నిర్ణయించిన విధానమునే రౌండుటేబిలు
సభయును నిర్ణయించుట బ్రిటీషు రాజ్యాధి
కారుల యభీష్టముల కనురూపముగ
నున్నది. నామకరణమున కనురూపమైన
ప్రయోజనము గలుగకపోయినను నామకర
ణముతోనె వాదములు, పంపకములు, స్వార్థ
ప్రయోజనములు ప్రత్యక్షములైనవి. మహమ్మ
దీయులు వారి ౧౪ విషయములును పూర్ణ
ముగ గావలయునని పట్టుపట్టుచున్నారు. మహ
మ్మదాలిగారు ఆరంభమునందు జేసిన గంభీరో
పన్యాసము మాటలతోనె అంతర్గతమైనది.

ఆయన సకలవిధములను తాను భారతీయుడ నని చేసినప్రతిజ్ఞను విస్మరించి మహమ్మదీయ సంస్మరణమును జేయుట సమావేశ ప్రయోజన ముల కనురూపముగ నున్నది. ఆగాఖాను, జిన్నాగారలును మహమ్మదాలిగారి మార్గ మునే యవలంబించుట సహజముగ నున్నది. జయకరు మూంజిగారలు మహమ్మదాలి గారి వలెను హిందూదుందుభిని మ్రోగించకపోయి నను హిందూ భాగమును ప్రతిపాదించు చున్నారు. సప్రూగారు స్వతంత్రముగను తన మార్గమును బట్టుచున్నారు.వారిమార్గమైనను భారతీయస్వాతంత్ర్యమార్గముగాకను అన్ని మార్గముల యందును సంగమించుచున్నది. సప్రూగా[illegible] బ్రిటీషు రాజ్యాధికారుల కును హితముగనుండుట సహజము. సంస్థానా ధీశులును వారి ప్రాతవాసనల ననుసరించుచు వారి స్వతంత్రచిహ్నముల రక్షణమును గోరు చున్నారు. ఈభిన్నమార్గములు భారతీయుల దుర్బలమును బ్రిటీషువారిబలమును వ్యక్తము చేయుచున్నవి. మూంజీగారు తెలిపినటు లన్ని పక్షములవారును డొమినియనుస్టేటసును స్వీక రించి పంపకమునకు బూనుకొనియుండిన స్వప క్షమునకును, దేశమునకును శాంతమైనను లాభము గలిగియుండును. స్వపరిపాలనము నంగీకరించని ఫెడరలువిధానము గంధర్వనగర మువలె నున్నది. రౌండుటేబిలు సమావేశ మునకు ఫలము భారతీయనాయకు లూహించి నటులె పరిణమించునని యూహించుటకు ప్రబ లమైన నిదర్శనములు గనుపడుచున్నవి. గాంధి మహాత్ముడును, మోతీలాలు నెహ్రూ జవహరి లాలునెహ్రూగారులును సంధి ప్రయత్నములకు చూపిన ప్రతికూలత ధర్మయుక్త మనియు[illegible] న్యాయ్యమనియును, గౌరవప్రద మ[illegible] ఇప్పుడైనను ప్రాజ్ఞు లందరును గ్రహిం[illegible]

* * *

గాంధిమహాత్ముడు—నవయుగధర్మమ[illegible]

భారత స్వరాజ్యసంరంభమున[illegible] మైన సమయము మహోదయ సమ[illegible] బరిణమింపగలదు. ద్వాపర యుగాంతమునందు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు శ్రీకృష్ణ భగవానుడు విజయునకు జేసిన ధర్మోపదేశము సార్థకమగుటకు శుభసమయము ప్రపంచము నకు సమకూడినది. శ్రీకృష్ణుడు ప్రతిపాదించిన క్షాత్రధర్మము విశాలమైన మానవధర్మము నందు లగ్నమగుటకు తగిన యవకాశములు లభించినవి. సర్వనాశనకరమైన మహాసంగ్రా మానంతరము ప్రపంచమంతయును శాంతిని బడయుటకు పరితపించుచున్న విధమును ప్రపంచపరిస్థితులు భిన్నదేశములందు భిన్న రూపములను పరిస్ఫుటము చేయుచున్నవి. రుష్యా, ఇటలి, గ్రేటుబ్రిటను, చీనా, ఇండియా మొదలగు దేశములన్నియును శాంతిస్థాపన మునకై భిన్నరూపములను పాటుపడుచున్నవి. త్రికరణశుద్ధిగను సకలజాతులును పరస్పర హితమునకై పాటుపడనంతవఱకును నానా జాతి సమితులు, రౌండుటేబిలు సమావేశ ములు శాంతి ధర్మస్థాపనములకు నిరర్థకములు.

[illegible]ంబించిన శాంతి సంరం
ములందు నిరుపమానమని
[illegible]ధలు వేలకొలది ప్రజలు
[illegible]గము విశదము చేయు
[illegible] ద్ధికిని
[illegible]గము. [illegible] పర
[illegible]మున
[illegible] శ్యము
[illegible] చేయుచున్నది. విశ్వ
[illegible] శుద్ధి
[illegible] భరత
[illegible]డై
పుచున్నాడు. గాంధిమహా
[illegible] వారి ఆత్మకథయును, పవిత్ర
[illegible]ములు, ధర్మోపదేశములును విశదము
[illegible]చున్నవి. గాంధిమహాత్ముడు గీతాశాస్త్ర
[illegible]క్తియోగరూపమునను జేసిన
[illegible] త్యాగప్రభావమును, అహింసా
ధర్మ[illegible] వ్యక్తము చేయుచున్నది. భారత
[illegible] ప్రకటితమైన యుద్ధధర్మము
[illegible]యుగమునం దహింసారూపమునను
[illegible]లకు సహాయ నిరాకరణయోగ
ము [illegible]మైనది.

[illegible]మునందు మంచి చెడుగులు, [illegible]లు సాపేక్షములుగాని సంపూర్ణములు గావు. అంతయును మంచిగాని, అంత [illegible] చెడుగుగాని యగోచరము. అహింస [illegible] హింసయును, నష్టములును సంభ[illegible]మును. ఇది ప్రకృతిధర్మము. అహింసాధర్మము హింసాధర్మమునకన్నను వేయి రెట్లు మేలని సర్వజనులును నంగీకరించవలసియుందురు. ఈ పరమార్థమును హింసాధర్మమున కలవాటుపడిన ప్రపంచము, ముఖ్యముగను పాశ్చాత్యప్రపంచము, గ్రహించుట దుర్లభము. సమయోచిత స్వార్థపరత్వమునే ధర్మముగను నారాధించెడి పాశ్చాత్యులు హింసాతత్త్వమును గ్రహింపజాలరు. ధర్మలక్ష్యమునందు గాంధిమహాత్ముడు గలుగజేసిన మహాపరివర్తనమును పాశ్చాత్యపండితులు సైతమంగీకరించుచు పరమాశ్చర్యమును వ్యక్తము చేయుచున్నారు. హిందూదేశమునందు భిన్నప్రాంతములను సందర్శించిన బ్రెయిల్సుఫర్డుగారు భారతీయులవలంబించుచున్న అహింసాదీక్ష కాశ్చర్యమును దెలియజేసిరి. అధికారనివేదకయును ప్రజల యహింసాపరత్వము నంగీకరించుచున్నది. ఇతరదేశీయులును స్వరాజ్యసిద్ధికై భారతీయులు చూపుచున్న మహాత్యాగము నభినందించుచున్నారు. ఇట్టి సందర్భములందు భరతవర్షమునకు స్వరాజ్యమును సాధింపగల యధికారి నవయుగధర్మప్రవర్తకుడైన గాంధిమహాత్ముడును, భరతవర్షమును నని భారతీయులును, బ్రిటీషుప్రజలును గ్రహించుట వివేకము.

భావసంశుద్ధిలేకను కార్యములు సాధ్యములు గావు. భిన్నపక్షములవారును సంకుచితభావములతో నారంభించిన రౌండుటేబిలు సమావేశము సంకుచిత ప్రయోజనమును సమకూర్చుటకు మాత్రమె వినియోగపడగలదు. భరతవర్షమునందు నిర్బంధపరం

పరలను వ్యాపింపజేయుటయును, లండనునందు స్వపరిపాలనమును నిర్ణయించుటయును నసంభవములు. దేశధర్మపరాయణు లైన 70,000 భారతీయులును, పూజ్యుడైన గాంధిమహాత్ముడును నిర్బంధముల ననుభవించుచున్నపుడు రౌండుటేబిలు సమావేశమువలన నేవిధమైన ప్రయోజనము గలుగజాలదు. కన్నులు మూసుకొని యథార్థమును గ్రహింపకుండుట ప్రయోజనకరము గాదు.

భారతస్వరాజ్యసమస్య కేవలము భారతీయ సమస్యమాత్రమె కాదు. అది ప్రపంచసమస్య; ధర్మరక్షణసమస్య; శాంతిసమస్య. ముప్పది మూడుకోట్ల ప్రజలకును, ప్రపంచమునకును సంబంధించిన ఈ మహాసమస్యను గాంధిమహాత్ముడు పూనిన ధర్మలక్ష్యముతో నవలోకించుట ప్రయోజనకరము గాని సంకుచితమైన స్వప్రయోజనలక్ష్యముతో నవలోకించుట లోకమునకును భరతఖండమునకును ప్రయోజనకరము గాదు. హిందువులు మహాత్యాగమును బూని మహమ్మదీయులకును, ఇతరసంఘములకును నభయము నొసంగుట శ్రేయస్కరము.

పదినందలయేండ్లు పారతంత్ర్యదుఃఖము ననుభవించిన హిందువులు కొంతకాలము లయిన మహమ్మదీయుల యు[illegible] నిరభ్యంతరముగను నంగీకరింప యుల బాధ తొలగినపుడు స[illegible] సహజముగనంతరింపగలదు. [illegible] న్యవిశ్వాసమును, భారతీయు[illegible] నిధులకును విశ్వాసమును గలు[illegible] టేబిలుసమావేశమువలన నేవిధమై[illegible] జనమును గలుగజాలదు. స్వరాజ్యకాముకులు శాంతికాములును తమలక్ష్యమును [illegible] రావడా జెయిలునందు, గీతాంతమునందు సంజయుడు తెలిపినటులు, కర్మజ్ఞానయోగపరాయణుండైన యోగీశ్వరుండైన గాంధిమహాత్మునిమీదను ప్రసరింపజేయుటయె సంకల్పసిద్ధికి సాధనము. భారతీయు లందరును గాంధిమహాత్మునివలెనే దీక్షాపరాయణులై కామితార్థములను బడయుదురు గాత!

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.

